# శ్రీరామకృష్ణ బోధామృతము

పరిశోధితమగు 1121 మహోపదేశములు గల

## శ్రీరామకృష్ణవాక్య రత్నాకరము

సంగ్రహజీవిత సహితము

అనువాదకుడు

చిరంతనానంద స్వామి



శ్రీ రామకృష్ణ మఠము

[illegible] రామస్వామి శాస్త్రులు అండు సన్సు [illegible]

[illegible]

# విజ్ఞప్తి

శ్రీ రామకృష్ణ బోధామృతము సర్వవేదాంత సారామృతము. 'Sayings of Sri Ramakrishna' - అన్న గ్రంథమునకు అనువాదమగు నియ్యది యీమలికూర్పున బాగుగా పరిశోధింపబడినది, మఱియు విపులీకరింపబడినది. తొలికూర్పున పునరుక్తమైయున్న 68 ఉపదేశములు ఇందు తొలగింపబడి వానితావున క్రొత్తవి చేర్పబడుటయే కాక, ఇంచుమించుగా నూటయిరువది ఉపదేశరత్నములు అదనముగా కూర్పబడినవి. అన్వయముననుసరించి పది పండ్రెండు పునరుక్తమైన వింకను నిలిచియున్నను మొత్తముమీద ప్రస్తుత ముద్రణమున 1121 మహోపదేశములు గలవు. ఇందు ఎనుబదికి మించినవి నీతికథారత్నములు. ఈ దివ్యోపదేశము లన్నియు అత్యంతప్రమాణభూతములగు మూలగ్రంథములనుండి * యేర్చి కూర్చినవి. శ్రీ శారదానందస్వామి రచించిన 'శ్రీరామకృష్ణలీలా ప్రసంగము' (Sri Ramakrishna the Great Master), 'మ' అను మహానీయుడు రచించిన

---

* ఇందు కొన్ని ఆంగ్ల గ్రంథములు, కొన్ని వంగగ్రంథములు. ఆంగ్లభాషలో మొదట 1898-వ సంవత్సరమున మాక్స్‌మ్యులర్ పండితుడు (Prof. Max Muller) 'Ramakrishna, His Life and Sayings' (శ్రీరామకృష్ణ జీవితము, ఉపదేశములును) అను గ్రంథమును రచించి ప్రకటించియున్నాడు. ఇంచుమించుగా నాటినుండియు శ్రీరామకృష్ణ జీవితోపదేశసారము వివిధభాషలలో జగద్వ్యాప్తముగా ప్రారంభించెను.

'శ్రీరామకృష్ణ కథామృతము' (The Gospel of Sri Ramakrishna), శ్రీ బ్రహ్మానందస్వామి వెలువరించిన 'శ్రీ శ్రీరామకృష్ణోపదేశములు' (Words of the Master) అనునవి † యిందు ప్రధానములు.

నూతనవిషయములను జేర్చుటయే కాక, మానవుని ఆత్మవికాస క్రమము ననుసరించు నూతనవిధానమున బోధనల నిందు పొందుపఱచియున్నాము. శ్రీగురుదేవుని బోధనలందలి మూలతత్త్వములతోడను సంక్షిప్తజీవితచరిత్రతోడను గూడిన పీఠిక, స్వవచనములలో శ్రీగురుదేవుని దివ్యానుభవములను దెలుపు ప్రత్యేక ప్రకరణము, బోధనలను బాగుగా గ్రహించుటకై తోడ్పడు నుపశీర్షికలు, ముఖ్యమైనతావులందు వేదశాస్త్రప్రమాణములు—ఇవి యీ మలికూర్పునకు ప్రత్యేకలక్షణములని గ్రహింపనగును.

శ్రీ 'ఎమ్. కె.' అనువారి ప్రోత్సాహమున శ్రీతత్త్వానందస్వాములవారిచే అనువదింపబడిన తొలికూర్పు మాకిందు తోడ్పడియున్నది.

సంగ్రహజీవితచరిత్రతో గూడ శ్రీగురుదేవుని

---

† వీనిమాతృకలు వంగభాషలో నున్నవి. ప్రామాణికములగు నీక్రింది వంగ గ్రంథములతో గూడ మూలగ్రంథము సరిచూడబడియున్నది (1) సురేశచంద్రదత్తు రచించిన 'శ్రీశ్రీ రామకృష్ణేర్ ఉపదేశ' (శ్రీరామకృష్ణోపదేశములు), (2) రామచంద్రదత్తు రచించిన 'శ్రీరామకృష్ణేర్ జీవనీ ఒ ఉపదేశ' (శ్రీరామకృష్ణ జీవితము, ఉపదేశములును). శ్రీరామకృష్ణుని జీవితకాలముననే (1884-వ సం॥న) ఇందలి మొదటి గ్రంథము ప్రకటింపబడియుండుట గమనింపదగిన విషయము.

దివ్యోపదేశములను సాధ్యమైనంతవఱకు సమగ్రముగా దెలుపు ప్రస్తుతగ్రంథము పాఠకుల కెంతయు నుపయుక్తము కాగలదని మా ఆశయము.

శ్రీరామకృష్ణమఠము
మైలాపూరు, చెన్నపురి
25-8-1941

చిరంతనానందస్వామి

## మూడవ కూర్పు

శ్రీరామకృష్ణ వాక్యావళి రెండవకూర్పు ప్రతులన్నియును చెల్లిపోయి చాలకాలమైనది. ఈ పుస్తకప్రతులను గోరువారు పెక్కురు. మరల ముద్రించుటయా ఈకాగితపు కఱవురోజులలో చాలకష్టము. ఈ క్లిష్టపరిస్థితులలో ఆంధ్ర సోదరు లొకరు గుప్తదానముగా ఈగ్రంథ ముద్రణార్థము పదునేనువందల రూపాయిలను మాకొసగి, సహాయభూతులై యున్నారు. శ్రీరామకృష్ణభగవానుడు వారిని వారికుటుంబమును సర్వదా అనుగ్రహించుగాక!

ఇక నీ కూర్పుకూడ పూర్వముద్రణములవలెనే జన సమాదరణము నందునని నమ్ముచున్నాము. శ్రీరామకృష్ణ వాక్యావళి యనుపేరును 'శ్రీరామకృష్ణ బోధామృతము' అని మార్చితిమి; కాని విషయవిన్యాసమం దేమియుమార్పు లేదు.

**చిరంతనానందస్వామి**

## నాలవ కూర్పు

ఈ కూర్పునకు ఆంధ్రసోదరు లొకరు నాలుగువందల రూపాయల గుప్తదాన మొనర్చియుండుటచే, మునుపటి కంటె మఱింత చక్కగా వెలువరింప గలిగియున్నాము.

ఈ యాంధ్రసోదరులు శ్రీరామకృష్ణదేవుని కృపకు విశేషపాత్రు లగుదురుగాక!

శ్రీరామకృష్ణ మఠము
మైలాపూరు, చెన్నపురి
11-12-1947

**చిరంతనానందస్వామి**

# విషయసూచిక

(ఇందలి యంకెలు పుటల సంఖ్యను సూచించును.)

## ద్వితీయ ఖండము

## ఆత్మోన్నతి

# తృతీయ ఖండము

# జీవుడు : దేవుడు

## పదునాఱవ ప్రకరణము—జ్ఞానము: భక్తి: కర్మము 262



## పదునేడవ ప్రకరణము—బ్రహ్మతత్త్వము 314



## పదునెనిమిదవ ప్రకరణము—బ్రహ్మసాక్షాత్కారము 336



## పందొమ్మిదవ ప్రకరణము—బ్రహ్మజ్ఞాని 357

## చతుర్థ ఖండము

## సూక్తులు: నీతికథలు

## బ్రహ్మసాక్షాత్కారము

# పీఠిక *

## శ్రీరామకృష్ణ వాక్యావళి † తత్త్వరత్నాకరము.

సర్వమతములును సమస్తశాస్త్రములును ఘోషించు మహోత్తమధర్మములన్నియు జిజ్ఞాసువుల కిందు కరతలామలకము. లౌకికనీతులు, వ్యావహారిక హితోపదేశములు, పారమార్థిక తత్త్వములు ఇందన్యోన్యసామరస్యముతో — అవిరళ మైత్రితో-ఒప్పుచున్నవని చెప్పనొప్పును. శ్రీరామకృష్ణవాక్య ప్రతిభ అతిసామాన్యపాఠకుని దృష్టినిసైత మరికట్టగలదను టతిశయోక్తి కానేరదు. కేవల పండితులును జీవయాత్రను గూర్చి మహాద్భుతతత్త్వములను ఉత్కృష్టధర్మములను వెల్లడించియుండ, శ్రీరామకృష్ణునియుపదేశములకును వీనికిని గల భేదమేమని మనము వివేచింపవలసియున్నది. కేవల శాస్త్రపండితుడగువాని వచనము లెంతటి ప్రతిభావంతములయ్యు, ఆధ్యాత్మికవిషయములలో ఆతడు సామాన్య మానవునికంటె నధికుడు గాకుండుటచే—అజ్ఞానాంధకారమున గోరాడుచునేయుండుటచే—వాని వచనములు మనకు ప్రమాణభూతములు కాజాలవు. కాని శ్రీరామకృష్ణుడు అఖండ మేధాసంపదను నిరుపమాన కళాదృష్టిని కలిగియుండుటయే కాక, 'దేవుని ముఖాముఖిని సందర్శించి' యుండుటచే,

---

* ఇయ్యది భావములలో మూలగ్రంథమునందలి పీఠిక ననుసరించుచున్నను చాలవఱకు స్వతంత్రముగా వ్రాయబడినది. † తొలికూర్పును మలికూర్పును "శ్రీరామకృష్ణవాక్యావళి" యనుపేర ననువదింపబడినవి.

—అనువాదకుడు.

దేవునితో సంభాషించి యుండుటచే, దైవసాగరమున నోలలాడి యుండుటచే అతని వాక్యములు మనకు అఖండ ప్రమాణ భూతములు—వేదవాక్యములు. సాక్షాత్పరమేశ్వరు నుండి పొందిన యధికారముద్ర శ్రీరామకృష్ణవాక్యరత్నము లందు జిజ్ఞాసువులకు విస్పష్టముగా గాన్పించును. ఇవ్విషయ మునుగూర్చియే గాంధిమహాత్ము డిట్లు నుడివియున్నాడు: "రామకృష్ణుడు సజీవాకృతిని దాల్చిన దివ్యత్వము. అతని యుపదేశము లోక పండితమాత్రుని వాక్యములు కావు, అవి జీవితమను గ్రంథమునందలి పుటలు, స్వానుభవనిదర్శన ములు. కావుననే వానిని జదువునప్పుడు పాఠకున కనివార్య మగు చిత్తసంస్కారము గలుగుచుండును...." శ్రీరామ కృష్ణవాక్యావళికి మూలమగు శ్రీరామకృష్ణుని దివ్యజీవితచరి త్రను జదువు నవకాశము నొందని పాఠకుల నిమిత్త మీక్రింది సంక్షిప్తజీవితచరిత్రను వ్రాయుచున్నాము.

# శ్రీ పరమహంస జీవిత సంగ్రహము

## జననము, బాల్యము

వంగదేశమందలి కామారిపుష్కరము (Kamarpukur) అనుగ్రామమున క్రీ. శ. 1836–వ సంవత్సరము ఫిబ్రవరి 18–వ తేదిని (ఫాల్గుణ శుక్ల ద్వితీయా బుధవారమున) * శ్రీరామకృష్ణు డొక పేద బ్రాహ్మణకుటుంబమున నుదయించెను. తండ్రిపేరు ఖుదీరామ చట్టోపాధ్యాయుడు, తల్లి చంద్రమణీదేవి. ఖుదీరాముడు దైవభక్తిపరాయణుడు, సత్యనిష్ఠాగరిష్ఠుడు, సుశీలవ్రతుడు. సత్యసంధతచే దనకును కుటుంబమునకును ఎట్టి యిక్కట్లు వాటిల్లినను ఆతడణుమాత్రమైనను వ్రతమును విడువనొల్లనని సత్యారాధకుడై యొప్పెను. ఒకప్పుడు తమ గ్రామమునందలి జమీందారుడు తనకనువగునట్లు కూటసాక్ష్యమును జెప్పుమని ఖుదీరాముని నిర్బంధింప, ఖుదీరాము డాతనిమాటలను తృణీకరించెను. దుర్మార్గుడగు ఆజమీందారుడు ఖుదీరామునిపై బగపట్టి, యొక అసత్యపువ్యాజ్యమును దెచ్చి, యాతని పిత్రార్జితమునే కాక, అతనికిని కుటుంబమునకును నిలువనీడ నిచ్చుచుండిన కుటీరములనుగూడ హరించెను. కాని ఖుదీరాము డీసుమంతయు చలింపలేదు. చంద్రమణీదేవియో, ఖుదీరామునకు దగిన సహధర్మచారిణి, సుగుణరాశి. శ్రీరామకృష్ణుని జననమునకుముందీపుణ్యదంపతులు ఆతని దివ్యత్వమును సూచించు

* పూర్వభద్రనక్షత్రయుక్త కుంభలగ్న శుక్రనవాంశమందు ఉదయము ఇంచుమించుగా గం. 5. ని. 15. లకు.

ననేకదివ్యదర్శనములను దివ్యానుభవములను బడసినట్లు తెలియవచ్చుచున్నది.

శ్రీరామకృష్ణునకు తల్లిదండ్రులు పెట్టిన పేరు గదాధరుడు. (జగత్ప్రసిద్ధమగు శ్రీరామకృష్ణనామము ఆతనికి గురువర్యు లిడిననామమని భావింపనగును.) † పూవు పుట్టగనే పరిమళము తెలియునన్నట్లు గదాధరుని భావ్యౌన్నత్య సూచనలు బాల్యముననే పొడకట్టనారంభించెను. బాలసూర్యుని బోలు నాతని దివ్యమూర్తి, ఆతని ప్రేమమయ ప్రవర్తనము, ఆతని ధీవైభవము జనుల నత్యద్భుతరీతి నాకర్షింపసాగెను. గదాధరు డున్నచో, ఇరుగుపొరుగు వారల కల్లారుముద్దు. తోడి బాలుర కాతడే నాయకుడు. కళాకౌశలమునకు నిలయమగు నాతని హృదయము ప్రకృతి సౌందర్యమున రమించెడిది. ధ్వనులలో, ఆకృతులలో, గల సూక్ష్మభేదములను మనుజుల రూపరేఖావిలాసముల యందలి వైచిత్ర్యముల నాతడవలీలగా గ్రహించువాడు. అనుకరణము, హాస్యము, చిత్రలేఖనము, మృణ్మయవిగ్రహనిర్మాణము, వీధి నాటకప్రదర్శ

† సన్న్యాసదీక్షాసమయమున గదాధరునకు ఆతని గురువరేణ్యుడగు శ్రీతోతాపురి రామకృష్ణనామము నిడియుండవచ్చునని శ్రీరామకృష్ణునిశిష్యుడగు శారదానంద స్వామి 'శ్రీరామకృష్ణలీలాప్రసంగము' అను తన సుప్రసిద్ధ వంగగ్రంథమున దెలుపుచున్నాడు. (చూ. లీలాప్రసంగము, సాధకభావము, పుట 285.) మఱికొందఱు శ్రీరామకృష్ణు డర్చించిన దక్షిణేశ్వరకాళికాలయమునకు నిర్వాహకుడగు మథురనాథుడు ఈనామమున గదాధరుని బిలిచెననియు నాటినుండియు ఈనామము వ్యాప్తమైనదనియు జెప్పుచున్నారు.

నములు, సంకీర్తనము, రామకృష్ణాదిపురాణపురుషధ్యానము —ఇవియే గదాధరుని బాల్య క్రీడలు. పాఠశాలయందలి నిర్జీవమైన విద్యావిధాన మాతని నాకర్షింపజాలకుండు టాశ్చర్యము కానేరదు. ప్రకృతిసౌందర్యరసాస్వాదనముపైమోల గణితము మున్నగు విద్యలాతని కెంతమాత్రము గణనీయములు కావయ్యె. ఆతని యఖండ కళాభిమానమే, అంతరంగమునుండి తలసూపుచున్న యాతని బ్రహ్మానందపిపాసయే యిందులకు కారణమని చెప్పనొప్పును. కాని యాతని ధారణాశక్తియు, అసమానధీవైభవమును లౌకికవిద్యల నాతడభ్యసింపని లోటును పూర్తిగా దీర్చివైచెను. పండితులచే జరుపబడు పురాణపఠనములను శాస్త్రవ్యాఖ్యానములను నాతడాలకించి భారతీయవిజ్ఞాన ఖనులగు భారతభాగవతాది గ్రంథముల సారమును పూర్తిగా గ్రోలెను. జీవుల స్వభావవర్తనములను బరిశీలించి—ప్రకృతియను గ్రంథము నాతడు ప్రత్యక్షముగా బఠించి—యందలి తత్త్వమును కరతలామలక మొనర్చుకొనెను. బడిచదువు నలక్ష్యముచేయుచుండెనని తనయన్నయు పండితుడు నగు రామకుమారుడొకప్పుడు తన్ను మందలింప, “అన్నా! ఈపొట్టకూటి చదువు నాకెందులకు? ఇందులకుబదులు శాశ్వతానందదాయకము, శ్రేయస్కరమునగు తత్త్వజ్ఞానమును నే నార్జింపగోరుదును” అని సమాధానము చెప్పెను. నిజమే, ఆత్మజ్ఞానదాయకమగు విద్యయే విద్యకాని మిగిలినదంతయు అవిద్య కదా!

శా. "ఏవేదంబు పఠించె లూత? భుజగం బేశాస్త్రముల్ చూచెఁ? దా
నే విద్యాభ్యసనం బొనర్చెఁ గరి? చెంచేమంత్ర మూహించె? బో
ధావిర్భావనిదానముల్ చదువులయ్యా కావు! నీపాదసం
సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!"

ఇదియే చదువులయెడ శ్రీరామకృష్ణుని మనోభావము.

ధైర్యసాహసములకును స్వాతంత్ర్యమునకును తోడి బాలురందెల్ల గదాధరుని జెప్పి మఱియొకని జెప్పవలయును. పసితనమునుండి సైతము పిఱికితనమన నెట్టిదో, సిగ్గన నెట్టిదో, యాత డెఱుగడు. దృఢగాత్రుడును తేజోనిధియునగు నాతడు తాను న్యాయ్యమని నమ్మిన విషయములలో నొకరి బెదరింపుల నెంతమాత్రము లక్ష్యించువాడు కాడు. పెద్దలు వలదనినను తనయంతరాత్మ ధర్మమని తెల్పినవిషయముల నాతడు విడుచువాడు కాడు. స్త్రీలసౌశీల్యమునకు శుద్ధాంతవాసము—'ఘోషాపద్ధతి'—కేవల నిరుపయోగమని నమ్మి యాత డూరిలో పలుకుబడిగలవారల యెదుట తదాచారమును తృణీకరించెను. ధనియను కమ్మరయిల్లాలున కొకప్పుడు తాను చేసియుండిన వాగ్దానము ననుసరించి గదాధరుడు తన యుపనయనసందర్భమున నెవ రెంత ప్రతిఘటించినను లక్ష్యింపక యామెకడ తన ప్రథమభిక్షను గైకొనెను. సత్యమునకును ధర్మమునకునేగాని అర్థరహితబాహ్యాచారములకు అంజలి ఘటింపని గదాధరుడు ఆయూరి పూర్వాచారపరాయణులకు విప్లవకారునివలె దోచియుండవలయును. కాని ముముక్షుకోటికి జ్ఞానభిక్ష నొసగిన వానికి తొలిబిచ్చమిడిన యాధని యెంతటి ధన్యయో కదా!

ఐనను ఈ 'బాలవిప్లవకారుడు' భక్తిప్రపత్తులు కొఱవడినవాడుకాడు. ఏలన బాల్యమునుండియు భగవద్భక్తియే యాతని జీవితలతకు ప్రధానాశ్రయమై యొప్పెను. ఇంటిలో నిత్యదేవతార్చనమునం దేమి, ఊరిలో జరుగు నీశ్వరసేవలం దేమి, గదాధరు డెల్లప్పుడును అగ్రగణ్యుడై దీపించువాడు. బైరాగులనినను సన్న్యాసులనినను ఆతనికి అతిబాల్యమునుండియు పరమానందము. అవకాశము లభించినప్పు డెల్ల నాతడు వారితో స్వేచ్ఛగా సంభాషించుచు గలిసిమెలసి వర్తించుచుండెడివాడు. వయసు వచ్చినకొలదియు నాతని భక్తిభావములు ప్రస్ఫుటము కాజొచ్చెను. ఈశ్వరధ్యాననిమగ్నుడై సాక్షాత్కారమున సంగమించు దివ్యభావముల నాతడు వడయసాగెను. బాల్యజీవితమున నిట్టి మహోత్కృష్టసంఘటనములలో ప్రధానమైనవి మూడు—వర్షాకాలమేఘము లలముకొనిన నల్లని యాకసమునను త్తెపుసరమును బోలు తెల్లని కొంగలబారును గాంచినప్పు డొకసారియు, ఊరిలో నాటకమున శివవేషము దాల్చినప్పుడు రెండవతూరియు, తీర్థయాత్రాసమయమున ఈశ్వరసంకీర్తనముచేయుతఱి మఱియొకమాఱును గదాధరుడు అత్యుత్తమసమాధిస్థితి ననుభవించెను. ఈభక్తిభావములే క్రమముగా ఆతనికళాకౌశలమును మూఢాచారనిరాసనమును బాలనాయకత్వము నతిక్రమించి యాతని గుణగణములను పరమాత్మాన్వేషణమున పాదుకొల్పెను. ఆత్మసామ్రాజ్యమున నాతడు గడించిన యఖండ విజయములే మానవకోటి కాతని నాదర్శపురుషునిగా—యుగపురుషు

నిగా—నొనర్చి మించినవి.

## సాధనదశ : శ్రీరామకృష్ణుని దివ్యత్వము

1855-వ సంవత్సరమున కలకత్తాలో దక్షిణేశ్వర వనమున రాణి రాసమణి యను నామె నిర్మించిన కాళికాలయము శ్రీరామకృష్ణు నఖండవ్యక్తిత్వవిజృంభణమునకు దగిన వాతావరణము నొసెగెను. (ఇంతటినుండి జగత్ప్రసిద్ధమైన శ్రీరామకృష్ణనామమున గదాధరుని బేర్కొందము.) కాళీదేవియాలయమున ప్రధానార్చకుడై యాతడు నిర్వహించుచుండిన నిత్యపూజావిధు లాతని యంతరంగము నందలి భక్త్యగ్నిని రగుల్కొల్పెను. బాహ్యలోకము నెఱుగని గాఢధ్యానమున, దివ్యసంకీర్తనమున నాతడు గంటలు గడపువాడు. మఱియు రాత్రులందు సమీపముననున్న చిట్టడవికి పోయి, భక్తికి బాహ్యవేషము లేలయని కట్టుబట్టలను తుదకు జందెమునుగూడ విసర్జించి, విశేషకాలము భగవద్ధ్యానమున గడుపుచుండువాడు. శ్రీరామకృష్ణునకు సన్నిహితుడగు హృదయరాము డది గని త్రాళ్లు బువ్వా నిరోధింపజూచెను గాని భగవద్ధ్యాననిమగ్నునకు బాహ్యావరోధము లెట్లు భీతిగొల్పగలవు? పూజావిధానమున బాహ్యాచారములు క్రమముగా సడలిపోవ, జగజ్జనని సన్నిహితసంబంధమున మానసము నాక్రమింప, నాత డపూర్వరీతిని దేవి నర్చింపసాగెను.

ఇది యంతయు శ్రీరామకృష్ణుని యంతరంగమున జెలరేగుచుండిన భగవత్పరితాపబడబానలమునకు బాహ్యలక్షణము. తా నర్చించు కాళికాదేవి ఆలయమునందలి కేవల

నిర్జీవ శిలావిగ్రహమా, లేక సృష్టిస్థితిలయకారిణియగు సాక్షాత్ పరమేశ్వరియా? అగుచో అలదివ్యమాత తనకేల దర్శనమీయదు? ..ఇట్టి పరితాపాగ్ని హృదయమును దహింప, సాక్షాత్కారము లేని జీవితము దుర్భరముకా నాత డిట్లు ప్రార్థింపసాగెను: "తల్లీ! ఒకదినము గడచిపోయినది. నాకింకను నీవు ప్రసన్నవు గావైతివిగదా!... అమ్మా! ఆనందమయీ! నీకృపాకటాక్షమున నీవు నాకు సాక్షాత్కరింపక తప్పదు." తీవ్ర భగవద్విరహవేదనచే మొగము నేలను బెట్టి రాచుకొన గాయములై నెత్తురు కాఱెడిది. హృదయము ఱంపముతో గోయబడినట్లు బాధగలుగ నేలపై బడి పొరలాడుచు, నాతడు పడు వేదనను గాంచిన జనులు, "అయ్యో, పాపము! ఈతడేదియో 'శూలనొప్పి'చే బాధపడుచున్నాడు కాబోలును, లేక నిజముగా మాతృవియోగముచే కుందుచున్నాడు కాబోలును" అని జాలిపడువారు. ఆతడిక హతాశుడై యొకనాడు జీవితము నంతమొందించుకొన ప్రయత్నించు నంతలో అకస్మాత్తుగా సాక్షాత్కారము లభించెను. 'దేదీప్యమానమగు ననంత చైతన్య సాగరరూపమున' దైవమును గాంచి యాతడు సమాధిమగ్నుడయ్యెను. *

* అపుడు తనయంతరంగమున అనిర్వచనీయానందసాగరము—అంతకుముందు తా నెన్నడనుభవించియెఱుగని దివ్యానందము—ప్రసరించుచుండెననిమాత్రమే తన కెఱుకయనియు, అయినను తనదివ్యజనని భవ్యసాన్నిధ్యముమాత్రము తన హృదయాంతరాళమున భాసించుచునే యుండెననియు తనదివ్యానుభూతినిగూర్చి కాలాంతరమున నాతడు శిష్యులకు దెలిపియున్నాడు.

కాని యీభగవదనుభవము శ్రీరామకృష్ణునకు నిరంతర బ్రహ్మానుభూతిని గల్గింపజాలదయ్యె. బ్రహ్మానందామృతము నొకపరి రుచిచూపినను సంతతానుభవపిపాస నయ్యది తీర్పజాలదయ్యె. నిరంతర బ్రహ్మానుప్రాప్తికై పరితప్త హృదయుడై యాతడు దినములు గడపుచుండెను. సర్వ కాలసర్వావస్థలయందును, సమస్తప్రదేశములందును బ్రహ్మాను భూతి నొందుటకై యాతడు బాష్పధారలు ప్రవహింప వెక్కి-వెక్కి యేడ్చుచు మునుపటికంటెను తీవ్రతర పరితాపముతో తనదివ్య జననిని ప్రార్థింసాగెను. ఆ హృదయమథనమున నాతనికి బాహ్యలోకమే స్ఫురించెడిది కాదు—ఒకవేళ స్ఫురించినను కేవలము మిథ్యగా దోచెడిది. అతని ప్రార్థనల చేతను రోదనలచేతను ఆకృష్టులై జనులు చుట్టును మూగిన యెడల వారు కేవలము ఆతనికి నీడలవలెను తెరపై వ్రాయ బడిన బొమ్మలవలెను—అంత మిథ్యగా—అంతమాయగా—దోచెడివారు. నిద్రాహారములను మఱచి రేయింబవళ్లాతడు తదేకముగా జగజ్జననిని ప్రార్థింపసాగెను. తుద కాలయమున దేవి నర్చించు టాతని కసాధ్యమైపోయెను. ఆలయనిర్వా హకుడును రాణి రాసమణి యల్లుడునగు మథురనాథుడు శ్రీరామకృష్ణుని స్థితిని గాంచి ప్రేమ గౌరవములతో నాతని పూజావిధులనుండి తొలగించి సాధనకు దగిన సమస్తసదు పాయములను సమకూర్చెను. ఈ సదవకాశమును గొని శ్రీరామకృష్ణుడు లోకాతీతమగు భగవత్పరితాపముతో, అపూర్వాశయములతో, ధ్యానాది సాధనలందు నిమగ్ను డయ్యెను.

తనయఖండపరితాపమునుగూర్చి కాలాంతరమున నాతడు —నీటముంచియుంపబడినవాఁ డుక్కిరిబిక్కిరియై యెట్లు గిజ గిజలాడునో—సాక్షాత్కారమునకై యట్టివేదన ననుభవించితి నని శిష్యులకు దెల్పియున్నాడు. లోభికి తాను కూడబెట్టు కొనిన ధనమునందుండు మక్కువ, పతివ్రతకు భర్తయందలి ప్రణయము, తలిదండ్రులకు తమ యేకైక పుత్రునందుండు ననురాగము—ఇవి ముప్పిరిగొనినప్పుడుండు తీవ్రతరపరి తాపము—ఎట్టిదో—ఊహించినయెడల తన భగవదనురాగ మును భగవత్ పరితాపమును లేశము గ్రహింపవచ్చునని యాతడు శిష్యులకు దెలుపువాడు.

ఇంచుమించుగా ఈసమయమున నాతడు స్వగ్రామమగు కామారిపుష్కరము (Kamarpukur) నొకసారి చూచుటకై వెడలెను. పెండ్లి చేసినచో, ఆతని భగవదున్మాదమును ప్రపంచవిముఖతయు గొంత లొంగుబాటునకు వచ్చుననియు, "నలుగురితో బాటు నారాయణా" యనునట్లు క్రమముగా సంసారధోరణి యలవడుననియు తల్లి చంద్రమణీదేవి తల పోయసాగెను. తదనుసారము సమీపగ్రామమందలి రామ చంద్రముఖోపాధ్యాయుని కుమార్తెయగు శారదామణీదేవి యను నైదేండ్లబాలికను శ్రీరామకృష్ణునకు ఇచ్చి పెండ్లి చేసిరి. కాని యాతని పిచ్చిమాత్రము కుదురలేదు. అది దివ్యోన్మాదముగదా! అనతికాలముననే 1860-వ సంవత్సర మున తిరిగి దక్షిణేశ్వరము వచ్చినంతనే భగవదున్మాదమున మునిగిపోయెను.

ఇంతవఱకును శ్రీరామకృష్ణుడు తనభక్తిసాధనలను ఏ

గురు సాహాయ్యమును లేకయే స్వయముగా సాగించుచుండె నని చెప్పనగును. ఇంతటినుండియు దైవనిమంత్రితులై గురువులాతని వెదకికొనుచు రాసాగిరి. పూవు వికసించినంతనే మధుపము దానిని వెదకికొనుచు రాకుండునా? శ్రీరామకృష్ణు డాగురువరేణ్యుల సాయమును గొని శాస్త్రోక్తముగా వివిధ సాధనల నభ్యసింపసాగెను.

బ్రహ్మానుభవమున నితరసాధకులకును శ్రీరామకృష్ణునకును రెండువిషయములలో విస్పష్టమగు భేదము గాన్పించును. ఏసాధన నవలంబించినను ఆత డతిశీఘ్రముగా సిద్ధిని బొందుట మొదటి విషయము. ఆతని సత్యాన్వేషణమునందలి తీవ్రతయే—ఆతని యనిర్వచనీయ భగవత్పరితాపమే—ఇందులకు కారణమని చెప్పనొప్పును. మానవకోటిమత చరిత్రలో నింతకుముందు కనివిని యెఱుంగని వివిధసాధనల నాత డభ్యసించుట రెండవవిషయము. ఆతని జీవితము బ్రహ్మానందానుభవనందనవనమై, సర్వమత సామరస్య నిలయమై దీపించుట కిదియే హేతువు. *

శ్రీరామకృష్ణుని ప్రథమగురువు భైరవీబ్రాహ్మణియను యోగినీమణి. ఈమె విశేషవిద్యావంతురాలు, తాంత్రిక సాధనలందుం దఖండ విజయమును బడసిన మహనీయురాలు. అరువదినాలుగు శాక్తేయ తంత్రములందునుగల ప్రధాన

---

* 'బ్రహ్మానంద తేజము బహువిధములుగా ప్రకాశితమై శ్రీరామకృష్ణుని దివ్యజీవితమున సామరస్యదేవాలయమును నిర్మించియున్న'దనియు 'ఆదేవళమున కివే నాప్రణతు'లనియు కవిచంద్రుడు రవీంద్రుడు నుడివియున్నాడు.

సాధనలనన్నిటిని శ్రీరామకృష్ణు డీమె శిక్షణమున జయప్రదముగా నభ్యసించెను. దైవమును జగజ్జననిగా భావించి సాగింపవలసిన యోగసాధనలలో ననేకము కష్టాత్కష్టతరములు, సామాన్యసాధకుల కసాధ్యములు, మీదుమిక్కిలి ప్రమాదకరములు. సంపూర్ణమగు నింద్రియనిగ్రహమున్న నే కాని సమీపమునకుగూడ బోదగని సాధనలివి. కాని జితేంద్రియ చక్రవర్తియు జగజ్జననిముద్దుబిడ్డయునగు శ్రీరామకృష్ణుడు వీనినన్నిటి నవలీలగా సాధింపగలుగు టాశ్చర్యము కానేరదు. ఆతనిప్రతిభాతిశయ మెట్టిదో దీనిమూలముననే మనకు దెలియగలదు. ఈతాంత్రికసాధన నానారూపములలో పరమేశ్వరీ సాక్షాత్కారము నాతనికి బ్రసాదించుటయేకాక, ప్రతిస్త్రీయును సాక్షాత్ పరమేశ్వరీస్వరూపమే యనునిశ్చయము నాతని హృదయమున నెలకొల్పెను.

శ్రీరామకృష్ణు డవలంబించిన సాధనలలో వైష్ణవసాధనలు తరువాత గణింపదగినవి. ఈమార్గమున సఖ్య దాస్య వాత్సల్య మధురభావము * లనువానిలో నేదియో యొక భావమున భగవానునితో సన్నిహితసంబంధము నేర్పఱచుకొని సాధకుడు భగవానుని భజించును. ఒకదాని వెంబడి నొకటిగా శ్రీరామకృష్ణుడు వీనినన్నిటిని సాధించెను. మఱియు ఈభావము లెవ్వరియందు రూపుదాల్చెనో అట్టి పురాణపురుషులతో సాధనకాలమున నాతడు తాదాత్మ్యము

* భగవానుడు తనచెలికాడని భావించునది సఖ్యభావము, ప్రభువనుకొనునది దాస్యభావము, ముద్దుబిడ్డయనుకొనునది వాత్సల్యభావము, తనప్రియభర్తయని తలచునది మధురభావము.

నొందువాడు—దాస్యభావమున దాను హనుమంతుడననియు మధురభావమున రాధననియు—ఈవిధముగా భావించి యత్యద్భుతమైనసాధనల నొనర్చెను. తాదాత్మ్యమును బొందునపు డాతడు సరిగా ఆయా పురాణపురుషులవలెనే సంచరించుచు, అచ్చముగా అట్టిమనోభావములనే—అట్టి దివ్యానుభవములనే—పొందువాడు. సఖ్యభావమును మధుర భావమును సాధించునపుడు డాత డనేకమాసములపర్యంతము స్త్రీలనుమ స్త్రీవలెనే మెలగెను; ఆసమయమున ఆ స్త్రీలకు గాని, యాతనికిగాని అందు ప్రకృతివైరుధ్య మేమియు, వైచిత్ర్య మేమియు, పొడకట్టనే లేదు. ఆతని మనోభావము లును ప్రవర్తనమును అంతటి సహజములై, వినిర్మలములై యొప్పెను. అట్టి యపూర్వపరిణామమును మనశ్శరీరము లందు బడయగల్గుట కాతని విశుద్ధసంకల్పప్రభావమే కారణము.

పిమ్మట (1864-వ సంవత్సరమున) అద్వైతవేదాంతియు యతివరేణ్యుడునగు శ్రీతోతాపురితో శ్రీరామకృష్ణునకు సమావేశము లభించెను. దైవనిమంత్రితుడై తోతాపురి శ్రీరామ కృష్ణునిగలిసికొని యాతనికి సన్న్యాసదీక్షనొసగెను. ఇంతవఱకును శ్రీరామకృష్ణుడు సగుణస్వరూపమున దైవము నుపాసించుచుండెను. తోతాపురిశిక్షణమున నాతడు నిర్గుణ నిరాకార బ్రహ్మధ్యానమున నుత్తీర్ణుడై అఖండ బ్రహ్మ సాక్షాత్కారమును బడసెను. బ్రహ్మానుభవవాఙ్మయమున తుదిమాటయు సమస్తసాధనలకును పరమావధియునగు నిర్వి కల్పసమాధి శ్రీరామకృష్ణునకు మూడుదినములలో కరతలా

మలకమయ్యెను. అనుకూల పరిస్థితులు లభించునెడ దోర కాయ ముగ్గుట కెంతకాలము కావలయును? ఎచ్చటనైనను మూడుదినములకంటె నెక్కువ నిలువని పరివ్రాజకోత్తము డగు తోతాపురి శ్రీరామకృష్ణుని యఖండప్రతిభచే నాకృష్టుడై యించుమించుగా నొకసంవత్సరమువరకు సాంగ త్యమున గడిపెను. శ్రీరామకృష్ణు డద్భుతరీతిని గురువునకు గురువై సగుణ బ్రహ్మభావమును—జగన్మాతృభావమును—తోతాపురి కలవరిచెను. ఏమి నిరుపమానవిజయము!

1866-వ సంవత్సరమున శ్రీరామకృష్ణుడు 'సూఫీ' సంప్ర దాయమునకు జెందిన గోవిందుడను పకీరునొద్ద మహమ్మ దీయమతసాధనల నభ్యసించి హిందూమతసాధనల మూల మున దాను బొందిన మహాఫలమే తన్మార్గమునను బడయు నగునని స్వానుభవముచే గనుగొనెను. కొంత కాలమునకు బిమ్మట క్రీస్తును క్రైస్తవాదర్శమును ధ్యానించి తద్ధమ్య మును నితరమతముల గమ్యము నొక్కటియే యని గ్రహిం చెను.

అనంతరము 1872-వ సంవత్సరమున శ్రీరామకృష్ణుడు షోడశీపూజయను మహాసాధనయందు తన భార్యను సాక్షా త్పరమేశ్వరీ స్వరూపముగా నారాధించెను. అతని దివ్య సాధ నల కిదియే పరిసమాప్తియని చెప్పనగును. శ్రీరామకృష్ణుని బాలభార్యయగు శారదామణీదేవి నవయౌవనము నొందినను ఇంతవఱకు భర్తను రెండుమూడుసారులు మాత్రమే దర్శించి యుండెను. కాకిమూకలగు లోకులు తనభర్త పిచ్చివాడని చెప్పుకొనుచుండిన ప్రలాపములను విని యామె కలవరపడి

యాతని సేవించు తమకమున (1872-వ సంవత్సరమున) స్వయముగా దక్షిణేశ్వరము వచ్చెను. దివ్యప్రేమమూర్తి యగు శ్రీరామకృష్ణుడు సామాన్యసన్న్యాసులవలెగాక, శారదాదేవి నఖండసానుభూతితో నాదరించి యైహికాముష్మికవిషయము లన్నిటిలో నామెకు గురుత్వము వహించెను. వినిర్మల హృదయయగు శారదాదేవియు వెంటనే తన మగని యాశయములను గని తన ప్రాణేశ్వరుడు సాక్షాత్పరమేశ్వరుడను భావముతో నాతని సేవింపసాగెను. చంద్రమండలమునకైనను మచ్చ కలదు కాని యీదివ్యదంపతుల యన్యోన్యప్రేమమున కామకళంక మణుమాత్రమైనను కానరాదయ్యె. మఱియు మేలిమి బంగారమగు తనజితేంద్రియత్వమును బరీక్షించుకొనుటకేమి, స్త్రీలనందఱను సాక్షాజ్జగజ్జననీస్వరూపిణులనుగా గాంచుటకేమి, తనచెంత శారదాదేవియునికి శ్రీరామకృష్ణునకు దోడ్పడియెను.

షోడశీపూజ శ్రీరామకృష్ణుని దివ్యజీవితమున సాధక భావమునకు శాంతిపాఠము; ఇంతటినుండియు లోకమున కాతడొనర్చిన దివ్యజ్ఞాన దానమునకు—అతని జగద్గురుభావమునకు—గణపతిపూజ. సాధనల నిమిత్త మాతనితీవ్రదాహము షోడశీపూజానంతర ముపశమించెను; తత్త్వము నిక కరతలామలకముగా గాంచుచు, తన మనశ్శరీరముల మూలమున జగజ్జనని లోకమునకు బ్రకటించు విజ్ఞానమును అఖండాధ్యాత్మిక శక్తిని విస్పష్టముగా నాతడు గుర్తింపసాగెను. ఆత్మమార్గమును లోకమునకు బోధించుటకై యాతడు పరితపింపసాగెను.

శ్రీరామకృష్ణునిజీవితమును బరిశీలించినచో, బాల్యము నుండియు నాతనియందు సద్గురువరేణ్యుని లక్షణములు పొడకట్టును. అనేకుల కీబాలశుకునిపలుకులు జ్ఞానప్రదీపకములై భాసించెను. సాధనకాలమున ఈశక్తి వికసింపసాగెను. దక్షిణేశ్వరాలయ నిర్వాహకులగు రాసమణీ మథురనాథులయెడ ఆత డెన్నడును సేవకభావము వహింపలేదు; సరికదా, సామాన్యబహిఃప్రజ్ఞయందు వారి యాప్తుడుగను దివ్యభావములందు రక్షకుడుగను ఇలువేలుపుగను వర్తించెను. ఆతనికి బోధింపవచ్చిన గురువు లాతనికి నేర్పినదానికంటె విశేషము తామే నేర్చుకొని వెడలిరి. భైరవీ బ్రాహ్మణి యాతని సాంగత్యముచే తనశీలమునందలి లోపములను సవరించుకొని యఖండ వైరాగ్య మలవరుచుకొనియెను. తోతాపురియు దన కపూర్వమగుభక్తిరహస్యముల నాతనికడ గ్రహించెను. మఱియు 1870-వ సంవత్సరమున శ్రీరామకృష్ణుడు మథురనాథునితో తీర్థయాత్రకు వెడలినపు డనేకు లాతనిసంసర్గమున ధన్యులైరి. విశేషము, వివిధసంప్రదాయములకు జెందిన సాధకులును సన్న్యాసులును వందలకొలది దక్షిణేశ్వరము వచ్చి యాతని దివ్యోపదేశసుధారసమును గ్రోలసాగిరి. పండితు లాతనివచనామృతము నాస్వాదించి ముగ్ధులై, ముముక్షువులైరి. వైష్ణవచరణుడు, పద్మలోచనుడు, నారాయణశాస్త్రి మున్నగు సుప్రసిద్ధపండితులు—ఉత్తమ సాధకులు— ఆ యమృతాస్వాదనభాగ్యమును బడసి తన్మయులై శ్రీరామకృష్ణుడు సాక్షాద్భగవదవతారమూర్తియని

భావింపసాగిరి. *

శ్రీరామకృష్ణుడు పరమహంసయని — దివ్యపురుషుడని — లోకము గ్రహింపసాగెను. ఆజన్మాంతము మహోత్తమ సమాధిస్థితు లాతనికి తఱచు కలుగుచునేయుండినను ఆతని నిరంతర బ్రహ్మానుభూతి సమాధివంటి ప్రత్యేక మనఃస్థితిపై నాధారపడినది కాదు. సగుణనిర్గుణభావములు రెండిటను బ్రహ్మానుభూతి నొందగలుగుచు, ఈ దివ్యానుభవమున కిసుమంతయు భంగములేకయే నిత్యకృత్యముల నవలీలగా నెఱవేర్పగలుగునట్టి 'భావముఖము' తనమనఃస్థితియని శ్రీరామకృష్ణుడే తెలిపియున్నాడు. పండితంమన్యులగు కొందఱు ప్రకృతిశాస్త్రజ్ఞులు తలచున ట్లాతని సమాధిస్థితులును దివ్యానుభూతులును మనోదౌర్బల్యలక్షణములు కానేరవనుట కాతని నిరుపమానవినిర్మలజీవనవిధానమే ప్రబల నిదర్శనము. ఎట్టి విషమపరిస్థితులయందైనను అఖండ ప్రశాంతియే యాతని జీవితగాన మాధుర్యమై యొప్పె, నిరంతర బాల్యోత్సాహమే యందలి ప్రధానస్వరమై విలసిల్లెను. లోకమును పాపపంకిలమున ముంచివేయు కామకాంచనము లాతని లేశమును వ్యామోహితుని జేయజాలక పోయెను. సుశీలవ్రతయైనను, కాకున్నను సమస్త స్త్రీలును ఆతనికంటికి జగన్మాతృస్వరూపిణులుగనే కన్పట్టిరి.

ఆతని కాంచనవిజయమో, అత్యద్భుతము. ధనముగాని,

---

* భైరవీబ్రాహ్మణి యించుమించుగా ఈ సమయముననే పండితమహాసభ జరిపి శ్రీరామకృష్ణుడు భగవదవతారమూర్తియని లోకమునకు ప్రకటించెను.

తుద కే లోహమునుగాని యాతడు ముట్టనే ముట్టజాలడయ్యె. సాధనకాలమున నాత డొకచేత మట్టిని రెండవచేత కనకమును బట్టుకొని, వైహికసుఖసంపాదనమున కేగాని, ఆత్మసాక్షాత్కారమున కవి రెండును సమానముగనే నిరుపయోగములని నిశ్చయించి రెంటిని గంగలో బాఱవైచును. కాలాంతరమున నాతని ప్రియశిష్యుడగు నరేంద్రుడు (వివేకానందస్వామి) ఒకప్పు డాతని కాంచనవిజయమును బరీక్షింప నెంచి యొక వెండి నాణెము నాతని పాన్పుక్రిందబెట్ట నాతడు దానిపై గూర్చుండినంతనే తేలు కుట్టినట్లు శరీరము మంటలెత్త తటాలున పాన్పు దిగెను! లోహస్పర్శనైనను సహింపజాలని యాతని కాంచనవిజయమును కన్నులార గాంచి శిష్యులు నిశ్చేష్టులైరి. మఱియొకప్పు డొక మార్వాడీభక్తుడు పదివేల రూపాయలను సమర్పింపబోవ, "శరీరము అంపముతో కోయ బడినట్లు" బాధపడి శ్రీరామకృష్ణు డా కానుకను తృణీక రించెను. ఎట్టి యద్భుతకాంచనవిజయమో కదా!

ఇక సంసారవిషవృక్షమునకు తల్లివేరనదగు నహంకార ము నున్మూలిత మొనర్చుకొనుటకై యాతడు సాగించిన సాధన లనుపమానములు. మలినప్రదేశములను శుద్ధిచేయువారల మఱుగుదొడ్లను తనపొడుగాటిజడలనుచీపురుగా జేసితుడిచెను! జనులలో — పనులలో — న్యూనతాధిక్యములు గలవను భ్రాంతి నాత డిట్లు నిర్మూలించెను.

ఆతని సత్యనిష్ఠయో, సత్యహరిశ్చంద్రాది పురాణ పీరులను దలపునకు దెచ్చును. జీవితమందలి విషమతమసంఘ టనములలో సత్యవ్రతమును బరిపాలించు టటుండ, నొకానొక

దినమున నొక చోటికి బోవుదునను వాగ్దానమునుగాని, యొకని యొద్దనుండి యొక వస్తువును గైకొందునను మాటనుగాని యాత డెన్నడును జవదాటజాలడయ్యె. ఒకవేళ నాతడు తన వాగ్దానమును మఱచినను తద్వ్యతిరిక్తముగా వర్తింప నాతని మనశ్శరీరములే నిరాకరించి విషయమును జ్ఞప్తికి దెచ్చెడివి. జగజ్జననికి సర్వము తా నర్పించినను సత్యమునుమాత్ర మర్పింప జాలనైతిననియు సత్యము నర్పించినచో తనయాత్మార్పణమే అసత్యమైపోవుననియు నాతడు వచించెను. నిజముగా ఆతని గభీరవ్యక్తిత్వమును బరిశీలించినచో, అందు సుగుణరత్నరాసు లనంతముగా గాన్పించును.

## జగద్గురువు

కల్యాణగుణములకు పెన్నిధానమగు శ్రీరామకృష్ణుని జీవితము లోకమున కెట్టిమేలొనగూర్చెనో మనమిక గమనింపవలసియున్నది. శ్రీరామకృష్ణుని జగద్గురుత్వ మీావలకే ప్రారంభమైనను 1875-వ సంవత్సరమున నాతడు బ్రాహ్మసమాజమహానాయకుడగు కేశవచంద్రసేనుని గలిసికొనిననాటినుండియు నాతనియుపదేశామృతము లోకమున నవిచ్ఛిన్నముగా బ్రసరింపసాగెను. ఆతని యసమానప్రతిభను —అద్వితీయమాన్నత్యమును—గూర్చి మహావక్తయు సుప్రసిద్ధతత్త్వవేత్తయు నగు కేశవచంద్రసేనుడు తన మహోపన్యాసములచే, రచనములచే,లోకమునకు జాట నారంభించెను. అంతట కలకత్తా పౌరులు, ముఖ్యముగా విద్యాధికులు, ఆబాలవృద్ధము తీర్థప్రజవలె శ్రీరామకృష్ణ సందర్శనార్థమై

రాసాగిరి. ప్రతాపచంద్రమజుందారు, శివనాథశాస్త్రి, విజయ కృష్ణగోస్వామి, దేవేంద్రనాథఠాకూరు, ఈశ్వరచంద్ర విద్యా సాగరుడు, బంకిమ్‌చంద్రచట్టోపాధ్యాయుడు, మైకేల్ మధు సూదనదత్తు, అశ్వినీకుమారదత్తు, గిరీశచంద్రఘోషు మున్నగు నాటి సుప్రసిద్ధవ్యక్తు లనేకులు శ్రీరామకృష్ణుని సందర్శించి, యాతనియెడ నఖండపూజ్యభావమును వహించి, లోకమునకు బ్రకటింపసాగిరి.

ఇటు లాతని సందర్శించిన ముముక్షువులలో ననేకులు క్రమముగా నొకభక్తబృందమై వెలసిరి. కాలాంతరమున వీరే శ్రీరామకృష్ణుని సందేశమును దేశదేశాంతరములలో వ్యాప్తమొనర్చిన ధన్యాత్ములు. సంసారులై యున్న పెద్దలు, సంసారబంధము నింకను బైనవేసుకొనని యువకులు — విద్యార్థులు — ఇటు లీబృందమున నిరుతెగల వారుండిరి. ఇందు గొందఱు బాలురు. ఈసమయమున నరేంద్రనాథదత్తు అన బఱగిన శ్రీవివేకానందస్వామి నాయకత్వమున వీరలే కాలాంతరమున శ్రీరామకృష్ణాశ్రమ సన్న్యాసులై గురుసందేశ ధర్మజ్యోతిని బ్రజ్వలింపజేయుసాగిన యతీంద్రులు. నరేంద్ర నాథుడు ఈబాలశిష్య బృందమున శ్రీరామకృష్ణున కత్యంత ప్రీతిపాత్రుడై, అఖండానుగ్రహపాత్రుడై కాలక్రమమున వివేకానందుడై గురుసందేశమును బ్రాక్పశ్చిమఖండములం దంతటను వ్యాప్తియొనర్చిన మహనీయుడు. తన యఖండ సేవలచే నవీన భారతదేశమున ఈ యతీశ్వరుడు నూతనోత్తేజ మును నూతన చైతన్యమును బ్రభవింపజేసి దేశ భక్తాగ్రగణ్యుడై విలసిల్లెను.

శ్రీరామకృష్ణుడు తన జీవితశేషమును ఈభక్తబృందమునకు బోధించుటకై — వారల జీవనవిధానమును మహోన్నతాదర్శదీపిత మొనరించుటకై — వినియోగింపసాగెను. శిష్యుల కాతడాప్తబంధువుడు, ప్రాణమిత్రుడు. తాను గురుడనని యాతడు కలనైనను దలచి యెఱుగడు. జగజ్జననిచేతిలో తాను కేవలము ఉపకరణమనని యాతడు భావించెను. ఇట్టి సంపూర్ణాత్మార్పణమువలననే ఆచార్యశక్తి యాతనియం దఖండముగా ప్రకాశితము కాసాగెను. ఆతని సాన్నిధ్యమును బొందిన సర్వము పవిత్రమై, మహనీయమై వఱలెను. పరుసవేదితాకున నినుము బంగార మగునట్లు పతితు లాతని సంసర్గ ప్రభావమున పావనులై యొప్పిరి.

ఐనను కఠినపరీక్షలకు దాళనిదే శిష్యుల నాతడు స్వీకరించువాడు కాడు. తనశిష్యులు లోకాదర్శపురుషులై వెలయుటయే శ్రీరామకృష్ణుని ప్రధానాశయము. శిష్యుల శారీర లక్షణములను ప్రవర్తనమును బరీక్షించుటలో నాత డఖండ నిపుణుడు. అజాగరూకులై యున్నతఱి వారల జీవితచర్యలను అతిజాగరూకతతో బరిశీలించును; ప్రశ్నలు వైచి వారిమనోభావములను గమనించును; తనబోధలచే, వర్తనముచే, ఆదర్శములచే, వారియందు గలుగు మార్పు లెట్టివో గుర్తించును. మఱియు నావశ్యకమైనపుడెల్ల దనయోగశక్తియను దివ్యతేజమును వారల హృదయాంతరాళమున బఱపి యథార్థవిషయములను గ్రహించును. ఒక్కొక్కప్పుడొకవిధమైన సమాధిస్థితిని గలిగించి వారిచే తమహృదయాంతరత రహస్యములను బ్రకాశింపజేయును. శ్రీరామకృష్ణ

భాస్కరునకు శిష్యహృదయములు కమలములై యొప్పెను!

ఆకసముకంటె నున్నతమును సముద్రముకంటె నగాధము నగు తన యనంతప్రేమచే శిష్యుల నాతడు స్వవశము గావించుకొనెను. తన యఖండప్రేమచేత న్నాతడు దాసునిగా నొనర్చి వైచెనని శ్రీవివేకానందస్వామియే పలికియున్నాడు. తమ తలిదండ్రులైనను ఆతనివలె తమ్ము ప్రేమించి యెఱుగరని యితర శిష్యులు వక్కాణించియున్నారు. తన బోధలను శిష్యు లాచరించు విషయమున నాత డఖండశ్రద్ధ వహించువాడు. ఆతని బోధనవిధాన మత్యద్భుతము. శిష్యులతో నాతడెన్నడును తర్కించువాడుకాడు. ఒక్కమాటచే, స్పర్శచే, కటాక్షముచే, నాతడు బోధించును. "ఆత్మసాక్షాత్కారమే మానవుని పరమావధి. ఆత్మానంద ప్రపూర్ణమగు హృదయమున వాదోపవాదములకు తావు లేదు. జ్ఞానోదయమైనంతనే సంశయాంధకారము పటాపంచలగును" — ఇదియే యాతని బోధన. ఆటలతో పాటలతో, వింతలతో, వినోదములతో నాతడు మహోన్నతాధ్యాత్మికతత్త్వములను శిష్యులకు బోధించెను. దైనందిన జీవితచర్యలను బరిశీలించి క్రమవిరహితమగు నెట్టిస్వల్పవిషయమును గూర్చియైనను సదుపదేశము లొనర్చెను. వర్తకులు నాణెములను బరీక్షించు చందమున తనమాటలను చేతలను పరిపూర్ణముగా బరీక్షించి ననేకాని నమ్మనక్కఱలేదనెను. అట్టిసద్గురు చరణసాన్నిధ్యము లభించిన యాశిష్యు లెంతటి ధన్యులోకదా!

అతని ప్రతిభాతిశయ మపూర్వము. ఆత్మవికాసమున ఏదశలోనున్న వారినైనను అవలీలగా నాత డాకర్షింప గలుగు

వాడు—సాధకుల యధికారాంతరము ననుసరించి బోధించుచు తన బోధనలను వారికి విస్పష్ట మొనర్చువాడు. శశధరతర్క చూడామణి, ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు మున్నగు పండిత వరేణ్యులను తనవిజ్ఞానముచే నొకవైపున ముగ్ధులను జేయుచు, మఱియొకవైపున తమ సంసారతాపత్రయమును దెలుపుకొని శాంతినొందవచ్చిన పల్లెటూరిస్త్రీలకు—వెఱ్ఱిమొఱ్ఱి సంశయములను దీర్చుకొనవచ్చిన యసామాయకవ్యక్తులకు — మన శ్శాంతి గలుగున ట్లాతడు సంభాషించువాడు. ఆచారవ్యవహారములలో—మనోభావములలో—సనాతనులకెల్ల సనాతనుడయ్యు, పరమతస్థులయెడ, నవీనసంస్కర్తలయెడ, ప్రకృతిశాస్త్ర పండితుల యెడ — విశేష ప్రేమసానుభూతులను జూపువాడు. అట్టిచో నరేంద్రనాథుడు, నాగమహాశయుడు, మహేంద్రలాల్‌సర్కార్, గిరీశచంద్రఘోషు— ఇట్టి విలక్షణస్వభావు లగు వ్యక్తు లాతని సన్నిధానమున గూడి సోదరప్రేమతో మెలగు టబ్బురము కానేరదు.

ఔదార్య మాతని జీవనసౌరభమైనచో, సరళతయే యందలి చక్కదనము. పసిబాలుని నమ్మికను బోలు నమ్మిక గలిగి సత్యమును బ్రహ్మచర్యమును బరిపాలించుటయే సాక్షాత్కారమునకు నిశ్చితమార్గమని— వినిర్మలహృదయముననే భగవానుడు విస్పష్టముగా గోచరించునని—శిష్యుల కాతడు ప్రకటించును. ఏ రూపమున నొనర్చినను మనఃపూర్వకమగు ప్రార్థనయు జపమును ధ్యానమును భగవంతుని వశమొనర్చుకొన గలవని యాతడు వక్కాణించును.

శ్రీరామకృష్ణుని బోధన నవరసభరితము. నవ్వుచు, పరి

హాసించుచునే అతి గభీరవిషయములను—ఆధ్యాత్మిక విషయములను—ఆత డతివిచిత్రముగా బోధించును. ఆతని సంభాషణము లొకప్పుడు కడుపు చెక్కలగునట్లు నవ్వించును, మఱియొకప్పుడు శ్వాసలుకట్టువడ నిశ్చేష్టుల నొనర్చును; ఇంతలో అఖండావేశము గలిగించును; అంతలో అపూర్వచిత్తశాంతిని జేకూర్చును. భక్తిపరవశుడై యాత డొక కీర్తనమును బాడి జగజ్జననినామము నుచ్చరించుచు నృత్యముచేయును. పిమ్మట ప్రాయికముగా భగవానుని సగుణనిర్గుణస్వరూప సమన్వయమువంటి వేదాంతరహస్యములను గూర్చి సహజసరళరీతి నత్యద్భుతముగా బోధించును. ఇట్టి మహోన్నతాత్మభావములనుండి యవలీలగా వ్యావహారిక విషయములలోనికి దిగి ప్రపంచజ్ఞానమును లోకవర్తనవిధానమును బోధించును. అహంకారియగు యోగీంద్రున కాత డెట్లు బేరమాడ వలయునో తెల్పెను; నిరంజనుని దుడుకుతనమును నిరసించి నిరోధించెను; స్త్రీలయెడ ద్వేషభావము జూపుచుండిన వారికి వారియెడ పూజ్యభావము నలవరుచుకొనుమని బోధించెను; ఏకపుత్త్రిని గోల్పోయి కుందుచుండిన మణిమల్లికు నోదార్చెను; ఆలుబిడ్డల నలక్ష్యముచేయుచుండిన యొకని చీవాట్లు పెట్టెను. భక్తి గానిండు, వేదాంతము గానిండు, లోకవర్తనము గానిండు—దేనినిగూర్చి బోధించినను, ఆతనిబోధనలు హాస్యచమత్కారములతో, మనోహర దృష్టాంతములతో నీతి కథారత్నములతో, వంగీయ గ్రామ్యసంభాషణాశైలిలో మృదుమధురస్వరమున ప్రాణప్రదీప్తములై యలరారు

చుండెడివి. * ఈ సంభాషణముల నడుమ నాతడు భక్తి పరవశుడై మహోత్తమసమాధిస్థితులను బొందుచుండుట జూచి జను లబ్బురపడుచుండెడివారు.

ఇట్లు తరచు సమాధినిమగ్నుడయ్యు, (సదా) భగవదేకార్పితచిత్తుడయ్యు, నిత్యకృత్యములలో నల్పవిషయములందుసైత మాతడు జూపు శ్రద్ధ యత్యద్భుతము. శౌచమునందేమి, గృహోపకరణములను యథాక్రమమున నుంచుటయందేమి యాత డతిజాగరూకుడు. చినిగిన గుడ్డలతోడను తెగిన చెప్పులతోడను జనులు సంచరించు టనిన, అతనికి రోత. తా నెచ్చటికి వెడలినను, తన కుపయుక్తమగు వస్తువులను గైకొని మఱి వెడలును. మఱియు తమ్ము పిలిచినవారి కిబ్బంది కలుగురీతినిగాని, అట్టి సమయమునగాని యెన్నడును వెడలవలదని శిష్యుల కుద్బోధించును. జోడుకాని, గొడుగుకాని, అంగవస్త్రముకాని జీవితమున నాత డెన్నడును నెచ్చటను మఱచివచ్చి యెఱుగడు. ఆతని కన్ను సూక్ష్మదర్శని, మఱియు దూరదర్శని. ఆత డొక భవనమున బ్రవేశించినచో, అందలి వస్తువులను— ఇతరులు గమనింపని వానిని సైతము —ఒక్కుమ్మడి కటాక్షవీక్షణముననే పరిశీలించి వాని నిజరూపస్థితులను ఎంతకాలమునకు బిమ్మటనైనను అచ్చముగా కంటికి గట్టినట్లు వర్ణింప గలుగువాడు.

సద్గురువరేణ్యు డగు శ్రీరామకృష్ణు డీరీతిని మహోత్తమాదర్శమును దన జీవితమున లోకమునకు బ్రకటించుచు,

---

* 'మనోజ్ఞమగునదయ్యు నించుక నత్తి' యాతనిమాటలలో తలచూపుచుండెడిదట.

తన బోధామృతమును గ్రోలు తమకమున దన్ను సందర్శించు ముముక్షుకోటికి నిద్రాహారములను మఱచి బోధింపసాగెను. విశ్రాంతి నెఱుగని ఇట్టి ప్రబోధపరంపరచే నాతని సుకుమార శరీరము సడలిపోసాగెను— ఆతని కంఠములో (1885-వ సంవత్సరమున) వ్రణము బయలుదేఱెను. భక్తు లాతని కలకత్తా నగరమునకు దీసికొని వెడలి సుప్రసిద్ధుడగు మహేంద్రలాల్ సర్కారుచే చికిత్స చేయింపసాగిరి. కాని వ్యాధి నానాటికి ప్రబలమగుచుండెను. అగ్ని కర్పూరమును హరించునట్లు ఆ ఘోరవ్యాధి యాతని జీవితమును హరింపసాగెను; కాని యాతని బ్రహ్మానందమునకుగాని, నిరంతర బ్రహ్మానుభూతికి గాని అణుమాత్రమును లోపము కలుగకుండెను.

శ్రీరామకృష్ణుని యుపదేశసుధ లోకమున కవిచ్ఛిన్నముగా లభించిన దీసమయముననే. 1884-వ సంవత్సరము నాటికే యాతని యన్వర్థనామము కలకత్తానగరమం దంతటను వ్యాపింప, నాతనియునికి జనసమూహముల నాకర్షింపసాగెను. ప్రాణాపాయకరమగు స్థితిలో నున్నను, వైద్యులును శిష్యులు నెంత వలదనినను, అఖండవిశ్వమానవప్రేమచే నాతడు తన యంత్యదినపర్యంతము జనసమూహములకు బోధించుచునే యుండెను. "ఈశరీర మేమైననేమి ? ఒక్క జీవికి సాయ మొనర్పగలిగినచో, వేయిపర్యాయములు కుక్కనై పుట్టుటకైన సంసిద్ధుడను" అని యాతడు ప్రకటించెను. స్వార్థరాహిత్యమునకు— ప్రేమానురాగములకు — ఇంతకంటె పరమావధి యెద్ది ?

శ్రద్ధాభక్తులతో ప్రియశిష్యులు శ్రీరామకృష్ణుని సేవిం

చుచు, ఆతని మహోపదేశములను బడయుచు, ఆత్మవికాసము నొందసాగిరి. ఈసమయమున వారలహృదయములందు పాదుకొనిన సోదరభావమే కాలక్రమమున శాఖోపశాఖలతో జగద్వ్యాప్తమై మించిన శ్రీరామకృష్ణమఠసేవాసంఘ సంస్థయను మహావృక్షమునకు బీజమై యొప్పెను. సాక్షాత్కారము నొందవలయునను తీవ్రవాంఛతో — గురుసంసేవనమే భగవదారాధనమను విశ్వాసముతో బాలశిష్యులు నరేంద్రనాథు(వివేకానందు)ని నాయకత్వమున శ్రీరామకృష్ణుని సేవించుచుండ, చికిత్సకగు వ్యయమును ఇంటియొద్దను గృహస్థశిష్యులు భరింపసాగిరి. గురుదేవుని వ్యాధి శిష్యుల నందఱను ఐక్యసూత్రబద్ధుల నొనర్చెను.

వ్యాధి యెంత తీవ్రముగానున్నను, ఆధ్యాత్మికశక్తి శ్రీరామకృష్ణునియం దీసమయమున మూర్తీభవించెను. దివ్యానుభూతుల నాతఁడనేకుల కనుగ్రహింపసాగెను. 1886-వ సంవత్సరము జనవరి యొకటవతేది నాతడు తన యాశీర్వచనము గోరిన భక్తులందెల్ల తనదివ్య సంకల్పముచే బ్రహ్మశక్తిని మేల్కొల్పెను. లోకకల్యాణార్థము నరేంద్రునకాతడు గొంతకాలమునకుబిమ్మట దన దివ్యశక్తులను బ్రసాదించెను. గుర్వనుగ్రహమున నరేంద్రు డింతకుముందుగనే నిర్వికల్పసమాధ్యనుభవమును బొందిన ధన్యాత్ముడు.

శ్రీరామకృష్ణు డించుమించుగా నొకసంవత్సరము వ్యాధిగ్రస్తుడై యుండెను. అంత్యదినము పర్వెత్తుకొనివచ్చినది. శ్రావణకృష్ణ ప్రతిపత్ భానువారము రాత్రి యించుమించుగా ఒంటిగంటకు (1886-వ సంవత్సరము ఆగస్టు 16-వ

తేదిని) శ్రీరామకృష్ణు డఖండసచ్చిదానందమయ పరబ్రహ్మైక్యము నొందెను.

శ్రీరామకృష్ణుడు తనభౌతికశరీరమును జాలించెను. ఐన నేమి? ఆతని దివ్యభావములు సజీవములై, శ్రీరామకృష్ణమఠ సేవాసంఘములై దేశసేవనేకాక ప్రపంచసేవను సల్పుచుండుట లేదా?

## ఉ ప దే శ సా ర ము

శ్రీరామకృష్ణుడు బోధించిన దేమి? 'మాటలమూలమునకంటె చేతలమూలమున' నాత డెక్కువ బోధించెననుట ముమ్మాటికిని నిజము. ఆతని దివ్యోపదేశము లాతని జీవితమున రూపు దాల్చినవి. ఆత డెన్నడును వ్రాసి యెఱుగడు, ఉపన్యసించియెఱుగడు. కాని తనబోధనల నన్నిటిని సంభాషణరూపమున జిజ్ఞాసువుల కొసగెను. ఈ సంభాషణములను గొన్నిటిని శిష్యు లతి జాగరూకతతో వ్రాసి భద్రపఱిచి యున్నారు. కాని యీ మూలములైనను ఆతని బోధనలను సమగ్రముగా దెలుపునని చెప్పజాలము. వాగ్రూపమున — సంభాషణ రూపమున— ఆత డొనరించిన బోధనలలో శిష్యులు స్వయముగా వ్రాసియుంచిన వన్నియు — విస్తారమగు వాఙ్మయమున బహు గ్రంథములలో గాన నగు నాతనియమూల్యోపదేశములన్నియు— యథారూపమున 'శ్రీరామకృష్ణబోధామృతము' న క్రోడీకరింపబడియున్నవి. కాని యిందు గూర్పబడిన విషయములు వివిధ సందర్భములలో జెప్పబడినవగుటచే సామ

రస్యమును—ఏకవాక్యతను—గూర్చుట కెన్ని యుపాయ ములమే మెంత ప్రయత్నించియున్నను, అదుకులు గాన్పింపక మానవు—కొంతవఱకైనను విషయము ఖండఖండములుగా దోపకమానదు. బోధనలను క్రమవికాసమార్గమున బొందు పఱచుటకై శ్రద్ధ వహించియున్నను, అందలి ప్రధాన తత్త్వములను ఇట సంగ్రహముగా దెల్పినచో, పాఠకజన సామాన్యమునకు విశేష ప్రయోజనకరమగునని మా ఆశ యము. ఐనను దిగ్దర్శన్యాయమున ఈక్రింద జూపబడు విష యములు ప్రత్యేకమైన యొక మతమునుగాని, సంప్రదాయ మునుగాని నిరూపించునవి కావని పాఠకులు గమనింతురుగాక. శ్రీరామకృష్ణపరమహంస ప్రత్యేకమగు నేమతమునుగాని, యే సంప్రదాయమునుగాని, యే సిద్ధాంతమునుగాని ప్రక టించి యుండలేదు, బోధించియుండలేదు. వివిధోపాసనా వాహినులు—వివిధమతసాధనలు—ఆతని విజ్ఞానసాగరమున లీనమై యొప్పుచున్నవని గమనింపవలసియున్నది. అందలి సారామృతమే యీ క్రింది తత్త్వసంగ్రహము.

సత్యము, లేక తత్త్వము స్వయంజ్యోతి. ఏకమగు నీ తత్త్వమే ప్రపంచమందలి వివిధమతములచే భగవంతుడు, అల్లా, బుద్ధుడు, శివుడు, విష్ణువు, బ్రహ్మము — మొదలగు నామములచే సూచింపబడుచున్నది. సాకారమదియే, నిరా కారము నదియే; సగుణమదియే, నిర్గుణము నదియే, నిరా కార బ్రహ్మమనునది సాకారబ్రహ్మముకంటె తక్కువదని గాక, నిరుపాధికమని భావింపనగును.

స్వతస్సిద్ధముగా బ్రహ్మము సర్వాతీతమయ్యు, పరమేశ్వ

రాంశమున (లీలారూపమున) చేతనాచేతన ప్రపంచమున కంతకును మూలాధారమై సృష్టిస్థితిలయకారణమై యొప్పుచున్నది. ఈభావముననే బ్రహ్మము జగత్పితయనిగాని జగన్మాతయనిగాని సూచితమగుచున్నది. జీవులును జగత్తును గూడ బ్రహ్మస్వరూపములే—పరమేశ్వర స్వరూపములే.

భక్తునకు ఆతడు ప్రేమమూర్తి, జీవనజ్యోతి. సంసార దుఃఖములు తన్ను మఱచి సంచరించుచున్న తనబిడ్డలను తిరిగి తనయొద్దకు జేర్చుకొనుటకై ఆతడు వినియోగించు నుపాయములు. సర్వాంతర్యామియై వెల్గొందుచున్నను భక్తిపూరితు లగువారలకు ఆత డత్యంతాప్తుడు. మానవుని హృదయాంతరాళమునుండి వెలువడు ప్రార్థనల నాత డాలకించును—ఆలకించి తనకటాక్షమును వానిపై బఱపును.

నిర్గుణనిరాకారతత్త్వమున వానిని జ్ఞానమార్గముచే బ్రాపింపనగును; సగుణసాకారరూపమున వానిని భక్తిమార్గమున బొందవచ్చును. ఐనను ఆత్మార్పణముతోఁగూడిన భక్తిమార్గమే మానవున కెంతయు సహజము, సులభము. * ఈ మార్గము నవలంబించువారల కాతడు జ్ఞానఫలమగు బ్రహ్మైక్యమునుగూడ బ్రసాదించును. భక్తిమార్గమున భగవానుని మన తండ్రిగాగాని, తల్లిగాగాని, మిత్రునిగాగాని, పుత్రునిగాగాని, ప్రాణేశ్వరునిగాగాని, సన్నిహితము, ప్రియతమము నగు మఱియే యితరసంబంధమునగాని భావింపనగును,

* "భగవన్నామస్మరణ, సంకీర్తనము మొదలగు సులభోపాయములతోఁగూడిన నారదప్రోక్తమైన భక్తిమార్గమొక్కటియే యీ కలికాలమున తరణోపాయము" అని శ్రీగురుదేవుడు జనసామాన్యమునకు బోధించువాడు.

భజింపనగును. భక్తుని మనోభావముననుసరించి భగవానుడు వివిధదివ్యరూపములతో సాక్షాత్కరించుచుండును.

సాక్షాత్కారవాఙ్మయమున అద్వైతము తుదిమాట. అది మనస్సునకును మాటలకును అతీతమగుటచే యోగ సమాధిలో ననుభవింపబడవలసినదే. మనస్సును బుద్ధియు విశిష్టాద్వైతమువఱకుగల విజ్ఞానమును గ్రహించి మాటలలో జెప్పగలుగును. వానిని దాటి యవి పోజాలవు. విశిష్టా ద్వైతముయొక్క సంపూర్ణావస్థయం దఖండ సచ్చిదానంద వస్తువును తద్బాహ్యరూపమును సమముగా సత్యములని కను గొనవచ్చును.

జీవులయెడ తన యనంతకారుణ్యముచే భగవాను డవత రించును. బ్రహ్మమార్గమును—ధర్మమార్గమును—లోక మునకు దెలుపుటకై ఆత్మశక్తికిని పవిత్రతకును నిలయ మగు నొకానొక దివ్యమానవ రూపమున నాత డావిర్భ వించును. వివిధదేశకాలములలో లోకమునకు ఆధ్యా త్మిక జీవనమార్గములను జూపిన ధర్మస్థాపకులందఱును ఇట్టి యవతారపురుషులే—లేదా, ఈశ్వరాదేశమునొందిన మహ నీయులే. వారి నారాధించుటయు వారి జీవితచరితములను ధ్యానించుటయు ఆత్మవికాసమునకు సులభోపాయములు.

జీవునివ్యక్తిత్వమునకు ఈశ్వరచైతన్యముతో సన్నిహిత సంబంధము గలదు, ఏలన పరమేశ్వరచైతన్యమే ఉపాధి బద్ధమై జీవరూపమున భాసించుచున్నది. కావున ప్రతి జీవి యందును దివ్యత్వము—ఈశ్వరత్వము—నిగ్ఢితముగా నున్నది. బాహ్యాంతర ప్రకృతులను వశమొనర్చుకొని యంతర్గతముగా

నున్న ఈశ్వరత్వమును ప్రకాశితమొనర్చుటచే జీవితపరమా వధి. సరియగు మనోభావములో నవలంబించినచో, సమస్త ధర్మమార్గములును ఈయాత్మవికాసము నొనగూర్చునవియే.

బ్రహ్మసాక్షాత్కారమును బొందుటకై జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము, రాజయోగము నను ముఖ్య మగు యోగములలో దేనినిగాని, కొన్నిటినిగాని, అన్నిటిని గాని యవలంబింపనగును.

పారమార్థికజీవనమునకు ప్రధానాంగము బలము — శారీర మానసికాధ్యాత్మికబలము. బలమే పుణ్యము, దౌర్బల్యమే పాపము. బలమునకంతకును మూలకారణము నమ్మిక — తన యందును భగవంతునియందును నమ్మిక; ఆత్మనిరసనము లేక స్వయముగా తాను పాపిననుకొనుట ధర్మలక్షణము కానేరదు. అట్టి దౌర్బల్యమును త్రోసి రాజనవలయును. ఏలన స్వతస్సిద్ధమగు తనదివ్యత్వమును ధ్యానించుటచే మానవుడు పాపముక్తుడు కాగలడుగాని, ''నేను పాపిని, పాపి''నని కుందు చుండుటచే విముక్తుడు కాజాలడు. నిజముగా ''అమృత పుత్రు''డగు మానవుని పాపి యనుటకంటె మహాపాపము మఱియొకటి లేదు.

అవినీతిపరు డగువాడు — పాపమునకు వెఱవనివాడు — పారమార్థికుడగుట కలలోని వార్త. సమస్తనీతినియమముల కును మూలాధారము స్వార్థరాహిత్యము, స్వార్థరాహిత్య మునకు మూలాధారము వైరాగ్యము. వైరాగ్యమనగా కామినీకాంచనసంగత్యాగము. వినిర్మల వర్తనమున, సర్వ భూతహితాచరణమున, సర్వేశ్వరుని బొందవలయునను పరి

తాపమున, వైరాగ్యము ప్రజ్వలించును. ఇట్టివైరాగ్యముచే వినిర్మలమగు హృదయమున భగవానుడు ప్రతిఫలించును. దుర్లభమగు మానవజన్మము నెత్తియు భగవద్దర్శనము నొందనివాని జీవితము — తుదకందులకైతగు సాధనమైన నొనర్పనివాని జీవితము—నిరర్థకము, నిరర్థకము!

ఓమ్

నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీరామకృష్ణ బోధామృతము

## మొదటి ప్రకరణము

## జీవుడు

**జీవుని పరమావధి—జీవుని తత్త్వము—బద్ధజీవుడు—మరణము: పునర్జన్మము**

### జీవుని పరమావధి

1. రాత్రికాలమున ఆకాశమున నీకు అనేక నక్షత్రములు కాన్పించుచున్నవి. సూర్యోదయమైనపిమ్మట అవి కానబడుట లేదు. అందుచే నీవు పగటివేళ ఆకాశమున నక్షత్రములు లేవనవచ్చునా? ఓనరుడా! అజ్ఞానదశలో నీవు భగవంతుని కను గొనజాలని కారణమున భగవంతుడు లేడనబోకుము.

2. దుర్లభమగు మానవజన్మము నెత్తియు ఈజన్మముననే భగవంతుని దెలిసికొనయత్నింపనివాని జీవితము నిరర్థకము.

3. మానవుడు తనభావములకును ఆశయములకును అను గుణమగు ఫలమును బొందుచుండును. భగవంతుడు కల్పతరువు వంటివాడు. ప్రతివాడును తాను కోరునది భగవంతునివలన బొందగలడు. పేదవాని కుమారుడు కష్టపడి చదువుకొని యెట్లో ఉన్నతన్యాయస్థానమున న్యాయాధిపతియై యిట్లు భావింప

వచ్చును: "నేనిప్పుడు హాయిగానున్నాను. చాలపెద్ద ఉద్యోగము సంపాదించినాను. నాకేమియు లోటులేదు." కాని యతడు తన యుద్యోగమును జాలించి 'పెన్సిలు' * పుచ్చుకొనుచు, తనపూర్వజీవితమును స్మరించునపు డిట్లు పశ్చాత్తాపపడును: "అయ్యో! ఈ జీవితమున నిజముగా నే జేసిన ఘనకార్యమేమి?" అంతరాత్మయగు భగవంతుడును అతని కిట్లు తెల్పును: "అయ్యో! నిజమే! నీవు చేసిన ఘనకార్యమేమియు లేదే!"

4. రెండువిధములగు సంస్కారములతో మానవు డీలోకమున బుట్టుచున్నాడు. అందొకటి ముముక్షుత్వమునకు హేతువగు విద్య, రెండవది సంసారబంధహేతువగు అవిద్య. మానవుని జన్మకాలమున నివిరెండును త్రాసునందలి సిబ్బులవలె సరిసమానముగా నుండునని చెప్పవచ్చును. వెంటనే సంసారము ఒకసిబ్బిలో లౌకికసుఖములను దైవము రెండవసిబ్బిలో దైవజిజ్ఞాసను బెట్టును. మనస్సు సంసారమును గోరుకొనెనా, అవిద్య యను సిబ్బి బరువై మానవుడు లోకమువైపునకు మ్రొగ్గును; అటులగాక దేవుని గోరుకొనెనా, విద్యయను సిబ్బి బరువై వానిని దేవునివైపునకు మఱల్చును.

5. ఒకటి తెలిసికొంటివా, నీకన్నియు దెలియును. ఒకటి యను అంకెతరువాత సున్నలను జేర్చినప్పుడు వానికి పదులు, వందలు, వేలు మొదలుగాగలిగిన విలువ యేర్పడుచున్నది. కాని యా ఒకటియను సంఖ్యను చెఱిపివేసితివా, సున్నలకు

---

* 'పెన్షన్' (Pension) అనుమాటను కొందఱు 'పింఛను' అనునట్లే శ్రీరామకృష్ణుడు 'పెన్సిలు' అనువాడట !

విలువ సున్నయే. ఏకమువలననే అనేకమునకు విలువ గలుగు చున్నది. మొదటిది ఏకత్వము, తరువాతిది నానాత్వము. మొదట భగవంతుడు, అటుపిమ్మట గణింపదగినవి జీవుడు, జగత్తును.

6. మొదట ఆత్మలాభమును బొందుము, తరువాత ధనము సంపాదింపుము—ఈవరుసను తలక్రిందుచేయకుము. పరమార్థమును బొందినవెనుక సంసారమున మెలగినను నీ మనశ్శాంతికి భంగము కలుగబోదు.

7. మీ రేదియో సంఘసంస్కరణ మనుచున్నారే! మంచిది, మొదట భగవంతుని సాక్షాత్కారముపొందిన తరువాత మీ రటుల చేయవచ్చును. భగవంతుని బొందుటకై ఋషులు సంసారమును త్యజించిరని మది నుంచుకొనుడు. అది యొక్కటియే మనకు ముఖ్యము. అటువెనుక వలసినయెడల మిగిలినవన్నియు మీకు సమకూరును. మొదట భగవద్దర్శనము పొంది, పిమ్మట ఉపన్యాసములనుగూర్చియు సంఘసంస్కరణమునుగూర్చియు మాటలాడుడు.

8. క్రొత్తగా పట్టణమునకు వచ్చువాడు, రాత్రి పరుండుటకు తగినగదిని జూచుకొని అచట తన సామానులను జేర్చుకొనవలయును. అనంతరము స్వేచ్ఛగా నగర విచిత్రములను జూడబోవచ్చును. అటుల చేయనిపక్షమున రాత్రి చీకటిలో నిలువ తావులేక చాల బాధపడవలసివచ్చును. అటులనే నిత్యశాంతినిలయమగు భగవంతుని ప్రాప్తి ముందుగా సంపాదించనేని, ఈ లోకములోనికి వచ్చిన నూతనపురుషుడు తన

నిత్యకృత్యములను చక్కబెట్టుకొనుచు సంసారమున నిర్భయముగా వర్తింపగల్గును.

9. ఎలుకలను బట్టుటకై పెద్దపెద్ద ధాన్యపుగోట్ల ద్వారములకడ పేలాలతోఁగూడిన బోనులను బెట్టెదురు. ఎలుకలు పేలాలవాసనచే ఆకర్షింపబడి అంతకంటె తృప్తికరమగు లోపలనున్న ధాన్యమును దినమఱచును. అంత నవి పట్టువడి చచ్చును. జీవుని విషయముకూడ నిట్టిదే. ఇహలౌకిక సుఖములన్నిటికంటెను కోటిరెట్లు ఘనతరమగు బ్రహ్మానందము జీవునకు మిక్కిలి దాపుననే యున్నది. అట్టి బ్రహ్మానందమును బొంద యత్నించుటకు బదులు తుచ్ఛవిషయ సుఖములచే మోహితుడై జీవుడు మాయాజాలమునఁ జిక్కుకొని నశించుచున్నాడు.

10. ఒకపండితుడు: దివ్యజ్ఞానసమాజమువారు మహాత్ములున్నారందురు. మఱియు సూర్యలోకము, చంద్రలోకము, నక్షత్రలోకము మొదలగు నేవేవో లోకములు గలవనియు నరుని సూక్ష్మశరీరము వీనియన్నిటియందును సంచారము చేయగలదనియు జెప్పెదరు. ఇట్టివిషయము లనేకములు వారు చెప్పుచుందురు. అయ్యా! దివ్యజ్ఞాన సమాజమునుగూర్చి మీ యభిప్రాయమేమి?

శ్రీగురుదేవుడు: భక్తి, — భగవద్భక్తి — యొక్కటియే సర్వోత్తమము. వారు భక్తిని లక్షింతురా? లక్షింతురేని మంచిదే. బ్రహ్మసాక్షాత్కారమే వారి ముఖ్యోద్దేశమైనచో మంచిదే. కాని సూర్యలోకము, చంద్రలోకము మొదలగు నల్పవిషయములను గూర్చిన చింతలో నిమగ్నులై యుండుట

నిజమైన తత్త్వాన్వేషణ కాదనిమాత్రము జ్ఞప్తినుంచుకొనుము. భగవత్పాదారవిందములయందు భక్తి కలుగుటకై, తీవ్రసాధన చేయవలయును; అఖండావేదనతో భగవద్దర్శనమునకై విలపింపవలయును. విషయసుఖములనుండి మనస్సును మఱల్చి భగవంతునియందే లగ్నముచేయవలయును. భగవంతుడు వేదములలో లేడు, వేదాంతమునందు లేడు, ఏశాస్త్రమునందును గానరాడు. హృదయమున భగవత్పరితాపము కలుగవలయును. గాఢమగు భక్తితో దేవుని ప్రార్థించుచు సాధన చేయుచుండవలయును. దైవసాక్షాత్కారము సులభసాధ్య మనుకొనబోకుము. సాధనలు చేసితీరవలయును.

11. నరులందఱును నారాయణుని జూడగల్గుదురా! ఎవ్వడును దినమంతయు పస్తుపడియుండనక్కఱలేదు. కొందఱకు ఉదయము తొమ్మిది గంటలకే భోజనము లభించును. కొందఱకు మధ్యాహ్నమైన వెనుక రెండుగంటలకును, కొందఱకు సాయంకాలముననో సూర్యాస్తమయ సమయముననో దొరకును. ఆవిధముగనే ఎప్పుడో యొకప్పుడు—ఈ జన్మముననో అనేక జన్మముల యనంతరమో—అందఱును దైవసాక్షాత్కారము పొందియేతీరుదురు.

12. చిన్నపిల్లలు పంచపాళిలో విచారము, భయము, ఆటంకము అనునవి లేకుండ, బొమ్మలు పెట్టుకొని స్వేచ్ఛగా ఆటలాడుకొనుచుందురు; కాని తల్లి కనబడగానే బొమ్మలనన్నిటిని త్రోసి పాఱవేసి, "అమ్మా! అమ్మా!" అనుచు ఆమె కడకు పరుగిడుదురు. ఓనరుడా! నీవును ఈలోకమున ధనకీర్తి

గౌరవము లనుగొమ్మలతో వ్యామోహమున జిక్కి ఆటలాడుకొనుచున్నావు. నీకేమియు భయముగాని, విచారముగాని లేకున్నది. కాని నీ కొక్కసారి ఆ దివ్యమాతృ దర్శనము లభించెనా, వీనిలో దేనియందును మక్కువ యుండదు. వీని నన్నిటిని తృణీకరించి ఆదివ్యజనని సన్నిధికి పరుగిడుదువు సుమీ!

13. సముద్రగర్భమున ముత్యము లున్నవి, కాని వానిని బడయగోరుదువేని ప్రాణాపాయమునకు వెఱవక నీట మునిగి చాలపాట్లు పడవలయును. ఒక్కసారి మునిగినంతనే ముత్యములు చేచిక్కనియెడల సముద్రమున ముత్యములు లేవని నిర్ధారణచేయరాదు. మఱలమఱల మునిగి వెదకులాడినచో తుదకు కష్టము ఫలించును. విశ్వమున దేవుడు కలడు. ఆ దేవుని కనుగొనుటలో నీ తొలిప్రయత్నము సఫలముకానియెడల నిరుత్సాహివి కావలదు. దీక్షతో సాధన చేయుము. తుదకు నీకు భగవద్దర్శనము లభించును.

14. సచ్చిదానందమయుని ధ్యానింపుము. నీకు బ్రహ్మానందము లభించును. బ్రహ్మానందమే నిత్యమైనది. ఐనను అజ్ఞానము దానిని కప్పివుచ్చుచున్నది. విషయములయందు రాగము తగ్గుకొలదియు ఈశ్వరానురక్తి నీయందు వృద్ధి యగుచుండును.

15. ధనము ఉన్నంతనే నరుని భాగ్యవంతు డనదగదు. భాగ్యవంతునియింటికి లక్షణమేమన, ప్రతిగదియందును ఒక దీపము వెలుగుచుండవలయును. పేద లంతటి వ్యయము చేయజాలకుండుటచే అన్ని దీపములు పెట్టుకొనజాలరు.

దేహమను నీ దేవాలయమును చీకటికొట్టుగా జేయరాదు; అందు జ్ఞానదీపమును వెలిగింపుము. "నీ హృదయకుహరమున జ్ఞానజ్యోతిని ప్రజ్వలింపజేసి దివ్యమాతయొక్క ముఖారవిందమును గనుము." ప్రతివ్యక్తియు జ్ఞానలాభము నొందగలడు. జీవాత్మ కలదు, అటులనే పరమాత్మయు కలదు. ప్రతిజీవాత్మకును పరమాత్మతో సంబంధమున్నది. పట్టణమున ప్రతి గృహమునకును వాయుదీప (Gaslight) సంబంధము ఏర్పడియున్నది. అందులకు వలయు వాయువును దానికి సంబంధించినవారినుండి పడయవచ్చును. తగు నధికారులకు దరఖాస్తు చేసినపక్షమున అట్టి యేర్పాటు చేయబడును. అప్పుడు నీ గది లోనికి వాయుదీపము వచ్చి వెలుగును.

## జీవుని తత్త్వము

16. ఒకటికి సున్నలు జేర్చుచు దానివిలువ నెంతగానైనను పెంచవచ్చును. కాని యా ఒకటిని కొట్టివేసిన, సున్నలకు విలువ సున్నయే గదా! అద్వితీయుడగు దేవుని నాశ్రయింపనిదే జీవునకు విలువలేదు, ఏలన లోకమున సర్వమునకును భగవంతునితోడి సంబంధముచేతనే విలువ యేర్పడుచున్నది. ప్రపంచమునకు ఆధారభూతుడును అన్నిటికిని విలువనిచ్చువాడును అగు భగవంతు నాశ్రయించి వానికోసము కర్మములు చేయుచుండునంతవఱకు జీవుడు పురోభివృద్ధినొందుచుండును; ఇందులకు మాఱుగా భగవంతుని లక్షింపక తన ప్రతిష్ఠకై తాను చేయు కార్యములను ఘనకార్యములుగ నెంచుకొనుట నిష్ప్రయోజనము.

17. చమురు లేనిదే దీపము వెలుగనిరీతిని నారాయణుడు లేనిదే నరుడు జీవింపజాలడు.

18. నరునకును నారాయణునకును గల సంబంధము ఇనుమునకును సూదంటురాతికిని గల సంబంధమువంటిది. ఐనను నరుడు నారాయణునిచే ఆకర్షింపబడడేమి? మట్టిచే గప్పబడిన యినుము సూదంటురాతిచే ఆకర్షింపబడని చందమున మహామాయచే గప్పబడిన జీవుడు ఈశ్వరాకర్షణమును బడజాలకున్నాడు. కాని నీటితో ఆమట్టిని గడిగివేసిన యెడల సూదంటురాయి ఇనుము నాకర్షించుటకు ఏయాటంకము నుండదు. అటులనే జీవుడు తన్ను సంసారబద్ధుని జేయుచున్న మాయయను మలమును నిరంతర ప్రార్థనచేతను పశ్చాత్తాపముచేతను పొంగివచ్చు కన్నీటితో గడిగివేసెనేని వెంటనే నారాయణునిచే ఆకర్షింపబడును.

19. జీవాత్మపరమాత్మల యైక్య మెట్టిది? గడియారముపందలి చిన్న ముల్లును పెద్దముల్లును గంటకొకతేప కలియుటవంటిది. అవి రెండును పరస్పరసంబంధముగలవై ఒకదానిపై నొకటి ఆధారపడియున్నవి. సాధారణముగా వేర్వేరై యున్నను అవకాశము లభించినపుడెల్ల అవి కలియుచుండును.

20. మాయాబద్ధమగు ఆత్మయే జీవుడు. బంధముక్తమగు ఆత్మయే ఈశ్వరుడు.

21. జీవాత్మపరమాత్మలకు గల సంబంధము ఎట్టిది? ప్రవాహమునకు అడ్డముగా నొకబల్ల నుంచినయెడల ప్రవాహము(నందలి జలము) రెండుగా జీల్చబడినట్లగపడును.

అటులనే మాయోపాధివలన అద్వితీయబ్రహ్మము జీవాత్మ పరమాత్మలుగా విభజింపబడినట్లు కాన్పించుచున్నది.

22. నీరును అందున్న బుడగయు నొక్కటియే. బుడగ నీటియందే పుట్టి, నీటిపై దేలుచు, తుదకు నీటియందే అడగుచున్నది. అటులనే జీవాత్మయు పరమాత్మయు నొక్కటిగా. ఐనను అంశభేదముమాత్రము కలదు. ఒకటి ఖండము, రెండవది అఖండము; ఒకటి పరతంత్రము, రెండవది స్వతంత్రము.

23. జీవాత్మభావము ఎట్టిది? గంగా ప్రవాహమున ఒక భాగమునకు హద్దులేర్పఱచి, ఆభాగమును "నా గంగ" యనుటవంటిది.

24. పాదరసముగల పాత్రలో పడవేసిన సీసపుముక్క దానితో ఏకమైపోవునటుల జీవుడు బ్రహ్మసాగరమున బడినంతనే తన ప్రత్యేకతను విడనాడును.

25. బ్రహ్మము అపరిచ్ఛిన్నము. జీవుడో, పరిచ్ఛిన్నుడు. ఇట్టి పరిచ్ఛిన్నుడు అపరిచ్ఛిన్నబ్రహ్మమును దెలియుటెట్లు? ఇయ్యది ఉప్పుబొమ్మ సముద్రపులోతును గనుగొనయత్నించుటవంటిది. అట్టి యత్నమున ఉప్పుబొమ్మ కరగి సముద్రమున లీనమైపోవునుగదా! జీవుడును బ్రహ్మస్వరూపమును గ్రహింప యత్నించునపుడు తన ప్రత్యేకతను గోల్పోయి బ్రహ్మమునం దైక్యమునొందును.

26. నారాయణుడే నరరూపమున క్రీడించుచున్నాడు. ఆతడు మహేంద్రజాలికుడు; జీవజగత్తు లనెడు నీయింద్రజాలము వాని మాయ. జాలకుడు మాత్రమే సత్యము, జాలము మిథ్యగదా!

27. ఈతనువు వంటకుండవంటిది; మనస్సు, బుద్ధి, ఇంద్రియములు అనునవి అందలి నీరు, బియ్యము, ఉరల గడ్డలు. వీనితోగూడిన కుండను నిప్పుపై బెట్టినప్పుడు అవి వేడెక్కును. అప్పు డెవ్వరైనను వానిని తాకినయెడల నిజముగా వేడిమి అందలి యే పదార్థమునకును జెందకున్నను చేయి కాలునుగదా? మనస్సు, బుద్ధి, (ఇతరమైన) ఇంద్రియములు వానివాని కార్యములను అవి చేయుచుండుటకు బ్రహ్మముయొక్క శక్తియే కారణము. ఆశక్తి తొలగెనా, ఇవి యన్నియు పనిచేయమానును.

## బద్ధజీవుడు

28. జీవుడు నిజముగా సచ్చిదానందస్వరూపుడు. అహంకారమువలన అనేకఉపాధులచే బద్ధుడై జీవుడు నిజస్వభావమును మఱచియున్నాడు.

29. ఉపాధివలన నరుని స్వభావము మాఱుచుండును. ఎవ్వరైనను నిగనిగలాడు నల్లంచుధోవతిని సొగసుమీఱు దుస్తులను ధరించెనేని నిధుబాబువిరచిత శృంగారగీతములు వాని పెదవులపై నాట్యముచేయ నారంభించును. ఇంగ్లీషు బూట్లు తొడగెనా, బక్కవానికైనను డంబము తలకెక్కును. తత్క్షణమే ఆతడు ఈలలువేయసాగును; మెట్లెక్కవలసి వచ్చెనేని దొరగారివలె మెట్టుపైనుండి మెట్టునకు కుప్పించుచు బోవును. ఇక చేతిలో కలమున్నవాడు కనబడిన కాగితముపై నెల్ల గిలుకుచుండును!

30. కుపసమును పాము విడిచినట్లు ఆత్మ శరీరము కంటె భిన్నము.

31. ఆత్మ అసంగము. పుణ్యపాపములు, కష్టసుఖములు మొదలగునవి ఎన్నటికిని ఆత్మ నంటజాలవు; కాని దేహాత్మబుద్ధిగలవానిని, లేక దేహమే తాననుకొనువానిని మాత్రము ఇవి బాధించుననుటకు సందియములేదు. పొగ గోడలనే మలినముచేయగలదుగాని వాని నడుమనున్న ఆకాశమును మలినము చేయజాలదుగదా?

32. ఆత్మ అసంగమని వేదాంతులు చెప్పుదురు. పుణ్యపాపములుగాని సుఖదుఃఖములుగాని ఆత్మ నంటజాలవు; కాని దేహాభిమానుల నవి బాధించును. పొగ గోడలను మలినము చేయగలదుగాని ఆకాశము నేమియు జేయ జాలదు కదా!

33. సత్త్వరజస్తమోగుణముల న్యూనతాధిక్యములను బట్టి మానవులు వేర్వేఱు స్వభావములు గలవారై యుందురు.

34. వస్తుతః జీవులందఱును ఒక్కటిగనేయయ్యును వారివారి స్థితిగతులనుబట్టి నాలుగువిధములుగా నుందురు: (1) బద్ధజీవులు, అనగా సంసారబద్ధులు, (2) ముముక్షువులు లేక మోక్షమునకై ప్రయత్నించువారు, (3) ముక్తులు, (4) నిత్యముక్తులు.

35. పల్లెవాడు ఏటిలో వలవేయగా వలలో చాల చేపలు పడినవి. అందు కొన్ని బయటపడుట కిసుమంతయు ప్రయత్నముచేయక స్తబ్ధముగా పడియున్నవి. కొన్ని చేపలు

గొంతులు వేసి పెనగులాడినను తప్పించుకొనలేకపోయినవి. కాని కొన్ని ఎట్లో తప్పించుకొని బయటపడినవి. ఇదే విధముగా లోకమందును జనులు ముప్విధములుగా నున్నారు; బద్ధులై ముక్తికొఱకెన్నడును ప్రయత్నింపనే ప్రయత్నింపని వారు కొందఱు; బద్ధులయ్యును మోక్షమునకై ప్రయత్నించువారు మఱికొందఱు; (ఇదివఱకే) ముక్తులైనవారు ఇక కొందఱు.

36. మూఁడు బొమ్మలున్నవి — ఒకటి ఉప్పుతో జేసినది, రెండవది గుడ్డతో జేసినది, మూఁడివది ఱాతితో జేసినది. ఈ బొమ్మలను నీటిలో ముంచినయెడల మొదటిది కరగిపోయి రూపనాశనము నొందును; రెండవది చాలనీటిని పీల్చుకొనును, కాని ఆకృతి పోఁగొట్టుకొనదు; మూఁడవది నీటిని తనలోనికి అనీయదు. ఆత్మను పరమాత్మలో లయించి ఐక్యమొందిన జీవుడే ఇందు మొదటి బొమ్మ. బ్రహ్మజ్ఞానానందమయుఁడగు భక్తుడే ఇందలి రెండవ బొమ్మ. తనహృదయమున తత్త్వజ్ఞానమునకు అణుమాత్రమైన అవకాశమీయని శుద్ధలౌకికుడు ఇందలి మూఁడవ బొమ్మ.

37. మానవులు తలగడదిండ్ల గలేబులవంటివారు. ఒక గలేబు ఎఱ్ఱగా నుండవచ్చును, మఱియొకటి నీలముగానుండవచ్చును, వేఱొకటి నల్లగా నుండవచ్చును; కానియన్నిటిలోను ఉండునది దూదియే కదా? మానవుల విషయముకూడ నిట్టిదే. ఒకడు చక్కనివాడు, మఱియొకడు నల్లనివాడు, ఇంకొకడు పావనుడు, వేఱొకడు పాపాత్ముడు. ఐనను అందఱియందును ఒకే పరమాత్ముడు నెలకొనియున్నాడు.

38. మోదకముల పైపూత వరిపిండియే, కాని లోపలి పూర్ణము పలువిధములుగా నుండును. మోదకముల బాగోగులు అందలి పూర్ణము ననుసరించి యుండును. అటులనే నరులందఱి శరీరమును పంచభూతములచేతనే నిర్మాణమై యున్నను చిత్తశుద్ధినిబట్టి వారు వేర్వేఱు గుణములు గల వారుగా నుందురు.

39. బ్రాహ్మణ కుమారుడు జన్మముచే బ్రాహ్మణుడే. కాని యిట్లు బ్రాహ్మణులై పుట్టినవారిలో గొందఱు పండితులగుచున్నారు; కొందఱు పురోహితులగుచున్నారు; మఱి కొందఱు వంటబ్రాహ్మణు లగుచున్నారు. ఇంక గొందఱు భోగకాంతల యింటిముంగిటి ఘాటీలో బడి పొరలాడుచున్నారు.

40. పులిలోపైతము దేవుడు ఉండుట నిజమే, కాని అందుచే మనము ఆజంతువున కెదురుగ బోయి నిలువ వచ్చునా? పరమదుర్మార్గులందును భగవంతుడుండుట నిజమే యైనను మనము వారి సహవాసముచేయుట పాడిగాదు.

41. నీరు అంతయు నారాయణస్వరూపమే. కాని అన్ని రకముల నీళ్లను త్రాగుటకు పనికిరావు. అటులనే భగవంతుడు సర్వాంతర్యామియై యుండుట నిజమే, అయినను సర్వప్రదేశములును మనము దర్శింపదగినవి కావు. ఒకరకము నీరు కాళ్లు కడుగుకొనుటకు మాత్రము ఉపయోగించును, వేఱొకరీతి నీరు స్నానమునకు పనికివచ్చును, మఱొకరీతి నీరు త్రాగుటకు వినియోగించును. కొన్నిరకముల నీరు తాకుటకు కూడ పనికిరాకుండును. అట్లే స్థలములును బహువిధములుగా

నున్నవి. కొన్నిటిసమీపమునకు బోదగును; కొన్నిటిని దర్శింప నగును; కొన్నిటిని దూరమునుండియే "సలాముచేసి" పోదగినవిగా నున్నవి.

42. ఈదిగువ చెప్పబడినవారి విషయమున మెలకువ గలిగి వర్తింపుము: (1) హద్దుపద్దులేకుండ సదా వాగుచుండువాడు, (2) కపటహృదయుడు, (3) చెవులకు తులసిదళమును దగిలించుకొని తన భక్తి నెల్లరకును బ్రదర్శించువాడు, (4) పెద్దమేలిముసుగు వేసికొను స్త్రీ, (5) మిగుల ననారోగ్యకరమగు వాచితో కూడియున్న ముఱుగుగుంటలోని చల్లనినిరు.

## మరణము : పునర్జన్మము

43. బద్ధజీవులు అవసానకాలమునగూడ సంసారపు గోడవలను గూర్చియే మాటలాడుదురు. నరుడు తీర్థయాత్రలుచేసియుండుగాక, గంగాస్నానము గావించియుండుగాక, తావళము బూని జపించియుండుగాక, హృదయమున రాగద్వేషము లున్నంతవఱకు మరణకాలమున నవి వెలువడకమానవు. ఆ సమయమున సంధిలో లౌకికప్రలాపములనే సాగింతురు (బద్ధజీవులు). (పెంపుడు) చిలుక సాధారణముగా రాధాకృష్ణనామమును గానముచేయవచ్చును; కాని పిల్లినోట చిక్కినప్పుడు కీచుకీచుమను స్వాభావికపు గూతతోడనే యేడ్చును గదా!

44. దైవభక్తి లేకపోవుటయే మానవుని యపరిమిత బాధలన్నిటికిని కారణము. కావున నరుడు అవసానకాలమున నారాయణస్మరణకు దోడ్పడునట్టి సాధనచేయవలయును.

అదిగో భక్తిసాధన. జీవితకాలమున అటువంటి సాధనచేసిన యెడల అవసానకాలమున భగవంతుడు తప్పక తలపునకు వచ్చును.

45. సరిగా అవసానకాలమున నరుడేమి చింతించు చుండునో దాని ననుసరించియే వానికి ముందుజన్మము గలుగు చుండును. కావున భక్తసాధనలు అత్యావశ్యకమైయున్నవి. నిరంతరసాధనవలన సాంసారిక చింతలు పూర్తిగా పోయి భగవచ్చింత మనస్సు నాక్రమించును. అపుడు మరణకాలమున సైతము అది మనస్సును విడువదు.

46. కాల్పనికుండ విచ్చిపోయినయెడల దానిమట్టి కుమ్మరి క్రొత్తకుండ చేయుట కుపయోగించును. కాని కాల్చినకుండ పగిలెనేని యతఁడుల చేయజాలడుకదా? మనుష్యుడు అజ్ఞానదశలో మరణించెనేని, పునర్జన్మము నెత్తును; కాని, బ్రహ్మజ్ఞానాగ్నిలో తప్తుడై, ముక్తుడై తనువు చాలించెనేని మఱల జన్మింపడు.

47. వేగించిన (ధాన్యపు) గింజలను జల్లినచో మొలకెత్తవు. వేగింపని వడ్లుమాత్రమే మొలుచును. అటులనే నరుడు సిద్ధుడై, లేక బ్రహ్మజ్ఞానాగ్నియందు తప్తుడై మరణించెనేని ఆతడు మఱల జన్మింప నగత్యము లేదు; అసిద్ధదశలో మరణించెనేని సిద్ధుడగువఱకు* మఱలమఱల జన్మింపవలసి వచ్చును.

---

* శ్రీరామకృష్ణపరమహంస 'సిద్ధు' డనుపదమును 'ముక్తు' డను పదమునకు పర్యాయపదముగా నుపయోగించును.

రెండవ ప్రకరణము

# మాయ

పరమేశ్వరుని సృజనాదిశక్తిరూపమగు మాయ—సంసారబంధహేతువగు నవిద్యామాయ — మోక్షహేతువగు విద్యామాయ

## పరమేశ్వరుని సృజనాదిశక్తిరూపమగు మాయ

48. మాయకును బ్రహ్మమునకును గల సంబంధము ప్రాకుచున్న పామునకును పరుండియున్న పామునకును గల సంబంధమువంటిది. క్రియారూపమై వ్యక్తమైయున్న శక్తియే మాయ, అవ్యక్తమైయున్న శక్తియే బ్రహ్మము.

49. సముద్రజలము ఇపుడు నిశ్చలముగనుండి ఇంతలో తరంగకల్లోల మగును. ఇట్టివే బ్రహ్మమును మాయయును, బ్రహ్మమే నిశ్చలమగు సాగరము. మాయయే చలించు సాగరము.

50. బ్రహ్మమునకును శక్తికిని గల సంబంధము అగ్నికిని దహనశక్తికిని గల సంబంధమువంటిది.

51. శివుడును శక్తియునుగూడ సృష్టికి ఆవశ్యకములే. పొడిమట్టితో కుమ్మరి కుండలను జేయజాలడు, అందులకు నీరు కూడ కావలసియున్నది. శక్తియొక్క సాయములేకుండ శివుడొక్కడే సృష్టింపజాలడు.

52. మాయను జూడ నభిలషించి యొకదినమున నేనొక దృశ్యమును గాంచితిని. చిన్నబిందు వొకటి మెల్లగా పెద్దదై

యొకబాలికగా నేర్పడినది. ఆ బాలిక పెరిగి యువతియై యొక బిడ్డను గనినది; మఱిబిడ్డ పుట్టినంతనే ఆమె దానిని బట్టి మ్రింగి వేసినది. ఇట్లు లామె యెందఱో బిడ్డలను గని వారినందఱిని మ్రింగివేసినది. ఆమెనే మాయయని గ్రహించితిని.

53. పాముకోఱలయందలి విషము పామును బాధింప కున్నను అది కఱచిన జంతువును బాధించి చంపును. అటులనే ఈశ్వరునియందు గల మాయ ఈశ్వరుని బాధింపజాలదు. ఐనను ఆమాయ ప్రపంచమునంతయు భ్రమింపజేయుచున్నది.

## సంసారబంధహేతువగు నవిద్యామాయ

54. దక్షిణేశ్వరాలయమందలి యొకగదిలో నొకసాధువు ఉండెడివాడు. ఆత డెవ్వరితోడను మాటలాడక తనకాలము నంతయు భగవద్ధ్యానమున వినియోగించువాడు. ఆకసమున హఠాత్తుగా నొకనాడు కారుమబ్బు లావరింప, ఉత్తరక్షణముననే పెనుగాలి వచ్చి మబ్బులను చెదరగొట్టుట గాంచి, సాధువు తనగదినుండి యీవలకు వచ్చి, ఆనంద పరవశుడై నృత్యముచేయ నారంభించెను. అది చూచి శ్రీరామకృష్ణు డాతని నిట్లు ప్రశ్నించెను: "నిశ్శబ్దముగా మీగదిలో కాలము గడపు మీరు నేడేల ఇంత మహోల్లాసముగా నృత్యము చేయుచున్నారు?" ఆ మహనీయు డిట్లు ప్రత్యుత్తర మొసగెను: "ఇట్టిదిగదా ఈజీవితమును ఆవరించు మాయ! ఇంతకు మునుపు లేశమైనను మాయ లేదే! కాని హఠాత్తుగా వినిర్మల బ్రహ్మాకాశమున మాయ కానబడి విశ్వమునంతయు సృష్టి

చేయుచున్నది. మఱల నంతలో ఆ బ్రహ్మముయొక్క నిశ్వాసముచేతనే అదృశ్యమైపోవుచున్నది.''

55. శ్రీరాముడు, సీత, లక్ష్మణుడును వనముల బడి పోవుచుండిరి. రాముడు ముందును సీత నడుమను లక్ష్మణుడు వెనుకను నడచుచుండిరి. శ్రీరామచంద్రు నెల్లప్పుడును చక్కగా నవలోకింపవలయునని లక్ష్మణుని యభిలాష. కాని తనకును శ్రీరామునకును నడుమ సీత యుండుటచే లక్ష్మణుడు అటుల అవలోకింపజాలడయ్యెను. అప్పు డతడు కొంచెము ప్రక్కకు తొలగుమని యామెను ప్రార్థించెను. ఆమె యటుల తొలగినంతనే లక్ష్మణుడు తనకోర్కె ఫలింప శ్రీరామచంద్రుని కన్నులార గాంచగల్గెను. ప్రపంచమున బ్రహ్మము, మాయ, జీవుడు ననువాని స్థితి యిట్టిది. మాయచే గలిగిన భ్రాంతి తొలగనిదే జీవుడు దేవుని గనజాలడు, నరునకు నారాయణుని దర్శనము కాదు.

56. ఒకమహాత్ముడు చిత్రవర్ణప్రదర్శనియగు గాజుకడ్డీని గాంచి చిఱునవ్వు నవ్వుచుండెడివాడు. కారణమేమనగా, అందుండి ఎరుపు, పసుపు, నీలము మొదలగు వివిధవర్ణములు ఆతనికి గానవచ్చుచుండెడివి. ఈరంగులు వట్టిబూటకములని గ్రహించిన యాతడు ఈదృశ్యప్రపంచము సైతము అటులనే బూటకమని గ్రహించి తనలో తాను నవ్వుకొనెడివాడు.

57. హరి (యను బాలుడు) సింగపుదలను దగిలించుకొనునప్పుడు నిజముగా భయంకరముగా గాన్పించును. తన చెల్లెలు ఆడుకొనుతావునకు బోయి యాతడు పెడబొబ్బ పెట్టును. వాని చెల్లెలు అదరిపడి యా భయంకరమృగము

బారినుండి తప్పించుకొనిపోవుచున్నమున కెవ్వమనును. కాని భయకంపితయైయున్న యాబాలిక, హరి తనవేషమును తీసివేయగనే ఆతడు తనప్రియసోదరుడే యని గుర్తించి "ఓహో! మా అన్నయ్యవే!" యని వానిచెంతకు పరుగెత్తెను. మానవు లందఱివిషయముకూడ నిట్టిదే. అచింత్యమైన మాయాశక్తిమఱుగున నున్నది బ్రహ్మము. ఐనను ఈ మాయచే భ్రాంతికి లోనై లోకులు సర్వవిధమైన చేష్టలను చేయుచుందురు. కాని బ్రహ్మమునుండి మాయయను తెర తొలగింపబడినప్పుడు నరునకు ఆతడు చండశాసనుడగు ఈశ్వరుడుగా గాన్పింపడు, అత్యంతప్రియుడగు అంతరాత్మయే యగును.

58. భగవంతుడు సర్వవ్యాపియగునేని మనకేల కాన్పింపడు? పాచిపట్టిన కోనేటియొక్క గట్టునుండి చూచితివేని నీకు అందు నీరు ఉన్నట్లు కాన్పింపదు. నీటిని జూడదలతువేని పాచిని తొలగింపవలయును. మాయావృతమైన కన్నులతో జూచుచు, భగవంతుడు కాన్పించుటలేదని మొఱలిడుచున్నావు. భగవంతుని జూడగోరుదువేని నీకన్నులనుండి మాయయను పొరను తొలగించుకొనుము.

59. మబ్బు సూర్యు నావరించురీతిని మాయ బ్రహ్మము నావరించియున్నది. ఈ మాయామేఘము తొలగినంతనే బ్రహ్మమను సూర్యుడు మఱల కాన్పించును.

60. రాజహంస నీరు కలసియున్న పాలనుండి నీటిని వేఱుచేసి పాలను మాత్రమే గ్రహించును. ఇతరపక్షు లట్టుల

చేయజాలవు. భగవంతుడు మాయతో సమ్మిశ్రితుడై యున్నాడు. సామాన్యమానవులు మాయను వేఱుపఱచి భగవంతుని గనజాలరు. పరమహంసలుమాత్రము మాయను విసర్జించి శుద్ధబ్రహ్మమును గ్రహింపజాలుదురు.

61. తనను గనిపట్టినంతనే దొంగ పాఱిపోవురీతిని మాయా తత్త్వమును నీవు గ్రహించినంతనే మాయ నివర్తించును.

## మోక్షహేతువగు విద్యామాయ

62. భగవంతునియందు విద్యామాయయు అవిద్యా మాయయుగూడ కలవు. విద్యామాయ నరుని భగవంతుని వైపునకు మఱల్చును. అవిద్యామాయ నరుని బ్రహ్మమార్గమునుండి విముఖుని జేయును. కారుణ్యము, జ్ఞానము, భక్తి, వైరాగ్యము—ఇవన్నియు విద్యామాయా స్వరూపములు. వీనిమూలముగ మాత్రమే నరుడు నారాయణుని బొందగలుగును.

63. బ్రహ్మసాక్షాత్కారమును గలిగించునది మాయయే. మాయయొక్క తోడ్పాటు లేనిపక్షమున ఎవ్వరు బ్రహ్మ సాక్షాత్కారమును బొందగలరు? శక్తిని, (అనగా భగ వంతునియొక్క సృజనాదిరూపమగు మాయాశక్తిని) దర్శింప కుండ భగవంతుని గనజాలము.

64. తత్త్వజ్ఞానము, బ్రహ్మానందప్రాప్తి మొదలగునవి మనకు సాధ్యమగుట మాయవలననే. అటులు కానియెడల వీనినన్నిటిని ఎవ్వరు కలనైనను తలపగలరు? ద్వైతభావ

మును ఈదృశ్యప్రపంచమును మాయనుండియే పుట్టుచున్నవి. మాయకవ్వల భోక్త, భోగ్యము అనునవి లేనేలేవు.

65. పిల్లి తనకూనలను పండ్లతో కఱచిపట్టుకొనునప్పుడు ఆకూనలకే అపాయము నుండదు. కాని యదే పిల్లి యెలుక నట్లు పట్టుకొనునేని అది చచ్చును. అటులనే మాయ యితరులను నాశనముచేయును కాని భక్తుల నెన్నడును నశింప జేయదు.

మూడవ ప్రకరణము

# మాయ: కామినీకాంచనములు*

**కామమే బంధకారణము—కామము: ఆత్మవికాసము—కామమును జయించు టెట్లు?—కాంచనమోహమును జయించు టెట్లు?**

## కామమే బంధకారణము

66. మాయ యనగా నేమి? పారమార్థికసాధనకు—ఆత్మవికాసమునకు—అడ్డువచ్చుచుండు కామమే మాయ.

67. సర్వము ధ్వంసముచేయుదానిని మాయ యనవలయునా, మదాగ్ని యనవలయునా?

68. కామినీకాంచనములందలి మోహముచే సంసారబద్ధులగు నరులు వానిమూలమున వేనవేలు అవమానములను పొందుచున్నను వానిబంధమును విదళించుకొని మనస్సును భగవంతునివైపు త్రిప్పజాలకున్నారు.

69. సంసారులారా! కామినులను నమ్మకుడు, అతికపటముగా వారు మిమ్ము లోబఱచుకొందురు!

* ఈ యధ్యాయమునను ఇతరాధ్యాయములందును కామినీకాంచనములనుగూర్చి శ్రీ రామకృష్ణుని యుపదేశములను గ్రహించునపుడు పాఠకులీక్రిందివిషయములను గమనింతురుగాక. స్త్రీయెడ నాత డెన్నడును నిరసనభావమును వహింపలేదు, సరికదా, స్త్రీని సాక్షాత్ జగన్మాత యనుభావముతో పూజించెను; మఱియు స్త్రీయెడ జగన్మాతృబుద్ధి నలవరుచుకొనుడనియు స్త్రీయెడ భోగదృష్టి విషతుల్యమనియు శిష్యుల

70. నీవెంత జాగరూకతతో మెలగువాడవైనను పొగ చూరి మసిపాటియున్న గదిలో వాసముచేయుచున్నపక్షమున కొంచెమో గొప్పయో మసిడాగులు పడకుండ తప్పించుకొ లేవు. ఎంత నిగ్రహసంపన్నుడైనను, ఎంత బుద్ధిమంతుడైనను నరుడు కాంతాజనముసడుమ నివసించునెడల ఏ కొలదిగనైనను కామచింతలు వానిమనసున పొడసూపక మానవు.

71. సన్నిపాతజ్వరముచే బాధపడుచు సంధించియున్న వానిచెంతను బిందెలకొలది చల్లని మంచినీరును జాడీలకొలది రుచికరములగు నూరుగాయలను బెట్టియుంచినయెడల వాని నారగింపవలయునను ఉద్రేకమును ఆపుకొనగలడా? అటులనే కామజ్వరముతో కొట్టుకొనుచు, ఇంద్రియసుఖములకై ఉబలాటపడువానికి ఒకవైపున కామినులటక్కులును మఱొకవైపున ధనాకర్షణములును సిద్ధమైనచో వాని నాతడు నిగ్రహించుకోజాలడు: భక్తిమార్గభ్రష్టుడై పెడత్రోవ త్రొక్కుట నిశ్చయము.

కుపదేశించెను. యథోచితముగా స్త్రీలకు నిట్లే కామవిజయమునుగూర్చి యుపదేశించెను. కావున శ్రీ పరమహంస కామినిని నిరసించుచో అయ్యది కామ నిరసనమనియే భావింపనగును. ఈ సందర్భమున కామినియను పదము (స్త్రీపురుషుల కొండొరులయందు గల) కామమును సూచించు నట్లే కాంచనము అనుపదము ధనరాగమును సిరిసంపదలయందలి మమకారమును సూచించును. శాస్త్రములం దివ్విషయమే ధనేషణ, దారేషణ, పుత్రేషణ యనునట్టి ఈషణత్రయముగా జెప్పబడియున్నది. శ్రీ వేమన యోగి దీనినిగూర్చి యిట్లు వచించియున్నాడు:

ఆ. "ఈషణత్రయంబు నెడపంగ నేరక, మోహరాశిలోన మునిఁగియుండు
జనుల కెట్లు మోక్షసౌఖ్యంబు గలుగురా, విశ్వదాభిరామ వినురవేమ

72. ఒక మార్వాడీ శ్రీరామకృష్ణుని సందర్శించి యిట్లు ప్రశ్నించెను: "నే నన్నిటిని త్యజించినాను, ఐనను నాకు భగవత్సాక్షాత్కారము కలుగకుండుటకు హేతువేమి?"

శ్రీ గురుదేవు డిట్లు సమాధాన మొసగెను: "నూనె పోసి యుంచుకొను తోలుసీసాలను జూచియుందురుకదా? అట్టితిత్తినుండి నూనె నంతయు కార్చివేసి చూడుడు. దాని యడుగునను ప్రక్కలను ఏకొంచెమో నూనె అంటిపట్టుకొనియే యుండును. కావున నూనెవాసన దానిని విడిచిపోనేపోదు. అదేవిధమున కొంత సంసారవాసన మీయందింకను మిగిలి యున్నది."

73. కామినియు కాంచనమును నరులను నారాయణుని యెడ విముఖులనుజేసి సంసారమున ముంచివేయునని జ్ఞప్తి నుంచుకొనుడు. తనభార్య మంచిదైనను చెడ్డదైనను మఱి యెట్టిదైనను నరుడామెను పొగడుచునే యుండుట కడు విచిత్రము!

74. కోతి వేటకాని కాళ్లకడ పడి ప్రాణములు విడుచు రీతిని పురుషుడు సుందరాంగి చరణములకడ బలియగు చున్నాడు.

## కామము: ఆత్మవికాసము

75. భక్తిసాధనలను సాగించి భగవంతుని బొందగోరు వారు కామినీకాంచనములయొక్క వలలో బడకుండ కడు జాగరూకులై మెలగవలయును, లేనియెడల ఎన్నటికిని సిద్ధి పొందజాలరు.

76. శ్రీ చైతన్యుని నిత్యానందు డిట్లడిగెను: “నేను చేయు భక్తిబోధన లన్నియు నరులమానసములలో నెట్టి ప్రత్యక్షమగు మార్పును గలిగింపజాలకుండుటకు హేతువేమి?” అందులకు శ్రీ చైతన్యు డిట్లనియెను: “స్త్రీలతోడి సాంగత్యమువలన వారు ఎట్టి తత్త్వబోధనలను మనసులో నిలుపుకొనజాలకున్నారు. తమ్ముడా! నిత్యానందా! వినుము, సంసారమోహితులకు ముక్తి లేదు.”

77. సరిగా నడుమ, ముల్లుదగ్గఱ నిలువక త్రాసుదండి ఎప్పుడు ఒరగిపోవును? ఒకవైపున నున్న సిబ్బి రెండవదానికంటె బరువైనప్పుడేకదా? అటులనే కామినీకాంచనముల భారము తనపై బడినప్పుడు—వానిచే లాగబడినప్పుడు—మనస్సు భగవంతునుండి తొలగిపోవుచున్నది.

78. అడుగున సూదిబెజ్జమంత చిల్లియున్నను కుండలో నున్న నీరంతయు క్రమముగా కాఱిపోవును. అటులనే సాధకునియందు ఏమాత్రపు లోలత యున్నను వానిసాధన లన్నియు బూడిదెలో పోసిన పన్నీరగును.

79. కామమును పూర్తిగా వశమొనర్చుకొన యత్నింపుము. ఇందు కృతార్థుడవైనయెడల ఇంతవఱకు బీజావస్థలో నున్న మేధానాడి బలపడుటచే శరీరములో నొకవిధమైన మార్పు కలుగును. ఈనాడి శరీరమునందలి క్షుద్రశక్తులను ఉత్తమశక్తులుగా మార్చు స్వభావము కలది. ఈ మేధానాడి బలపడినంతనే ఆత్మజ్ఞానము అలవడును.

80. కామినీకాంచన వ్యామోహములో మునిగియున్న మనస్సు లేతపోకకాయ వంటిది. పోక పచ్చిగా నుండునంత

వఱకు పై బెరడునకు గట్టిగా నంటిపట్టుకొనియే యుండును; కాని యది పండి యుండినప్పుడు వక్కయు డొల్లయు వేఱు పడి కదలించునప్పుడు వక్క లొటలొటలాడును. అటులనే కామినీకాంచన వ్యామోహము ఇగిరిపోయినప్పుడు ఆత్మ శరీరముకంటె భిన్నమని బాగుగా గోచరించును.

81. మనస్సు భోగములపై ఆశ వీడి, నిర్మలమైనంతనే భగవానునిపై లగ్నము కాగలదు. బద్ధుడు ఈవిధముగా ముక్తుడగుచున్నాడు. భగవంతుని వీడి పెడత్రోవను బోవువాడే బద్ధుడు.

82. కామినీకాంచనమోహము మనస్సునుండి నిర్మూలనమైనప్పుడు మిగులునదేమి? కేవలము బ్రహ్మానందము.

## కామమును జయించు టెట్లు?

83. పాములకు నిలయమైన యింటిలో నివసించువారు వానివలన ఎప్పుడు ఏకీడు మూడునో యని జాగ్రత్తగా నుందురుకదా? అటులనే సంసారులగు నరులు కామినీకాంచనములు తమ్ము లోబఱచుకొనకుండ మెలకువగలిగి మెలగవలయును.

84. పాము కంటబడినప్పుడు ఇటులను నాచారము కలదు: "తల్లీ! మానసా! నీతోకనుమాత్రము అగపఱచుచు, తలను దాచుకొని దూరముగా తొలగిపొమ్ము." అటులనే కామోద్రేకమును పురికొల్పు విషయ భోగములనుండి దూరముగా తొలగి వర్తించుటయే తెలివిగలపని. పతితులై తెలివి తెచ్చుకొనుటకంటె వానిసంసర్గము పొందకుండుటయే మేలు.

85. ఒకశిష్యుడు భగవద్ధ్యానముచేయుచు కాలము గడపు చున్నను దుష్టసంకల్పములు అపుడపుడు మనస్సులో బుట్టుచునే యున్నవని చెప్పి కామమును జయించు టెట్లని శ్రీరామకృష్ణు నడిగెను. అందులకు శ్రీగురుదేవు డిట్లు బోధించెను: "ఒకని యొద్ద నొకకుక్క యుండెడిది. దాని నెత్తుకొని ముద్దాడుచు, దానితో ఆటలాడుచు, ఆ కుక్కను ఆతడు చాలమక్కువతో బెంచుచుండెడివాడు. అది చూచి యొక జ్ఞాని కుక్కపై నంతటి మక్కువ కూడదని యాతని మందలించెను. ఏలన, కుక్క కేవలము జ్ఞానహీనమగు జంతువుగదా? ఎప్పుడైనను ఆతని గఱచినను కఱవవచ్చును. దాని యజమాను డీబోధల నాలకించి యొడిలోనున్న కుక్కను ఆవలికి ద్రోసివేసి, దాని నిక చేరదీయుటగాని, బుజ్జగించుటగాని కూడదని నిశ్చయించు కొనెను. కాని యాకుక్క యజమానునకు తనయందు దృష్టి మాఱినదని తెలియజాలక ఎప్పటివలెనే ఎత్తుకొని ముద్దులాడు నను నాశతో తఱచు వానియొద్దకు పరుగెత్తుచుండెడిది. ఎన్నియోసార్లు దెబ్బలు తినినపిమ్మట తుదకు అది తన్ను లాలింపుమని యజమాను నిక బాధించుట మానివేసెను. నీస్థితియు అటులనే యున్నది. నీయంతరంగమున నీవింతవఱకు బుజ్జగించిన కుక్కను నీవు వదలించుకోదలచినను సులభముగా నిన్నది విడువదు. అయినను భయములేదు లెమ్ము. ఆకుక్కని బుజ్జగింపక నీదరిజేరినపుడెల్ల చీకొట్టుచుండుము, కొట్టు చుండుము. నీచే లాలనపొందుటకై నిన్ను పీడించుచున్న యాకుక్క (కామము) కొంతకాలమునకు నిన్ను విడిచి వేయును.

86. కామినియు కాంచనమును లోకమునంతయు సంసార సాగరమున—పాపపంకిలమున—ముంచి వేసినవిసుమీ! స్త్రీని నీవు సాక్షాజ్జగజ్జనని యను భావముతో జూచినయెడల ఆమె వలన నీకెట్టి ప్రమాదము నుండదు. కామకాంచనమోహాగ్ని చల్లారినదేకాని భగవద్దర్శనము కానేరదు.

87. తీవ్రవైరాగ్యము పొంది యొక్కసారి భగవద్దర్శనము పొందినంతనే అత్యంతబలీయములగు మోహపాశములు విచ్ఛిన్నమై పోవును. అట్టివాని కిక భార్యవలననైనను మోహావాయము ఉండదు. ఇనుపముక్కకు సమదూరమున ఇటునటు అసమమైన రెండు సూదంటురాళ్లున్నయెడల వానిలో ఏది దానిని విశేషబలముతో నాకర్షించును? వానిలో పెద్దదిగదా? భగవంతుడే ఈపెద్ద సూదంటురాయి. అప్పుడు చిన్న సూదంటురాయివంటి స్త్రీ అందులకు వ్యతిరిక్తముగా ఏమి చేయగలదు?

88. పాములు విషజంతువులుగదా? నీవు వానిని పట్టుకొనబోయినయెడల తప్పక నిన్ను కఱచును. కాని, మన్ను మంత్రించి వానిపైజల్లి వానిని వశమొనర్చుకొననేర్చినవానికి పాములను బట్టుకొనుట అంతకష్టమైనపని కానేరదు. ఏడెనిమిది పాములనుసైతము అతడు చేతులకును మెడకును జుట్టుకొని వానితో ఆటలాడ గల్గును. (అదేవిధముగా బ్రహ్మసాక్షాత్కారము నొందినవాడు సంసారభయమునుండి విముక్తుడగును.)

89. ఒక మార్వాడీపెద్దమనుష్యుడొకనాడు శ్రీరామకృష్ణుని సందర్శించి కొన్నివేలరూపాయలను సమర్పింప దనకు అనుజ్ఞనీయుడని వేడుకొనెను. ఆత డెట్టి సదుద్దేశము కలిగి

యున్నను శ్రీగురుదేవుడు ఖండితముగ వలదని చెప్పి దానిని స్వీకరింపడయ్యెను. "నాకు డబ్బుతో నెట్టిసంబంధము నుండ రాదు. దానిని స్వీకరించితినా, నామనస్సు ఇక సదా దాని మీదనే నిలిచియుండును" అనెను. అంత నాపెద్దమనుష్యుడు, సొమ్ము శ్రీరామకృష్ణుని సేవకు వినియోగపడుటకై అతని బందుగులలో నొకరిచెంత నుంచెదననెను. శ్రీరామకృష్ణు డిట్లు బదులుచెప్పెను. "వలదు, అది కపటమైనపని. ఇంతేకాక దానిచే ఒకరిదగ్గఱ నాసొమ్ము ఉన్నదనుభావము సదా నా మనస్సులో గలుగుచుండును."

అప్పుడును ఆమార్వాడీ ఊరకుండక, "మనస్సు తైలము వలెనే యున్నయెడల కామినీకాంచనములను సాగరముపై తేలియాడగలదు" అను శ్రీరామకృష్ణుని వచనములనే యుదాహరించి తన కానుక నంగీకరింపుడని పట్టుపట్టెను.

అంత శ్రీరామకృష్ణు డిట్లు సమాధానమొసగెను: "ఆ మాట నిజము. కాని ఆచమురే చాలకాలము నీటిపైని తేలుచుండినయెడల ముఱుగెత్తునుగదా! అటులనే కామినీ కాంచనములను సాగరముపైని ఊరక తేలుచున్ననుగూడ దానితో చిరకాలము నిరంతరమైన సంసర్గము కలిగెనా, మనస్సు కుళ్లి కంపుకొట్టును."

## కాంచనమోహమును జయించు టెట్లు ?

90. కాంచనమోహము, లేక ధనరాగము సాధకుని ధర్మ మార్గమునుండి పెడత్రోవ త్రొక్కించునని తెలుపుచు శ్రీ గురుదేవుడు యువకుడగు నొకశిష్యుని జూచి యొకప్పు డిట్లు

పలికెను: "లౌకికుని వలె—పామరుని వలె—నీవు డబ్బుపుచ్చుకొని ఉద్యోగముచేయ నారంభించినావు. కాని నీతల్లి నిమిత్తము నీవు పాటుపడుచున్నావు. లేనియెడల, ఛీ ఛీ! ఛీ ఛీ! యని యుందును." పదేపదే యిట్లని తుదకు, "భగవంతుని దప్ప మఱెవ్వరిని సేవింపకుము" అనియెను.

91. డబ్బుకోసము ఉద్యోగముచేయుట యెట్టి పతన హేతువో తెలుపుచు శ్రీ గురుదేవు డొకప్పు డొక శిష్యున కిట్లనియెను: "వానిమొగ మెట్లు కళావిహీనమై యున్నదో కనుడు. నల్లనిగోర వానిమొగము నావరించినట్లున్నది. ఇది యంతయు 'ఉద్యోగమాహాత్మ్యము.' జమాఖర్చు లెక్కలు, మఱియిట్టివేయివిషయములలో అతడుమునిగి తేలుచుండును."

92. ధనము మనుష్యుని స్వభావమునే మార్చివేయునట్టి ఉపాధి. దానిప్రభావము యిట్టిదని చెప్ప నలవికాదు; ఎవ్వడైనను ధనవంతుడైనంతనే వాని నైజము పూర్తిగా మాఱిపోవును. ఎంతయో వినయవిధేయతలుగల బ్రాహ్మణు డొకడు ఇచటికి (దక్షిణేశ్వరమునకు) తఱచుగా వచ్చుచుండెడివాడు. కొంతకాలమునకు ఆత డిచటికి వచ్చుట మానివేసెను. వాని సంగతి సందర్భములేవియు మాకు దెలియలేదు. ఒకనాడు మేము కొన్నగరము (Konnagore) నకు పడవ నెక్కి వెడలితిమి. మేము పడవదిగుచు, గంగానదియొడ్డున గూర్చుండిన యా బ్రాహ్మణుని జూచితిమి. నదిపైనుండి వచ్చు నిర్మల వాయువుల ననుభవించుచు ఆతడు ఠీవితో దొరవలె గూర్చుండి యుండెను. నన్ను చూడగానే అనుగ్రహసూచకమైన కంఠ

స్వరముతో, "ఓహో! తాకూరు! క్షేమమా!" అని పలుక రించెను. వాని వాలకమును కనిపట్టి నాతో నున్న హృదయుసితో నిట్లంటిని: "హృదయా! చూడుము, వీని కేదియో సంపద చేచిక్కియుండును. వీనివాలకమున నెట్టిమార్పు గలిగినదో చూచితివా?" హృదయుడు పకపక నవ్వసాగెను.

93. ధనము నీకు బువ్వనుమాత్రమే ఈయగలదు. ధన సంపాదనమే నీ పరమావధి యనుకొనకుము.

94. తనసంపదను, అధికారమును, పేరుప్రతిష్ఠలను ఆధిక్యమును చెప్పుకొని గర్వపడువారు కొందఱుందురు. తుదకివి యన్నియు మూడునాళ్ల ముచ్చటలేకదా! మరణానంతరము వీనిలో వెంటవచ్చున దేదియులేదు.

95. రెండు సందర్భములలో భగవంతుడు నవ్వును— ఒకటి: అవసానకాలము సమీపించిన రోగి పడకదగ్గఱకు వచ్చి వైద్యుడు వానితల్లితో, "ఎందుకు అమ్మా, ఆతురపడుటకు కారణము ఏమియులేదు, నీకొడుకు ప్రాణము రక్షించు భారము నాది" యనునప్పుడు. రెండవది: అన్నదమ్ములు తమ భూమిని పంచుకొను నాత్రమున కొలతబద్దెను చేపూని పొలమును కొలుచుచు, "ఈ భాగము నాది, ఆ భాగము నీది" యనుకొనునప్పుడును (భగవంతుడు నవ్వును).

96. ధనమునుగూర్చి గర్వింపదగిన దేమియులేదు. నేను ధనికుడనందువా, నీకంటె నెందఱో విశేషధనవంతులు కలరు, వారితో బోల్చి చూచినయెడల నీవు వట్టి దరిద్రుడవని చెప్పవలసియుండును. సంజచీకటులు క్రమ్మగనే మెఱుగుడు బురు

వులు బయలుదేఱి, "మేమే ప్రపంచమునకు వెలుగు నిచ్చు చున్నాము" అని గర్వించును. కాని నక్షత్రములు మినుకు మినుకుమని ప్రకాశింప మొదలిడినతోడనే మెఱుగుడుబురు గుల గర్వమడగును. అంత నక్షత్రములు, "లోకమునంతయు మేమే ప్రకాశింపజేయుచున్నాము" అని తలపోయసాగును. కొంచెము సేపైనంతనే చంద్రు డుదయించి తన యమృత కిరణములతో ప్రకాశింప నక్షత్రములు వెలవెలపోవుచున్నవి. ఆ చంద్రుడో, తన కాంతిచే లోకమునంతయు శోభామయము చేయుచున్నానని పొంగుచుండును. ఇంతలో ప్రభాతము తూర్పుదిశను సూర్యోదయవైభవమును జాటును. అప్పుడు చంద్రుని ప్రభావ మేమైనది?

ధనాధికులమని విఱ్ఱవీగువారు ఈ ప్రకృతిసంఘటనలను అవలోకించి తమ భోగభాగ్యములనుగూర్చియు అధికారముచుగూర్చియు మిట్టిపడకుందురుగాక.

97. వంతెనక్రింద నెప్పుడును నీరు పాఱుచు పోవునే కాని యచట ముఱుగదు. అటులనే ముక్తపురుషులచేతినుండి ధనము నిరాటంకముగా నడచిపోవునే కాని వారు ధనము నెన్నడును నిలువ జేసికొనరు.

98. ధనమునకు ఎవ్వడు దాసుడుగాడో, ధన మెవ్వనికి దాస్యముచేయునో, వాడే నిజమైన మానవుడు. ధనమును సరిగా వినియోగించుకొను తెలుగని వానిని మానవు డనదగదు.

నాల్గవ ప్రకరణము

# అహంకార రూపమగు మాయ

**అహంకారమువలని దోషములు—అహంకారమును జయించుట దుర్లభము—పక్వాహంకారము: అపక్వాహంకారము—ముక్తునియందలి అహంకారము**

## అహంకారమువలని దోషములు

99. సూర్యుడు లోకమున కంతకును వేడిని వెలుతురును ఇచ్చుచున్నాడు. కాని మబ్బులు క్రమ్మి తనకిరణములను అడ్డగించునపుడు ఏమియు జేయజాలకున్నాడు. అట్లే అహంకారము హృదయమునావరించునపుడు భగవానుడు అందు ప్రకాశింపజాలడు.

100. అహంకారము మబ్బువంటిది. ఇది మనకు భగవంతుని గోచరింపకుండ జేయుచున్నది. సద్గురుకటాక్షమున ఈమేఘము తొలగెనేని స్వయంజ్యోతియగు భగవానుని సాక్షాత్కారమును బడయవచ్చును. పటమున శ్రీరామచంద్రుని, సీతను, లక్ష్మణుని జూడుము. భగవానుడగు శ్రీరామచంద్రుడు లక్ష్మణునకు (జీవునకు) ముందుగ రెండుమూడడుగుల దూరమున మాత్రమే యున్నను సీత (మాయ) వారిరువురకును నడుమ నుండుటచే లక్ష్మణునకు శ్రీరామచంద్రుని దర్శనము లభింపకున్నది.

101. ప్రశ్న: అయ్యా! మే మెందుచే ఇట్లు బద్ధులమై యున్నాము? ఎందుచే భగవంతుని గనజాలకున్నాము?

ఉ. జీవుని యహంకారమే మాయ. ఈ తెరయే ఆత్మ ప్రకాశమును గప్పుచున్నది. అహంకారము నశించెనా, అన్ని చిక్కులును తొలగును. భగవదనుగ్రహమువలన జీవునకు తాను కర్తనుగానను జ్ఞానము కలిగెనా, ఆతడు జీవన్ముక్తుడగును, అనగా ఈజన్మముననే ముక్తుడగును, భయరహితుడగును.

102. నే నీ గుడ్డను తెరవలె నాకు అడ్డముగా పట్టుకొందునేని ఎప్పటివలె మీకు నేను దాపుననే యున్నను మీరు నన్ను గనజాలరు. అటులనే భగవంతుడు మీకు అన్నిటికంటెను సన్నిహితుడై యున్నను అహంకారమను తెరవలన మీరు వానిని జూడజాలకున్నారు.

103. అహంకారము నిలిచియుండునంతవఱకు ఆత్మజ్ఞానముగాని ముక్తిగాని లభింపజాలదు, జననమరణబంధము తొలగదు.

104. వంటకై బియ్యము, పప్పు, ఉరలగడ్డలు మొదలగు వానిని చల్లని నీరు గల కుండలో వేసితి మనుకొనుడు. వానిని పొయ్యిమీద బెట్టి ఉడుకబెట్టకుండునంతవఱకే గదా వానిని మనము తాకగలము. జీవుని విషయముకూడ నిట్టిదే. ఈ దేహమే ఘటము: ధనము, విద్య, జాతి, వంశము, అధికారము మొదలగునవి బియ్యము, పప్పు, ఉరలగడ్డలు మున్నగువాని వంటివి. అహంకారమే అగ్ని. ఈ యగ్నిచేతనే జీవుడు తాపము పొందుచున్నాడు. (చూ. 27.)

105. వాననీరు మిట్టపై నిలువక పల్లమునకు ప్రవహించునుగదా! అటులనే భగవదనుగ్రహము గర్వముచే

మిట్టిపడువారల హృదయమునుండి తొలగిపోవును, కాని అడకువగలవారి హృదయమున నిలుచును. (చూ. 412.)

106. అహంకారము చాల చెడ్డది. అది నిర్మూలము కానిదే ముక్తిలేదు. ఆ లేగదూడను జూడుడు, అహంకారముచే దాని కెన్ని యిక్కట్లు వాటిల్లుచున్నవో కనుడు. అది పుట్టిన తోడనే "హంబై"—"నే నున్నాను" అని యఱచును. ఫలితమేమి? అది పెద్దదై (యెద్దయి)న యెడల దానిని నాగలికి గట్టుదురు. లేదా బరువులతో నిండిన బండ్లకు గట్టుదురు. ఆవైనయెడల గుంజకు కట్టివేయుదురు. ఒకొక్కప్పుడు చంపియు తిందురు. కాని యెన్నిదండనల వాలైనను ఆపశువు అహంకారమును విడువదు. దాని చర్మముతో డోలుచేసినను గూడ, 'హం హం'—నేను, నేను అనియే శబ్దించును. దూదేకులవాడు దాని ప్రేవులను దన వింటినారిగా జేసికొనినప్పుడు గాని అది వినయము నవలంబింపదు. అపుడు "తుహై"—'నీవున్నావు' అని గానముచేయును. "నేను. నేను" అను భావము పోయి (పరమేశ్వరా! అంతయు) "నీవే" అను భావము కలుగవలయును. జ్ఞానోదయమైననే కాని ఈస్థితి ప్రాప్తము కాజాలదు.

107. అహంకారము తొలగి పరతత్త్వమున లయించి నప్పుడు ముక్తి లభించును.

108. ప్రశ్న: మానవున కెప్పుడు ముక్తి లభించును?
ఉ. అహంకారము నశించినప్పుడే.

109. ప్రశ్న: నే నెప్పుడు ముక్తుడనగుదును?

ఉ. ఆ "నేను" అను భావము నీయందుండి తొలగినప్పుడు, "నేను, నాది" యనుకొనుటయే అజ్ఞానము; "నీవు, నీది" అనుకొనుటయే జ్ఞానము. నిజమైన భక్తుడిట్లు భావించును: "దేవా! నీవే కర్తవు. సకలము నీవే చేయుచున్నావు. నేను నీచేతిలోని ఉపకరణ మాత్రమను. నీవు నన్నేమి చేయించిన నేను అది చేయుదును. ఈ సర్వము నీ విభూతియే. ఈయిల్లు, ఈసంసారము అన్నియు నీవే, నావి కావు; నీయాజ్ఞానుసారము సేవచేయుటకుమాత్రమే నా కధికారము కలదు."

## అహంకారమును జయించుట దుర్లభము

110. అందఱి యహంకారములును క్రమముగా తొలగి పోగలవుగాని మహాత్మునకు తన మాహాత్మ్యమును గూర్చిన అహంకారము* తొలగిపోవుట దుర్లభము.

111. వెల్లుల్లిరసము పోసియుంచిన గిన్నెను వేయిసార్లు కడిగినను ఆవాసన పోదు. అజ్ఞానముచే గలుగుచున్న అహంకారము అంతటి మొండిది. దానిని తొలగించుకొనుట కెంతటి విశ్వప్రయత్నము చేసినను అది పూర్తిగా తొలగిపోదు. (చూ. 113, 127, 129.)

112. అజీర్ణరోగి పులుపువస్తువులు తనకు హానికరములని బాగుగా ఎఱుగును, కాని యవి వాని కండ్లకగపడిన జాలును, నోరూరును. చేరికయొక్క ప్రభావము అట్టిది. అటులనే "నేను, నాది" యనుభావము నెంతగా అణచివేయ బ్రయత్నించినను

* లేదా, జ్ఞానికి తనజ్ఞానమునుగూర్చిన అహంకారము.

కర్మరంగములోనికి దిగినంతనే అపక్వపుటహంకారము తల యెత్తుచునేయుండును.

113. అహంకారమును నిర్మూలించి సమాధిస్థితిని సాధింప గల్గువారు అరుదుగా నుందురు. సాధారణముగా అది పోనే పోదు. విధివిరామములనునవి లేక నివెంత విచారముచేసినను ఈ అహంత మఱల మఱల తలయెత్తుచునేయుండును. రావి చెట్టును ఈనాడు మీరు నఱికివేసితిమి గదా యనుకొనిన, మఱునాడే చిగుర్చుచున్నది. (చూ. 111, 127, 129.)

114. పేరుప్రతిష్ఠలకై దేవులాడువారు భ్రాంతిలో పడి కొట్టుకొనుచున్నారు. విధాతయే లేక సర్వేశ్వరుడే సమస్తము నియమించుచున్నాడనియు, అన్నిటికిని ఆతడే కర్త యనియు గమనింపజాలరు, వారు, పాపము! "సర్వేశ్వరా! అన్నిటికిని నీవే కర్తవు, నీవే నియామకుడవు" అని బుద్ధిమంతుడు భావించును. పామరులును భ్రాంతిమతులును "నేను, నేను" అని ప్రలాపింతురు.

## పక్వాహంకారము : అపక్వాహంకారము

115. అహంకారము రెండువిధములుగా నున్నది—ఒకటి పక్వము, రెండవది అపక్వము. "నా దేమియు లేదు, నేనేమి చూచినను, చేసినను, అనుభవించినను, వేయేల,—ఈ శరీరము సైతము నాదికాదు; నేను నిత్యముక్తబుద్ధస్వరూపుడను"— ఇట్టిభావములతో గూడినది పక్వమైన అహంకారము; "ఇది నాయిల్లు, నాబిడ్డ, నాభార్య, నాతనువు"—ఈవిధమైన భావన కలుగజేయునది అపక్వమైన అహంకారము.

116. "నేను భగవంతుని సేవకుడను" అని భావించుట భక్తుని యహంకారమునకు లక్షణము. ఇట్టిది విద్యాహంకారము. ఇదిగో పక్వాహంకారమనియు జెప్పబడును.

117. "తంటాలమారి అహంత" అనగా ఎటువంటిది? "ఏమి! వారు నన్నెఱుగరా? నే నింత ధనవంతుడనుగదా, నన్ను మించిన ధనికు లెవరు? నాకంటె అధికు లెవరు?" అని మిట్టిపడు నహంతగో "తంటాలమారి అహంత", హానికరమైన అహంత.

118. నరుని లౌకికునిగను కామినీకాంచనములకు దాసునిగను జేయు నహంకారమే హానికరమగు నహంకారము. జీవాత్మకును పరమాత్మకును నడుమ ఈ అహంకారము వచ్చి పడుటచేతనే వారిరువురును వేఱుపడుచున్నారు. నీటిమీద కఱ్ఱను వేసినయెడల ఆనీరు విభాగమైనట్లు కాన్పించును. అహంకారమే యీకఱ్ఱ. దీనిని తొలగించితివా, నీరు మఱల అభిన్నమై కాన్పించును.

## అహంకారమును జయించు టెట్లు?

119. "నేను" అనుదానినిగూర్చి దాని ఆనుపానులను గనిపట్టవలయునని ప్రయత్నించినయెడల అది కేవలము అహంకారమునకు సంజ్ఞ యని తెలియవచ్చును. కాని దానిని తొలగించుకొనుట కడుదుర్లభము. కావున సాధకు డిట్లు భావింపవలయును: "ఓపాపిష్ఠమైన అహంకారమా! ఏవిధముగను నీవు నన్ను విడువకున్నయెడల భగవంతుని దాసు

రాలవై యుండుము.'' భగవంతుని సేవకుడనని భావించు నహంకారమునే పక్వాహంకార మందురు.

120. శంకరాచార్యులను ఒక శిష్యుడు చిరకాలము సేవించుచుండెను, కాని వారాతని కేమియు ఉపదేశము చేసి యుండలేదు. శంకరులొకప్పుడు ఒంటరిగా కూర్చుండియుండ వెనుకనుండి యెవ్వరో వచ్చుచున్నటుల కాలిచప్పుడు విన నయ్యెను. ఆచార్యులు, ''ఎవరక్కడ?'' అనిరి. ''నేనే'' అని యా శిష్యుడు పలికెను. శంకరాచార్యులు అప్పు డాతని కిట్లు బోధించిరి: ''ఈ 'నేను' అనునది నీకంత ప్రియమైన యెడల దానిని అనంతముగా పెంచుము, (అనగా విశ్వమంతయు నీవే యని గ్రహింపుము) లేదా, దానిని పూర్తిగా విడిచి పెట్టుము.''

121. అహంకారము ఎట్లును అడుగునట్లు నీకు కాన్పింపని యెడల ''దాసోఽహం'' అనురూపమున దానిని నిలిచియుండ నిమ్ము. ''నేను భగవంతుని కింకరుడను, నేను వానిభక్తుడను'' అను నహంకారమువలన నంతగా భయపడవలసినదిలేదు. మిఠాయిలు అజీర్ణవాతమును గలిగింపవచ్చును, కాని కల కండ అట్టిదికాదు. భక్తుని ''దాసోఽహం'' అను నహంకార మును పసివాని ''నేను'' అను నహంకారమును—పుల్లతో నీటిపై గీచిన గీతవంటివి, అది యెంతో సేపుండదు.

122. కలకండయందు ఇతరమగు తియ్యని వస్తువులవలె దుర్గుణములు లేనిచందమున భగవంతుని కింకరుడననికాని, భక్తుడననికాని భావించు పక్వమైన అహంకారములో దోషము

లేదు, దానివలన హాని గలుగదు. కాని అపక్వమైన అహంకారము అట్టిదికాదు, దానివలన అనేకబాధలు కలుగును. పక్వమైన అహంకారమో, భగవత్ప్రాప్తిని గలుగజేయుచు భక్తియోగ మనదగియున్నది.

**123.** "దాసోఽహం" అను భావము కలవాని కామక్రోధాదులు ఏవిధముగా నుండును? ఆమనోభావన సత్యమును మనఃపూర్వకమునై నపక్షమున వాని పూర్వపు కామక్రోధాదులు పేరునకుమాత్ర ముండును. భగవంతునిదాసుడనను అహంకారముకాని, భక్తుడనను అహంకారముకాని నిలిచియున్నను సాక్షాత్కారము పొందినవా డెవ్వనికిని హాని చేయడు—చేయజాలడు. అట్టి యహంకారమున తానొక వ్యక్తినను విషమంతయు హరించిపోవును. పరుసవేదిని తాకిన కత్తి బంగారుకత్తిగా మాఱిపోవును. దాని పూర్వపు రూపు నిలిచియున్నను అది యెవ్వనికిని హానిచేయజాలదు.

**124.** నీకు అహంభావ మున్నయెడల భగవంతుని సేవకుడవనియో పుత్త్రుడననియో భావనచేసి గర్వపడుము. మహాత్ములు శిశుస్వభావము గలవారై యుందురు. భగవంతునిమ్రోల వా రెప్పుడును బిడ్డలే. కావున వారికి అహంభావము ఉండదు. వారిబలమంతయు భగవంతునిదే కాని వారిదికాదు. భగవంతునుండియే వారికి బలము లభించును.

**125.** సమస్తము ఈశ్వరేచ్ఛచేతనే జరుగుచున్నదను దృఢవిశ్వాసము గలవాడు తాను ఈశ్వరునిచేతిలో కేవలము ఉపకరణమనని భావించును. అట్టివా డీజన్మమునందే ముక్తు

డగును. సర్వేశ్వరా! నీవే నీకార్యములను జేయుచుండ, వీరు, ఆహా! 'నేను జేయుచున్నాను' అందురు.

126. "నే నెఱుగుదును" అనికాని, "ఎఱుగను" అని కాని పలుకుచున్నంతవఱకు నరుడు తా నొకవ్యక్తినని భావించుచుండును. "నీలోని యీ అహంకారమును పూర్తిగా నేను తొలగించినపుడే అఖండబ్రహ్మసాక్షాత్కారము సమాధిస్థితియందు గలుగగలదు" అని నా జగజ్జనని పలుకుచున్నది. అంతవఱకు 'నేను' అనునది నాలోను నాయెదుటనుగూడ నిలిచియే యుండును.

127. కామక్రోధాదులతో తీవ్రమైన పోరాటము సలిపి, ఆత్మజ్ఞానముకొఱకై భల్లూకపుబట్టు పట్టి యఖండసాధన చేసిన పిమ్మటగాని సమాధిస్థితి లభింపదు. అప్పుడే అహంకారము సపరివారముగా తరలిపోవును. కాని సమాధిస్థితినిబొందుట చాల దుర్లభము. అహంకారమును వేయిసార్లు అణచినను మఱల మఱల తలయెత్తుచునేయుండును. దానిమూలముననే మఱల మఱల మనము ఈ లోకమున జన్మమెత్తుచుండుట! (చూ. 111, 113, 129.)

128. ఈశ్వరసాక్షాత్కారము లభింపనిదే, క్షుద్రమైన లోహము పరుసవేదియొక్క స్పర్శచే బంగారముగా మాఱనిదే, "నేను కర్తను" అను భ్రమ తొలగదు. ఈ భ్రమ తొలగకుండునంతవఱకు "నే నీ సత్కార్యమును జేసితిని, ఆ దుష్కార్యమును జేసితిని" అను భేదభావము గలుగుచునే యుండును. ఈ భేదభావమే—ఈ భేదదృష్టియే—మాయ,

దీనిమూలముననే సంసారభ్రమణము నిరంతరముగా సాగు చున్నది. సత్త్వగుణప్రధానమగు విద్యామాయ శరణుజొచ్చితి మేని మనల నది ధర్మమార్గమున నడపి భగవంతుని బొందించును. భగవత్సాక్షాత్కారము నొందినవాడే మాయారూపమైన సంసారసాగరమును దాటుచున్నాడు. భగవంతుడే కర్తయనియు స్వయముగా తాను అకర్తననియు అశక్తుడననియు గ్రహించునతడు జీవన్ముక్తుడగుచున్నాడు—అనగా ఈ శరీరముననుండగనే ముక్తుడగుచున్నాడు.

## ముక్తునియందలి అహంకారము

129. అహంకారము ఎన్నడును పూర్తిగా నశించదా? కాలపరిపాకమున కలువరేకలు రాలిపోవును, కాని వాని గుఱుతులు నిలిచియుండును. అటులనే ఈశ్వరసాక్షాత్కారము పొందునేని నరుని యహంకారము పూర్తిగా తొలగిపోవును. కాని దాని జాడలుమాత్రము నిలిచియుండును. ఐనను దాని వలననెట్టిహానియు గలుగదు. (చూ. 111.)

130. భగవత్సాక్షాత్కారము నొందినవాడే నిజమైన జ్ఞాని. ఆతడు పసిబాలుని బోలును. బాలునికిగూడ నొక వ్యక్తిత్వము ఉన్నటులే తోచును, కాని యది పైకిగాన్పించునదేకాని వాస్తవమైనది కాదు. వయసువచ్చినవారి వ్యక్తిత్వభావముతో—అహంకారముతో—బోల్చిచూచినయెడల పసివాని యహంకారము ఒక యహంకారమే కాదు.

131. సప్తమభూమికను లేదా, ఉత్తమమైన సమాధిస్థితిని బొంది బ్రహ్మభావమున లయముగాంచిన మహాత్ములు కొందఱు

ఉందురు. వారు లోకశ్రేయముగల్గింప కరుణకలవారై తమ మహోన్నతస్థితినుండి దిగివత్తురు. అట్టివారు విద్యారూపమైన అహంకారమును—ఉత్తమాత్మభావమును— నిలుపుకొనినేయుందురు. కాని యీ అహంకారము పేరునకు మాత్రమే. ఇది నీటిమీాద గీచిన గీతను బోలియుండును. (చూ. 121.)

132. తగులబడిన త్రాటికి పూర్వపు ఆకారమున్నను అది దేనిని కట్టుటకు పనికిరానిచందమున జ్ఞానాగ్నిచే దగ్ధమైన అహంకారము (కర్మబంధమును గల్గింప శక్తిలేనిదై) ఉండును.

133. ఎవ్వడో తనను ఖండఖండములుగా నఱికి వేయుటకై వచ్చుచున్నటుల ఒకడు కలగాంచును: అడలిపోయి మేల్కొనును. కన్నులువిప్పిచూడగా గదిలోపల గడియ వేయబడియేయుండును. గదిలో తాను తప్ప మఱెవ్వరును ఉండరు. అయినను కొన్నినిమిషములవఱకు వానిగుండెలు దడదడ కొట్టుకొనుచునేయుండును. అటులనే మన అభిమానము లేదా, అహంకారము మనలను వీడి చనుసప్పుడుగూడ దానివడి కొంతవఱకు శేషించినే యుండును.

134. సమాధిస్థితిని బొందిన పిమ్మటకూడ భగవత్సేవకుడనను అహంకారముగాని, భగవద్భక్తుడనను అహంకారముగాని కొందఱు నిలుపుకొందురు. శంకరాచార్యులు ఇతరులకు బోధించుటకై విద్యారూపమగు నహంకారమును నిలుపుకొనిరి.

135. హనుమంతుడు భగవంతుని సాకారునిగను నిరాకారునిగనుగూడ దర్శించుభాగ్యము పొందెను. ఐనను ఆతడు

భగవత్సేవకుడనను అహంకారమును నిలుపుకొనెను. నారద సనక సనందన సనత్కుమారుల విషయముకూడ నిట్టిదే.

ఒకభక్తుడు: నారదుడు మొదలైనవారు కేవలము భక్తులేనా? జ్ఞానులుకూడనా?

గురుదేవుడు: నారదాదులు బ్రహ్మజ్ఞానమును బొందినవారే. కాని వారు గలగలలాడుచు బ్రవహించు సెలయేటి చందమున భగవద్గుణానుభవకథనమును స్తోత్రములను పాడించుచువచ్చిరి. తరణోపాయముగు తత్త్వములను జనులకు బోధించుటకై విద్యాహంపమైన యీ అహంకారమును— వ్యక్తిత్వపుజాడను—భగవంతునుండి తాము వేఱను స్పృహ గలుగుటకై లేశమైన యీ అహంతను—నిలుపుకొనిన వారని తెలియనగును.

136. శ్రీగురుదేవు డొకప్పుడు తనశిష్యులలో నొకనిని విలాసముగా నిట్లు ప్రశ్నించెను: సరేకాని నాకేమైన శరీరాభిమానమున్నట్లు నీకు తోచుచున్నదా? నాకు అభిమానమేమైన గలదా?

శిష్యుడు: ఔనండి, కొంచెమున్నది; కాని యీకొంచెము ఇందు నిమిత్తము ఉన్నదని నాయభిప్రాయము: (1) శరీర రక్షణార్థము, (2) భగవద్భక్తిసాధన నిమిత్తము, (3) భక్తులతో సాంగత్యముకొఱకు, (4) ఇతరులకు తత్త్వము నుపదేశించుటకును. ఐనను భగవానుని మీరెంతయో బతిమాలుకొని, లేశమైన యీ అభిమానమును నిలుపుకొనిరని చెప్పవలసియున్నది. అనగా మీ ఆత్మయొక్క నైసర్గికస్థితిని సమాధి

యనుమాటచేతనే అభివర్ణింపనగునని నాభావము. కాబట్టి వీరాకుగల అభిమానము మీ ప్రార్థనయొక్క ఫలమని చెప్పెదను.

గురు దేవుడు : నిజమేకాని నావలన కాదది నిలిచియుండుట, అల జగజ్జననివలన. ప్రార్థన నంగీకరించుట నాజగజ్జనని దివ్యచిత్తము.

ఐదవ ప్రకరణము

# గ్రంథములు గ్రంథులు

**కేవలపుస్తకపాండిత్యము నిష్ప్రయోజనము—వాదోపవాదముల సారహీనత—పాండిత్యమునకు నిజమైన ప్రయోజనమేమి?**

## కేవలపుస్తకపాండిత్యము నిష్ప్రయోజనము

137. ఒకనాడు కేశవచంద్రసేనుడు దక్షిణేశ్వరాలయమునన్న శ్రీరామకృష్ణుని సందర్శించి యిట్లు ప్రశ్నించెను: "పండితులు పెట్టెలకొలది గ్రంథములను జదివియు నిజముగా పారమార్థిక విషయమునకు వచ్చునరికి పరమపామరులై యుండుటకు కారణమేమి?" శ్రీగురుదేవుడిట్లు సమాధానమొసగెను: "గద్దలును రాబందులును ఆకాశమున ఎంతయో ఎత్తున కెగురునుగదా? కాని వాని కన్నులుమాత్రము క్రుళ్లి కంపుగొట్టుచుండు శవములను వెదకుచు ముఱికిగుంటలమీదనే నిలిచియుండును. ఆవిధముగనే ఎన్ని శాస్త్రములు చదివినను, ఎంతపాండిత్యము సంపాదించినను, పండితంమన్యుల మనస్సు కామినీకాంచనములను ఐహికవిషయములందే లగ్నమై యుండును. అందుచే వారికి బ్రహ్మజ్ఞానము అలవడదు."

138. అంతఃకరణమును శుద్ధిచేయు విద్యయే విద్య, మిగిలినదంతయు అవిద్య.

139. కేవల గ్రంథపాండిత్యమువలన ప్రయోజనమేమి? పండితులు వందలకొలది శ్లోకములను ఏకరువుపెట్టవచ్చును.

కాని వానిని ఊరక వల్లించినమాత్రమున లాభము లేదు. శాస్త్రములందలి తత్త్వములు జీవితమున ఆచరణలోనికి రావలయును. కామినీకాంచన మోహితుడై సంసారబద్ధుడై యున్నంతవఱకు — కేవల శాస్త్రపఠనమువలన జ్ఞానముగాని, ముక్తిగాని లభింపజాలదు.

140. మన పండితంమన్యులు మహాడాంబికముగా మాట లాడెదరు. బ్రహ్మయని, బ్రహ్మమని, అవ్యక్తమని, జ్ఞాన యోగమని, తత్త్వశాస్త్రమని, వేదాంతమని యేమేమో పలి కెదరు. కాని వానియొక్క అనుభవమును బొందినవారు మాత్రము పూజ్యమనియే చెప్పవచ్చును. వారు కేవలము శుష్కహృదయులు, సారహీనులు.

141. "స, రి, గ, మ, ప, ద, ని," అని ఊరక నోటితో అనుట తేలికయే, కాని వానిని ఒకవాద్యముమీద పలికించుట కష్టము. అటులనే మతధర్మములను గుఱించి మాటలాడుట సులభమే, కాని ఆచరించుట దుర్లభము.

142. చిలుక రాధాకృష్ణనామమును బలుకుచుండును; కాని పిల్లినోట చిక్కినపుడు కీచుకీచుమనును. అపుడు దాని సహజమైన కూతయే బయలుపడుచున్నది. లౌకికులు ఐహిక ఫలములను బడయుటకై ఒక్కొక్కప్పుడు హరినామస్మరణము చేయుచుందురు. పుణ్యకార్యములను దానధర్మములనుగూడ సాగించుచుందురు. కాని దురదృష్టవశమున దుఃఖమో, దారి ద్ర్యమో, మరణమో సంభవించునపుడు ఆ హరినామస్మరణ మును ఆ నియమనిష్ఠలను అన్నిటిని మఱచిపోవుదురు.

143. భగవద్భక్తి పుస్తకములను జదువుటవలన లభించునా? పంచాంగములో ఒకానొకదినమున ఇరువదిముక్కల వాన కురియునని వ్రాయబడియున్నది. కాని యా పంచాంగమును మెలిపెట్టి పిండుటచే ఒకచుక్కయైనను వచ్చునా? అదేవిధమున శాస్త్రములలో అనేక సద్వాక్యములు ఉండవచ్చును, కాని వానిని పఠించినమాత్రమున నెవ్వడును పారమార్థికుడు గాజాలడు. భగవద్భక్తి కలుగవలయుననిన, ఆ శాస్త్రములలో జెప్పబడిన ధర్మములను అనుష్ఠింపవలయును.

144. పరమేశ్వరుని ప్రేమ యుక్తి, ధీశక్తి, పాండిత్యము—ఇవేవియు కొనజాలవు. అచట మూగవాడు మాటలాడును, గ్రుడ్డివాడు చూచును, చెవిటివాడు వినును.

145. శాస్త్రములను జదివినమాత్రాన ఈశ్వరుని తత్త్వమును నిరూపింపబూనుట కేవలము కాశీపటమును జూచి కాశీ యెట్టిదో మఱియొకరికి వర్ణింపబూనుటవంటిది.

146. 'గంజాయి' యనుమాటను వేయిసార్లు ఉచ్చరించినను గంజాయియొక్క మత్తు కలుగదు. కొంచెము గంజాయి తెచ్చి నీరు మొదలగువానితో గలిపి నూఱి యా రసమును త్రాగుము; అప్పుడు నిజముగా నీకు నిషా కలుగును. "దేవుడా! దేవుడా!" యని దేవులాడుటచే నేమి లాభము? శ్రద్ధాభక్తులతో సాధనముచేయుము. అపుడు దేవుని దర్శనము లభించును.

147. తన పాండిత్యమును ఐశ్వర్యమును జూచుకొని గర్వ పడువానికి తత్త్వజ్ఞానము లభింపజాలదు. అట్టివానితో నీవిట్లు చెప్పెదవుగాక; "ఒకానొకచోట నొకసాధువు ఉన్నాడు, చూచివత్తము, వత్తువా?" ఆత డేదియో సాకుజెప్పి రాజాల నన్నును. సాధువులను, సన్న్యాసులను జూడబోవుట తనవంటి ఘనునకు తగదని భావించును. అజ్ఞానమువలన నిట్టిగర్వము కలుగును జుమీ!

148. అల్పవిద్యావంతునకు అహంభావము ఎక్కువ. నే నొకనితో భగవంతునిగూర్చి ప్రసంగించితిని. ఆత డిట్లనెను: "ఆఁ! నా కివన్నియు తెలిసినవే!" అంత నే నిట్లంటిని. "ఢిల్లీకి వెళ్లి వచ్చినవాడు నేను ఢిల్లీకి వెడలితి నని చాటు కొనుచు బోవునా? పెద్దమనుష్యు డెవ్వడైనను తాను పెద్ద మనుష్యుడ నని చెప్పుకొనునా?"

149. గ్రంథములు గ్రంథులు—మనలను బంధించు ముడులు; తఱచుగా ఈ యర్థమే వానికి జెల్లును. గర్వము నంతయువిడిచి సత్యమును గ్రహింపవలయునను తీవ్రవాంఛతో జదువనియెడల గ్రంథపఠనము దుష్పాండిత్యము, అహం భావము మొదలగువానిని బెంచును: హృదయమున నివి యనేకగ్రంథులై బాధించును.

150. బూడిదెప్రోవుపై పోసిన నీరు వెంటనే ఇగిరిపోవును గదా! గర్వమే ఈ బూడిదెప్రోవు. గర్వముతో ఉబ్బిపోవు వాని హృదయమున ప్రార్థనలును ధ్యానములును ఫలవంత ములు గాజాలవు.

## వాదోపవాదముల సారహీనత

151. కూజాను నీటిలో ముంచునపుడు బుడబుడమని ధ్వనిచేయును, కాని నిండినతోడనే శబ్దము అణగును. అటులనే బ్రహ్మసాక్షాత్కారము పొందనివాడు బ్రహ్మమునుగూర్చి లొడలొడ వ్యర్థవాదములు చేయుచుండును, సాక్షాత్కారమును బొందినవాడో, నిశ్శబ్దముగా బ్రహ్మానందము ననుభవించు చుండును.

152. పామరజనులు ధర్మమునుగూర్చి బ్రహ్మాండమైన ప్రసంగములను జేయుదురు. కాని అణుమాత్రమైనను ఆచరింపరు. జ్ఞానియో, వాని యావజ్జీవము ధర్మాచరణము యొక్క స్వరూపమైయున్నను ధర్మమునుగూర్చి మాటాడనే మాటాడడు.

153. సమారాధనకు పలువురు ఆహ్వానింపబడినప్పుడు వారు చేయు గోల విశేషముగా వినవచ్చును, కాని యా గందరగోళము అంతయు వారు భోజనము ఆరంభించునంతవఱకే. వడ్డన అయి భోజనము ప్రారంభించునరికె శబ్దము ముప్పాతిక పాలు అణగిపోవును. ఇక బూరెలు వచ్చును—వడ్డన సాగిన కొలది శబ్దము క్షీణించుచుండును. మజ్జిగ దగ్గఱకు వచ్చునరికి జుఱ్ఱుకొను శబ్దముదక్క మఱేదియు వినబడదు. భోజనములు అయినంతనే ఇక వారు చేయుపని నిద్రపోవుటయే!

దైవసాన్నిధ్యమును బొందినకొలదియు ప్రశ్నలందును హేతువాదములందును నిరుచి తగ్గిపోవుచుండును. ప్రత్యక్షముగ దైవమును దర్శించినంతనే ఈ వాదోపవాదములన్నియు,

ఈ గందరగోళము అంతయు పూర్తిగా అణగిపోవును. అపుడు నిద్రా సమయము, అనగా సమాధిస్థితియందు బ్రహ్మానందమును పొందు సమయము వచ్చును.

154. తేనెటీగ పుష్పదళములలోనికి ప్రవేశించి యందలి మకరందమును చవిచూడకుండునంతవఱకు బయటనేయుండి దాని చుట్టును ఝుంకారము చేయుచు దిరుగుచుండును. కాని యది పువ్వులోనికి ప్రవేశించినంతనే నిశ్శబ్దముగా మకరందమును గ్రోల నారంభించును. వాదములనుగూర్చియు సిద్ధాంతములనుగూర్చియు చర్చించుచున్నంతవఱకు మానవుడు తత్త్వామృతమును రుచిచూడనివాడే. దానిని రుచి చూచెనా, వాదోపవాదములకు స్వస్తి చెప్పును.

155. క్రొత్తభాషను నేర్చుకొన మొదలిడినవాడు తన సంభాషణలందు ఆ భాషాపదములను తఱచు వాడుచు, తన ప్రజ్ఞను ప్రదర్శింపజూచుచుండును. కాని దానిని బాగుగా నేర్చినయతడో, మాతృభాషను మాటలాడునపుడు ఆ నూతన భాషాపదములను ఉపయోగింపనే ఉపయోగింపడు. ఆధ్యాత్మిక సాధనలలో అభివృద్ధి పొందినవారివిషయముకూడ నిట్టిదే.

156. సంతకు దూరమున నున్నప్పుడు 'హో హో' యను పెద్దగోల వినబడును. సంతలో బ్రవేశించినపిమ్మట ఆ శబ్దము వినబడదు. కాని యచట జరుగుచున్న బేరసారములు తెలియవచ్చును. అటులనే భగవంతునికి దూరముగా నున్నంతవఱకు నరుడు నిరర్థకవాదోపవాదము లను గందరగోళములో నిమగ్నుడై యుండును. కాని భగవంతుని సమీపింపగనే

యుక్తులును వాగ్వాదములును అన్నియు శాంతింప భగవ
ల్లీలలను స్పష్టముగా గాంచును.

157. కాగుచున్న నేతిలో అప్పచ్చులను వేయునపుడు సల
సలమని ధ్వని పుట్టును. కాని యవి వేగినకొలదియు ధ్వని
తగ్గుచుండును. పూర్తిగా వేగినంతనే శబ్దము అణగిపోవును.
అల్పజ్ఞానియై యున్నంతవఱకు నరుడు ప్రసంగములను బోధోప
దేశములను అదేపనిగా సాగించుచుండును; కాని బ్రహ్మజ్ఞానము
లభించెనేని ఈ పటాటోపము అంతయు అణగిపోవును.

158. ఈశ్వరానుగ్రహము లభించునపు డెల్లరును తమ
దోషములను సవరించుకొందురు; దీనిని గ్రహించినవాడు
వాగ్వాదములలోనికి దిగడు.

## పాండిత్యమునకు నిజమైన ప్రయోజన మేమి?

159. భగవంతుని గూర్చెడు మార్గమును జూపుటయే ధర్మ
శాస్త్రములు చేయు పని. మార్గమును గ్రహించినపిమ్మట
పుస్తకములతో పనియేమి? ఇక నేకాంతముగా సాధన చేయ
వలసియుండును. తనబంధుగులకు ఏవో కొన్ని వస్తువులను
బంపుమని యింటినుండి ఒకనికి ఉత్తరము వచ్చినది. ఆత
డావస్తువులను కొనబోవునపుడు ఉత్తరములో ఏ వస్తువులు
పంపుమని వ్రాయబడెనో నిర్ధారణగా దెలియగోరెను. ఉత్త
రముకోసము చూడగా అది కనబడలేదు. అందుచే చాలసేపు
వెదకినాడు. తుదకది యెట్లో కాన్పించినది. మహానందము
పొంది దానిని ఆత్రముతో జదువ నం దిట్లున్నది: "ఐదుసేర్ల
మిఠాయి, వందనారింజపండ్లు, ఎనిమిది ధోవతులు పంపుడు."

సంగతులు తెలియగనే ఉత్తరమును అవలబెట్టి కావలసిన వస్తువులు కొననారంభించినాడు.

ఎంతవఱకు అట్టియుత్తరముయొక్క అవసరము? దానిలోని సంగతులను తెలిసికొనువఱకేగదా! సంగతులు తెలిసిన తోడనే కావలసినవస్తువులను గొనుటకై ప్రయత్నించుటయే అతడు చేయవలసినపని. అదేతీరున భగవత్ప్రాప్తిని బొందు మార్గమును, అనగా సాక్షాత్కారమునకు వలయు సాధనలను శాస్త్రములు మనకు దెలుపును. అంతే వాని పని. మార్గము తెలిసినపిమ్మట మనము చేయవలసినపని గమ్యమును జేరుటకు వలయు సాధనయే. సాక్షాత్కారమే మన గమ్యము.

160. దేనిసాయమున మనము భగవతుని దెలిసి కొందుమో అదియే బ్రహ్మవిద్య. కేవలశాస్త్రములు, వేదాంతము, తర్కము, వ్యాకరణము మొదలగున వన్నియు మనస్సును కలవరపెఱుచునట్టివి. గ్రంధములు ప్రాయికముగా గ్రంథులు (ముడులు). బ్రహ్మజ్ఞానమునకు సాధనభూతమైనంత వఱకే వానియొక్క ప్రయోజనము.

161. పుస్తకములు చదివిననేకాని బ్రహ్మజ్ఞానము కలుగ దని భావింపరాదు. చదువుటకంటె వినుటమేలు. వినుటకంటె విశేషము సాక్షాత్కారము. గ్రంథములను సూక చదువుట కంటె గురుముఖమున తత్త్వమును వినుటచే మనస్సున బాగుగా నాటుకొనును; సాక్షాత్కారముచేతనో, తత్త్వజ్ఞానము స్థిర పడును. కాశీనగరమునుగుఱించి పుస్తకములలో జదువుట కంటె దానిని స్వయముగా జూచినవానినోట వినుట మేలు, కాని తనయంత తానే చూచుట సర్వోత్తమముగదా!

162. ఆత్మజ్ఞానము ఇరుతెఱగులవారికి అలవడును—ఎవరి మనస్సు పాండిత్యపు గందరగోళములోనికి దిగకుండునో లేక ఎరవుతెచ్చుకొనిన భావములతో పూడిపోకుండునో వారికిని, సమస్త వేదవేదాగములను జదివినను ఎవ్వరు తమకేమియు తెలియలేదను సంగతిని తెలిసికొనియుందురో వారికిని (ఈ యిరుతెఱగులవారికే మాత్రమే) జ్ఞానలాభము గలుగును.

163. ఏవో దోషములనియు మూఢాచారములనియు బలుకుచు గొందఱు తమపాండిత్యమునుగుఱించి గర్వపడు చుందురు. కాని నిజమైన భక్తుడు తన కెప్పుడును దయామయుడగు భగవానుడే చేయూత నొసగ సిద్ధముగానున్నాడని తెలిసికొనును. కొంతకాలము ఆతడు తప్పుత్రోవను బోవుచుండినను బోవుగాక, మఱేమియు బాధలేదు. వానికేది ఆవశ్యకమో భగవానుడెఱుగును. భగవానుడే భక్తుని యభీష్టమును సిద్ధింపజేయును.

164. ఇరువురు మిత్రులొకతోటలోనికి బోయిరి. వారిలో లౌకికజ్ఞానదక్షుడైన వాతడు వెంటనే తోటలోని మామిడిచెట్లను లెక్కింపనారంభించెను. మఱియు ప్రతిచెట్టునకు ఎన్ని కాయలు గలవో, మొత్తముమీద తోట యెంత కిమ్మతు చేయునో అంచనా వేయసాగెను. వానిమిత్రుడు తోటయజమానుని దగ్గఱకుబోయి వానితో మెల్లగా స్నేహముచేసికొని యొకచెట్టును సమీపించినాడు; యజమానుని సమ్మతిని బొంది పండ్లుకోసికొని తిననారంభించినాడు. వీరిరువురిలో బుద్ధిశాలి యెవడు? మామిడిపండ్లను తినిన నీయాకలి తీరును. అంతేకాని చెట్లను ఆకులను లెక్కించి అంచనా వేయుటవలన నేమి

లాభము? శుష్కపండితుడు సృష్టియొక్క ఉత్పత్తిక్రమము లను కనుగొనుయత్నమున వ్యర్థముగా కాలయాపనచేయును. కాని వినమ్రుడును విజ్ఞానియు నగునాతడు సృష్టికర్తతో చెలిమి సంపాదించి వాని ప్రసాదమున లభించు బ్రహ్మానందము ననుభవించును.

165. ప్రజ్ఞానస్వరూపిణియగు నాజగజ్జననియొక్క కటాక్ష మొక్కటి ప్రసరించిన జాలును, మహాపండితాగ్రేసరుని సైతము పడగొట్టి నేలపై బ్రాకు నీచక్రిమితుల్యునిగా గాన్పింపజేయగలదు.

166. 'గీతా' యనుపదమును వేగముగా 'గీ–తా–గీ–తా–గీ–తాగీ' యని పదిసార్లు ఉచ్చరింపుము. చూడగా అది 'తాగీ, తాగీ' అని యుచ్చరింపబడునుగదా? తాగి లేక త్యాగియనగా భగవంతుని బొందుటకై సర్వము త్యాగముచేసినవాడని యర్థము. ఇటు లొక్కమాటలో గీత యిట్లు బోధించుచున్నది. "ఓ సంసారులారా! త్యాగముచేయుడు! అన్నిటిని త్యజించి భగవానునిపైకి బుద్ధి మఱల్పుడు."

167. చైతన్యదేవుడు దక్షిణదేశమున తీర్థయాత్రలు చేయుచు; గీతను జదువు నొక పండితుని ముందర కన్నీరు గార్చుచు గూరుచుండిన యొక భక్తుని గాంచెను. ఈభక్తునికి ఓనమాలైనను రావు. గీతలోని ఒక్క శ్లోకమునకైనను పండితుడు చేయుచున్న అర్థమేమో గ్రహించునట్టి స్థితిలో లేడు. కన్నీళ్లు గార్చుచుండుటకు కారణమేమని చైతన్య దేవుడు ప్రశ్నింపగా నాత డిట్లు పలికెను: "గీతలోని ఒక్క మాటకూడ నాకు తెలియదనుమాట నిజము. కాని గీతా

కాలక్షేపము జరుగుచున్నంతసేపు కురుక్షేత్రమున రథము పైని, అర్జునునియెదుట గూర్చుండి గీతలోని యీ దివ్య తత్త్వములనన్నిటిని ఉపదేశించుచున్న శ్రీ కృష్ణపరమాత్ముని సుందరరూపము నాలోపలి కన్నులకు అగపడుచున్నది. కాబట్టి వానియందలి భక్తిచేతను ఆనందముచేతను నాకన్నులు బాష్పములతో నిండినవి.''

ఆతడు ఓనమాలైనను నేర్వకున్నను బ్రహ్మజ్ఞాని, నిర్మల భక్తిచే భగవత్సాక్షాత్కారము పొందగలిగిన భక్తిపరుడు.

ఆఱవ ప్రకరణము

# 'బాధ గురువులు : బోధ గురువులు'

### గురుత్వమునందలి ప్రమాదములు—బోధగురువులు

## గురుత్వమునందలి ప్రమాదములు

168. ఓ ఆచార్యుడా! బోధించుటకు నీకడ అధికార చిహ్నము కలదా? రాజుచే అధికారముద్రపొందిన యెంతటి అల్పసేవకుడైనను వానిమాటలను జనులు భయభక్తులతో విందురు. ఆతడు తన డవాలుబిళ్లను జూపి యెంతటి అల్లరినైనను అణచివేయగలడు. అటులనే నీవును మొట్టమొదట ఈశ్వరునియాజ్ఞను బొంది ఈశ్వరప్రేరితుడవు కావలయును. ఈ యీశ్వరాదేశచిహ్నము నీకడ లేనియెడల జీవితకాల మంతయు నీవు ధర్మోపన్యాసములు చేయుదువుగాక, వట్టి కంఠశోషయే కాని మఱేమియు ప్రయోజనము ఉండబోదు.

169. భక్తిసాగరమున మునుగుట కెవ్వనికిని అభిలాష గాని, ఓరిమిగాని లేదు. వివేకవైరాగ్యములనుగాని, సాధనలనుగాని ఎవ్వరును లక్షింపనే లక్షింపరు. ఏపుస్తకము నుండియో నాలుగుముక్కలు నేర్చినంతనే యిక నుపన్యాసములు చేయుటనిన, పరులకు ధర్మోపదేశము చేయుటనిన, ప్రతివ్యక్తికిని తహతహ, అందులకై పరుగు! ఎంత విచిత్రము! పరులకు బోధించుటనిన అంత తేలికయైన పనియా? కష్టాత్కష్టతరము. ఈశ్వరసాక్షాత్కారమును బొంది, ఈశ్వరాదేశమును బొందినవాడే బోధింపగలడు!

170. మంచివక్తయు బోధకుడు నయ్యును ఆత్మవికాసము లేనివా డెట్టివాడో తెలియునా? ఆతడు తనయొద్ద కుదువ బెట్టిన పరులద్రవ్యమును దుర్వినియోగముచేయువాని వంటి వాడు. ఇతరుల కాతడు ధారాళముగా ఉపదేశింపగలడు. దానివలన తనకేమి నష్టము? ఆతడు బోధించుభావములు ఎరవుసొమ్ములుగదా!

171. సుప్రసిద్ధుడైన యొక ఉపన్యాసకు డొకనాడు ఒక హరిసభలో నుపన్యసించుచుండెను. ఉపన్యాసము నడుమ నాత డిట్లనెను: "భగవంతుడు కేవలము రసవిహీనుడు, మన స్వభావమునందలి రసమొసగి యాతని మనము రస మయుని జేయవలయును." రసమనగా ప్రేమ, భగవంతుని వని చెప్పబడు నితరగుణములు నని యాతనిభావము. ఈమాట లను వినినప్పుడు నాకొకబాలునిసంగతి జ్ఞప్తికి వచ్చినది. వాడు తనమామకు చాలగుఱ్ఱములున్నవని చెప్పుచు, విను వారిని తనమాటలను నమ్మింపనెంచి తనమామయింట ప్రత్యేకముగా నొకగోశాలయంతయు గుఱ్ఱములతో నిండి యున్నదని చెప్పెను. గోశాలలు గుఱ్ఱములకోసము కట్టబడు నవి కావని, బాలుడు చెప్పినది అసత్యమని, గుఱ్ఱములను గూర్చి వానికెట్టి యనుభవములేదని వివేకులగువారు వెంటనే గ్రహించియుందురని వేఱుగ జెప్పనక్కఱలేదు.

భగవంతుడు రసవిహీనుడనుట కేవలము అసంగతము,* (శాస్త్రమునకును, అనుభవమునకును, యుక్తికినిగూడ) విరు

* "రసో వై సః"—(భగవంతుడు రసస్వరూపుడు అని) తైత్తిరీ యోపనిషత్తు.

ర్థము. ఆ ఉపన్యాసకునకు తనమాటలయర్థమేమో తనకే బొత్తిగా తెలియలేదన్నమాట. సచ్చిదానందమూర్తియగు భగవానునాతడెన్నడును గనలేదని, భగవదనుభవము నాతడెన్నడును పొందలేదని వానిమాటల వైఖరియే తెలుపుచున్నది.

172. నేటిమతబోధకుల విధానము లెట్టివో మీకు తెలియునా? ఒక్కనికిమాత్రమే సరిపోవు అన్నము ఉండగా నూఱుమందిని విందునకు బిల్చుటవంటివి. అణుమాత్రమైన ఆత్మానుభవము ఉన్నదో లేదో, కేవలము మహాధర్మోపదేష్టలుగా నటించుచుందురు.

173. మొదట నీహృదయదేవాలయమున భగవానుని ప్రతిష్ఠించుకొనుము. మొదట వాని సాక్షాత్కారము పొందుము. భగవంతుని జూచినపిమ్మట ప్రసంగములు, బోధలు, ఉపన్యాసములు మొదలగువాని నెన్నిచేసినను చేయవచ్చును. అంతే కాని అంతకు పూర్వముకాదు. విషయలోలురయ్యును జనులు భగవంతునిగూర్చియు బ్రహ్మమునుగూర్చియు ప్రసంగములు సాగించుచుందురు. ఆలయములో దేవుడు లేనిదే ఆరాధనకై సంకు ఊదెనట!

174. ఒకనాడు నేను పంచవటినుండి పోవుచుండ కప్పయొకటి భయంకరముగా కూయుచుండుట వింటిని. దానిని పాము పట్టుకొనియుండునని ఊహించితిని. చాలసేపైన తర్వాత ఆదారినే వచ్చుచు, తిరిగి ఆశబ్దమునే వింటిని. పొదలనుండి తొంగిచూడగా ఒక బురదపాము కప్పను బట్టుకొనియున్నది. దానిని అది మ్రింగను మ్రింగజాలకుండెను, విడువను విడువ

జాలకుండెను, పాప మా కప్ప దురవస్థ చెప్పనలవి కాకుండెను. అప్పుడు నే నిట్లనుకొంటిని : "అదియే తాచుబాము ఐనయెడల రెండుమూడుకూతలతో ఆకప్పపని ముగిసియుండెడిది, (అంత టితో కప్పకును పామునకును గూడ బాధ నివర్తించెడిది.) కాని యిచట పాముబాధయు కప్పబాధయు ఇంచుమించుగా సరిసమానముగా నున్నవి. అటులనే ఆత్మజ్ఞానహీనుడు అహంక రించి మఱియొకనిని తరింపజేయు బాధ్యతబూనినయెడల ఇరు వురి బాధకును అంతము ఉండదు. శిష్యుని యహంకారము గాని, వాని సంసారబంధములుగాని తొలగవు. అనర్హు నాశ్ర యించిన శిష్యు డెన్నడును తరింపనేరడు; కాని సమర్థుడగు గురువు నాశ్రయించిన జీవుని యహంకారమో, మూడు బెకబెకలతో సరి."

175. ధర్మప్రచారమును వృత్తిగా బెట్టుకొనిన యొక బోధకుడు వినువారలు భక్తిపరవశు లగునట్లు ఉపన్యసించెడి వాడు. కాని స్వయముగ ఆతడు యోగ్యమైన నడవడి కల వాడు కాడు. వాని ప్రవర్తన జూచి, మనస్సునొచ్చి, అంత మంది హృదయములలో భక్తిభావములను పురికొల్పగల్గియు తాను స్వయముగా అయోగ్యుడై యుండుటకు కారణమేమని నే నాతని నడిగితిని. ఆతడు గౌరవార్థము తలవంచి యిట్లనెను: "అయ్యా, నిజము. చీపురు స్వయముగా నీచమైన వస్తు వయ్యును నేలమీదను వీధులందును గల ధూళిని తొలగించును గదా!" ఆతనికి నిజముగా నే నేమియు బదులు చెప్పలేక పోయితిని. *

## బోధగురువులు

176. తత్త్వజ్ఞానశోభితుడే సద్గురువు, ఆతడే బోధగురువు.

177. అనేకులు మంచుగడ్డనుగూర్చి వినియుందురు, కాని చూచియుండెరు. అటులనే చాలమంది ధర్మోపదేష్టలు భగవానుని యనంత కల్యాణగుణములనుగూర్చి గ్రంథములలో జదివియుందురు, కాని స్వయముగా వానియనుభవము పొందిన వారు కారు. అనేకులు మంచుగడ్డను జూచిన వారయ్యును చవిచూచినవారు కారు. ఈతీరుననే ధర్మబోధకులు పెక్కురు ఈశ్వర విభూతిని లేశము గాంచినను తత్త్వానుభవము పొందిన వారు కారు. మంచుగడ్డను రుచిచూచినవాడే అది యెట్టిదో చెప్పగలడు. అటులనే ఒకప్పుడు దాసునిగను, మఱియొకప్పుడు సఖునిగను, వేఱొకప్పుడు ప్రియునిగను వివిధభావములలో భగవదనుభవము పొంది మఱల సమాధిస్థితిలో వానితో సంపూర్ణైక్యమును సాధించినవాడే భగవత్కల్యాణగుణములను వర్ణింపగలడు.

178. తాను నాయకుడననియు సంప్రదాయనిర్మాతననియు తలంపు కలవాని యహంకారము అపక్వమైనట్టిది. కాని సాక్షాత్కారము పొందినవెనుక ఈశ్వరాదేశమును పొంది

---

* ఈ ప్రకరణమందలి ముఖ్యవిషయముల కిది విరుద్ధమని భావింపరాదు. ఏలన ఈవిధమైన బోధనలవలన గలుగు ఫలము క్షణికము, తాత్కాలికము. ఆత్మానుభవము గలవారి వాక్కులవలె సుస్థిరమైన శ్రేయము వానిచే గలుగజాలదని విచారించిన తెలను కాగలదు.

లోకశ్రేయముకోసము బోధించునేని దానివలన నెట్టిహానియు గలుగదు. పరీక్షితునకు భాగవతమును బోధించుటకై శుకదేవు డిట్టి యాదేశమును బడసెను.

179. నిండుకుండ తొణకదు. ఆత్మానుభవము గలవాని యొద్ద వాచాలత యుండదు. ఐనపక్షమున నారదాదులమాట యేమందురా? నిజమే. నారదుడు, శుకదేవుడు మొదలగు కొందఱు సమాధిస్థితిని బొందినవెనుక తమ మహోన్నతస్థితి నుండి ఎంతయో క్రిందికి దిగి కృపావ్యాప్తులై లోకమునకు బోధించినారు.

180. ముక్తులు లోకమున నిరుతెఱంగులుగా గాన్పించుచున్నారు — తత్త్వజ్ఞానము బొందినవెనుక శాంతముగా, నిశ్శబ్దముగానుండి, యితరులనుగూర్చిన మాటనే తలపెట్టక బ్రహ్మానందమును తామే అనుభవించువారు కొందఱు; జ్ఞానలాభమును పొంది, దానినంతయు తమయొద్దనే దాచుకొనుటలో ఆనందమును గానక, పరుల నుద్దేశించి, "రండు, మాతో తత్త్వానందము ననుభవింపుడు" అని యెలుగెత్తి చాటువారు మఱికొందఱు.

181. పువ్వు వికసించి దాని పరిమళము పిల్లగాడ్పులవలన నల్దిక్కులందును వ్యాపింపగనే తేనెటీగలు తమంతతామే దాని యొద్దకు వచ్చును. మిఠాయిల నుంచిన తావునకు చీమలు తమంతతామే వచ్చిచేరును. తేనెటీగనుగాని చీమనుగాని యెవ్వరును పిలువనక్కఱలేదు. అదేవిధమున నరుడు పవిత్ర హృదయుడై సిద్ధుడైనపుడు ఆతని సుశీలసౌరభము ఎల్లెడలను వ్యాపింప, ముముక్షువు లెల్లరును సహజముగనే వానిచే

ఆకర్షింపబడుదురు. తనమాటలను వినువారికోసము వెదకు లాడుచు ఆతడు తిరుగాడనక్కఱలేదు.

182. మిఠాయి, లేక పంచదార పడినచోటికి చీమలు తమంతతామే వచ్చిచేరును. పంచదార వగుటకై ప్రయత్నింపుము, అనగా ఆత్మజ్ఞానమాధుర్యమును పొంద యత్నింపుము; అప్పుడు భక్తులను చీమలు తమంతతామే నీకడకు వచ్చును. భగవదాదేశము లేకుండ నీవు బోధలుచేయ మొదలిడితివా, ఆ బోధలు నిస్సారములై, కొఱగానివై యుండును. వాని నెవ్వరును చెవియొగ్గి వినరు. భక్తిచేగాని, మఱినే యితరసాధనచేగాని ముందు భగవంతుని పొంద వలయును. అప్పుడు వాని యాదేశమును పొంది యెల్లెడలను బోధలను ఉపన్యాసములను జేయవచ్చును. ఇదినే భగవంతుని వలన శక్తిసామర్థ్యములను పొందుమార్గము. అటుపిమ్మట ఆచార్యుని బాధ్యతలను వహించుటకును వానిని సక్రమముగా నిర్వహించుటకును ఎవ్వడైనను శక్తిమంతుడగును.

183. మంట మండునప్పుడు మిడుతలు వచ్చిపడును, అవి యెక్కడినుండి వచ్చునో యెవ్వరికిని తెలియదు. మిడుతల బిలుచుటకై నిప్పు పరుగులిడునా? ముక్తపురుషులుచేయు బోధన ఇటువంటిది, పరులను బిలుచుటకై వారు పరుగు లాడరు. కాని వందలకొలది, వేలకొలది జనులు వారి బోధన లను పొందగోరుచు తమంతతామే వారికడకు వత్తురు—వా రెక్కడినుండి వచ్చిచేరుదురో ఎవ్వరికని తెలియదు.

184. నిజమైన బోధన యెట్టిదో తెలియునా? పరులకు బోధించుటకు బదులు నిరంతరము భగవానుని భజించు నెడల

అదియే కావలసినంతబోధన. సంసారబంధమునుండి విముక్తుడగుటకై ప్రయత్నించువా డెవడో వాడే నిజమైన బోధకుడు. నల్దిక్కులనుండియు వందలకొలదిజనులు వచ్చి ముక్తునికడ చేరి వాని యుపదేశమును బొందుటకై ఆతురపడుచుందురు. గులాబిమొగ్గ వికసింపగనే తేనెటీగలు, పిలువకయే, కోరకయే నలువైపులనుండియు వచ్చిమూగును.

185. పెద్దవర్తకుని ధాన్యపుగొట్టునుండి కొనవచ్చినవారికి ధాన్యము నొకడు గొలుచుచునేయుండును. వాని వెనుకనుండి ధాన్యము తెంపులేకుండ వచ్చిపడుచుండును. చిల్లరవర్తకుని రాశియో, శీఘ్రముగా తఱిగిపోవును. అదేవిధమున భగవద్భక్తునిహృదయమున సత్సంకల్పములను సద్భావములను నిరంతరము భగవంతుడే తోపించుచుండును. అందువలన నవనవోన్మేషమైన భావములకు వానికెన్నడును లోపము కలుగదు. కాని పుస్తకములను బట్టుకొని ప్రాకులాడు పండితులు చిల్లరవర్తకులను బోలుదురు. ఆశయములకును భావములకును వారి కెప్పటికప్పుడు లోపము గలుగుచునే యుండును.

186. పురమున వాయుదీపములు వివిధభాగములలో ఒకచోట ఎక్కువగను మఱియొకచోట తక్కువగను ప్రకాశించుచుండును. కాని దీపమునకు ప్రాణమగు వాయువుమాత్రము అన్నిటికిని సామాన్యమగు ఒకే యంత్రమునుండి వచ్చును. వివిధదేశకాలములందలి నిజమైన మతబోధకులందఱును ఈ వాయుదీపములవంటివారు. నిరంతరము వీరియందుండి వెలు

వడు ఆత్మతేజమునకు ఆధారభూతుడైనవాడు ఒకే పర మేశ్వరుడు.

187. మేడకప్పుపై బడు వాననీరు అందు విచిత్రముగా పులితలతీరున అమర్చబడు గొట్టములనుండి నేలపై బడుచుం డును. దానిని జూచిన, పులినోటినుండి నీరు వచ్చుచున్నటుల తోచును. కాని నిజముగా ఆ నీరు ఆకాశమునుండి పడు చున్నది. అదేతీరున భాగవతోత్తముల నోటినుండి వెలువడు దివ్యబోధలు వారి పలుకులవలె గాన్పించినను నిజమున కవి భగవంతునుండియే వెల్వడుచున్నవి.

ఏడవ ప్రకరణము

# లౌకికులు: వారి ధోరణులు

లౌకికుల లక్షణములు—ప్రాపంచికజనుల పురాణవైరాగ్యాదులు, వారి భక్తిరీతులు—లౌకికులు : పారమార్థికసాధనలు

## లౌకికుల లక్షణములు

188. మనుష్యమాత్రులు, మనిషావంతులు నని మనుష్యులు ఇరుతెఱగులుగా నుందురు. భగవంతునికోసము పరితపించువారు మనిషావంతులు. కామినీకాంచనములకోసము ఆరాటపడువారు మనుష్యమాత్రులు.

189. ఒకేవేషమును అనేకులు ధరింపవచ్చును. మేకవన్నె పులివలె అనేకులు నరరూపమును దాల్చిన జంతువులు. వీరిలో కొందఱు చిల్చిచెండాడు తోడేళ్లు, కొందఱు భయంకరమగు భల్లూకములు, మఱికొందఱు జిత్తులమారి నక్కలు, ఇకను కొందఱు విషసర్పములు.

190. సన్నని ధాన్యపుగింజలను బోవిడిచి, ముదుకగింజలను, గొల్లుకాయలను నిలుపుకొనుట జల్లెడయొక్క స్వభావము. అట్లే దుర్జనులు సద్విషయములను విడిచిపెట్టి దుర్విషయములను తమలో నిలుపుకొందురు. చేటయొక్కయు సజ్జనులయొక్కయు స్వభావము సరిగా నిందులకు వ్యతిరేకము.

191. సహజముగా లోకమున కొందఱికి ఆకర్షణలేవియు లేకున్నను, వారేదియో మమకారమును గల్పించుకొని దానికి దాసులై యుందురు. స్వేచ్ఛగా, ఏ తాపత్రయము

లేకుండ నుండుట వారికి గిట్టదు, అటు లుండిన నేమగుననియు వారు తలపరు. తాను సంరక్షింపవలసిన కుటుంబముకాని, బంధువులుగాని లేనివాడు ఏపిల్లినో, కుక్కనో, కోడినో లేదా ఏపక్షినో చేరదీసి దానినిక మక్కువతో జూచి పోషించును. ‘తా వలచినది రంభ, తా మునిగినది గంగ’ యనునట్లు ఇక వానికి దానితోడిదే లోకము! ఆహా! లోకులను మాయ ఎన్నివిధములుగా మోహితులను జేయుచున్నదో!

192. లేగదూడ ఎంతయో చురుకుగను ఉల్లాసముగను గాన్పించును. తల్లియొద్ద కమ్మనిపాలు కడుపునిండునంతమాత్రము అప్పుడప్పుడు ఆగుచు, దినమంతయు చెంగుచెంగున గంతులు వేయుచుండును. కాని మెడకు పలుపుగట్టగనే ఆ ఉత్సాహము అంతయు పోవ బిక్కమొగము వేయును. క్రమముగా చిక్కిపోవ నారంభించును. ఇదేవిధముగా సంసారముతో జోక్యము లేకున్నంతవఱకు బాలుడు కేళీవిలాసముల దేలుచుండును. వివాహపాశముచే సంసారబద్ధుడై కుటుంబబాధ్యతలు తన మీద బడినంతనే ఆ ఉల్లాసమంతయు అణగిపోవును. మోమున నిరుత్సాహము, విచారమును మూర్తీభవించును. చెక్కిళ్లనుండి బాల్యవికాసము పలాయనముకాగ క్రమముగా నుదుట విచారసూచకములగు ముడుతలు కాన్పింప నారంభించును. ప్రాతఃకాలమారుతమువలె స్వేచ్ఛామయమై, నవకుసుమములీల సుకోమలమై, మంచుబిందువు చందమున స్వచ్ఛమై తన చారు బాల్యము ఆజన్మాంతము ఎవ్వనియందు శోభిల్లునో వాడే ధన్యాత్ముడు!

193. పసిబాలునకుగాని, బాలికకుగాని సంభోగానంద మన

నెట్టిదో అవగాహన కాదు. అటులనే లౌకికులకు ఆత్మసంయోగానంద మన నెట్టిదో అర్థముకాదు.

194. సంసారయాతనలను నిరంతరము అనుభవించుచున్నను సంసారపరాయణులు కామినీకాంచనమోహమును నిగ్రహించి కావలసిన భగవంతునిపైకి మనసు మఱలింప నొల్లరుకదా!

195. పరమార్థమున వానికి గల వెగటుచేతనే ప్రాపంచికుని సులభముగ దెలిసికొనవచ్చును. మంత్రముగాని, స్తోత్రముగాని, తుదకు నామసంకీర్తనముగాని యాతడు విననొల్లడు, సరికదా, ఇతరులను విననీయక నిరుత్సాహపఱుచును. ప్రార్థనలను భజనసంఘములను నిరసించి హేళన చేయువాడెవ్వడో వాడే పరమలౌకికుడు. సంసారబద్ధుడు.

196. లౌకికులు భక్తులతోగూడి కొన్నికొన్ని పర్యాయములు ఒకచోటికి వచ్చుచుందురు. లౌకికులకు పారమార్థికప్రసంగము రుచింపదు. ఇతరులు భగవంతునిగూర్చియు పరమార్థమునుగూర్చియు చాలసేపు ముచ్చటించుచుండ వారు విసుగుకొని చీకాకుపడుదురు. ఊరక కూర్చుండుటకూడ వారికి చాల కష్టముగానుండును. అందుచే తమ మిత్రుల చెవిలో, "ఎప్పుడు మీరు బయలుదేఱుట? ఇంకను ఎంత సేపుందురు?" అని గుసగుసలాడుదురు. అప్పుడప్పుడు వారి స్నేహితులిట్లు సమాధానము చెప్పుచుందురు: "కొంచెము తాళుడు, ఇప్పుడే వచ్చుచున్నాము." ఈమాటలను విని విసుగుకొని వారిట్లందురు: "సరే, మీరు మాటలాడుచుండుడు. మేము పోయి పడవలో కనిపెట్టుకొని యుందుము." (కలకత్తానుండి జనులు శ్రీరామకృష్ణదర్శనార్థము పడవపై దక్షిణేశ్వరము వచ్చువారు.)

197. పావురముయొక్క కుత్తుక అది ఏరుకొని తిను గింజలతో నిండియుండునట్లే లౌకికుని హృదయము అడ్డమైన లౌకిక చింతలతోడను క్రిక్కిరిసియున్నదని వానితో రవంత ప్రసంగించినంతనే తెలియగలను.

198. పాపాత్ముని మనస్సు ఉంగరాలజుట్టు వంటిది. ఎంత ప్రయత్నించినను ఉంగరాలజుట్టును సాఫుగానుండునట్లు చేయజాలవు. అట్లనే దుర్జనుని బుద్ధిని సరిచేయుట దుర్లభము. (చూ. 579.)

199. సాధువుచేతనున్న కమండలువు అతనితో తీర్థయాత్రలు చేయుచు ధామములను (దర్శింపదగిన ముఖ్యమైన పుణ్యస్థలములు) నాల్గింటిని దర్శించినను ఎప్పటివలెనే చేదుగనే యుండును. సంసారబద్ధుల స్వభావము కూడ అట్టిదే.

200. కాల్చని రేగడమట్టితో కుమ్మరి బొమ్మలను జేయగలడుగాని కాల్చినమట్టితో జేయజాలడుగదా! నరుని హృదయము లౌకికవాంఛలను దావానలమున బడి దగ్ధమైనవెనుక ఉత్తమోపాయముల ప్రభావముచే నెక్కుడుమార్పునొందవలయునన సాధ్యముకాదు.

201. రాతిముక్కలో నీరు ఇంకజాలనిరీతిని ధర్మబోధలు సంసారబద్ధుని మనసున కెక్కజాలవు.—అందెట్టి మార్పును గల్గింపజాలవు.

202. మేకును రాతిలో గొట్టజాలము, కాని మంటిలో సులువుగ గ్రుచ్చవచ్చును. అట్లనే సాధుజనుల హితబోధ లౌకికుని మనస్సున చొరదు, కాని శ్రద్ధాభక్తులుగల ఆస్తికుని హృదయమున అతిసులభముగ నాటుకొనును.

203. మెత్తని రేగడిమట్టిపై ముద్రపడును, కాని రాతిపై బడదు. అట్లనే తత్త్వజ్ఞానము భక్తుని హృదయమున హత్తుకొనునట్లు సంసారబద్ధుని హృదయమున హత్తుకొనదు.

204. ఏ తెఱంగున నీరు ఒకవైపునుండి ప్రవేశించి రెండవవైపునుండి పోవునో అట్లు సాంసారికులకు జేయు ధర్మబోధ ఒక చెవిలోనుండి వారి మనసున ప్రవేశించి రెండవ చెవినుండి పలాయనమగును. వారి హృదయమున రవంతయు మార్పు గలుగదు.

205. లౌకికుని లక్షణమేమి? (ముంగిసను బెంచువాని) కుండలోని ముంగిస వంటివాడు లౌకికుడు. ముంగిసను మచ్చిక చేయువాడు ఎత్తైన గోడలో ఒక కుండ నుంచును. అది ముంగిసకు దాని గూడు. మఱియు, ముంగిస మెడకు ఒక త్రాటిని గట్టి దాని రెండవకొనకు బరువు నొకదానిని గట్టును. ముంగిస కుండలోనుండి వెలువడి, గోడ దిగి వచ్చి, ఇటునటు తిరుగును. కాని యేదేని భయము తోపగనే తటాలున పైకిపోయి తన కుండలో దూరి దాగుకొనును. కాని, పాపము, త్రాటి రెండవకొనను గట్టియున్న బరువు దానిని దిగలాగుచుండుటచే అది యచట చాలసేపు ఉండజాలదు. అటులనే లౌకికుడు జీవితమున నెన్నియో యాతనలను అనుభవించి, యెట్లో బుద్ధి తెచ్చుకొని, లౌకికచింతల విడిచి, భగవంతుని శరణు జొచ్చును. కాని, పాపము, దురంతమైన సంసారభారమును, వ్యసనములును వానిని నచట నిలువనీయవుకదా! అవి వానిని మఱల సంసారతాపత్రయములోనికి లాగివేయుచుండును!

206. పొలములనడుమ నుండు కాలువలలో చేపలను

బట్టుటకు వెదురువాగువులను బెట్టుదురు. వానిద్వారములనుండి తళతళలాడుచు నీరు ప్రవహించుచుండుట జూచి చిఱుచేపలు అందు మహోల్లాసముతో బ్రవేశించును. కాని యం దొక సారి ప్రవేశించినవెనుక మఱల నవి తప్పించుకొని పోజాలవు. అట్లులనే అవివేకులగువారు మాయాసంసారసుఖములచే మోహితులై సంసారమున బ్రవేశింతురు. సంసారజాలమున సులభముగా బ్రవేశింపగలరుగాని వెలువడజాలరు, పాపము! వెదురుమావులందు చేపలవలనే వీరును అందు దగుల్కొని దరి గానక బద్ధులై యుందురు.

207. సంసారబద్ధుల కెన్నడును తెలివి రాదు. ఎన్ని దుఃఖములపాలైనను, ఎన్ని యాతనల బడినను, ఎన్నిసార్లు వంచింపబడినను వారు తెలివి తెచ్చుకొనరు. ఒంటెను జూచితిరా ? దానికి ముండ్లతుప్పలనిన ఇష్టము. వాని నది మేసిన కొలదియు ముట్టెనుండి నెత్తురు కాఱుచుండును. ఐన నేమి ? వానిని దినుట మానదే! సాంసారికుడు ఎన్నియో యిడుముల గుడుచును. ఎన్నియో పాట్లు పడును. ఐన నేమి ? కొలది నాళ్లకే అన్నిటిని మఱచును. బహుశః వానిభార్య చనిపోయి యుండవచ్చును. ఇంతలోనే మఱల పెండ్లియాడునుగదా! ఒకవేళ వానిబిడ్డ చనిపోయియుండవచ్చును. అందుల కాత డేడ్చును. కాని కొలదినాళ్లు ఐనంతనే ఆ విషయమునంతయు మఱచిపోవును. బిడ్డ చనిపోవుటచే ఘోరదుఃఖము ననుభవించిన స్త్రీ మఱల నూతనవస్త్రములను ఆభరణములను దాల్చి కులుకుచున్నది! కుమార్తెకు పెండ్లిచేసి తల్లిదండ్రులు దారిద్ర్యపీడితు లగుచున్నారు. ఐన నేమి ? ఏటేటను బిడ్డలను

గనుచునేయుందురు. ఇక వ్యాజ్యెములచే ధ్వంసమగుచున్నను వానిని నడిపించుచునేయుందురు. ఉన్నబిడ్డలకు అన్నవస్త్రములు లేకున్నను ఏకేటా కానుకులు!

ఒక్కొక్కప్పుడు వీని (సంసారబద్ధుని) గతి కొండెలుకను బట్టుకొనిన పాముగతిని బోలును. అది దానిని మ్రింగను జాలదు, విడువను జాలదు. ఆతడు ఒకవేళ సంసారము అసారమనియు, అంబాళప్రపండువలె సంసారమున నంతయు తొక్కయు టెంకయునేకాని అనుభవింపదగిన గుంజు ఏమియు లేదనియు గ్రహించిన గ్రహించుగాక, సంసారమోహమును త్యజించి భగవంతునిపైక బుద్ధి మఱల్చునా? మఱల్చడే! సంసారతాపత్రయమునుండి తొలగించి వానికి సత్సాంగత్యము కలుగజేసితిమా, పరితాపహీనుడై, దిగులుచెంది, చిక్కి పోవ నారంభించును. మాలిన్యమున బుట్టి పెరుగు పురుగును గైకొని బియ్యపుగూనలో నుంచినయెడల అది యచట బ్రదుకలేక చచ్చునుగదా!

208. ఒకసారి పెరుగు తోడుపెట్టిన కుండలో పాలు పోసి యుంచుట కెవ్వరును సాహసింపరు, పాలు విఱిగిపోవునేమో యను భయము వారిని బాధించును. ఆకుండను వంటచేయుటకును వినియోగింపరు, నిప్పుమీద బెట్టిన విచ్చిపోవునేమో యని జడియుదురు. కాబట్టి అది యించుమించుగా నిరుపయోగ మన్నమాట! అట్లే అనుభవశాలియగు సద్గురు వెప్పుడును సాంసారికునకు అమూల్యమగు సద్బోధలను జేయ వెఱచును. ఏలన వానికి అపార్థములను గల్పించి నీచమగు స్వకార్యములను సమర్థించుకొన జూచుట నిశ్చయము.

కొంచెము శ్రమపడవలసిన సత్కార్యములందు గురు వాతని నియోగింపజాలడు. ఏలన తన మంచితనమునుబట్టి గురువు తనవలన ఏదియో లాభము పొందజూచుచున్నాడని యాతడు తలచినను తలపవచ్చును.

209. ప్రారబ్ధకర్మమును సంస్కారములును అడ్డుతగులు చుండుటచే నరుడు సంసారమును త్యజింపదలచినను త్యజింప జాలడు. ఒకరాజు నొకప్పుడొకయోగి తనకడ గూర్చుండి భగవద్ధ్యానము చేయుమనెను. అందులకు రాజిట్లనెను: "అయ్యా! అది అసాధ్యము. నేను మీసన్నిధి నుండవచ్చును, కాని నాభోగకాంక్ష యెచ్చటికి బోవును? నాయొద్ద నేయుండును గదా! నేనీ అడవిలో నుండినయెడల బహుశః ఇక్కడనే ఒకరాజ్య మేర్పడవచ్చును. నేను నాభోగము ననుభవింపక తీరదుగదా!"

## ప్రాపంచికుల పురాణవైరాగ్యాదులు, వారిభక్తిరీతులు

210. లౌకికులు ఐహికఫలముల నాశించి పుణ్యకార్యము లను దానధర్మములను ఎన్నిటినో చేయుదురుగాక,—ఆపదలు, దుఃఖము, దారిద్ర్యము వారిని సమీపించినంతనే ఆ పుణ్య చింత, ఆ దానపరత, అంతయు ఎగిరిపోవును. దినమంతయు "రాధాకృష్ణా! రాధాకృష్ణా!" యని పలుకు చిలుకవంటివారు లౌకికులు. ఆ చిలుకను పిల్లి పట్టుకొనినంతనే భగవన్నామ మును మఱచి యది కీచుకీచుమనును. కాబట్టి మీకు నేను జెప్పున దేమనగా, అటువంటివారికి ధర్మబోధనలను తత్త్వ

బోధనలను జేయుట నిష్ప్రయోజనము. మీ రెన్ని యుపదేశములను జేసినను లౌకికులు ఐహికచింత విడువరు.

211. ఉక్కుచుట్టలతో అమర్పబడిన దిండుపై గూర్చుండు నప్పు డది యణగును. కాని బరువు తొలగగనే ఎప్పటి యాకృతి దాల్చును. లౌకికులవిషయముకూడ నిట్టిదే. వారు పురాణశ్రవణము చేయుచున్నంతసేపు ధర్మబుద్ధితో నిండి యుందురు. కాని నిత్యకృత్యములలో ప్రవేశింపగనే ఆ ధార్మిక చింతను ఉత్తమాశయములను అన్నిటిని మఱచి యెప్పటి వలెనే నీచకార్యములకు పాల్పడుదురు. ఎప్పటి మే లప్పటికే!

212. కొలిమిలో కాలుచున్నంతసేపు ఇనుము ఎఱ్ఱనై చక్కనిప్పువలె గాన్పించును. కాని అందుండి తీసివేసిన పిమ్మట నల్లబడును. అటులనే లౌకికులు దేవాలయమునగాని, సాధుసాంగత్యమునగాని ఉన్నంతసేపు భక్తిపరవశులుగ గాన్పింతురు; కాని యా సాంగత్యము తొలగినంతనే ఆ భక్తి పారవశ్యము అడుగంటును.

213. ఈగ అసహ్యకరమైన పుండుపై వ్రాలును; మఱల దేవుని కర్పణచేయు నైవేద్యముపై వ్రాలును. అట్లే లౌకికుని మనస్సు ఒకసమయమున పారమార్థికగోష్ఠిలో రమించును. మఱుక్షణముననే కామినీకాంచనముల దగుల్కొనును. (చూ. 217, 224.)

214. ప్రాపంచికుని మనస్సు పేడకుప్పలోని పురుగువంటిది. అది యెప్పుడును పేడలోనే కాలము గడపుచు, అందే యుండ గోరును. కర్మము జాలక ఎవ్వరైనను దానిని ఆ మలినస్థలము నుండి తీసి తామరపువ్వునం దుంచినయెడల ఆ పువ్వుయొక్క

కమ్మనివాసన భరింపలేక చచ్చిపోవును. అటులనే లౌకికుడు తుచ్ఛమగు లోకవ్యవహారములను, చింతలను, వాంఛలను విడిచి నిమిషమైనను మనజాలడు.

215. భగవంతునిగూర్చి లౌకికజనుల భావన ఎట్లుండునో తెలియునా? తమలో తా మాడుకొను పసిపిల్లల ప్రలాపము లను బోలును. ఒక్కొక్కప్పుడు వారు, "దేవునితోడు!" అని ఒట్టుపెట్టుకొందురు. ఇంటిలో వారి పెద్దవాండ్రు ఒట్టుపెట్టు కొనుచుండగా చూచి వీరును దాని నేర్చుకొందురు. లేదా, విలాసపురుషు డొకడు 'షోకుగా' వేషము వేసికొని, పూల తోటలో మహాచిద్విలాసముగా ఈలలు వేయుచు, చేతికర్రను త్రిప్పుచు విహరించునపుడు అతడు ఏపూవునో పుణికి, "ఆహా! భగవంతు డెంత చక్కని పూవు సృష్టించినాడు!" అని మనసు దేనిమీదనో పెట్టుకొని పలికినట్లుండును. ఎఱ్ఱగా కాలిన యినుముపై చిలుకరింపబడిన నీటి బొట్టువలె వారిమనోభావము క్షణికము. కావున భగవంతునికోసము మీరు పరితపించ వలయును. ఆ యమృతసాగరమున నిర్భయులై దుమికి మునుగ వలయును.

## లౌకికులు: పారమార్థికసాధనలు

216. కాపువా డొకడు దినమంతయు చెఱకుతోటకు నీరు పెట్టుచుండెను. తన పని యైనపిమ్మట చూచుసరికి తోటలోనికి ఒక చుక్కయైనను నీరు ఎక్కలేదు; నీరంతయు పెద్దపెద్ద యెలుకకన్నములగుండా క్రిందికి పోయియుండెను. ధనము, కీర్తి మొదలగువానికోసము గొంతెమ్మకోరికలను అంతరంగ

ముననె పెట్టుకొని భగవంతు నారాధించు భక్తుని విషయము కూడ నిట్టిదే. నిత్యము ఆతడు ప్రార్థనలు సల్పుచున్నను ఎట్టి యభివృద్ధిని బొందకుండును. కారణ మేమన, మనసులో పెట్టుకొనిన యీవాంఛలను ఎలుకకన్నములద్వారా ఆతని భక్తిసాధనలన్నియు గంగపాలగుచున్నవి. యావజ్జీవము సాధనచేసి యాతడు తుదకు "రెడ్డి వచ్చె, మొదలాడుము" అన్నట్లు ఎప్పటివలెనే లౌకికుడై యుండును.

217. ధ్యానించుచున్నప్పుడు మనస్సు చలించుచుండుటకు కారణమేమి? ఒకప్పుడు ఈగ మిఠాయిదుకాణములో నున్న మిఠాయిమీద వ్రాలును. కాని పాకీవాడు అశుద్ధపుదట్ట తీసికొని ఆత్రోవను పోగానే మిఠాయిలను విడిచి అశుద్ధముపైని వ్రాలును. కాని తేనెటీగ యెప్పుడును పూలమీదనే వ్రాలునుగాని అశుద్ధవస్తువుల వెంట బడదు. లౌకికజనులకు ఈయీగవలె ఒకప్పుడొకప్పుడు భగవద్భక్తియను మిఠాయి యందు రుచి గలుగుచుండును, కాని యది క్షణికము. తుచ్ఛ విషయములందు వారికి గల సహజమైన రాగము వెంటనే ఐహికచింత యను అశుద్ధముమీదికి వారి మనస్సును లాగుచుండును. మహాత్ములగు పరమహంసలో, సదా ఆత్మసంయోగానందమున — భగవత్ప్రేమానందమున — ఓలలాడుచుందురు. (చూ. 213, 224.)

218. దయ్యముపట్టినవానిపై మంత్రించిన ఆవాలను జల్లి మాంత్రికులు ఉచ్చాటనచేయుదురు. కాని దయ్యము ఆవాలలోనే ప్రవేశించినయెడల వానివలన దయ్య మెటుల పోగలదు? దేనితో భగవంతుని ధ్యానింతువో అట్టి నీమనస్సే లౌకిక

వాంఛలచే కళంకితమైయున్న యెడల అట్టి క్షుద్రసాధనముతో నీధ్యానాదులను జయప్రదముగ నెట్లు సాగింపగలవు?

219. నెమ్ముకొనిన అగ్గిపుల్ల నెంత గీసినను పొగవచ్చునే కాని వెలుగదు. కాని పొడిగానున్న అగ్గిపుల్ల నెంత మెల్లగా గీసినను వెంటనే బుస్సున మండును. ఉత్తమభక్తుని హృదయమే ఈ యెండిన యగ్గిపుడక. లేశమగు భగవన్నామోచ్చారణమైనను సరియే, వానిహృదయమున భక్త్యగ్నిని ప్రజ్వలింపజేయును. కామినీకాంచనములలో మునిగితేలుచున్నవాని మనస్సో, నెమ్ముకొనిన అగ్గిపుల్లవలె ప్రబోధతేజమును పొందదు. అట్టివానికి భగవంతునిగూర్చి యెన్ని బోధలు చేసినను భక్త్యగ్ని వాని హృదయమున రగుల్కొననేరదు.

220. లౌకికునకు జ్ఞానికున్నంత తెలివియు జ్ఞానము నుండ వచ్చును, యోగి పడునంత శ్రమను కష్టమును ఆతడు పడ వచ్చును, సన్న్యాసి చేయునంత మహాత్యాగమును చేయ వచ్చును. కాని వాని శ్రమయంతయు నిరర్థకము. ఏలన, వాని శక్తిసామర్థ్యములన్నియు పెడత్రోవను నడచుచున్నవి. ఆత డెన్నిపాట్లు పడినను భగవంతునికోసము కాక, సిరిసంపదలు, ఖ్యాతి మొదలగు క్షుద్రమగు భౌతికవిషయముల కోసమే!*

* "క్షమచేఁ గాదవమాన మోర్చుట మహాసంతుష్టిచేఁ గాదు గేహమునందైన సుఖంబు మానుట తపోవ్యాసక్తిచేఁగాదు దుర్దమశీతోష్ణజయంబు కాదు హరిపై ధ్యానంబు విత్తంబుపై నమరెన్ మాకు మునీంద్రకృత్యములు లేవాసత్ఫలాభ్యున్నతుల్."
—భర్తృహరిసుభాషితము, వైరాగ్యశతకము, 6.
ఏనుగు లక్ష్మణకవి యనువాదము.

221. మకిలపట్టిన అద్దము సూర్యకిరణములను ప్రతిఫలింప జేయజాలదు. అట్లే మాయామోహితులగు మలినహృదయులును అపవిత్రహృదయులును భగవన్మహిమమును గనజాలరు. కాని నిర్మలమగు నద్దము సూర్యుని ప్రతిఫలింపజేయురీతిని పవిత్రహృదయులు భగవంతుని గనజాలుదురు. కావున పవిత్రులవు కమ్ము.

222. చట్టింపునీటితో గలిసిన పాలను గడ్డకట్టినపాలుగా మార్చుటకు చాలసేపు పట్టును, చాల శ్రమపడవలసివచ్చును. లౌకికుని మనస్సు దుష్టచింతలు, పాపపు టాలోచనలు అను మురికినీటితో గలిసి చాల పలుచబడిపోయి యుండును. దానిని పరిశుద్ధమొనర్చుకొని ఉత్తమమైన పవిత్రహృదయమునకు లక్షణమగు బలస్థైర్యములను గలుగజేసికొనుటకు వానికి చాలకాలము పట్టును, అందులకై చాల శ్రమపడవలసి యుండును.

223. ప్రశ్న: లౌకికులు భగవంతుని గాంచుటకై సర్వము నెందుచే త్యాగముచేయరు?

ఉ: నాటకరంగమునకు వచ్చిన నటుడు వెంటనే తన వేషమును తీసివేయగలడా? లౌకికులను తాము దాల్చిన పాత్రల ననుగుణముగా నటింపనిండు, కాలపరిపాకమున వారు తమ మాయావేషములను తీసి వేయుదురు.

224. పూర్తిగా సంసారబంధమున జిక్కిన నరుడు అశుద్ధమున బుట్టి అశుద్ధమున జచ్చు పురుగువంటివాడు; వానికి

మతేమియు తెలియదు. అంతటి పరమనీచమైన లోలత లేని సామాన్యసంసారి ఒకప్పుడు అశుద్ధముమీదను, ఒకప్పుడు మిఠాయిమీదను వ్రాలుచుండు ఈగవంటివాడు. ముక్తుడు మాత్రమే సదా మకరందమును గ్రోలుచు, ఇతరమును చవి చూడని తేనెటీగను బోలును. (చూ. 213, 217.)

225. లౌకికుడు మొసలివంటివాడు. ఎట్టి ఆయుధములైనను దాని చర్మము దుర్భేద్యముగదా! కడుపుపై గొట్టిననేకాని అది చావదు. అదేవిధమున లౌకికునకు నీవు ఎంత హితబోధ చేసినను వానిపై వాని కెంత వెగటు పుట్టించినను ఆతడు అంటిపెట్టుకొనిన విషయములనుండి యీవలకు లాగిననే కాని తన పరిస్థితుల నాతడు గుర్తింపజాలడు.

226. సమస్తము త్యజించి భగవంతుని పాదారవిందములను ఆశ్రయింపుడని లౌకికులను మీరు కోరినయెడల వారు మీమాటలను విందురా? వినరు. కావున ఎంతయో ఆలోచించి, అట్టివారి నాకర్షించు నిమిత్తము గౌరనితాయులు (చైతన్యనిత్యానందులు) ఒక యుపాయమును పన్నిరి. "అన్నలారా! రండు! హరినామస్మరణము చేయుడు. మీకు మంచి పాయసము లభింపగలదు; సొగసుకత్తెల కౌగిండ్ల ననుభవింపవచ్చును, రండు, రండు!" అని బోధించుచు వారికి ఎరజూపిరి. నీసు కాశపడి అనేకులు వారితో భగవన్నామసంకీర్తన మొనర్చుటకై గుమికూడెడివారు. క్రమముగా నామామృతముయొక్క రుచి మరగినంతనే వారికి నిత్యానందుని బోధలోని రహస్యార్థము బోధపడినది. భగవద్భక్తిచే బాష్పధారలు వెల్లివిరియ

దమకు గలుగు నానందపారవశ్యమే పాయసానందమనియు, భూమియే యీసొగసుకత్తెయనియు, భగవత్ప్రేమపరవశులై నేలపై బడి దొరలుటే ఆమె యాలింగనమనియు వారు గ్రహించిరి!

నావిరతో దుశ్చరితాత్ నాశాన్తో నాసమాహితః,
నాశాన్తమానసోవాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్.

—కఠోపనిషత్తు, 1-2-24.

ఎవ్వడు దుర్మార్గమును వీడడో, ఎవ్వడు ఇంద్రియములను నిగ్రహింపడో, ఎవ్వడు ఏకాగ్రచిత్తుడు గాకుండునో, చిత్తశాంతిని బొందకుండునో, అట్టివాడు విశేషజ్ఞానముచే సహితము ఆత్మను బొందజాలడు.

ధనుర్గృహీ త్వౌపనిషదం మహాస్త్రం
శరం హ్యుపాసా నిశితం సన్ధయీత,
ఆయమ్య తద్భావగతేన చేతసా
లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి.

—ముండకోపనిషత్తు, 2-2-3.

ఓసౌమ్యుడా! (ఓంకారమున నెలకొనియున్న) ఉపనిషద్విజ్ఞానరూపమగు వింటిని చేపూని, ఉపాసనచే వాడియైన (ఆత్మరూపమగు) బాణమును సంధించి, బ్రహ్మభావమున లయించిన మనస్సుచే లాగి, ఆయక్షర (పరబ్రహ్మ) స్వరూపమను లక్ష్యమును భేదింపుము. (బ్రహ్మమును తెలిసికొనుము.)

యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం
మనః సహ ప్రాణైశ్చ సర్వైః,
తమేవైకం జానథ ఆత్మాన మన్యా
వాచోవిముఞ్చథామృతస్యైష సేతుః.

—ముండకోపనిషత్తు, 2-2-5.

ఎవ్వనియందు స్వర్గము, పృథివి, అంతరిక్షము, సకలప్రాణసహితమగు మనస్సును నెలకొనియున్నవో అట్టి యాత్మనుమాత్రమే తెలిసికొనుము; ఇతరమగు (వ్యర్థ) భాషణములను విడువుము. ఇదియే అమృతత్వమును బొందు మార్గము.

ఎనిమిదవ ప్రకరణము

# సాధకులలో వేర్వేఱు తరగతులు: వారి యాదర్శములు

**సాధకులలో వేర్వేఱు తరగతులు—ఉత్తమసాధకుల లక్షణములు—ఒండొరులతో సాధకుల చుట్టఱికము—సాంసారికుడగు సాధకుని యాదర్శములు**

## సాధకులలో వేర్వేఱు తరగతులు

227. లక్షలకొలదియు గాలిలో ఎగురుచుండు గాలిపటములలో ఏ యొకటి రెండు మాత్రమో దారము తెంపుకొని స్వేచ్ఛను బొందును. అటులనే వేలకొలది సాధకులలో ఏ యొకరిద్దఱో సంసారబంధమునుండి విముక్తులు కాగలరు.

228. హోమపక్షులను నొకజాతిపక్షులు కలవని చెప్పుదురు. ఆకసమున అత్యున్నతప్రదేశమున నవి నివసించును. ఆ తావున తమకుగల అమితప్రీతిచే అవి యెన్నడును భూమిపైకి రావు. అవి తమగ్రుడ్లనుగూడ ఆకసముననే పెట్టును. భూమ్యాకర్షణచేత అవి క్రిందబడునప్పుడు మార్గమధ్యమున గాలి ఒత్తిడిచే పిల్లలై తాము క్రిందబడుచున్నామని గుర్తించినంతనే నిజస్వభావముచే ప్రేరితములై పైనున్న తమ నివాసమువైపునకు ఎగిరిపోవునట. శుకదేవుడు, నారదుడు, ఏసుక్రీస్తు, శంకరాచార్యులు మున్నగు మహనీయు లీహోమపక్షులవంటివారు. పసితనముననే ఇట్టివారు ప్రాపంచిక

విషయములయెడ పరమవిరక్తులై బ్రహ్మజ్ఞానధామమున కెగసిపోవుదురు.

229. గుప్తయోగులనియు ప్రకటయోగులనియు యోగులు రెండువిధములుగా నుందురు. గుప్తయోగులు రహస్యముగా తమ సాధనలను సాగించుచు జనులదృష్టికి గాన్పింపకుందురు. ప్రకటయోగులో, దండకమండల్వాది బాహ్యచిహ్నముల నన్నిటిని ధరించి పారమార్థికవిషయములనుగూర్చి జనులతో స్వేచ్ఛగా ప్రసంగించుచుందురు.

230. మొదట పూవును తరువాత పిందెయు పుట్టుట ప్రకృతియొక్క సర్వసాధారణధర్మము. కాని కొన్నిజాతుల చెట్లందును పాదులందును మొదట పిందెలును తరువాత పూవులును గాన్పించును. అటులనే బ్రహ్మసాక్షాత్కారము పొందుటకు ముందు సామాన్యమానవు లనేకసాధనలను జేయవలసియుండ, మొదట సాక్షాత్కారమును బడసి తరువాత సాధనలను జేయువారు కలరు.

231. పేలాలు వేగించు మూకుడునుండి యెగిరి విచ్చుకొని బయటపడు గింజలు శ్రేష్ఠమైనవి. వాని కెట్టి మచ్చయు నుండదు. బాగుగా వేగి మూకుడులో నిలుచు పేలాలలో ప్రతిదానికిని కాలినమచ్చ ఏకొంచెమో ఉండకపోదు. అలాగుననే సద్భక్తులలో సంసారమును పూర్తిగా త్యజించి సంచరించువారు ఏకళంకమును లేక పరిశుద్ధులై యుందురు. ఇక సంసారముననే యుండు భక్తులలో ఉత్తమోత్తములు సహితము తమప్రవర్తనలో ఏదో రవంతమచ్చను గలిగియే యుందురు.

232. సూర్యోదయము కాకముందే చిలికిన వెన్న మేలైనది. సూర్యుడు ఉదయించినపిమ్మట చిలికిన వెన్న అంత శ్రేష్ఠమైనది కాదు. కాలాంతరమున సన్న్యాసులైన తన బాలశిష్యులతో శ్రీగురుదేవు డిట్లనుచుండెడివాడు: "మీరు ప్రాతఃకాలమున చిలికిన వెన్నవంటివారు. నాగృహస్థశిష్యులో, ప్రొద్దు ఎక్కినవెనుక చిలికిన వెన్నవంటివారు."

233. లేతవెదురును సులభముగా వంచవచ్చును, ముదిరిన వెదురును (బలాత్కారముగా) వంచబోయిన అది పరుక్కున విరుగును గాని వంగదు. పిల్లలహృదయమును భగవంతుని వైపు సులభముగా మఱల్పవచ్చును. కాని వయసు చెల్లినవారి కట్టుబాట్లు లేని మనస్సును భగవంతునివైపు త్రిప్ప ప్రయత్నించినచో, అది పట్టు తప్పిపోవుచుండును.

234. చిలుక పెద్దదై కంఠమందలి స్వరనాడులు గడసబాఱిన తరువాత దానికి సంగీతము నేర్పజాలము. చిన్నతనమున, కంఠమాల కాన్పింపకమునుపె, దానికి గీతములు నేర్పవలసియుండును. అటులనే ముసలితనమున భగవంతునిపై మనసు నిలుపనేర్చుట కష్టసాధ్యము. కాని చిన్నతనముననో, అది సుసాధ్యమగును.

235. మామిడిపండు దేవునికి అర్పణచేయవచ్చును, లేదా మఱి యెందులకైనను వినియోగింపవచ్చును; కాని కాకి దానిని ఒక్కసారి పొడిచిన జాలును, అది యెందులకును కొఱగానిదగును. అప్పు డది దేవతార్పణకా, పనికిరాదు; బ్రాహ్మణునకు దానముచేయుటకా, తగదు; మఱియు ఉత్తము లెవరైనను తినుటకును అక్కఱకురాదు. కావున బాలబాలి

కల హృదయము నిర్మలముగా నున్నప్పుడే, అనగా భోగ వాంఛలచే కళంకితముకాకమునుపే భగవంతునిసేవయందు వారిని నియమింపవలయును. ఒక్కసారి భోగవాంఛలు వారి మనసున ప్రవేశించెనా, లేదా, విషయసుఖము లను దయ్యము వారిపై తన వినాశకరచ్ఛాయల నొక్కసారి ప్రసరింపజేసెనా, వారి నిక ధర్మమార్గమున నడిపించుట దుర్ఘటము.

236. బాలుని హృదయమందలి ప్రేమ పూర్ణముగను అభిన్నముగను ఉండును. కొన్నాళ్లకు వానికి పెండ్లి కాగనే సగము హృదయమైనను భార్యకు అర్పింపబడును, ఇక బిడ్డలు పుట్టినంతనే మఱి పాతికభాగము వారికి పోవును. మిగిలిన పాతికభాగమును వాని తల్లిదండ్రులు, గౌరవమర్యాదలు, వేష భాషలు, అభిమానము మున్నగువానికై పోవును. ఇక భగ వంతునకు అర్పించుటకై వానియొద్ద ప్రేమానురాగములు మిగులనే మిగులవు. కాబట్టి బాలుడై యుండగా భిన్నము కాని వానిమనస్సును శీఘ్రముగా భగవంతునివైపు త్రిప్పిన యెడల భక్తుడై సులభముగా దైవమును గాంచగల్గును. కాని వయసుచెల్లినవా రటులచేయజాలుట బహుదుర్లభము.

237. సంసారముననే మెలగు జ్ఞానులకును సన్న్యసించు జ్ఞానులకును భేదమేమని మీరు నన్నడిగినయెడల, ఇరువురును సములని చెప్పెదను. ఇరువురకును జ్ఞానము సమానమే. కాని భోగాకర్షణల నడుమ నివసించుట ప్రమాదముతో గూడు కొనియుండుటచే సంసారియైన మను జ్ఞానికి ఏ కొలదిగనైనను భయకారణము కలదు. పొగచూరి మసి పాఱియున్న గదిలో

నీ వెంత జాగ్రత్తగా మెలగినను ఏకొంచెమో మసి యంటు కొనక తప్పదుగదా!

238. ఒకనితో శ్రీగురుదేవు డిట్లనియెను : "జీవితమందలి యుత్తమ భాగమును సంసారమున గడపి నీవు ఇప్పుడు భగవంతుని వెదకవచ్చినావు, మంచిది. భగవంతుని గాంచిన సిమ్మట సంసారివైనపక్షమున ఎట్టి శాంతిని ఆనందమును అనుభవించియుండెడివాడవో కదా!"

239. సాత్త్వికపూజ, రాజసికపూజ, తామసికపూజ— అనగా ఎట్టివి? వీనికి గల భేదమేమి?

ఏయాడంబరమును డంబమును లేకుండ మనఃపూర్వకముగా భగవంతు నారాధించువాడు సాత్త్వికారాధకుడు. మందిరాలంకారములలో విశేషశ్రద్ధ గనబఱచుచు, నృత్యగీతములనుగూర్చి పెద్ద కోలాహలముచేయుచు, హెచ్చుధనము వెచ్చించి, సమారాధనకై అట్టహాసమైన యేర్పాట్లుచేసి, దేవతాపూజార్చనలు జరుపువాడు రాజసికభక్తుడు. నోరు లేని మేకలను గొఱ్ఱెలను వందలకొలదిగా బలిపీఠమున నఱికి, మద్యమాంసములతోసహా నైవేద్యముచేసి ఒడలు తెలియకుండ చిందులు ద్రొక్కుచు, పాటలుపాడుచు, పూజలుచేయువాడు తామసికభక్తుడు.

## ఉత్తమభక్తుల లక్షణములు

240. చెకుముకిఱాయి కోట్లకొలది సంవత్సరములు నీటి యడుగున పడియున్నను తనలోని అగ్నిని కోలుపోదు. నీ చిత్తము వచ్చినప్పుడు దానిని ఉక్కుతో గొట్టుము. తళుక్కున

నిష్పరవ్వలను వెలిగ్రక్కును. దృఢవిశ్వాసముగల ఉత్తమ భక్తు డిట్టివాడు. లోకమునందలి సమస్తదోషములును ఆతని నావరించినను భగవంతునియందలి తన భక్తివిశ్వాసములను గోల్పోకుండును. భగవన్నామము చెవిని బడినంతనే మహో త్సాహపరవశుడై భక్తిపూరితు డగును.

241. ఒరపిడిరాతిపై గీయుటచే ఇత్తడికిని బంగారము నకును గల భేదము తెల్లమగునటుల హింసాదూషణ లను ఒరపిడిరాతిమూలమున కపటసాధువులకును నిజమైనసాధువు లకును గల భేదము తెలియనగును.

242. బాగుగా బరువులతో నిండిన అనేకమైన రైలు బండ్ల వరుసను ఇంజను సులభముగా లాగుకొనిపోగలదు. అటులనే భగవంతుని ప్రియసంతానమగువారు భక్తివిశ్వాస పరులై ఎన్ని కష్టనిష్ఠురములు వచ్చినను భారమనుకొనక జీవయాత్ర సాగింపగలరు. మఱియు అనేకులను అట్టివారు తమతో ధర్మమార్గమున భగవంతుని సన్నిధికి గొనిపోగలరు.

243. ఇంద్రియలోలత ఎప్పుడు నశించును? ఎవ్వడు సర్వానందములకును సమస్తసుఖములకును నిలయమో, పర మావధియో, అట్టి పరమాత్ముని ప్రాపించునపుడు ఇంద్రియ లోలత నశించును, విషయసుఖమునందలి వ్యామోహము అణగిపోవును. బ్రహ్మానందము ననుభవించువారికి ఐహిక సుఖములు రసహీనముగా — తుచ్ఛముగా—గాన్పించును. వారి నవి యాకర్షింపజాలవు.

244. మంచికలకండను ఒక్కసారి రుచిచూచినవాడు బెల్లపుదెబ్బను తిని ఆనందింపజాలడు. దివ్యమైన రాజసౌధ

ములలో నిద్రించినవాడు అసహ్యమైన గుడిసెలలో పరుండి సంతసింపజాలడు. బ్రహ్మానందమును రుచిచూచినవాడు నీచమగు నైహికసుఖములలో సంతుష్టి గనజాలడు.

245. 'రాజును జూచిన మొగమును మగని జూచిన మొత్తబుద్ధి' యనునట్లు రాజునే తనప్రియునిగా గల్గిన స్త్రీ ముష్టి వానిని జూచి మోహింపదు. భగవంతుని కృపాకటాక్షమును బడసిన నరుడు తుచ్ఛమగు నైహికభోగములకు ఆశపడడు.

246. తేలికయైన పదార్థములను పరికిస్తాలిన పొల్లును విడిచి, ఘనమై ఉపయోగపడు పదార్థములను చేట తనలో నిలుపుకొనును. ఉత్తములైనవారి స్వభావము ఇట్లుండును. (చూ. 190.)

247. ఇసుకయు పంచదారయు గలిసియున్నను చీమ యిసుకరేణువులను విడిచి పంచదారనే గైకొనును. అటులనే పరమహంసలును సాధుసత్తములును అయోగ్యమగు విషయములను విడిచి పరమార్థమును చేకొందురు.

248. మంచిప్రవాహమునందలి నీరు కొన్నిచోట్ల సుడి గుండములలో చుట్టిచుట్టి తిరుగుచున్నను వెంటనే వాని నతిక్రమించి, తిన్నగను వేగముగను ప్రవహించును. అట్లే భక్తునిహృదయము తఱచు నిరాశ, దుఃఖము, అవిశ్వాసము నను సుడులలో చిక్కుకొనుచుండును, కాని యిది కేవలము తాత్కాలికమైన వైపరీత్యము, చిరకాలము ఉండబోదు.

249. భక్తునిబల మెందున్నది? భక్తుడు భగవంతుని బిడ్డడు. భక్తిచే వెల్లివిరియు బాష్పములే వానియస్త్రములు. (చూ. 635.)

250. తామర లేచినచోట గోకినకొలదియు దురద హెచ్చు చుండును, ఎంత గోకిన అంత సుఖముగా నుండును. భగవద్గుణానుకీర్తనమున భక్తు లెన్నడును తృప్తిచెందరు.

251. భగవన్నామము చెవిని బడినంతనే ఎవ్వానికి పులకాంకురమగునో, ఎవ్వానికన్నులనుండి ఆనందబాష్పములు ప్రవహించునో—అట్టివానికి అదియే తుదిజన్మము!

252. వ్యభిచారిణియగు యువతి సాధుసత్తముని వెంటబడి వానిని లోబఱచుకొన బ్రయత్నించిన నేమగును? మామిడిపండును గట్టిగా నొక్కినయెడల టెంకయు గుంజును తప్పించుకొనిపోయి తోలుమాత్రమే చేతిలో మిగులురీతిని సాధుజనుని హృదయము భగవంతునికడకు తప్పించుకొనిపోవును, తోలుబొమ్మయగు తనువుమాత్రమే ఆ స్త్రీ చేచిక్కును.

253. పరు డెవ్వడును తన్ను జూడజాలని ఏకాంతస్థలమున నున్నను పరాత్పరుడు తనను జూచుచునే యున్నాడని గ్రహించి పాపకార్యములను ఆచరింపనివాడే నిజమైన పారమార్థికుడు. ఎవ్వ డొంటరిగ నట్టడవిలో యౌవనవతియగు సుందరి, ఇతరుల కంటబడుదునను భీతిలేని తావున, తనపై వలపుజూపినను భగవంతుడు తనను జూచుచున్నాడను భయభక్తులచే లోబడకుండునో, కామవీక్షణమునైనను ఆమెపై బఱపకుండునో, అట్టివాడు నిజమైన పారమార్థికుడు. నిర్జనప్రదేశమున నున్న యింటిలో కాసులసంచి కనబడినను ధనాశకు లోబడి దానిని ముట్టకుండునో, వాడే నిజమైన పారమార్థికుడు. కాని లోకులు ఏమనుకొందురో యనుభీతిచే, డంబముకొఱకు కర్మకలాపములను నిర్వహించువాడుగాని,

దానధర్మములను జేయువాడుగాని పారమార్థికు డనదగడు. నిశ్శబ్దముగను ఏకాంతముగను ఆచరింపబడు ధర్మమే ధర్మము. అదియే పరమార్థము. డంబము, ఆడంబరము సాగుచోట నున్నదంతయు బూటకమే.

## ఒండొరులతో సాధకుల చుట్టటికము

254. పారమార్థికు లగువారు సమస్త సంఘాచారములకును అతీతమగు జాతిలోనివారు, అదియే వారికి స్వీయమైన జాతి.

255. అనుదినము తన భర్తతో జరుపు సంభాషణలను ముచ్చటలను స్త్రీ అందటితోడను జెప్పుటకు సిగ్గుపడును. ఆ రహస్యముల నామె యెవ్వరికిని తెలుపదు, తెలుపవలయుననియు కోరదు. కర్మము చాలక అవి బయటపడెనా, ఎంతయో ఆవేదన పడును. ఐనను తన ప్రాణసఖితో మాత్రము దాపరికము ఇసుమంతయులేక సర్వమును జెప్పును; చెప్పుటకై ఆరాటపడును. ప్రాణసఖితో జెప్పుటామెకు ఆనందదాయకము. అటులనే భగవద్భక్తుడు దైవసన్నిధిని తా ననుభవించిన బ్రహ్మానందమును గూర్చి నిజమగు భక్తునికిదప్ప మఱెవ్వరికిని దెలుప నిచ్ఛగింపడు: మఱియు అట్టిభక్తునికి తన యనుభవములను దెలుపుటకై ఆత్రపడును, అయ్యది సమకూడెనా, బ్రహ్మానందపడును.

256. ఆలమందలోనికి అన్యజంతు వేదియైనను జొరబడిన యెడల ఆవులన్నియు గలిసి దానిని కుమ్మి తఱిమివేయును. కాని మఱియొక ఆవే ప్రవేశించెనా, ఆవులన్నియు దానియెడ

నెయ్యము జూపి యొకదాని నొకటి నాకుకొనును. అటులనే భక్తుడు మఱియొకనిని గలిసికొనునప్పుడు ఇరువురును మహానందమును బొంది యెడబాటున కోర్వకుందురు. కాని నాస్తికుడు తమ సంఘములోనికి వచ్చెనా, ఘృణికతో వానిని సాగనంపుదురు.

257. భగవద్భక్తుడు ఏకాంతవాసమున నిష్టపడకుండుటేల? గంజాయి త్రాగువాడు తోడివారు లేకుండ పోగ త్రాగి యానందింపజాలడు. భక్తుడు భాగవతసాంగత్యమునకు వెలియై యెచ్చటనో భగవానుని పావన నామకీర్తనముచేసి యానందింపజాలడు.

## సాంసారికుడగు సాధకుని యాదర్శములు

258. తాంత్రికుడు మృతుని ఆత్మయొక్క సాయమున దేవత నావాహనచేయునపుడు క్రొత్తశవముమీద గూర్చుండి దాపున అన్నమును కల్లును ఉంచును. ఆవాహనసమయమున ఆశవము తాత్కాలికముగా ప్రాణవంతమై ఎప్పుడైనను నోరు తెఱచినయెడల, నిర్భయుడైన ఆసాధకుడు పీనుగు నావహించిన భూతమును తృప్తిపఱుచుటకై కల్లును దాని నోట బోసి అన్నమును కూరును. ఆత డటుల చేయనియెడల ఆభూతము వాని ఆవాహనను భంగపఱుచును. అందువలన దేవత ప్రత్యక్షముకాదు. అట్లే ఈ సంసార మను శవముయొక్క ఎడదపై నివసించుచు బ్రహ్మానందమును బొందగోరెదవేని ఐహికవిషయముల గందరగోళము నణచుటకై ఆవశ్యకమగు వస్తువులను ముందుగ సంపాదించి పెట్టుకొనుము;

లేకున్న నీభక్తిసాధనల కడ్డుతగిలి సంసార తాపత్రయము నిన్ను వేధించును.

259. సంసారయాత్రకు ధనము ఆవశ్యక మనుమాట నిజమే; కాని సిరిసంపదలనుగూర్చి కాని, ఇతరైహికలాభములనుగూర్చి కాని అదేపనిగా చింతింపకుము. ప్రాప్తమగు దానితో తృప్తిపడుట శ్రేష్ఠము. ధనము కూడబెట్టవలయునని ఆందోళనపడకుము. ఎవరు తను మనఃప్రాణములను భగవానున కర్పింతురో, ఎవరు భగవద్భక్తులై భగవంతునే శరణుపొందుదురో, అట్టివారు తుచ్ఛమగు నైహికవిషయములనుగూర్చి చింతింపజాలరు. అటువంటివారి వ్యయము ఆదాయమునను సరించి సాగుచుండును. ఒకవైపున చేతిలోనికి ధనము వచ్చుచుండ, మఱియొకవైపున వ్యయమగుచుండును.

260. ఒకగృహస్థుడు : అయ్యా! ఇప్పటికంటె ఎక్కువ ధనము సంపాదించుటకు నే బ్రయత్నింపవచ్చునా?

శ్రీ గురుదేవుడు : మంచిది, వివేకముతో దానిని నీ కుటుంబయాత్రకు వినియోగించుకొనుట నీ అభిప్రాయమైన పక్షమున ప్రయత్నింపుము. కాని న్యాయ్యమార్గమున ఆర్జింపవలయునుజుమీ. ఏలన నీ ఆశయము భగవంతునిసేవకాని ధనార్జనకాదు. భగవానుని సేవకై వినియోగింపబడు ధనము నిరాక్షేపణీయము.

శిష్యుడు : అయ్యా! కుటుంబవిషయమున నా బాధ్యత యెంతవఱకు?

శ్రీ గురుదేవుడు : కుటుంబపోషణ తనంతటది జరుగుటకు వలయు సౌకర్యమును నీవు కల్పింపకుండునంతవఱకు. కాని

నీబిడ్డలు తమ్ముతాము పోషించుకొనుస్థితికి వచ్చినంతనే వారి విషయమై ఇక నీ కెట్టి బాధ్యతయు నుండదు.

261. కొందఱు గృహస్థశిష్యులకు శ్రీ గురుదేవు డిట్లుపదేశించెను: "ఇంటిని అన్నవస్త్రములను సంపాదించుకొనుటకును, దైవము నారాధించుటకును, సాధువులను భక్తులను సేవించుటకును ధనము కేవలము సాధనభూతమని భావింపుడు. కాని ధనమును కూడబెట్టరాదు. తేనెపట్టును కట్టుకొనుటకై తేనెటీగ లెంతయో శ్రమపడును. కాని మానవుడు వచ్చి దానిని హరించివేయుచున్నాడు. స్త్రీని మీరు పూర్తిగా విసర్జింపనక్కఱలేదు, కాని ఒకరిద్దఱు సంతానము కలుగగనే భార్యయు మీరును సోదరభావముతో జీవింపవలయును. (చూ. 264.)

262. ప్రశ్న : ఏనాటికానాడు భుక్తికై పాటుపడవలసిన నేను పారమార్థికసాధనలను ఎట్లు సాగింపగలను ?

ఉ. ఎవరికొఱకు నీవు పాటుపడుదువో ఆతడే నీ అక్కఱలను దీర్చును. నిన్నిలోకమునకు బంపుటకుపూర్వమే భగవంతుడు నీపోషణకై ఏర్పాటుచేసియున్నాడు. *

263. ఇల్లు, కుటుంబము, సంతానము—ఇవి అన్నియు మనకు కొలదికాలమే ఉండునవి—ఇవన్నియు అశాశ్వతములు. తాటిచెట్టే ఉండునది ; ఒకటిరెండుపండ్లు చెట్టునుండి క్రింద బడిన, మనము విచారించు టెందులకు ?

264. కామినీకాంచనత్యాగము సన్న్యాసులకు నియమింపబడియున్నది. సన్న్యాసులు స్త్రీపటము పైపు గూడ

* "యో మే గర్భగతస్యాపి వృత్తిం కల్పితవాన్ ప్రభుః."

చూడదగదు. సంబారములతోఁగూడిన ఊరుగాయయొక్క తలపే చాలును, నోరు ఊరుటకు. ఇక నట్టి రుచికరములగు పదార్థములయొక్క దర్శనముమాటయు స్పర్శనముమాటయు జెప్పనేల? (తన సన్నిధి నున్న గృహస్థశిష్యులను సంబోధించుచు) ఈకఠిననియమము మీవంటి సంసారులకోస ముద్దేశింపబడినది కాదు. ఇది కేవలము సన్న్యాసులకు ఉద్దేశింపబడిన నియమము. మీవిషయమో యనిన, మోహరాగములను విడిచి, మనస్సు భగవంతునిపై నిలిపి మీరు స్త్రీలనడుమ మెలగవచ్చును. మనస్సు అటుల రాగరహితమై భగవంతునిపై నిలుచుటకై మీ రెప్పుడెప్పుడు ఏకాంతవాసము చేయుట మేలు. అట్టి తావు స్త్రీపురుషు లుండుచోటికి చాల దూరమున నుండవలయును. బ్రహ్మజ్ఞానమునిమిత్తము పరితపించుచు మనఃపూర్వకముగా భగవంతుని ప్రార్థించుట కనువగునట్లు అయ్యది ఏకాంతస్థలమై యుండవలయును. అధికముగాకున్న, మూడుదినములైనను, అథవా, ఒక్కదినమైనను మీరచట నుండుట కనుకూలమైన తావై యుండవలయును.

మఱియు ఒకరిద్దఱు సంతానము గలిగిన తరువాత కేవల సోదరభావముతో మెలగుటయు, పారమార్థికము, ఆత్మనిగ్రహపరమునగు పరిశుద్ధ జీవనము గడుపుటకు వలయు బలమునొసగుమని సదా భగవంతుని ప్రార్థించుటయునే గృహస్థులగు మీయొక్క విధ్యుక్తమార్గము. (చూ. 261.)

265. సంసారులై యుండుడు, కాని సంసారసాగరమున మునిగిపోకుడు. సామ్యము చెప్పునట్లు కప్పను పాముముందు

నాట్యముచేయింపుడు, కాని పాము దానిని మ్రింగకుండ జూడుడు.

266. పడవ నీటిలో నుండవచ్చును, కాని నీరు పడవలో నుండరాదు. సాధకుడు సంసారములో నుండవచ్చును, కాని సంసారము వానిలో నెలకొనరాదు.

267. నీవు గృహస్థుడవై యున్నను మఱేమియు భయము లేదు—నీ మనసును మాత్రము భగవంతునిపై నిలుపుము, చాలును. ఒకచేతితో నీగృహస్థధర్మములను నిర్వర్తించుచు రెండవచేతితో పరమేశ్వరుని పాదారవిందములను బట్టు కొనుము. గృహకృత్యములు నీకు లేకుండునప్పుడు రెండు చేతులతోడను వాని పాదపద్మములను బట్టుకొని నీహృదయ మునకు అద్దుకొనుము.

268. సంసారమున నుండియు దానియందు రాగము లేకుండువానిస్థితి యెట్టిది? ఆతడు నీటిలోని తామరాకువంటి వాడు, లేదా బురదలోని చేపవంటివాడు. వీనిలో నేదియు అది నివసించుపదార్థముచే మలినముకాదు. నీరు తామరాకు నంటజాలదు; బురద, అందలి చేపయొక్క నిగనిగలాడు శరీర మును మలినము చేయజాలదు.

269. నీవు గృహస్థుడవై యున్నను, సన్యాసివై యున్నను సరియే. సదా మనసు భగవంతునిపై నిలిపి నివిహితకర్మ ములను నీవు నిర్వర్తించుచుండుము. ఎటులన, వీపుమీద రాచకురుపు గలవాడు తన మిత్రులతోడను, ఇతరులతోడను మాటలాడుచునే యుండును. తుదకు వ్యవహారములను గూడ

చక్కబెట్టుకొనుచుండును. కాని వాని మనసుమాత్రము సదా కురుపువలని సలుపుమీదనే యుండును.

270. వివేకవైరాగ్యములును వీనితోబాటు దృఢమైన భగవద్భక్తియు ఉన్నయెడల సంసారములో నున్నను బాధ లేదు.

271. విధివశమున ఈ సంసారములో నుండగా నీవు చేయవలసిన పనియేమి? సమస్తము భగవంతునికి సమర్పించి, వానికి ఆత్మార్పణముచేసికొనుము—ఇక నీకేమియు భయము ఉండదు, బాధయు నుండదు. సమస్తము అల భగవంతుని యిచ్ఛచేతనే జరుగుచున్నదని నీ వపుడు గ్రహింపగలవు.

272. గృహస్థులును భగవానుని సాక్షాత్కారమును పొందవచ్చును. జనకచక్రవర్తి యటువంటివాడు. ఆతడు రాజర్షి. కాని ఆకస్మికముగా జనకునివంటివా రగుట పొసగదు. జనకమహారాజు లోకవ్యవహార కల్లోలమునకు దూరముగా, ఏకాంతవాసముచేయుచు, భక్తిసాధనలను ఎన్నో సంవత్సరములు సాగించియుండెను. కావున గృహస్థులు అప్పుడప్పుడు ఏకాంతవాసముచేయుచు, ఒక్కొక్కసారి మూడేసిదినములైనను అటులుండుచు, భగవత్సాక్షాత్కారమును పొందునిమిత్తము సాధనలుచేయుట మిగుల శ్రేయస్కరము.

273. ఒకనాడు కొందఱు బ్రాహ్మసమాజపు బాలురు తాము జనకుని ఆదర్శము ననుసరించుచు సంగములేకుండ సంసారమున మెలగుచుంటిమని నాతో జెప్పిరి. నే నిట్లంటిని: "జన

కుడనై యున్నానని చెప్పుట సులభమే, కాని జనకునివలె వర్తించుట వేఱువిషయము. ఏవిధమైనసంగమును, మాలిన్యమును బొందకుండ, ఐహికవిషయముల నడుమ మెలగుట అతిదుర్ఘటము. ప్రారంభదశలో జనకుడు ఎట్టి కఠిన నియమముల నవలంబించెనో, తపమొనరించెనో తెలియునా? కాని మీరందఱును అట్టి కఠిననియమముల నవలంబింపుడని చెప్పను. ప్రశాంతమైన తావున ఒంటరిగా కొంతకాలము నివసింపుడని మిమ్ము కోరుచున్నాను. జ్ఞానమును భక్తిని సంపాదించుకొని మీరపుడు సంసారమున ప్రవేశింపవచ్చును. పాలు కదలకుండ ఒకచోట బెట్టినప్పుడే గట్టిపెరుగుగా తోడుకొనును. కదల్చినను, ఒకకుండలోనుండి మఱియొక కుండలోనికి మార్చినను పెరుగు చెడును. జనకుడు నిస్సంగుడు. అందువలన నాతనికి "విదేహుడు" అను పేరువచ్చినది. అతడుజీవన్ముక్తుడై మెలగెను. దేహబుద్ధిని నిర్మూలించుకొనుట మహాకష్టసాధ్యము. జనకుడు నిజముగా మహావీరుడు! ఒక చేత జ్ఞానము, రెండవచేత కర్మము నను ఖడ్గములను అవలీలగా ధరించిన ధీరుడు!"

274. సంసారమున నుండియు బ్రహ్మజ్ఞానమును బొందవచ్చునని జనకు నెల్లప్పుడు ఉదాహరణముగా జెప్పుచుందురు. కాని, మానవచరిత్రయందంతటను ఆతడొక్కడే యిందులకు ఉదాహరణము. సర్వసాధారణముగా నిట్లెన్నడును జరుగదు, జనకునిసంగతి వేఱు. కామినీ కాంచనత్యాగము చేయనిదే ఎవ్వడును బ్రహ్మజ్ఞానము పొందజాలడు; ఇదియే సర్వసాధారణ నియమము. నీవును 'జనకుడ' నని తలపకుము, ఎన్నియో శతాబ్ద

ములు గడచినవి కాని ప్రపంచములో ఇంతవఱకు మఱియొక జనకుడు పుట్టలేదు.

275. నిస్సంగుడవై సంసారమున వర్తింపగోరుదువేని ఒక సంవత్సరమో, ఆఱు నెలలో, ఒక్క నెలయో, తుదకు పట్టుమని పండ్రెండుదినములో—కొంతకాలము ఏకాంత స్థలమున మొదట భక్తిసాధన చేయవలయును. ఇట్టి యేకాంత వాస సమయమున భగవంతునిగూర్చి నిరంతర ధ్యానము చేయుచు, భక్తిని ప్రసాదింపుమని వేడుకొనవలయును. ఈ ప్రపంచములో నీవు నిదనుకొనదగినది ఇసుమంతయు లేదను భావము మననము చేయదగును. నీవు 'నావారు' అనుకొను నట్టివారు ఎప్పుడో యొకప్పుడు నిన్ను విడిచిపోవువారే యని మఱల మఱల స్మరణకు దెచ్చుకొనుచుండుము. భగవంతు డొక్కడే నీవాడు. ఆతడే నీసర్వస్వము, నీ పెన్నిధి. ఈమహా లాభమును బొందుట ఎట్టులను చింత యొక్కటియే నీకు ఉండదగినది. (మూ. 633.)

276. ధ్యానాదిసాధనలుచేయు సమయమున వానిని జూచి హేళనచేయునట్టి వారినుండియు, సాధువులను సాధుత్వమును నిరసించి వెక్కిరించువారినుండియు దూరముగా తొలగి వర్తింపుము.

277. చేతులకు ముందుగా నూనె రాచుకొని పనసపండు ఒలిచినయెడల జిగురు అంటుకొని నిన్ను బాధింపకుండును. ముందుగా పరమాత్మజ్ఞానమను రక్షను బూని పిమ్మట సిరి సంపదలమధ్యమున — సంసారవ్యామోహముల నడుమ — నీవు నివసించినను అవి నిన్నెంతమాత్రమును బాధింపజాలవు.

278. దిక్సూచీయంత్రమందలి (అయస్కాంతపు) ముల్లు ఎప్పుడును ఉత్తరదిశను జూపుచుండును. అందువలన ఓడ దారితప్పకుండ పోగల్గుచున్నది. అట్లే మానవునిహృదయము భగవంతునివైపు త్రిప్పబడియున్నంతవఱకు ఆతడు సంసార సాగరమున దారి తప్పకుండ వర్తింపగలడు.

279. దాగుడుమూతలాటయందు ఆటకాడు తల్లిని తాకిన యెడల, తెలుముకొనివచ్చువాడు వీనిని దొంగను జేయజాలడు. అట్లే మనము ఒక్కసారి భగవంతుని సాక్షాత్కారమును బొందితిమా, సంసారబంధములు ఇక మనలను బంధింపజాలవు. తల్లిని తాకిన ఆటకాడు ఇతరులు తనను తటిమి దొంగను జేయుదురను భయము లేశమును లేకుండ తన యిచ్చవచ్చినటుల తిరుగాడుచందమున ఒక్కసారి భగవంతుని పాదపద్మములను స్పృశించినవాడు ఈలోకమను క్రీడారంగమున నిర్భయుడై సంచరింపగలడు. ఆతడు సంసారతాపమునుండి వెంటనే విముక్తుడగును. ఇక వాని నేదియు బాధింపజాలదు, బంధింపజాలదు.

280. మొసలి నీటిపై ఈదులాడగోరును. కాని యది పైకి రాగానే వేటకాండ్రు దానినిచంపుటకై గుఱిపెట్టెదరు. కావున అది విధిలేక నీటియడుగుననే యుండి పైకి రాజాలకుండును. ఐనను సురక్షితముగా పైకి వచ్చుటకు అవకాశము చిక్కినప్పుడెల్ల బుస్సలుకొట్టుచు పైకి లేచి ఆనందముతో సాగరమున ఈదులాడును. ఓనరుడా! సంసారమోహమున జిక్కిన నీవును ఆనందసాగరమున ఈదులాడ వాంఛించుచున్నావు, వేదనపడుచున్నావు. కాని సంసారతాపత్రయము

నీకు అవకాశ మొసగుటలేదు. ఐనను నిరుత్సాహపడకుము. తీఱిక లభించినప్పుడెల్ల ఆర్తముతో భగవానుని వేడుకొనుము, మనఃపూర్వకముగా ప్రార్థింపుము. నీదుఃఖము లన్నిటిని వానితో జెప్పుకొనుము. సకాలమున నిన్ను ఆతడు విముక్తుని జేసి సచ్చిదానంద సాగరమున ఓలలాడజేయును.

281. మోహనిలయమగు తావునకు విధిలేక నీవు వెడల వలసివచ్చినయెడల ఎప్పుడును జగన్మాతయొక్క స్మరణమును నీతో గొనిపొమ్ము. నీమనస్సున దాగియుండు దుష్టచింతల నుండిసైతము ఆమె నిన్ను కాపాడగలదు. జగజ్జనని సమక్ష మున దుష్కార్యములును దుశ్చింతలును నిలువ సిగ్గుపడి పాఱిపోవునుజుమీ!

282. సంసారమునకును భగవంతునికిని సామాన్యమును గుదుర్చు టెట్లు? ఆవడ్రంగివాని భార్యను చూడుము! ఎన్ని విధములైన పనులను జక్కబెట్టుకొనుచున్నదో! ఱోటిలో అడుకులువేసి ఒకచేత రోకలిపూని దంపుచున్నది. రెండవ చేతితో బిడ్డకు పాలిచ్చుచు తోడ్తోడనే అడుకులను కలియ బెట్టుచున్నది. మఱియు అడుకులను కొనవచ్చిన వారితో బేరమాడుచున్నది. ఇటులామె ఇన్నిపనులను జేయుచున్నను రోకలి జారిపడి చేతిని నలుగగొట్టకుండ అతిజాగరూకతతో మెలగుచున్నది. ఈవిధముగా నీవు సంసారముచేయుము. కాని సర్వదా భగవంతుని స్మరించుచుండుము. ధర్మమార్గమునుండి యెన్నడును తొలగి వర్తింపకుము.

283. స్తంభమును బట్టుకొని, పడిపోవుదునను భయము లేకుండ దానిచుట్టును దిర్దిర తిరుగు బాలునితీరున భగవంతు

నిష్ఠ మనసు నిలిపి నీసాంసారికధర్మములను నిర్వర్తించు చుండుము. నీకెట్టి అపాయమును గలుగదు.

284. ఊరిలో యువతులు నాలుగైదుకుండలను దొంతరగా తలమీద బెట్టుకొని నీళ్లు తెచ్చుకొనునప్పుడు త్రోవలో తమ కష్టసుఖములనుగూర్చి ముచ్చటించుకొనుచు బోవుదురు. ఐనను నీటినిమాత్రము ఒకచుక్కయైనను తొణకనీయరు. ధర్మమార్గమున జీవయాత్రచేయువా డటుల వర్తింపవలయును. ఎట్టి పరిస్థితులలో నున్నను తన మనస్సుమాత్రము ధర్మ మార్గమునుండి తప్పిపోకుండ మెలకువగలిగి మెలగవలయును.

285. వ్యభిచారిణియగు స్త్రీ తనయింటిపనుల నన్నిటిని సవరించుకొనుచున్నను మనసుమాత్రము తన విటునిపై నుంచు రీతిని, ఓ సంసారీ! నీవిహితకృత్యముల నన్నిటిని నిర్వర్తించు కొనుచుండుము, కాని నీమనసును భగవానునిపై నిలుపుము.

286. భాగ్యవంతుని కుటుంబమున బిడ్డకు పాలిచ్చుదాది ఆబిడ్డను తనబిడ్డయో యనురీతిని బెంచును. ఐనను ఆబిడ్డపై తనకెట్టి హక్కును లేదని బాగుగ తెలిసికొనియే యుండును. అటులనే మీరు మీబిడ్డలకు కేవలము పోషకులనియు, ఉపచారకర్తలనియు, వారి నిజమైనతండ్రి భగవంతుడనియు, భావింపుడు. (చూ. 288.)

287. వీధిలో బిచ్చమెత్తుకొనుచు తిరుగుపాటకుడు తంబురను ఒకచేతితో మీటుచు, చిరుతలను ఒకచేతితో వాయించుచు, నోటితోగూడ పాడుచుండునుగదా ? అటులనే, ఓ సంసారీ ! చేతులతో నీ సాంసారికధర్మములను నిర్వర్తించు

కొనుచుండుము. కాని నిండుమనముతో భగన్నామగుణాను కీర్తనము చేయుచుండుము.

288. దాసి తనయజమానుని యింటినిగూర్చి 'మాయిల్లు' అని చెప్పుచుండును. ఐనను ఆయిల్లు తనది కాదనియు తన యిల్లు దూరముగా బర్ద్వానులోనో, నడియాలోనో ఉన్న పల్లెటూరిలో నున్నదనియు ఆమెకు దెలియును. ఆమె నిజముగా ఆపల్లెటూరియింటినిగుఱించి గనే తలపోయుచుండును. తనయొడిలోనున్న యజమానునిబిడ్డనుగూర్చి, "మా హరి చాల కొంటెవాడై పోయినాడు" అనియో లేక, "మా హరికి అది యిష్టము, ఇది యిష్టము" అనియో పలుకుచుండును. కాని హరి తనబిడ్డకాడని ఆమెకు బాగుగా తెలియును. ఈ దాసివలె అసంగులై మెలగుడని నాయొద్దకు వచ్చినవారితో నెల్ల చెప్పుచుందును. సక్తతలేకుండ సంసారముచేయుడని—సంసారమున నున్నను సంసారబద్ధులు కావలదని—పరంధాముడగు భగవంతునివైపు మనసు త్రిప్పుడని—వారందఱితోడను చెప్పుచుందును. భక్తినిమిత్తమై భగవానుని ప్రార్థింపుడనియు భక్తినే జీవితమునకు మూలముగా నొనర్చుకొనుడనియు వారితో బలుకుచుందును.

289. నీ (సంసార) యోగక్షేమములు నీవి కావని సదా జ్ఞప్తి నుంచుకొనుము. అవి భగవంతునివి. నీవు వాని సేవకుడవు, వాని యాజ్ఞలను పరిపాలించుటకై నీ విచటికి వచ్చియున్నావు. ఈభావన స్థిరమయ్యెనా, నరుడు తన దనుకొనదగిన బాధ్యత యేమియు నుండదు.

290. మనసు భగవానునిపై నిలిపి సంసారధర్మముల నన్నిటిని నిర్వర్తించువాడే నిజమైన వీరుడు. బలాఢ్యుడు దక్కు మతియొకడు రెండుమణుగులుబరువును తలమీద బెట్టుకొని మోయుచుండియు తన కెదురుగా నడుచుచున్న యూరేగింపు టుత్సవమును జూచి యానందించుటకై ఆగజాలడు.

291 సంసారులై యుండియు మోక్షసాధనలను సాగించువారు కోటగోడల చాటుననుండి పోరాడు యోధులవంటివారు. సంసారమును త్యజించి భగవదన్వేషణచేయు సన్న్యాసులు బహిరంగముగా యుద్ధముచేయు భటుల బోలువారు. బహిరంగముగా పోరాడుటకంటె కోటలోపలినుండి శత్రువులతో యుద్ధముచేయుట ఎక్కువ క్షేమంకరము, సుకరము.

292. బయటికి పోయి శత్రువు నెదిరించి పోరుటకు పూర్వము యోధులు బారాకులలో—బహిరంగముగ యుద్ధము చేయునపుడు గలుగు ప్రమాదములు లేని తావులందు—రణకౌశలమును నేర్చుకొందురు. అటులనే సన్న్యాసాశ్రమపు కఠిననియమములను పూనుటకు పూర్వము ఆత్మోన్నతిని గడించుటకై మీగృహస్థజీవనపు సౌకర్యములను వినియోగించుకొనుడు.

293. ఎవనిబుద్ధియు హృదయమును పూర్ణవికాసమునంది సమత్వము నొందియున్నవో వాడే నిజముగా ధన్యాత్ముడు. అట్టివా డెక్కడనున్నను, ఏపరిస్థితులలో నున్నను, ప్రశంసార్హముగా వర్తింపజాలును. ఆతడు దైవమునెడ వినిర్మల భక్తివిశ్వాసపూర్ణుడై యుండును. ఐనను పరులతో నాతని వ్యవహారములం దెట్టిలోపమును గానరాదు. లోకవ్యవహార

ములను సంగ్రహించునపుడాతడు దక్షుడు; పండిత సభలలో నాతడు విశేషవిద్యావంతుడై ప్రకాశించును; వాదములలో అద్భుత యుక్తినైపుణ్యమును బ్రదర్శించును; తల్లిదండ్రుల యెడ విధేయుడై శ్రద్ధాభక్తులను జూపును; బంధుమిత్రుల యెడ హితవర్తనుడై ప్రేమానురాగములతో మెలగును; ఇరుగుపొరుగువారియెడ దయాదాక్షిణ్యములు గలిగి పరోపకార మొనర్చుట కెప్పుడును సంసిద్ధుడై యుండును; భార్య యెడ ప్రేమపూర్ణుడై వర్తించును. ఇట్టిపురుషుడే నిజముగా సిద్ధాత్ముడు.

## సన్న్యాసాదర్శములు

294. తండ్రివలన గలుగునది మొదటి జన్మము. ఉపనయనముచే నేర్పడునది ద్వితీయజన్మము. సన్న్యాసమో, మూడవ జన్మము.

295. కామినీకాంచనములలో మునిగి తేలుచుండువాని మనశ్శక్తి విశేషము వ్యర్థమైపోవును. సన్న్యసించిననేకాని ఆ నష్టమును దీర్చుకొన శక్యముకాదు.

296. సన్న్యాసాశ్రమము నెట్టివాడు స్వీకరింపదగును? ఎవ్వడు మఱునాడు తా నేమి తిందునో, ఏమి ధరింతునో యనుచింత లేశమును లేక ప్రాపంచికవిషయములను పూర్తిగ విడిచిపెట్టునో అట్టివాడే నిజముగా సన్న్యాసమును స్వీకరింపనర్హుడు. ఎత్తైన చెట్టు చివర కెక్కి తనప్రాణములకుగాని అవయవములకుగాని ఏమి యపాయము సంభవించునో యను చింత యిసుమంతయులేక, ఆవశ్యకమగుచో, అచటినుండి

నిర్భయముగా క్రిందికి దుముకువాని మనోభావమును బోలి యుండవలయును, నిజమైన సన్న్యాసియొక్క మనోభావము.

297. యోగులును సన్న్యాసులును పాములవంటివారు. పాము తనకై కలుగు నిర్మించుకొనదు, ఎలుక చేసికొనిన కలుగులో దూరి నివసించును. ఒక కలుగు వాసయోగ్యము కానిచో, మఱియొకదానిలో ప్రవేశించును. అటులనే యోగులును సన్న్యాసులును తమకై యిల్లు కట్టుకొనరు, ఇతరులయిండ్లలో కాలక్షేపము చేయుదురు—నేడు ఒకరి యిల్లు, రేపు మఱియొకరి యిల్లు.

298. వనమునకును అన్నపానీయములకును సౌకర్యము లేనితావున సాధువులు నిలువనొల్లరు. వనమనగా కాల్య కృత్యములను దీర్చుకొనుటకు తగిన నిర్జనప్రదేశము, అన్నపానీయము లనగా భిక్ష. సాధువులు భిక్షాన్నము తిని జీవింప వలసినవారు కావున అనాయాసముగా భిక్ష దొరకు తావులనే ఎన్నుకొందురు. భిక్షదొరకుట కష్టమైనను, దీర్ఘయాత్రచే అలసినను, ఎచ్చటనో ఒకచోట ఒకటిరెండుదినములు ఆగినను ఆగవచ్చును. కాని నీటి కిబ్బంది గల తావునగాని, దేహబాధ లను దీర్చుకొనుటకై నిర్జనప్రదేశములు లేనితావునగాని వారు ఎన్నడును ఆగరు. పరులు తమ్ము చూచుట కవకాశము గల తావులందు వారు దేహబాధలను దీర్చుకొన నొల్లరు. వీనిని మానవనివాసములకు దూరముగా, ఏకాంతస్థలమున దీర్చుకొందురు.

299. తెల్లని బట్టపై నల్లనిమచ్చ నలుసంత పడినను ఎంతో అసహ్యముగ గాన్పించును. అట్లే సాధువుయొక్క

నడవడియందు ఏమాత్రపు లోపమున్నను—దోషమున్నను—ముఖ్యముగా గనబడి బాధకరమగును.

300. సన్న్యాసియగువాడు తానెంత విరక్తుడై ఇంద్రియ నిగ్రహము గలిగియున్నను లోకమునకు మార్గదర్శకుడై యుండుటకై కామినీకాంచనములను పూర్తిగా విసర్జింపవలయును. ఏలన సన్న్యాసియొక్క అఖండవైరాగ్యమును గాంచి నప్పుడే లోకులకు తామును అసక్తత నలవరచుకొనగలమను ధైర్యము గలుగును. లేనియెడల వారు కామకాంచనములను విడుచుటకు ప్రయత్నింపనే ప్రయత్నింపరు. సన్న్యాసి కానిచో లోకులకు మఱెవ్వరు త్యాగవైరాగ్యతత్త్వమును దెలుపుటకు సమర్థులు ?

301. నిజమైన సన్న్యాసియొక్కగాని, త్యాగియొక్క గాని లక్షణమేమి ? కామినీకాంచనములతో లేశమును సంబంధము లేకుండుటయే. త్యాగి కానిమ్ము, సన్న్యాసి కానిమ్ము, కాంచన వ్యామోహము అణుమాత్రమున్నను, కలనైనను స్ఖలనపీడితుడైనను, వాని పారమార్థిక సాధనలన్నియు గంగపాలగును.

302. సన్న్యాసచిహ్నమగు కాషాయవస్త్రమును ధరించినవాడు నిజముగ సన్న్యాసివలెనే మెలగవలయును. నాటకములో రాజువేషము వేసినవాడు సరిగా రాజువలెను, మంత్రి వేషము వేసినవాడు సరిగా మంత్రివలెను నటించుట మీరు చూడలేదా? ఒకప్పు డొక పగటివేసకాడు సన్న్యాసి వేషము వేసికొని ఊరిలో జమీందారు నింటికి వచ్చెను. జమీందారు వానికి గొంత ధనమును బహుమాన మీయబోయినాడు. కాని యతడు దానిని స్వీకరించుటకు నిరాకరించి వెడలిపోయినాడు.

కొంతసేపటికి ఆతడు తన వేషమును తీసివేసి, బూడిదెను కడుగుకొని మఱల వచ్చి జమీందారును ఆత డీయదలచిన డబ్బు ఇమ్మని వేడుకొనెను. ఆతడు సన్న్యాసివేషముతో నుండగా ధనమును తాకుటకూడ వానికి తగనిపనియని తోచినది. కాని తరువాత పావులాడబ్బు లిచ్చినను సంతుష్టుడై స్వీకరించుటకు సిద్ధపడినాడు.

303. ఒక మనుష్యుడు జబ్బుగానున్న తనబిడ్డను ఎత్తుకొని, ఔషధమునిమిత్తము ఒకసాధువును దర్శించెను. మఱునాడు రమ్మని సాధువు వానితో జెప్పెను. మఱునా డతడు రాగా సాధువు ఇట్లు పలికెను : "బిడ్డకు మిఠాయిలు పెట్టకు, త్వరలోనే నిమ్మళించును." అందుల కామనుజుడు, "అయ్యా! ఈ మాట నాకు నిన్ననే చెప్పలేక పోయితిరా?" అనగా సాధువు ఇట్లనెను. "ఔను, చెప్పెడివాడనే; కాని నిన్న నా యెదుటనే చక్కెర యుండెను. అది చూచి నీబిడ్డడు, 'ఈ సాధువు తాను పంచదార మెక్కుచు, ఇతరులను తిన వద్దనును. దొడ్డసాధువే!' అని తలచియుండును."

304. తల్లితోడనో, తండ్రితోడనో, లేక భార్యతోడనో, తగవులాడి సన్న్యసించువానిని "ఆతురసన్న్యాసి" యన వచ్చును. వాని వైరాగ్యము పురాణవైరాగ్యమువంటిది, క్షణికము. ఏ ధనికునియింటనో మంచి డబ్బు సంపాదించు కొను పని దొరకినయెడల ఆ వైరాగ్యము ఎగిరిపోవును, ఆసన్న్యాసము అంతరించును.

305. ఒక శిష్యుడు : నిజమైన సాధువును గుర్తించు టెట్లు?

శ్రీగురుదేవుడు : ఎవని హృదయమును ఆత్మయు పూర్తిగ భగవదర్పితములైయుండునో ఆతడు నిజమైన సాధువు. కామినీ కాంచనములను త్యజించినవాడే నిజమైన సాధువు. ఆతడు స్త్రీని లౌకికదృష్టితో—మోహదృష్టితో—జూడడు. స్త్రీ కాతడు దూరముగానుండును. ఒకవేళ తన సమీపమునకు వచ్చుట తటస్థించినయెడల ఆమెను తన తల్లిగా భావించి గౌరవముచేయును. నిజమైన సాధువు నిరంతరము దైవచింతన చేయుచుండును. సర్వమునందును దైవముకలడని గ్రహించి సర్వభూతములను అర్చించును. నిజమైనసాధువుల కివి సామాన్యలక్షణములు.

306. వైద్యముచేయు సన్న్యాసిని నమ్మకుడు. అశ్లీ మంత్రోచ్చాటనములను సాగించుచు, కానుకలను స్వీకరించుచు, విశేషమైన బాహ్యచిహ్నములచే తమ సాధుత్వమును బ్రకటించుచుండెడు సన్న్యాసులను నమ్మకుడు.

307. క్షమయే సన్న్యాసికి నిజమైన లక్షణము.

తొమ్మిదవ ప్రకరణము

# పారమార్థిక జీవనమునకు కొన్ని సదుపాయములు

జాతిధర్మములు : ఆచారములు—విగ్రహారాధన—యాత్రలవలని ప్రయోజనము—సత్సాంగత్యము—నామస్మరణ, నామజపము

## జాతిధర్మములు : ఆచారములు

308. లోపలి భావనయు, పై రూపమును రెండును మాన్యములే, రెంటిని పాటింపుడు.

309. వరిగింజ మొలకెత్తి పెరుగుటకు అందుండు అంకురమే ప్రధానమనియు, పైనున్న ఊక అప్రధానమనియు సామాన్యముగా తలంతురు. ఐనను ఊకలేని బియ్యపుగింజను నాటినయెడల అది మొలకెత్తి మొక్కయై పంటనీయజాలదు కదా? పంట కావలసినయెడల ఊకగలిగి చెక్కుచెదరకయున్న విత్తనములనే నాటవలయును. మతధర్మములు నిలుచుటకేమి, అభివృద్ధిపొందుటకేమి, కర్మములును ఆచారములును ఆవశ్యకములైయున్నవి. అవి తత్త్వాంకురములను తమలో భద్రపఱచుకొనిన విత్తనములు. పరమార్థమును—పరతత్త్వమును—స్వానుభవముచే దెలిసికొనువఱకు ప్రతిమానవుడును కర్మములను ఆచరించుచుండవలసినదే.

310. మంచిముత్యమును గర్భమునందు దాల్చు ముత్తెపు జిప్పకు అంతగా విలువలేదు, కాని లోపలి ముత్యమును వృద్ధి

పొందించుటకై చిప్ప చాల ముఖ్యమైనది. ముత్యము చేచిక్కిన వానికి చిప్ప నిరుపయోగము కావచ్చును. అట్లే (సాధన చేసి) బ్రహ్మసాక్షాత్కారము పొందినవానికి కర్మకాండయు ఆచారములును ఆవశ్యకములు కాకపోవచ్చును.

311. ఆచారములను, విధులను విధిగా అవలంబింప వలయును. కాని ఆత్మమార్గమున ఆరూఢుడైనవాడు వాని నంతగా పాటింపనక్కఱలేదు. అపుడు మనస్సు భగవంతుని యందు లగ్నమగుటచే భగవచ్చింతన ప్రాప్తమగును.

312. పుండు మానిపోయినతర్వాత పక్కు దానంతట అదియే రాలిపోవును. కాని అంతవఱకు ఆగక పక్కును బలాత్కారముగా లాగివేసినిమా, పుండునుండి నెత్తురు కాఱ నారంభించును. బ్రహ్మసాక్షాత్కారము కలిగినవానినుండి జాతిభేదములు వానియంత నవియే వీడిపోవును; కాని పామరులై యుండియు (జనులు) అట్టి భేదములను అతిక్రమించుట తప్పు. దానివలన అనేకమైన అనర్థములు వాటిల్లును.

313. చెట్టున పక్వమై రాలినపండు మధురముగా నుండును; కాని కోసి పండవేసినకాయ అంత తియ్యగానుండదు. మఱియు శీఘ్రముగా వాడిపోవును. అరీతినే ముక్తుడై సర్వభూతము లందును గల ఏకత్వమును గాంచిన మహనీయునుండి జాతి భేదములు, కులాచారములును తమంత తామే రాలిపోవును. కాని యిట్టి దివ్యానుభవము కలుగకుండునంతవఱకు ఇతరు లందలి యెక్కువతక్కువలను లక్షింపకుండు టెవ్వరికిని సాధ్యముకాదు. అట్టివా రెల్లరును జాతిభేదాదులను పాటింప వలయును. అజ్ఞానస్థితిలోనే కులాచారములను జాతిభేదము

లను అన్నిటిని త్రోసిరాజని విచ్చలవిడిగ సంచరించుచు సిద్ధత్వమును పొందినటుల నటించునేని, అట్టివాడు కృత్రిమముగా పండవేసిన లేతకాయవలె చెడును.

314. బ్రహ్మజ్ఞానమును పొందినవాడింకను జందెము నుంచుకొనుట యుక్తమా? బ్రహ్మజ్ఞానమును బొందినంతనే సమస్త బంధములును తమంతతామే తెగిపోవును. అప్పుడు వీడు శూద్రుడనియు, వీడు బ్రాహ్మణుడనియు, వీడు అగ్రజాతి వాడనియు, వీడు కడజాతివాడనియు తారతమ్యము లుండ జాలవు. అప్పుడు జందెము తనంతట అదే రాలిపోవును. కాని భేదములును తారతమ్యములును స్ఫురించుచున్నంతవఱకు బలాత్కారముగా వానిని పరిత్యజింపదగదు.

315. తుపాను చెలరేగునప్పుడు మఱ్ఱిచెట్టేదియో, రావి చెట్టేదియో గుర్తింపజాలము. అట్లె బ్రహ్మజ్ఞానఝంఝూమారుతము వీచునప్పుడు జాతిభేదము లుండజాలవు.

316. భగవద్భక్తిరసామృతమును తనివితీర గ్రోలిన యుత్తమభక్తుడు మధుపానమత్తునివంటివాడు. ఆస్థితిలో ఆతడు ఉచితానుచితములను పాటింపజాలడు.

317. కృష్ణకిశోరుడు ఒకప్పుడు, "జందెమును మీరు ఎందుకు తీసివేసితిరి?" అని నన్నడిగెను.* నాలో ఈమార్పు కలుగగనే అశ్వినీ ఝంఝూమారుతము † వీచుటచేతనో యనునట్లు సర్వము ఎగిరిపోయినది. పూర్వపు పొలిమేర లన్నియు తుడిచిపెట్టుకొనిపోయినవి. నాకపుడు బాహ్య

* బ్రహ్మసాక్షాత్కారముచే.

† 1864-వ సం॥న వంగదేశమున సంభవించిన గొప్ప తుపాను.

స్ఫురణయే లేదయ్యె. ఇక యజ్ఞోపవీతముగాని, ఒడలిమీది బట్టనుగాని సంరక్షించుకొనుమాట చెప్పెడిదేమి? తీవ్రమగు బ్రహ్మభావనయందు మునిగి బాహ్యస్మృతిలేక దినమున చాల భాగము దిగంబరుడనై యుంటినన్న సంగతియే నాకపుడు తెలియకుండెడిది. జందెము తీసివేసితివేమని కృష్ణకిశోరుడు నన్నాక్షేపించినప్పుడు నేనిటులని యూరకుంటిని: "భగవదున్మాదము నిన్నావేశించినప్పుడు నీకీవిషయము తెలియగలదు లెమ్ము."

318. భగవన్నామ ముచ్చరించువారే పావనులు. కృష్ణకిశోరుడు అరియాధగ్రామమందలి పుణ్యాత్ముడు. ఆయన యొకప్పుడు బృందావనమునకు తీర్థయాత్రకు వెడలెను. యాత్రలో ఒకనాడు దాహపీడితుడై ఆయన యొక నూతిదాపున నిలుచుండిన యొకని గాంచి, తనకు గంచెము నీళ్లు తోడిపెట్టుమని యడిగెను. అందుల కాతడు తాను కడజాతి వాడననియు, బ్రాహ్మణునకు నీరు తోడిపెట్టుటకు తగననియు జెప్పెను. అది విని కృష్ణకిశోరుడు ఇట్లు పలికెను: "ఒకసారి భగవన్నామోచ్చారణచేసి పావనుడవు కమ్ము." ఆత డంత భగవన్నామము నుచ్చరించి నీరు తోడిపెట్టెను. ఆయన ఎంతయో సదాచార సంపన్నుడగు బ్రాహ్మణుడయ్యును ఆనీరు త్రాగెను. ఆయన విశ్వాస మెంతగొప్పదో!

319. త్రాగినవాడు తన చొక్కాను దీసి యొకప్పుడు తన నెత్తిమీద బెట్టుకొనును, మఱియొకప్పుడు కాళ్లకు దొడుగుకొనును. భగవన్నామసుధను గ్రోలుటచే మత్తిలిన వాడును బాహ్యస్పృహలేనివానివలెనే వర్తించును.

320. ఈకాలప్రజనులు ప్రతివిషయమందలి సారమును తెలియగోరుదురు. మతధర్మములందును వారికి సారమే కావలయునుగాని అముఖ్యమగునవి (కర్మకలాపములు, వాదములు, మతములు) వారి కక్కఱలేదు.

321. చేపలను దినువారు నిరుపయోగములగు తలను తోకను విడిచిపెట్టి నడుమనున్న మెత్తనిభాగమును మాత్రమే తినగోరుదురు. అటులనే మనధర్మశాస్త్రములందలి విధులలో కాలక్రమమున వచ్చిపడినవాని కన్నిటికిని స్వస్తిచెప్పి, ధర్మశాస్త్రములను ప్రస్తుతకాలమునకు అక్కఱకు వచ్చునట్లు ఒనరింపవలయును.

## విగ్రహారాధన

322. మేడ కట్టుచుండుకాలమున పరంజా చాల ఆవశ్యకము, కాని కట్టడపుపని ముగిసినవెనుక పరంజాతో ఎవ్వరికిని పనియుండదు. అటులనే విగ్రహారాధన ప్రారంభమున ఆవశ్యకమేకాని సాక్షాత్కారమైన వెనుక అనావశ్యకము.

323. చక్కని చిన్న అక్షరములను వ్రాయనేర్చుటకు పూర్వము వంకరటింకరగా పెద్దపెద్ద అక్షరములను వ్రాయుని దస్తూరీ అలవరుచుకొనువానిచందమున మొట్టమొదట విగ్రహముమీద మనసు నిలిపి చిత్తైకాగ్రతను సంపాదించుకొనవలయును. చిత్తైకాగ్రతను సంపాదించినపిమ్మట పరాకార బ్రహ్మముపైని సులభముగా మనసు నిలుపగలుగుదుము.

324. విలుకాడుగాని, సైనికుడుగాని మొట్టమొదట పెద్ద వస్తువులను గుఱిచూచి కొట్టనేర్చును; అందు నేర్పఱితనము

సంపాదించినకొలదియు చిన్నచిన్నవస్తువులను సులభముగా గొట్టగలుగును. అటులనే సాకారములగు విగ్రహములపై మనసు లగ్నముచేయుట నేర్చినపిమ్మట నిరాకార బ్రహ్మముపై సులభముగా మనసు నిలుపగల్గుదుము.

325. లక్కపండును లక్కయేనుగును, నిజమైనపండును నిజమగు నేనుగును తలపునకు దెచ్చువిధమున విగ్రహములు వాని నర్చించువానికి నిరాకారమై, నిత్యమై, వెలుంగు బ్రహ్మమును తలంపునకు దెచ్చును.

326. శ్రీగురుదేవు డొకప్పు డొకశిష్యున కిట్లు తెల్పెను: "మట్టివిగ్రహములనుగూర్చియా, నీవు మాటలాడుచున్నావు? సాధకున కొక దశలో అవియు కావలసియున్నవి. ఆ తవికాస మున ఆయాదశలలో నున్నవారికి అనుకూలించుటకై ఈ అర్చారూపములన్నియు ఏర్పాటుపబడియున్నవి."

327. తల్లి తనబిడ్డలలో ఎవరికి తగిన ఆహారము వారికి లభించునట్లు వండిపెట్టును. ఆమెకు నలుగురైదుగురు బిడ్డ లున్నారనుకొనుడు. ఒక పెద్దచేప దొరకనయెడల దానిని వేర్వేఱురీతులుగా పచనముచేసి ఎవరికేది సరిపడునో వారి కది పెట్టును. ఒకనికి పులావు చేసిపెట్టును. జీర్ణశక్తి మందగించిన వానికి దానితో చారు గాచి పెట్టును: ఇటులనే మిగిలిన వారందఱకును వారివారి జీర్ణశక్తికి సరిపడునట్లు వండిపెట్టును. (సాధకులకు నియమింపబడిన ప్రతీకములయొక్కయు సాధనల యొక్కయు విషయముకూడ నిట్టిదే.) (చూ. 478, 647.)

328. ఒక శిష్యుడు: బ్రహ్మము సాకారమని నమ్మవచ్చును. కాని అయ్యది మనము పూజించు మృణ్మయ విగ్ర

హము (మట్టిబొమ్మ) మాత్రము కాజాలదుకదా?

శ్రీ గురుదేవుడు : మృణ్మయము అందువేల? దేవతా విగ్రహము చిన్మయముకాదా!

329. ఆకాలమున విగ్రహారాధనను తీవ్రముగా ఖండించు చుండెడి కేశవచంద్రసేనునితో శ్రీ గురుదేవు డొకప్పు డిట్లు పలికెను : "ఈ విగ్రహములు నీమనస్సులో ఎందుచే ఱాయి, గడ్డి, కట్టె అనుభావములను గల్గింపవలెను? నిత్యానంద ప్రజ్ఞానమయియగు అల జగన్మాతయే ఈ రూపము లన్నిటను వెలుగొందుచున్నదని నీ వేల గ్రహింపరాదు?"

330. తా నర్చించు దేవతావిగ్రహములు నిజముగా దివ్యరూపము లను దృఢవిశ్వాసము గలవాడు తగుకాలమున దేవుని సాక్షాత్కారము నొందును. వాని వానిని మట్టి, ఱాయి, గడ్డి అని మాత్రమే తలచెనా, అట్టి విగ్రహారాధన వలన వాని కేమియు శ్రేయము కలుగబోదు.

331. విగ్రహారాధనలో ఏమేని దోషమున్నయెడల సమస్తమైన ఆరాధనలును తననే ఉద్దేశింపబడియున్నవని భగవంతునికి దెలియదా? ఏ యారాధనయందైనను తానే ఉద్దిష్టుడనని తెలిసికొని ఆనందముతో భగవానుడు ఆ యారాధనను స్వీకరించును! భగవంతుని ప్రేమింపుము. ఇదియే నీకు అత్యంతము విహితమై, సన్నిహితమైన కర్మము.

332. భగవత్సాక్షాత్కారము పొందినవాడు ప్రతి వస్తువును—విగ్రహమును—సమస్తము—భగవత్స్వరూపములుగనే కాంచును. అట్టివానిదృష్టిలో విగ్రహము మృణ్మయముకాదు. చిన్మయము.

# తీర్థయాత్రలవలని ప్రయోజనము

333. ఆవుపాలు నిజముగా రక్తమూలమున ఆవుశరీరము నందంతటను వ్యాపించియున్నను చెవులను కొమ్ములను పిండు టచే పాలు రావుకదా? పొదుగునుండి మాత్రమే పాలు లభించును. అటులనే భగవంతుడు సర్వాంతర్యామియై యున్నను ఎల్లెడలను నీవు వానిని గనజాలవు. పూర్వపు భక్తవరులు తమ పవిత్ర జీవితముచేతను పారమార్థిక సాధనలచేతను భక్తిమయ మొనర్చిన పావన దేవాలయములందు భగవానుడు సులభముగా ప్రత్యక్షము కాగలడు.

334. బ్రహ్మసాక్షాత్కారమును గోరి అసంఖ్యాకులైన జనులు చిరకాలము జపతపములను, ధ్యానమును, ప్రార్థనలను, పూజలను సలిపిన పుణ్యస్థలములందు భగవానుడు నిశ్చయముగా వెలసియుండునని గ్రహింపుడు. వారి శ్రద్ధాభక్తులచే పారమార్థికభావము లచ్చట ఘనీభూతమైయుండునని చెప్పవచ్చును. ఇట్టి పుణ్యతీర్థములందు మానవుడు సులభముగా ఆత్మప్రబోధము నొంది భగవంతుని గనజాలును. అనాదిగా అసంఖ్యాకులగు సాధువులు, భక్తులు, జ్ఞానులును ఇట్టి పుణ్యక్షేత్రములను దర్శించి సకలవాంఛలను విడనాడి, భక్తిపూరిత హృదయముతో ఈశ్వర సాక్షాత్కారముకొఱకై నిష్ఠలు సలిపియుందురు. కావున భగవంతుడు సర్వత్ర నిండియున్నను ఈ క్షేత్రములందు ముఖ్యముగా వెలసియుండునని గ్రహింపుడు. ఎక్కడ త్రవ్వినను నీరు దొరకును, కాని బావియో, కోనేటో, సరస్సో ఉన్నతావున త్రవ్వవలసిన పనిలేకయే,

కావలయు నన్నప్పుడెల్ల సిద్ధముగా జలము లభించునుగదా!

335. ఆవులు కడుపార మేసి నెమ్మదిగా ఒకచోట పరుండి నెమరు వేయును. అటులనే నీవొక పుణ్యక్షేత్రమును దర్శించినపిమ్మట, అచట నీమనస్సున నుదయించిన పవిత్రభావములను గైకొని, యేకాంతస్థలమున గూర్చుండి వానిలో నీవు నిమగ్నుడవగువఱకును మననము చేయవలయును. ఆ క్షేత్రములనుండి మఱలగనే విషయభోగములకు దాసుడవై ఆ యుత్తమభావముల నన్నిటిని బోగొట్టుకొనరాదు.

336. ప్రపంచమున నలుదిశలందును యాత్రలు చేయుదువు గాక, నీ కెచ్చటను పరమార్థము చేచిక్కదు. ఉన్నదంతయు ఇచ్చటనే (అనగా హృదయముననే) కలదు.

337. శిష్యు లనేకులు తీర్థయాత్రలుచేయుటకై శ్రీగురుదేవునికి తమ యిచ్ఛను నివేదించువారు, అందులకు గురుదేవు డిట్లు వచించువాడు : "మంచిది. ఇచట (అనగా గురుసన్నిధిని, లేక స్వయముగా తనయందే) పరమార్థమును గన్నవానికి అచటకు (అనగా పుణ్యతీర్థములందును) గలదు. ఇచట గాంచనివానికో, అచటను లేదు," లేదా, "హృదయముననే భగవద్భావన గలవానికి అయ్యది పుణ్యక్షేత్రములందు మఱింత వృద్ధియగును, దృఢమగును. కాని హృదయమున భక్తి లేనివానికి తీర్థయాత్రలవలన నేమి ప్రయోజనము? ఫలానివారి కుమారుడు ఇల్లు విడిచి పాఱిపోయి కాశికో, మఱి యెచ్చటికో వెడలినాడని విందుము. కాని తరువాత చాల శ్రమపడి అక్కడ ఏదియో ఉద్యోగము సంపాదించి కొంత ధనమును బంపుచు తన యోగక్షేమములను కుటుంబ

మునకు తెలియబఱిచెననియు వినుచుందుము. జనులు పుణ్య క్షేత్రములలో నివసించుటకై వెడలుచుందురు, కాని వారిలో ననేకులు అక్కడ ఏ దుకాణమో పెట్టుకొని వర్తకముచేయ నారంభింతురు. మథురనాథునితో నేను పశ్చిమప్రాంతములకు వెడలినపుడు అచ్చటి పరిసరములు సరిగా ఇచ్చటివానివలెనే ఉండెనని పొడకట్టెను. ఆ మామిడిచెట్లు, ఆ చింతచెట్లు, ఆ వెదురుడొంకలు—అన్నియు సరిగా ఈ ప్రాంతమునందలి వానివలెనే ఉండెను. నాకేమియు భేదము కనబడలేదు. అందుచే హృదయునితో నిట్లంటిని: "మంచిది, నీ విచ్చటికి ఏమి చూచి యానందింపవచ్చినావు? సరిగా అక్కడనున్న వస్తువులే ఇక్కడను ఉన్నవి; కాకున్న, ఈ ప్రాంతమందలి జనులకు జీర్ణశక్తి కొంచెము హెచ్చు. ఇది యొక్కటియే తేడా." (చూ. 739.)

## సత్సాంగత్యమువలని లాభములు

338. నీటికిని పాలకును చేరిక కల్గించినయెడల రెండును కలిసిపోవును. పాలను ఇక వేఱుచేయజాలము. అటులనే ఆత్మ శ్రేయమునకై పాటుపడు సాధకుడు అద్దమైనవారితోడను స్నేహముచేయుచున్నయెడల తనలక్ష్యమును గోల్పోవుటయే గాక, పూర్వపు శ్రద్ధాభక్తులను ఉత్సాహమునుగూడ పోగొట్టు కొనును. తనకు తెలియకుండగనే అవి చల్లగా సమసిపోవును.

339. సత్సాంగత్యము ఆత్మవికాసమునకు ముఖ్యాంగము.

340. ఎండు కట్టెలను చిదుగులను ప్రోగుచేసి కష్టపడి యెవ్వడైనను మంటచేసినయెడల దానిసెగను అనేకులు చలి

దీర్చుకొందురు. అట్లే తీవ్రజపతపముల నొనర్చి ఈశ్వర సాక్షాత్కారము బడసిన మహనీయుల సాంగత్యము చేయుట చేతను వారి సదుపదేశముల ననుసరించుటచేతను అనేకులు తమ మనస్సును భగవంతునిపై లగ్నముచేసికొందురు.

341. వకీలు కాన్పింపగనే వ్యాజ్యెములును కోర్టులును తలపునకు వచ్చును. అటులనే సద్భక్తులు గాన్పించునపుడు భగవంతుడును ఆముష్మికమును తలపునకు వచ్చును. (చూ. 599.)

342. జీవితమును ఎటుల గడపవలయును? కుంపటిలోని నిప్పు ఆరిపోకుండ అపుడపుడు కదల్చి ప్రజ్వలింపజేయునటుల సాధుసాంగత్యముచే మనస్సును అపుడపుడు ఉజ్జీవింపజేయు చుండవలయును.

343. కమ్మరి తనకొలిమిలోని నిప్పును తిత్తులతో ఊది ప్రజ్వలింపజేయుచుండును. ఆ రీతిగనే సాధుసంగమువలన మనస్సునునిర్మలముగను ప్రకాశవంతముగను ఉంచవలయును.

344. సాధుసంగము బియ్యపుగడుగువంటిది. కల్లు త్రాగుటచే గలుగు మైకమును బోగొట్టుశక్తి బియ్యపుగడుగునకు గలదు. అలాగుననే విషయలోలురగు పామరులకు ఆలోలతను మత్తతను దొలగించు శక్తి సాధుసాంగత్యమునకు గలదు.

345. జమీందారునియొక్క ప్రతినిధి శిస్తులను వసూలు చేయుటకై పల్లెలకు బోయినప్పుడు రైతులను బహువిధములుగా పీడించును. ఆతడే తిరిగి వచ్చి యజమానుని సమక్షమున నున్నప్పుడో, తన ధోరణిని మార్చుకొని, అమిత యోగ్యుడై రైతులను దయతో జూచుచు, వారి కష్టనిష్ఠుర

ములను బాగుగా విచారించి యందఱకును నిష్పక్షపాతముగా న్యాయమును జరుప యత్నించును. రైతులను పీడించు నీ గుమాస్తా యజమానుని భయమువలనను, వాని సమక్షమం దుండుటవలనను యోగ్యుడై వర్తించుచున్నాడు. అటులనే సాధుజనుల సహవాసము దుర్మార్గులకు సహా భయభక్తులను గల్గించి వారిని సన్మార్గులనుగ జేయును.

346. తడిసినకట్టెలైనను నిప్పుసెగను బెట్టినయెడల త్వరగ లోనే యెండి బాగుగా మండును. అటులనే సాధుసంగము లౌకికుల హృదయమందలి లోభమోహము లను తేమను హరించును. అంతట వివేకాగ్ని వారియందు రగుల్కొని ప్రకాశింపగలదు.

347. జగజ్జననియగు ఉమ హిమవంతుని పుత్రికయై అవ తరించినపుడు ఆ సర్వశక్తిమయి తన దివ్యరూపముల ననేకము చూపి యాతని ధన్యునొనర్చెనని పురాణములలో విందుము. కాని గిరిరాజు వేదవాచ్యమగు బ్రహ్మమును జూపుమని కోరగా ఆమె యిట్లు పల్కెను: "నాయనా! బ్రహ్మమును జూడదలతు వేని సర్వసంగపరిత్యాగము చేసిన సాధువుల సాంగత్యము చేయ వలయునుజుమీ!"

348. ఏనుగుశరీరమును శుభ్రముగ తోమి కడిగి పిమ్మట దానిని యథేచ్ఛముగా విడిచిపెట్టినయెడల వెంటనే శరీరము మలినము చేసికొనును; కాని దానిని చావడిలోనికి దీసికొని పోయి కట్టివేసినయెడల శుభ్రముగా నుండును. అటులనే సత్సాంగత్యముయొక్క ప్రభావమువలన నీవు చిత్తశుద్ధిని బడసి తదుపరి పామరజనులతో యథేచ్ఛముగా సంచరించితి

వేని, ఆ చిత్తశుద్ధిని త్వరలోనే పోగొట్టుకొందువు. అటులగాక నీమనస్సును భగవంతునిపై స్థిరముగా నిలిపితివా, ఇక నెన్నటికిని మనోమాలిన్యము పొందకుందువు.

## నామస్మరణ

349. భోగములందు మోహముగలవారు ద్వైతభావము నవలంబించి నారదపాంచరాత్రమున జెప్పబడినరీతిని బిగ్గఱగా భగవన్నామ సంకీర్తనచేయుటయే ఉత్తమమైన సాధన.

350. శ్రీగురుదేవు డొకశిష్యున కిట్లు బోధించెను: "భక్తిమార్గమున సులభముగా ఇంద్రియనిగ్రహము లభించును. మానసమున భగవద్భక్తి వృద్ధిపొందినకొలదియు విషయభోగములు రసహీనముగా గాన్పించుచుండును. తమ బిడ్డ చనిపోయినదినమున ఇంద్రియసుఖములు భార్యాభర్తల నాకర్షింపజాలునా?"

శిష్యుడు: కాని భగవానునియందు నాకు భక్తి కుదురకున్నది.

గురుదేవుడు: నిరంతరము భగవన్నామమును స్మరింపుము. దానివలన సమస్తపాపములును కామక్రోధములును నిర్మూలమగును. భోగవాంఛలన్నియు అదృశ్యమైపోవును.

శిష్యుడు: కాని భగవన్నామమున నాకు రుచికలుగకున్నది.

గురుదేవుడు: కలుగనిచో, 'నీనామమున రుచి కలుగజేయు'మని పరితాపముతో భగవానుని వేడుకొనుము. నిస్సంశయముగా నీప్రార్థన నాలకించి సఫలముచేయును...'నీనామమున నాకు రుచి కలుగలేదు!'—సంధించినరోగికి పూర్తిగా

అన్నహితవు తప్పినపక్షమున ఇక వాని జీవితాశ వదలుకొనవలసినదే. అటులకాక కొంచెమైనను అన్నహితవు ఉన్నయెడల వ్యాధి కుదురునని ఆశపడవచ్చును. కావున భగవన్నామమున రుచి గనుమని—ఆనందము గనుమని—చెప్పుచున్నాను. వాని నామమును స్మరింపుము—దుర్గానామము—కృష్ణనామము—శివనామము— ఏదియైనను సరిదే. నామస్మరణమున నిత్యము ఆకర్షణయు ఆనందమును వృద్ధియగుచుండెనా, నీ కిక భయములేదు. చిత్తభ్రమ—సంసారమోహము—నివారణకావలయును, అపుడు తప్పక వాని యనుగ్రహము నీకు లభించును. (చూ. 243, 426, 438.)

351. ఏల? నామము సర్వశక్తిమంతముగదా! భగవన్నామమును భగవంతుడును వేఱుకావు. బంగారముతోడను నవరత్నఖచితమైన నగలతోడను సత్యభామ భగవానుని తూచలేకపోయినది. కాని త్రాసులో ఒకవైపున తులసీదళమును మఱియొకవైపున కృష్ణనామమును ఉంచి రుక్మిణీదేవి కృష్ణభగవానుని తూచగల్గెను!

352. నీవు నిజముగా భగవంతుని జూడగోరెదవేని హరినామస్మరణమున దృఢవిశ్వాసము బూని, నిత్యమేది, అనిత్యమేది—అను వివేకము నలవరుచుకొనవలయును. అందులకై ప్రయత్నింపుము.

353. శ్రీ చైతన్యుడు ఇట్లు పలికియున్నాడు: "భగవన్నామము అఖండశక్తిమంతము. నామస్మరణమువలన వెంటనే ఫలము గలుగకపోవచ్చును. కాని, మేడపరంజా గోడచివర నొకమూల ఎప్పుడో పడిన గింజ తుదకు నేలనంటి

మొలిచి, చెట్టై, బహుశః, మేడ బీటలువారి పడిపోయిన తర్వాత కానిమ్ము, ఫలించునుజుమీ."

354. ఎఱిగికాని, ఎఱుగకకాని, స్ఫురణయుండికాని, స్ఫురణలేక కాని—ఏస్థితిలోనైనను భగవన్నామము నుచ్చరించినయెడల దానివలన తప్పక సత్ఫలము గలుగును. బుద్ధిపూర్వకముగా ఏటికి పోయి స్నానము చేసినవానికిని స్నానలాభము గలుగును; మఱియొకనిచే నీటిలోనికి ద్రోయబడినవానికిని స్నానఫలము గలుగును; మఱియు గాఢనిద్రపోవుచుండ నెవరైనను మీద నీళ్లుపోసినను స్నానము ప్రాప్తించును.

355. ఎఱిగియో, ఎఱుగకయో, ఎటులైనను అమృతసరోవరమున బడెనేని నరుడు (అందు బడుటచేతనే) అమృతుడగును. ఐచ్ఛికముగా గాని, పరులప్రేరణచేగాని, ఏవిధముగానైనను భగవన్నామస్మరణచేయువాడు తుదకు అమృతత్వమును బొందును.

356. బ్రహ్మసాక్షాత్కారమునకు భగవన్నామమే చాలునని యొక ధర్మబోధకుడు పలుక శ్రీ గురుదేవు డిట్లు వచించెను: "నిజమే, భగవానుని దివ్యనామము అఖండశక్తిమంతము, సందియములేదు; కాని భక్తి లేనిదే అది చాలునా? భగవంతునికొఱకు పరితపింపవలయును. కామినీకాంచనములపై మనసు బెట్టుకొని భగవన్నామస్మరణ చేసినందువలన నేమి లాభము? కేవల మంత్రమువలన తేలు కాటు మానదు, ఆవుపేడయొక్క పొగనుగూడ అచట వేయవలయును. ఒక్కసారి భగవన్నామము నుచ్చరించినందువలననే నరుని సమస్తపాప

ములును హరించును, సందియములేదు. కాని వెనువెంటనే నరుడు పాపకార్యములను జేయుచున్నాడే! ఇక మఱల పాపముచేయనని ఒట్టుపెట్టుకొనుటకు వానికి మనోబలము చాలదు. గంగాస్నానము సమస్త పాపహరము. ఐననేమి? పాపములు తొలగి ఒడ్డుననున్న చెట్లపై పొంచియుండి, నరుడు స్నానముచేసి యీవలకు వచ్చినంతనే వాని బుజములపై దుముకునని చెప్పుదురు. కాబట్టి కొన్ని యడుగులదూరము నడుచుటకుముందే అవి వచ్చి వానిపై బడుచున్నవి, మఱల వాని నావేశించుచున్నవి. కావున భక్తిలాభము కలుగజేయుమని—పేరుప్రతిష్ఠలు, శరీరసుఖములు మొదలగు తుచ్ఛ క్షణిక విషయములందలి మోహము క్షీణింపజేయుమని— భగవానుని వేడుకొనుచు సదా వాని నామస్మరణ చేయుచుండుము.

**357.** కొండంత దూదిపైనను నలుసంత నిప్పు దానిపై బడినంతనే తగులబడి బూడిదై పోవురీతిని పావనభగవన్నామమును భక్తితో కీర్తించినమాత్రాన నీ పాపరాసులన్నియు పటాపంచలై పోగలవు.

**358.** లౌకికబుద్ధిగలవారి భక్తిసాధనలు కేవలము అప్పటికప్పుడుండునవి. వానివలన స్థిరమైన సంస్కారము గలుగదు. కాని భగవద్భక్తిపరాయణులగువారు ప్రతిశ్వాసముతోడను భగవన్నామము నుచ్చరింతురు. కొందఱు తమలో తాము "ఓం రామ ఓం" అని నిరంతరము స్మరణచేయుచుందురు. జ్ఞానయోగావలంబులు "సోఽహం" అని స్మరించుచుందురు. కొందఱిజిహ్వ సదా కదలుచునే యుండును. (అనగా ఏ స్తోత్ర-

మునో, మంత్రమునో ఉచ్చరించుచునే యుండును.)

**359.** ప్రశాంతమైన యొకతావున గూర్చుండి, మౌనముగా భగవన్నామమును స్మరించుచుండుటయే జపమన బడును. ఏకాగ్రచిత్తముతోడను భక్తితోడను ఎడతెగకుండ నామస్మరణము చేయుచున్నయెడల తుదకు తప్పక దివ్యదర్శనములు గలుగును—ఈశ్వరసాక్షాత్కారము లభించును. పెద్ద దూల మొకటి గంగాజలములో మునిగియున్నదనుకొనుము, దాని చివర నొక గొలుసు కట్టి ఆగొలుసు రెండవకొనను ఒడ్డున దగిలించినా రనుకొనుము. ఆగొలుసు పట్టుకొని క్రొక్కులను అనుకొనుచు పోతివేని నీవాదూలమును జేరగలుగుదువుగదా? అదేతీరున నీవు భగవానుని పావన నామస్మరణమున నిమగ్నుడవైనయెడల తుదకు వాని సాక్షాత్కారమును పొందగలుగుదువు.

**360.** శ్రీగురుదేవుడు తఱచుగా నిట్లు వచించువాడు.: "చేతులను చఱచుచు ఉదయమునను సాయంకాలమునను హరినామసంకీర్తన చేయుడు. మీపాపములును బాధలును—అన్నియు మిమ్ము విడిచి పలాయన మగును. చెట్టుక్రింద నిలువబడి చప్పట్లు గొట్టినయెడల చెట్టుమీదిపక్షు లెగిరి పోవును గదా! చప్పట్లు గొట్టుచు హరినామ సంకీర్తన చేయుదురేని మీశరీరము అను చెట్టునుండి పాపము లను పక్షులు ఎగిరిపోవును."*

---

* "హరే ర్నామ, హరే ర్నామ, హరే ర్నామైవ కేవలం,
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా."

కలియుగమున హరినామసంకీర్తనముకంటె తరణోపాయము ముమ్మాటికిని మఱియొకటి లేదనియు,

"తృణా దపి సునీచేన తరో రపి సహిష్ణునా,
అమానినా మానదేన కీర్తనీయః సదా హరిః."

గడ్డిపోచకంటె నీచుడనను భావముకలవాడవై, వృక్షముకంటె సహిష్ణుతకలవాడవై అభిమానమును త్యజించి పరులను సమ్మానించుచు సదా హరినామసంకీర్తన చేయుచుండుమనియు శ్రీచైతన్యస్వామి తఱచు బోధించువాడు.

"చేతోదర్పణమార్జనం భవమహాదావాగ్ని నిర్వాపణం
శ్రేయఃకైరవచన్ద్రికా వితరణం విద్యావధూజీవనం,
ఆనన్దామ్బుధివర్ధనం ప్రతిపదం పూర్ణామృతస్వాదనం
సర్వాత్మస్నపనం పరం విజయతే శ్రీకృష్ణసంకీర్తనమ్."

—శిక్షాష్టకము.

శ్రీకృష్ణసంకీర్తనమువలన హృదయమను నద్దము శుభ్రమై చిత్తమునందలి సమస్తకళంకములును తొలగును. మహాదావాగ్నివలె మనల నెల్లప్పుడు దహించుచున్న విషయవాసనలు నశించును. చంద్రకిరణములచే కలువలు వికసించునందమున శ్రీకృష్ణసంకీర్తనమువలన హృదయము వికసించును, అనగా ఆత్మాభ్యుదయము కలుగును.

పదియవ ప్రకరణము

# పారమార్థిక జీవన మార్గములు

**సాధనలో అవాంతరములు—సంస్కారముల ప్రభావము—సిద్ధుల వలని ప్రమాదములు—దానధర్మములు—ఆహార నియమము—వస్త్రధారణము—శరీరాభిమానము : శరీర సంరక్షణము—కష్టములం దుండవలయు మనోభావము—సహనము—మౌనము—వినయము : ఆత్మగౌరవము — నిష్కాపట్యము — వాంఛానివృత్తి — స్త్రీలయెడ నుండవలయు మనోభావము—భక్తుడు : సంసారము—ప్రార్థన : శ్రద్ధాభక్తులు**

## సాధనలో అవాంతరములు

**361.** పిఱికితనము, ద్వేషము, భయమును రాజ్యమేలు పట్ల భగవంతుడు గోచరింపడు.

**362.** తక్కెడలోని బరువైన సిబ్బి క్రిందికి బోవ, తేలికయైనది పైకిలేచును. అటులనే తాపత్రయభారముచే క్రుంగిపోవువాడు సంసారమున మునిగిపోవుచుండ, అంతటి తాపత్రయమును ఉబలాటమును లేనివాడు భగవత్పాదారవిందముల నాశ్రయించి ఉన్నతిని బొందును. (చూ. 413.)

**363.** ఇతరుల గుణావగుణములగూర్చి విమర్శించుచు కాలముగడపువాని జీవనము వ్యర్థమైపోవుచున్నది. ఏలన వానికాలము ఆత్మచింతనమునగాని, పరమాత్మచింతనమునగాని వినియోగపడుట లేదు, సరికదా, ఇతరుల మంచిచెడుగులనుగూర్చి విమర్శించుటలో వ్యర్థమైపోవుచున్నది.

364. మనస్సు ఎట్టిదశలో నున్నప్పుడు భగవత్సాక్షాత్కారము లభించును? మనస్సు ప్రశాంతముగా నున్నప్పుడు భగవంతుడు సాక్షాత్కరించును. మనస్సను సరస్సును కోరికలను గాడ్పులు కల్లోలపఱచు నెడల అందు దేవుని ప్రతిబింబము గోచరింపదు. భగవత్సాక్షాత్కారము అట్టి స్థితిలో అసంభవము (చూ. 536.)

365. కడుపు నిండియున్నను అజీర్ణవాతముచే బాధపడు చున్ననుగూడ కమ్మని పిండివంటలును ఊరుగాయలును కంటబడగానె ఎవ్వనికైనను నోరూరును. ఒకడు లేశమును లోభి కాకపోవచ్చును, పరమ పవిత్రభావములు గలిగియుండ వచ్చును; ఐనను ధనమును ఇతర కామ్యార్థములును కంట బడగానే వాని మనస్సు రెపరెపలాడునుజుమీ.

366. నూతిలోని కప్పవలె నుండకుము. నూతిలోని కప్పకు నూయియే దాని ప్రపంచము. నూతికంటె పెద్దది కాని, గొప్పదికాని మఱేమియు దానికి గోచరింపదు.* ఇటులనే అందఱును స్వమతదురభిమానులే. తమ మతముకంటెను సంప్రదాయముకంటెను ఉత్తమమైన దేదియు వారికి గోచరింపదు.

367. శంకరులయొద్ద ప్రతివిషయమునను ఆతని ననుకరించు నొక మూర్ఖశిష్యుడుండెను. శంకరులు 'శివోఽహం' అనునప్పుడెల్ల శిష్యుడును 'శివోఽహం' అనెడివాడు. వానికి బుద్ధిగఱపనెంచి శంకరు లొకనాడు, కమ్మరికొలిమి సమీపమునుండి పోవుచు, మూసలో కరగియున్న సీసమును గైకొని

* దీనినే కూపస్థమండూక న్యాయ మందురు.

త్రాగిరి, మఱియు శిష్యునిగూడ నటులే త్రాగుమని చెప్పిరి. కాని గురు వొనర్చిన యీ కార్యమును శిష్యుడు చేయజాలక పోయెను. అప్పటినుండియు ఆతడు 'శివోఽహం' అనుట మానివేసినాడు. క్షుద్రానుకరణము ఎన్నటికిని కూడని పనియే, కాని పెద్దల నడవడిని జూచి తన లోపములను దిద్దుకొనుట సదా శ్రేయస్కరము.

## సంస్కారముల ప్రభావము

368. సంస్కారముల ప్రభావము ఎంత గొప్పదో చూడుడు! ఒకచోట కొందఱు సన్న్యాసులు కూర్చుండి యుండిరి. ఆ దారిని ఒకపడుచు పోవుచుండెను. అందఱును దైవధ్యానమున నిమగ్నులై యుండిరి. ఒక్కడుమాత్రము రహస్యముగా ఆమెపై దృష్టి నిగిడ్చెను. ఇటులా స్త్రీసౌందర్యముచే ఆకర్షింపబడిన యాతడు గృహస్థుడై యుండి సన్న్యాసమున ప్రవేశించునప్పటికి ముగ్గురుబిడ్డలతండ్రియై యుండినవాడు.

369. ఒకచోట విత్తుకొట్టిన రెండెద్దులను జూచితిని. ఆవు ఒకటి ఆ త్రోవను బోవుచుండ గాంచి అం దొకయెద్దు ఉద్రేకము పొందినది. రెండవది శాంతముగ నుండెను. ఈ విచిత్రవర్తనమును గాంచి వాని పూర్వచరిత్రను విచారించితిని. మొదటిది పెద్దదై ఆవులతో మెలగినపిమ్మట దానికి విత్తుకొట్టిరట. రెండవదానికి చిన్నదూడగా నుండగనే కొట్టి నట్లు తెలియవచ్చినది. పూర్వాభ్యాసములచే గలుగు సంస్కారములబలము అంత గొప్పది. విషయసుఖములను పొందకుండ సంసారమును త్యజించిన సాధువులు స్త్రీలు కాన్పించినప్పుడు

కామోద్రేకమును బొందరు. ఇక సంసారభోగముల ననుభవించి, వయసు చెల్లినతర్వాత కాషాయమును దాల్చువారు చిరకాలము ఇంద్రియనిగ్రహ మవలంబించినను వారి పూర్వ సంస్కారములు మఱల తలయెత్తుట సంభవించుచుండును.

370. పాపప్రవృత్తులందు చరించు మనస్సును మాలపల్లె లందు వసించు కులీనబ్రాహ్మణునితో బోల్పనగును. లేదా, పెద్దనగరములలో వేశ్యలుండు తావున వసించు పెద్దమనుష్యునితో బోల్పనగును.

371. శ్రీగురుదేవునితో ఒకనాడొక పెద్దమనుష్యు డిట్లనెను: "నాకుమారుడు హరీశుడు పెద్దవాడు కాగానే వానికి పెండ్లి చేసెదను, అపుడు కుటుంబమును వానికి ఒప్పగించి, సన్న్యసించి నేను యోగాభ్యాస మారంభింతును." అందులకు శ్రీగురుదేవు డిట్లు విమర్శించి పలికెను: "ఆ పక్షమున భగవద్భక్తిసాధనచేయుటకు నీకెన్నడును అవకాశము చిక్కనే చిక్కదు. అటుపిమ్మటకూడ 'ఈ హరీశునకును ఆ గిరీశునకును నే నని ప్రాణము, నేను సన్న్యసించితినా, వారు బెంగపెట్టుకొందురు. మొదట హరీశునకు ఒక కొడుకు పుట్టనిండు, మనుమని పెండ్లికూడ చూడవలదా?' అనబోదువు. ఈవిధముగా నీ గొంతెమ్మకోరికలకు హద్దుండదు." (చూ. 544.)

## సిద్ధులవలని ప్రమాదములు

372. మహిమల బ్రకటించువారల—జాలకుల—దరిచేరకుడు. వారు బ్రహ్మపథమును వీడి తిరుగాడువారు. వారి మనస్సు యోగసిద్ధులలో దగుల్కొనియున్నది. బ్రహ్మమార్గ

మున మాయచే పన్నబడిన వలలివి. వీనిచే మోసపోక మెల కువగలిగి వర్తింపుడు, సిద్ధుల నెన్నడును వాంఛింపకుడు.

373. రోగనివారణచేయుట, వ్యాజ్యేములు గెల్చుట, నీటిపై నడచుట—మొదలగువానికై తోడ్పడు యోగసిద్ధుల కొఱకై ప్రాకులాడువారు అల్పబుద్ధులు. పరమేశ్వర చరణార విందములనుదక్క మఱి దేనిని నిజమైన భక్తులు ఆశ్రయింపరు.

374. ఒకప్పుడు శ్రీకృష్ణుడు అర్జునున కిట్లు తెల్పెను: "నీవు నన్ను పొందవలయునన్నచో నీకడ అష్టసిద్ధులలో ఏదేని ఒక్కటియైన నున్నంతవఱకు కృతార్థుడవు కాజాలవు." ఏలన సిద్ధులు మానవుని యహంకారమును పెంచి భగవంతుని మఱవజేయును.

375. ఒకడు పదునాలుగేండ్లు అడవిలో ఘోరతపస్సు చేసి తుదకు నీటిపైని నడచు సిద్ధిని సంపాదించెను. ఈసిద్ధి లభించె నని బ్రహ్మానందపరవశుడై గురుసన్నిధికి వెడలి యిట్లు పలి కెను: "గురుదేవా! గురుదేవా! నేను నీటిపై నడచు మహి మను పొందినాను!" అంతట గురువు వాని నిట్లు చీవాట్లు పెట్టెను: "ఛీ! ఛీ! పదునాలుగేండ్లు పడిన శ్రమకు ఇదియా ఫలము? నీవు సంపాదించినశక్తి కానివిలువ చేయదు. పదు నాలుగేండ్లు పాటుపడి నీవు చేయగలిగిన కార్యమును సామాన్యమానవులు పడవవాని కొక కానీ యిచ్చి చేయ గలరుసుమీ!"

376. సిద్ధులను అశుద్ధమువలె త్యజింపవలయును. పార మార్థిక సాధనలవలనను సంయమమువలనను సిద్ధులు వాని యంతట నవియే కలుగుచుండును. కాని సిద్ధులపై మనసు

నిలుపువారు వానియందు దగుల్కొని యిక పురోవృద్ధి నొంద జాలరు.

377. గుటికాసిద్ధి యనబడు అదృశ్యశక్తిని బడసిన చంద్రుడను నాత డొక డుండెను.* ఆతడు ఒక గుటికను తన యొద్ద నుంచుకొని తన యిచ్ఛవచ్చినచోటికి పోగలిగి యుండెను; ఇతరులకు అగపడకుండ ఏ తావునకైనను ప్రవేశింపగలిగియుండెను. ప్రారంభమున నాతడు భగవంతుని యందు భక్తి కలవాడై సాధనలందు నిష్ఠాపరుడై యుండెడి వాడు. ఏమైనను ఆతడు ఆశక్తిని సంపాదించినపిమ్మట క్రమముగా తన క్షుద్రభోగవాంఛలను సంతృప్తిపఱచుకొనుటకై ఆ శక్తిని వినియోగించుకొనసాగెను. నేనతనిని మందలించినను ఆతడు లక్ష్యపెట్టడయ్యెను. ఆతడు ఇతరులకు గానరాకుండ ఒక పెద్దమనుష్యుని భవనమున ప్రవేశించి అందొక యువతితో వ్యభిచరింప మొదలిడినాడు. దానిమూలమున తుదకు తనసిద్ధిని పూర్తిగా పోగొట్టుకొని పతితుడై పోయెను.

378. ఒక్కొక్కప్పుడు సిద్ధులవలన గొప్ప అనర్థములు వాటిల్లును. ఒక గొప్ప సిద్ధునిగుఱించి తోతాపురి నాతో ఇట్లు చెప్పిరి: ఆ సిద్ధుడు సముద్రతీరమున గూర్చుండి యుండగా పెద్దతుపాను చెలరేగెను. దానిచే చాలబాధపడి, ఆసిద్ధుడు, 'తుపాను ఆగిపోగాక!' అనగానే తుపాను ఆగిపోయినది. సరిగా ఆసమయముననే నిండారవిప్పిన తెరచాపలతో అతి

---

* శ్రీ రామకృష్ణునకు గురుత్వము వహించిన భైరవీ బ్రాహ్మణికి ఈ చంద్రుడు మఱియొక శిష్యుడు. శ్రీ రామకృష్ణునకు ఈతడు సుపరిచితుడు అయ్యెను.

వేగముగా సముద్రమున నౌకయోడ పోవుచుండెను. ఆక స్మికముగా గాలి నిలిచిపోవుటచే ఆతాకునకు ఓడ మునిగిపోవ, అందున్నవారందఱు సముద్రము పాలైరి! అంతమందికి ప్రాణ హాని కల్గించిన పాపము తగులుటచే ఆ సిద్ధుడు తన సిద్ధుల నన్నిటిని కోల్పోవుటయే-గాక నరకమునుగూడ పొంది పాప ఫల మనుభవింపవలసివచ్చెను.

379. నేను పంచవటిక్రింద తీవ్రసాధనలు చేయుచుండు కాలమున గిరిజుడు *అను నత డచటికి వచ్చెను. అతడు గొప్ప యోగి. ఒకసారి రాత్రి చీకటిలో నేను నాగదికి పోవలసి వచ్చెను. అంత నాతడు తన చేతిని పైకెత్త నాతని బాహు మూలమునుండి గొప్పవెలుగు బయల్వెడలి మార్గమునంతయు ప్రకాశమాన మొనర్చెను. నా హితవాక్కును విని యీ మహిమను వినియోగించుట మానివేసి యాతడు బ్రహ్మ సాక్షాత్కారమునకై మనస్సు మఱల్చుకొనెను. కొన్నాళ్ల కాతని కాశక్తి పోయినను ఆత్మోన్నతిని బడయగల్గెను.

380. యాచకుడు మహారాజాంతఃపురమునకు బోగల్గియు గుమ్మడికాయ, పుచ్చకాయవంటి క్షుద్రవస్తువుల కొఱకు యాచించునేని చాల తెలివితక్కువగా వర్తించినవా డగును. రాజరాజేశ్వరుడగు సర్వేశ్వరుని ద్వారముకడ నిలిచి, అమూల్యమైన భక్తిజ్ఞానములను విడిచి, భక్తుడు సిద్ధులకై అర్థించునేని అవివేకముగా వర్తించినవా డగును.

---

* శ్రీ రామకృష్ణునకు గురుత్వము వహించిన భైరవీబ్రాహ్మణికి ఈ గిరిజుడు మఱియొక శిష్యుడు. శ్రీ రామకృష్ణునితో నీతడు కొంతకాలము నివసించెను.

381. శ్రీ గురుదేవుని బాలశిష్యులలో నొకడు, ఇతరుల మనోభావములను ముఖము చూచినంతనే గ్రహించు శక్తి మంతు డయ్యెను. పరమానందభరితుడై యాతడు తనసిద్ధిని గూర్చి గురుదేవునితో ముచ్చటింప, గురుదేవుడు మందలించి యిట్లు వచించెను : "సిగ్గు! సిగ్గు! నాయనా! నీశక్తిసామర్థ్య ములను ఇట్టి క్షుద్రవిషయముల నిమిత్తము వ్యర్థము చేసి కొనకు."

382. ఒక శిష్యుడు దూరమున జరుగు సంగతులు తనకు ధ్యానసమయమున ప్రత్యక్షముగ గోచరించుననియు, ఆ సమ యమున గొందఱు ఏమిచేయుచుందురనదియు జూడగల్గుదు ననియు, విచారింప నవ్వియవి వాస్తవములని ఋజువగుచుండె ననియు శ్రీ గురుదేవునితో జెప్పెను. అంతట శ్రీ గురుదేవు డాతని కిట్లు తెల్పెను : "నాయనా! కొన్ని దినములవఱకును ధ్యానమును ఆపివేయుము, బ్రహ్మసాక్షాత్కారమునకు ఈ శక్తులు అడ్డుతగులును జుమీ!"

## దానధర్మములు

383. జనులకు సమారాధనలుచేయు టెందులకు? సర్వ భూతములందును వైశ్వానరరూపుడై యున్న భగవంతునకు ఆహుతి నొసగుట యనియేకదా మీయభిప్రాయము? ఐనను దేవునియందు భయభక్తులు లేని దుర్మార్గులు, వ్యభిచారులు మొదలైనవారిని అట్టి సమారాధనల కెన్నడును పిలువరాదు. వారు కూర్చుండుతావున ఎన్నియో బారల లోతువఱకును భూమి మైలపడిపోవునంతటి మహాపాపములను జేసియుందురు.

384. ఒకప్పు డొక కసాయివాడు ఒక ఆవును దూరమున నున్న గోవధశాలకు తోలుకొనిపోవుచుండెను. ఆ కసాయి వాడు దానిని క్రూరముగా గొట్టుటవలన ఆవు వానిని తిప్పలు పెట్టసాగెను. దానిని తోలుకొనిపోవుట వానికి బహుదుర్ఘట మైనది. అట్లు చాలసేపు శ్రమపడి మధ్యాహ్నమునకు ఎట్లో ఒకగ్రామము చేరుకొనెను. చాల అలసిపోయి సమీపమున నున్న యొక ధర్మసత్రమునకు వెడలి అచట నీయబడు సదావృత్తిలో పాల్గొనినాడు. తృప్తిగా తినుటచే బాగుగా తేఱుకొని సులభముగా ఆవును వధశాలకు జేర్పగలిగినాడు. ఆ గోవును హత్యచేసిన పాపములో కొంతభాగము కసాయివానికి అన్నదానముచేసిన దాతకు ప్రాప్తించినది. కాబట్టి అన్నదానాదులలోగూడ దానమును గ్రహించువాడు దానిని దుర్మార్గకృత్యములకై వినియోగించు దుష్టుడు కాడుగదా యని వివేచించి మఱి చేయుచుండవలయును.

385. విధి యిట్టిది: పూర్వజన్మమున బాగుగా దానధర్మములను జేసినవారు ఈజన్మమున భాగ్యవంతులై పుట్టు చుందురు. కాని యీ ప్రపంచము భగవంతుని మాయ. మాయ యనేక అక్రమములతో గూడుకొనియున్నది. మాయ నెవ్వరును గ్రహింపజాలరు.

## వస్త్రధారణ : ఆహారము

386. సన్న్యాసులు కాషాయవస్త్రములను ధరించుట ఎందులకు? వస్త్రధారణలో ఏమున్నది? కాషాయ వస్త్రములు మనసులో పవిత్రభావములను స్ఫురింపజేయును. అఱిగి

పోయిన చెప్పులను చినిగిపోయిన బట్టలను దాల్చినవానికి తన యొక్క దైన్యస్థితి తలపునకు వచ్చును ; నీటగుణోటులను లాగు లను విలువగల బూటులను తొడిగినప్పుడు సహజముగా నెవ్వ డైనను అహంభావముతో పొంగుచుండును. నల్లంచు సన్నని రవసెల్లా ధోవతిని గట్టినయెడల అయ్యది వానికి ఎక్కడలేని ఉల్లాసమును పురికొల్పును. అట్టివాడు శృంగార కీర్తనలను గూడ పాడుచుండును. కాషాయవస్త్రముల దాల్చుటచే సహజ ముగా మనసున పవిత్రభావములు స్ఫురించును. స్వతః వస్త్ర ధారణలో ఏవిశేషము లేకున్నను ఆయావేషములచే ఆయా భావములు గలుగుచుండును.

387. మొక్కను కంచెవేసి కాపాడవలయును. లేనియెడల మేకలును అల్లరిపిల్లలును దానిని ధ్వంసము చేయవచ్చును. కాని ఆమొక్క పెద్ద చెట్టయినపిమ్మట మేకలమందగాని ఆవుల మందగాని స్వేచ్ఛగా దాని విశాలమైన కొమ్మలనీడను విశ్ర మింపవచ్చును, దాని ఆకులను పొట్టనిండ మేయవచ్చును. (చెట్టునకు ఏమియు అపాయము ఉండదు.) అట్లే భగవంతుని యందు నీయొక్క శ్రద్ధాభక్తులు ఇంకను బీజావస్థలోనో, అంకురావస్థలోనో ఉండగా దుష్టసాంగత్యమును ఐహికచింత లును వానిని పాడుచేయకుండ సంరక్షించుకొనవలయును. కాని నీభక్తిశ్రద్ధలు దృఢపడినపిమ్మట ఏయైహికచింతగాని, ఏదుష్ప్రవృత్తిగాని నిన్ను సమీపింపవెఱచును. నీసాన్నిధ్యమే అంతటి పవిత్రమై యొప్పును. నీ సాంగత్యమహిమచే దుర్మార్గ లనేకులు దైవభక్తులుగా మాఱగలరు.

388. ఒక విద్యార్థి శ్రీరామకృష్ణుని సందర్శించి యిట్లు

ప్రశ్నించెను: "అయ్యా, ఒకే దేవుడు సర్వభూతములందును సంస్థితుడై యుండ ఎవనిచేతి యాహారమును గైకొనినను హానియేమి?" శ్రీగురుదేవుడు, "నీవు బ్రాహ్మణుడవా?" యని యడుగ నాతడు, "ఔా" ననియెను. అంత గురుదేవు డిట్లనియెను: "అందువలననే నీవు నన్నట్లడిగినావు. నీ వొక అగ్గిపుల్లను వెలిగించి దానిపై ఇన్ని యెండుకట్టెలను పడవైచితి వనుకొనుము. ఏమగును?" "వానిచే గప్పబడి నిప్పు ఆఱి పోవును" అని విద్యార్థి బదులుచెప్పెను. మఱల గురుదేవు డిట్లనియెను: "కార్చిచ్చు మండుచుండగా ఇన్ని పచ్చిఅరటి బోదెలను తెచ్చి దానిలో పడవేసితి వనుకొనుము. అవి యేమగును?" "ఒక్కక్షణములో భస్మమైపోవును" అని విద్యార్థి సమాధానము చెప్పెను. అంత గురుదేవు డిట్లు బోధించెను: "ఆవిధముగనే నీలో ఆధ్యాత్మిక శక్తి చాల దుర్బలముగా నున్నప్పుడు విచక్షణ లేకుండ, అడ్డమైనవారి చేతినుండియు తినుచుండినయెడల ఆ రవంతశక్తియుకూడ అణగిపోవచ్చును. ఇదియే ఇందున్న ప్రమాదము. కాని ఆ శక్తియే ప్రబలముగా నున్నప్పుడో, నీవు ఎట్టి ఆహారము తిన్నను బాధలేదు."

389. నేనొకప్పు డొక మహమ్మదీయగురునిచే ఉపదేశము బొంది అనేకదినములు అల్లానామస్మరణము చేయుచు, వారి యాచారములనే అవలంబించుచు, వారి యాహారమునే తినెడివాడను. ఆదినములలో నేను కాళీమాతయొక్క ఆలయమునకు బోజాలకపోతిని, మఱియు హిందూదేవతా నామస్మరణకూడ నాకు సాధ్యముకాలేదు.

390. శ్రాద్ధసమయములం దిడు భోజనము గుడువకుము.

అట్టిభోజనము భక్తివిశ్వాసములను నశింపజేయును. మఱియు శ్రాద్ధకర్మాదులచే జీవించు పురోహితునింటగూడ తినకుము.

391. ప్రశ్న : ఆహారవిషయమై దొరికినదానిని దినదగదా?

ఉ : అయ్యది మన ఆధ్యాత్మికస్థితి ననుసరించి యుండును. జ్ఞానమార్గమున దానివలన హాని కలుగదు. జ్ఞాని భుజించునప్పుడు కుండలిన్యగ్నికి దానిని ఆహుతిగా నర్పించును. కాని భక్తునివిషయము వేఱు. భక్తుడు తన యిష్టదైవమునకు నిరాక్షేపణీయముగా నివేదనచేయదగిన పవిత్రాహారమును మాత్రమే భుజింపవలయును. మాంసాహారము భక్తునికి తగదు. కాని యొకడు పందిమాంసమును దిని జీవించుగాక, భగవంతునియెడ అనురక్తుడై యుండెనా, వాడు ధన్యుడని చెప్పవలసియున్నది. మఱియొకడు హవిష్యాన్నమును దినుచున్నను కామినీకాంచనములలో వాని మనసు తగుల్కొనియుండెనా, వాడు పరమనిర్భాగ్యుడని గ్రహింపుము.

392. ఎవడు సాత్త్వికశాకాహారమునే తినుచున్నను బ్రహ్మప్రాప్తిని వాంఛింపడో వానికి ఆ సాత్త్వికశాకాహారము సైతము గోమాంసమంతటి అనర్థకమే యగును. ఎవడు గోమాంసమును దినుచును బ్రహ్మప్రాప్తిని కాంక్షించునో వానికా గోమాంసము అమృతమంతటి యోగ్యమైన దగును.

393. పగలు తృప్తిగ భుజింపుము. కాని రాత్రికాలమున లఘువుగ దినుము.

394. శరీరమునకు వేడిచేయనట్టియు మనస్సునకు ఉద్రేకము గలిగింపనట్టియు ఆహారమును మాత్రమే భక్తుడు భుజింపవలయును.

## శరీరాభిమానము : శరీరసంరక్షణము

395. ప్రశ్న : శరీరాభిమానమును జయించు టెట్లు?

ఉ : మానవశరీరము క్షయమగు క్షుద్రప్రకృతితో నిర్మింపబడియున్నది. ఇయ్యది మాంసము, మజ్జ, ఎముకలు, నెత్తురు మొదలగు క్రుళ్లిపోవు నసహ్యమైన వస్తువులప్రోవు కాని మఱియొకటికాదు. శరీరమునుగూర్చి యీవిధమైన వివేచన నిరంతరము చేయుచుండుటచే శరీరాభిమానము అణగిపోవును. (చూ. 542, 545.)

396. పక్షి ఎగిరిపోయిన తర్వాత పంజరము నెవ్వరును లక్షింపరు. ప్రాణమనెడు పక్షి ఎగిరిపోయినపిమ్మట మిగిలియున్న కళేబరము ఎవ్వరికిని అక్కఱలేదు.

397. ఈతనువు తుచ్ఛము, అశాశ్వతము నైనపక్షమున సాధువులును భక్తులును దీనిని సంరక్షించుకొందురేల? ఏమియులేని పెట్టెనుగూర్చి యెవ్వరును జాగ్రత్తపడరు. విలువగల నగలు, బంగారము, ప్రశస్తమైన వస్తువులును గల ఖజానా పెట్టెను ఎల్లరును జాగ్రత్తగా కాపాడుకొందురు. ఈ దేహము దేవాలయమై* యుండుటచే సాధుజనులు దీనిని సంరక్షించుకొనకుండ నుండజాలరు. మన శరీరములు దేవుని ధనాగారములు.

## కష్టములందుండవలయు మనోభావము

398. శరీరగృహమున నున్నందులకు (జీవుడు) చెల్లింపవలసిన అద్దెయే వ్యాధి.

---

* "దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవస్సనాతనః."

399. ఇనుమును కొలిమిలో గాల్చి, ఎన్నియో సార్లు సమ్మెటతో బాగుగా గొట్టిననే కాని మంచి ఉక్కు కానేరదు. అప్పుడు దానిని పదనైన ఖడ్గముగా జేసి నీ యిచ్చవచ్చినట్లు వంచవచ్చును. అదేవిధముగా ఆపద లను కొలిమిలో మానవుడు పెక్కుసార్లు తపించి, లోకులు పెట్టు బాధలనెడి సమ్మెటదెబ్బలు బాగుగా తిననినేగాని శుద్ధుడును వినమ్రుడునై దైవసాన్నిధ్యమును బొంద నర్హుడుకానేరడు.

400. శ్రీ గురుదేవు డొకప్పుడు కేశవచంద్ర సేనునితో నిట్లు వచించెను : "నీవు బాధపడుచున్నావు, కాని నీవ్యాధికి గంభీరార్థమున్నది. ఈ శరీరమున నీ వనేక ఆధ్యాత్మిక దశలను పొందియున్నావు ; తత్ఫలితముగా శరీరము ఇపుడు బాధపడుచున్నది. ఆధ్యాత్మికతరంగములు లేచునపుడు శరీర స్మృతి అదృశ్యమగును, కాని తుదినవి దేహమును బాధించును. గంగానదిలో పెద్ద స్టీమరు పోవునపుడు దాని వెనుక తరంగములు లేచి, కొంతసేపటివఱకు నొడ్డునకు గొట్టుకొనుచుండును. స్టీమరు ఎంత పెద్దదో తరంగములు అంత పెద్దవి లేచుచుండును. ఒక్కొక్కప్పుడు వాని తాకునకు ఒడ్డు విఱిగి పడుచుండును. ఏనుగు చిన్న గుడిసెలోనికి జొరబడిన యెడల గుడిసె అల్లల్లాడి కూలిపోవును. అట్లే బ్రహ్మానందానుభవము సాధకుని శరీరమును గదల్చివైచి యొక్కొక్కప్పుడు విచ్ఛిన్నము చేసివేయును. దానివలని ఫలితమేమో తెలియునా? ఇల్లు అంటుకొనినయెడల అనేకవస్తువులు (దానితోబాటు) తగులబడిపోవును. అటులనే జ్ఞానాగ్ని కామక్రోధాదిరిపుల నందఱను ధ్వంసముచేసి తుదకు 'నేను, నాది' యను స్మృ

హాను గూడ నాశనముచేయును. తీవ్రమైన ఆ దెబ్బతో శరీరము శిథిలమైపోవును. అంతయు పూర్తియైనదని నీ వనుకొన వచ్చును కాని, అహంకారవాసన లేశమున్నను గూడ భగవంతుడు నిన్ను విముక్తుని జేయడు. నీ వొక ఆసుపత్రిలో రోగిగా ప్రవేశించినయెడల పూర్తిగా నీవ్యాధి నివారణకాని దే నిన్ను విడువరుగదా!"

401. కేశవచంద్రసేనునకు జబ్బు జేసినపుడు శ్రీగురుదేవు డాతని గాంచి యిట్లు పలికెను: "తోటమాలి యొక్కొక్కప్పుడు గులాబిమొక్కల వ్రేళ్లమీద మంచు పడులాగున వానిమీది మట్టి నించుక తీసివేయును. పువ్వులు పెద్దవగుటకై యొక్కొక్కప్పుడు వ్రేళ్లను గొన్నిటిని కత్తిరించుచుండును. నీ వింకను ఘనతర కార్యముల నొనర్చుటకై భగవానుడు ని న్నీవిధముగా ఆయిత్తమొనర్చుచున్నాడు కాబోలును."

402. శ్రీగురుదేవుడు వ్యాధిని గూర్చి తన మనోభావము నిట్లు వెల్లడించెను: "వ్యాధి దానిపనిని అది సాగించుగాక. శరీరము బాధపడుగాక. మనసా! నీవు మాత్రము ఆనందమున నెలకొనుము."

403. శరీరమున నెట్టి కష్టములు ప్రాప్తించినను, సుఖములు ప్రాప్తించినను నిజమైనభక్తు డెన్నడును జ్ఞానదీప్తిని, శక్తిని గోల్పోకుండును. ఆతని శ్రద్ధాభక్తు లెన్నడును కుంటుపడవు, ఆతని జ్ఞానతేజము క్షీణింపదు. పాండవుల కెట్టి ఘోరాపదలు వాటిల్లెనో చూడుడు! కాని క్షణమైనను వారు జ్ఞానతేజమును గోల్పోయిరా?

## స హ న ము

404. (వంగ) గుణితమున 'శ, ష, స' అను మూడు అక్షరముల కంటెను మఱేవియు ఒకేవిధముగా ఉచ్చరింప బడవు. ఇట్లు ఈ మూడును 'సహింపుము,' 'సహింపుము,' 'సహింపుము' అని మనకు బోధించుచున్నవి. అక్షరాభ్యాసమునాటినుండియు—చిన్ననాటినుండియు—సహనము నల వరచుకొనవలయునని మన కివి తెలుపుచున్నవి. మానవులకు సహనమే ముఖ్యమైన సుగుణము.

405. ఆ కమ్మరివాని దాగలిని జూడుము,—దానిని సమ్మెటతో నెట్లు కొట్టుచున్నారో కనుము! ఐనను ఇసుమంతయు అది కదలుటలేదే? శాంతిని, ఓరిమిని మానవు లీ దాగలినుండి నేర్చుకొందురుగాక!

## మౌ న ము

406. నీభక్తివిశ్వాసములను, మనోభావములను రహస్యముగ నుంచుకొనుము. నలువురియెదుటను వానిని వెల్లడి చేయకుము. చేసితివేని నీకు గొప్పనష్టము వాటిల్లును.

407. నరుడు తన పారమార్థికసాధనలను ఎంత గోప్యముగ నుంచిన నంత శ్రేయస్కరము.

## వినయము : ఆత్మగౌరవము

408. అహంభావమునకు పతనమే ఫలము. కాకిని జూడుడు.—అది తా నెంతయో బుద్ధిశాలి ననుకొనును. అది యెన్నడును వలలో చిక్కదు. ఏమాత్రము అపాయము

కాన్పించినను తప్పించుకొనిపోవును. కడు నేర్పుతో దొంగి లించి మేత సంపాదించుకొనును. కాని, పాపము, ఆ జంతువు అశుద్ధము తినక తప్పదయ్యె! మితిమీరిన దాని తెలివితేటల కిది ఫలము! వంచన కిదియే పర్యవసానము!

409. ఘనతను బొందవలయుననిన వినయము గలిగి యుండ వలయును. భరద్వాజపక్షియొక్క గూడు క్రిందుగా నేల దాపుననే యుండును. కాని యది యెంత యెత్తున కెగురునో చూడుడు. మిట్టనేల వ్యవసాయమునకు పనికిరాదు; అందు లకై వలయునీరు నిలుచుటకై పల్లపునేలయే కావలయును. (అట్టులనే గర్వముచే మిట్టిపడు హృదయము సాధనకు పనికి రాదు. చూ. 412.)

410. పండ్లచే భారవంతమైన చెట్లెప్పుడును వంగి యుండును. నీవు ఘనుడవు కాదలచెదవేని (వీనివలె) అడకువ గలిగి యుండుము.

411. గౌరవసూచకముగా ఇతరులు కేవలము తలవంచు నెడల మనము సాగిలబడి పూజింపవలయును. ఇదియే మన ధర్మము.

412. "నేనుపన్యసించుచున్నాను, కావున మీరందఱును వచ్చి వినవలయును" అని యహంభావముచెందు ప్రచారకుని వలె మనము అహంభావము పొందరాదు. అహంభావమునకు నిలయము అజ్ఞానము. జ్ఞానాగ్నియందు దది నిలువజాలదు. ఎవ్వడు అహంకారరహితుడో, నిష్కపటచిత్తుడో, వానికే జ్ఞానలాభము గలుగును. వాననీరు పల్లపునేలలందు నిలుచును, మిట్టనుండి కొట్టుకొనిపోవును. (మిట్టిపడువారి హృదయము

నుండి జ్ఞానము కొట్టుకొనిపోవును. (చూ. 105, 409.)

413. తక్కెడలో భారవంతమైన సిబ్బి క్రిందికి బోవ తేలికయైనది పైకి లేచును. నిపుణుడును సమర్థుడును ఎప్పుడును అడకువ కలిగియుండును: మూర్ఖుడో, మిట్టిపడుచుండును. (చూ. 362.)

414. పెనుగాలిచే గొనిపోవబడు పులివిస్తరివలె గర్వశూన్యుడవై యుండుము. (చూ. 525.)

415. సూదిలో దారము ఎక్కింపదలతువేని, సరిగాలేని పోగులను తొలగించి, దారమును కొన తేలునటుల పేనవలయును. అప్పుడు దారము సులభముగా సూదిబెజ్జములోని కెక్కగలదు. నీ మనోబుద్ధులను భగవంతునిపై ఏకాగ్రము చేయగోరెదవేని, కకావికలగు కోరికలను తొలగద్రోసి, అహంకారమును వీడి, వినమ్రుడవై దీనభావము వహింపుము.

416. అనేకులు వినయము చూపనెంచి, "నేను బురదలో పొరలాడు వానపామువంటివాడనండి!" అనుచుందురు. ఈ రీతిని తాము పురుగులమని భావించుకొనుచు కాలక్రమమున నిజముగా వారు పురుగులవలెనే ఆత్మబలహీనులయ్యెదరు. దైన్యమును నీ మనస్సున జొరనీయకుము. దైన్యమనునది, నిరాశయనునది, పురోగమనమునకు ప్రబలశత్రువు. భావననుసరించియే సిద్ధియు గలుగుచుండును.*

417. మానము కలవాడే మానవుడు. ఇతరులందఱును మానవ మాత్రులు.

* "యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ."

**418.** ఆత్మప్రభావమును ప్రకటించు గర్వము గర్వము కాదు. ఆత్మగౌరవము నణచివేయు వినయము వినయము కాదు.

## నిష్కాపట్యము

**419.** పసివానివలె నిష్కాపట్యివై యుండిననేకాని, నీకు తత్త్వజ్ఞానము లభింపబోదు. నీవు గడించిన లౌకికజ్ఞానము నంతయు మఱచిపోయి ఆవిషయమై పసిబిడ్డవలె అజ్ఞుడవు కమ్ము, అమాయకుడవుగమ్ము. అపుడు నీకు తత్త్వజ్ఞానము లభింపగలదు.

**420.** సులభముగా నరుని నారాయణుని సన్నిధిని జేర్చునది నిష్కాపట్యము. ఱాళ్లు లేకుండునట్లు చక్కగా సాగు చేయబడిన నేలలో విత్తనములు సులభముగా అంకురించి పెరిగి, ఫలించు రీతిని నిష్కపటచిత్తుని మృదులహృదయమున తత్త్వబోధనలు చక్కగా నాటుకొని ఫలవంతము లగును.

**421.** శ్రీ గురుదేవు డిట్లు వచించెను: "ఎవ్వడైనను ఉదారహృదయుడు, నిష్కాపటచిత్తుడనై యున్నచో అది మహా తపఃఫలమని భావింపవలయును. నిష్కాపట్యమైననే కాని నరుడు నారాయణుని గనజాలడు. అమాయకులకే భగవంతుడు సాక్షాత్కరించును." కాని సత్యసంధత, అమాయకత్వము ననువాని పేర సాధకులు వెఱ్ఱివెంగళప్పలుగా పరిణమింపకుండ శ్రీ గురుదేవు డిట్లు హెచ్చరించువాడు: "నీవు భక్తుడవు కావలయునుగాని వెఱ్ఱిపుల్లయ్యవు కారాదు", లేదా, "సత్య మేదియో, మిథ్యయేదియో, నిత్యమేదియో, అనిత్యమేదియో

సదా మనస్సులో వివేచన చేయుచుండవలయును; అంతట అనిత్యమైన జగత్తును విడిచి నిత్యుడగు భగవంతునియొద్ద మాత్రమే మనసు నిలుపవలయును.''

## వాంఛానివృత్తి

422. ఎవ్వడు ఈలోకమున జీవించియుండియు మృతుడై యుండునో, అనగా శవమునందువలె ఎవ్వని కామక్రోధాదులు నిగ్రహింపబడి నిర్మూలములగునో అట్టివాడే మానవోత్తముడు.

423. దివ్యమగు మానససరోవరము కామక్రోధాదులను పెనుగాడ్పులచే కల్లోలమైయున్నంతవఱకు అందు పరంజ్యోతి యొక్క ప్రతిబింబము గోచరింపజాలదు. నిర్మలమై, ప్రశాంతమై భగవచ్చింతనమున నిమగ్నమైయుండు మానసమున మాత్రమే దైవదర్శనము లభించును.

424. మనసున కామమను కళంకము అణుమాత్ర మున్ననుగూడ భగవంతుని గనజాలవు. కావున నీ ''చిల్లర కోరికలను'' దీర్చుకొని పెద్ద కోరికలను వివేక వైరాగ్యములచే విడనాడుము.

425. లోతగునూతిదాపున నిలుచుండిన యాతడు దానిలో పడిపోవుదునేమోయని కడుజాగరూకుడై యుండునటుల సంసారమున మనునతడు అందలి వ్యామోహములకు జిక్కకుండ సదా జాగరూకతతో మెలగవలయును. మోహనిలయమగు సంసారకూపమున బడినవాడు నిరపాయముగను నిష్కళంకముగను వెలువడుట దుర్లభము.

**426.** "కామక్రోధాదులు ఎప్పుడు లోబడును?" అని యొకరడుగగా, శ్రీగురుదేవు డిట్లు సమాధానమొసగెను: "కామక్రోధాదులను స్వార్థపరముగా—భోగపరముగా—నడపుచున్నంతవఱకు అవి నీకు శత్రువులుగనే యుండును. వానిని భగవంతుని వైపునకు మఱల్చితివేని, అవిగా నీకు పరమాప్తవర్గమగును. అవి నిన్నంత భగవంతుని సన్నిధికి గొనిపోవును. విషయముల దలి కామమును భగవంతునందలి కామముగా మార్పవలయును. ఇతరులపై గలుగు క్రోధమును భగవంతుడు నీకు ప్రసన్నుడు గానందులకై వాని మీదికి త్రిప్పవలయును. అరిషడ్వర్గము మిగిలిన రిపులన్నిటి విషయమునను నీ విట్లనే వర్తింపవలయును. కామాదులను నిర్మూలింప జాలము, కాని వానికి ఆత్మగతి కల్పించి దివ్యముగా నొనర్పవచ్చును. * (చూ. 243, 350, 438.)

**427.** మండోదరి తన భర్తయగు రావణునితో నిట్లు పలికెను: "సీత మీరాణి కావలయునని మీకింత మమకారమున్నయెడల మీ మాయాశక్తిచే సీతాపతియగు రాముని రూపమును దాల్చి యామెనేల మోహింపజేయరాదు?" రావణు డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను: "ఓసీ! వెఱ్ఱిదానా! రాముని పవిత్రరూపమును దాల్చినయెడల తుచ్ఛమగు నింద్రియభోగములపై మఱల ఆశపడగలనా? రామరూప భావనయే మహోత్తమస్వర్గసుఖమును సైతము తుచ్ఛమని

---

* "తదర్పితాఖిలాచారః సన్ కామక్రోధాభిమానాదికం తస్మిన్నేవ కరణీయమ్." —నారదభక్తిసూత్రములు, 65.

దీనినే పాశ్చాత్యమానసికశాస్త్రజ్ఞులు Sublimation అందురు.

పించునంతటి అనిర్వాచ్యానందముతో నా హృదయమును నింపివేయునుగదా !''

428. ఏనుగును విచ్చలవిడిగా విడిచినయెడల అది చెట్లను పొదలను విధ్వంసింప నారంభించును. కాని మావటివాడు తలపై అంకుశమును ప్రయోగించినంతనే అది శాంతించును. అటులనే మనసును యథేచ్ఛముగా పోనిచ్చినయెడల పనికి మాలిన గొంతెమ్మకోరికలలో విహరించును. కాని వివేక మను అంకుశమును ప్రయోగించినంతనే మనస్సు శాంతించును.

429. సంసారమున రాగము హెచ్చిన కొలదియు జ్ఞాన లాభమును పొందు నవకాశము సన్నగిల్లుచుండును. సంసా రముపై రాగము క్షీణించినకొలదియు జ్ఞానలాభమునుబొందు నవకాశము హెచ్చుచుండును. (నా. 750.)

430. మజ్జిగనుండి వెన్నను చిలికి తీసినపిమ్మట దానినిక మజ్జిగతోపాటు ఒకేపాత్రలో నుంచగూడదు; ఉంచితిమేని దాని మాధుర్యమును చిక్కదనమును కొంతవఱకు తగ్గి పోవును. నిర్మలమైన నీటిలో వేఱొకపాత్రలో నుంచవలయును. అటులనే సంసారమున నరుడు కొంత పరిపక్వస్థితిని బొందిన పిమ్మట లోకులతో గలిసి సాంసారిక వ్యామోహముల నడుమ నిలిచియుండెనేని కళంకితుడు కాగలడు. అట్టివాడు సంసారము నకు దూరముగా నుండినప్పడే నిర్మలుడై యుండగల్గును.

431. ప్రశ్న: మనలో అనాదిసిద్ధముగా నున్న కామమును జయించు టెట్లు ?

ఉ. పువ్వులోని పిందె పెద్దదయినప్పుడు పూరేకులు వాని యంతట నవియే రాలిపోవును. అటులనే నీయందలి దివ్యత్వము

వికసించినంతనే మానవదౌర్బల్యము దానియంత నదియే తొలగిపోవును. (చూ. 85, 86, 438.)

**432.** (ఇచట 87_వ ప్రవచనము జదువుకొనుడు.)

**433.** (ఇచట 243_వ ప్రవచనము జదువుకొనుడు.)

**434.** హేలాంగము (ఒకానొక వనమూలిక)ను సేవించుట పెరటిలోని సామాన్యమూలికలను దినుటవంటిదికాదు; కలకండను దినుట మిఠాయులను మెక్కుటవంటిదికాదు. ఇందు మొదట చెప్పబడినవి శరీరమునకు ఆరోగ్యకరములు. రోగులు సైతము వీనిని దినవచ్చును; కాని తరువాత చెప్పబడినవి, శరీరమునకు అనారోగ్యకరములు. తారకమంత్రమగు ప్రణవము సామాన్యశబ్దముకాదు, సాక్షాత్ పరబ్రహ్మస్వరూపము.* అటులనే పవిత్రతను భక్తిని గోరుకొనుట క్షుద్రమగు లౌకిక వాంఛలతో బోల్పదగదు.

## స్త్రీలయెడ నుండవలయు మనోభావము

**435.** స్త్రీలందఱును జగన్మాతయొక్క అంశములే కావున ఎల్లరును వారిని తల్లులవలె భావింపవలయును.

**436.** స్త్రీలు యోగ్యురాండ్రై యుండనిమ్ము, అయోగ్యురాండ్రై యుండనిమ్ము, పతివ్రతలు కానిమ్ము, కాకపోనిమ్ము; వారిని ఆనందమయియగు అల జగజ్జనని దివ్యస్వరూపములుగా గనవలయును.

**437.** ప్రశ్న: స్త్రీలను మే మెటుల జూడవలయును?

* "ఓమిత్యేతదక్షర మిదం సర్వమ్"—మాండూక్యోపనిషత్తు. "తస్య వాచకః ప్రణవః"-పాతంజలయోగసూత్రములు. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ"-భగవద్గీత.

ఉ. ఎవ్వడు బ్రహ్మజ్ఞానమును బడసియున్నాడో, అట్టి వాడు వారిని గాంచువిషయమున భయమందడు. ఆతడు వారిని తాత్త్వికదృష్టితో, అనగా జగజ్జననియొక్క అంశములుగా గాంచును. కావున వారియెడ గౌరవమర్యాదలు జూపుటయేకాక, పుత్త్రుడు జననివలె సాక్షాత్తు వారిని ఆతడు పూజించును. (చూ. 86.)

438. ప్రశ్న: కామమును మే మెట్లు జయింపగలము?

ఉ. స్త్రీలనందఱను నీతల్లివలె భావింపుము. స్త్రీలపాదములవైపు చూడుముకాని ముఖమువైపు ఎన్నడును జూడకుము. ఇట్లు చేసినయెడల మనస్సునుండి దుష్టచింతలు పలాయనమగును. (చూ. 85, 243, 350, 426.)

439. భర్తతో కాపురము చేయుచునుగూడ బ్రహ్మచర్యము నవలంబించు స్త్రీ సాక్షాత్తు జగజ్జననియే.

440. ప్రశ్న: తంత్రశాస్త్రము బోధించునటుల స్త్రీ సాంగత్యమున సాగింపబడు భక్తిసాధనలనుగూర్చి మీ యభిప్రాయమేమి?

ఉ. అవి నిరపాయమైన మార్గములుకావు, మఱియు దుర్లభములు, భ్రమప్రమాదములతో గూడుకొనియున్నవి. తంత్రశాస్త్రానుసారము మూడువిధములైన సాధనలు గలవు. జగజ్జననియెడ సాధకుడు వీరభావమునుగాని, సఖీభావమును గాని, పుత్రభావమునుగాని అవలంబింపవచ్చును. నాది పుత్రభావసాధన. సాధకుడు జగన్మాతయొక్క సఖినని భావించుట కూడ మంచిదే కాని వీరభావము, లేక వీరాచారము *

* ఈ మార్గమున సాధకుడు జగన్మాతను తన భార్యగా భావించును.

అపాయముతో గూడుకొనియున్నది. (తాను జగజ్జనని పుత్రుడ నని భావించు) పుత్రభావమే నిష్కళంకము.

441. నీకు దైవానుగ్రహము వలయునెడల పరాశక్తి యగు జగన్మాతను సంతుష్టురాలి నొనర్పుము. ఔను, ఆమెయే మహామాయ. సమస్తజగత్తును భ్రమింపజేయున దామెయే. సృష్టిస్థితిలయములను మహాలీల నామెయే సాగించుచున్నది. సర్వము నామె అజ్ఞానముచే గప్పియున్నది. మోక్షద్వారము నామె తెఱవనిదే ఎవ్వరును ఆత్మసౌధమును ప్రవేశింప జాలరు. బైటనుండి మనము కేవలము బాహ్యవిషయములను జూచుచున్నాము. సచ్చిదానందమయుని స్వరూపము సర్వదా మనకు అతీతమై, అగోచరమై యున్నది.

విద్య, అవిద్యయునని దివ్యశక్తి రెండురూపముల వెలయు చున్నది. కామినీకాంచనములచే అవిద్య జగమును భ్రమింప జేయుచు సంసారబద్ధ మొనర్చుచున్నది. విద్యయో,—భక్తికిని, జ్ఞానమునకును, ప్రేమకును, కారుణ్యమునకును నిలయమై మనలను పరమేశ్వరుని సన్నిధికి గొనిపోవును. (చూ. 4.)

ఈ యవిద్యాశక్తిని సంతుష్ట నొనర్చుటకే శక్తిపూజ విధింపబడియున్నది. ఇందులకై వివిధమార్గములు కలవు. సాధకుడు తనను ఆమెయొక్క సఖిగాగాని, భర్తగాగాని, బిడ్డగా గాని భావించుకొనవచ్చును. శక్తిసాధనయనగా మాటలు గాదు, మహాకఠినమైన—ప్రమాదకరమైన—సాధనలతో గూడుకొనియున్నది. జగజ్జననిసఖినను భావముతో నేను రెండుసంవత్సరములు సాధనచేసినాను, ఐనను నాది పుత్ర భావము—శిశుభావము; నా కేవనిత పాలిండ్లైనను నా తల్లి

పాలింపవలెనే తోచును.

స్త్రీలందఱును శక్తిస్వరూపములు. వివాహసమయమున ఈదేశమున పశ్చిమప్రాంతములలో వరుడు చేత నొక కత్తెరను దాల్చును: వంగదేశమున, అడకత్తెరను ధరించును. సాక్షాచ్ఛక్తిస్వరూపమగు వధువుయొక్క సాయమున వరుడు తాను మాయాబంధములను విచ్ఛిన్నము చేయునని దీనిభావము. ఇదియే వీరభావము. కాని దీనిని నే నెన్నడును అవలంబింపలేను. నే నవలంబించునది శిశుభావము.

## భక్తుడు : సంసారము

442. ప్రశ్న: సాధకుడగు తన భర్తతో భార్య, "మీరు నన్ను ఉచితరీతిని జూడకున్నచో, నేను ఆత్మహత్య చేసికొందును" అని పలుకు ననుకొనుము. అప్పు డాత డేమి చేయవలసి యుండును?

ఉ. అట్టిభార్యను విడిచివేయవలయును—మోక్ష సాధనకు అడ్డువచ్చు భార్యను విడువవలసినదే. ఆమె ఆత్మహత్య చేసికొననీ, మఱేమైన కానీ. బ్రహ్మమార్గమునకు అడ్డుతగులు భార్య అవిద్యాస్వరూపిణి! ఐనను రాజు, దుష్టుడు, భార్యయు సైతము భగవంతునియెడ నిర్మలభక్తి కలవానికి వశులగుదురు. నిజమైన భక్తుడగువాని భార్యయు క్రమక్రమముగా బ్రహ్మమార్గమునకు తిరుగ గలదు. భర్త యోగ్యుడగునేని భగవత్కృపవలన భార్యయు యోగ్యురాలగును.

443. తల్లిదండ్రులు నరునికి ముఖ్యులు. వారు సంతుష్టులు

గాని దే ఏసాధనలును ఫలింపవు.* శ్రీచైతన్యుని గనుడు. భగవద్భక్తిపరవశుడయ్యును, తాను సన్న్యాసము స్వీకరించుటకు పూర్వము తల్లిని సమాధానపఱుచుట కెంత శ్రమపడెనో! "అమ్మా! దుఃఖింపకుము. అప్పుడప్పుడు వచ్చి నిన్ను దర్శించుచుందును" అని చెప్పెను. దేవతల ఋణము, ఋషుల ఋణము, పితరులఋణము, భార్యాఋణము—అని మానవుడు తీర్పవలసిన ఋణము లెన్నో యున్నవి. †తల్లిదండ్రుల ఋణమును దీర్పనిచో ఏకర్మమును ఫలింపజాలదు. భార్యయెడలను తీర్పవలసిన ఋణ మున్నది. తన భార్యను విడిచిపెట్టి హరీశు డిక్కడ నున్నాడు. ఆమె కేదియో జీవనోపాధి కల్పింపకుండు నెడల నే నాతని దుర్మార్గు డనియందును. రామప్రసన్ను డెంత సేపు, హఠయోగికి నల్లమందు, పాలు సమకూర్చుటకై దేవులాడుచున్నాడు. మనువు సాధుసేవను విధించియున్నాడని యాతడు చెప్పును. ఈత డిట్లు తిరుగుచుండ, ఇతని ముసలితల్లి తినుటకు లేక పస్తుండవలసివచ్చుచున్నది. ఆతల్లి తానే బజారునకు పోవలయును. ఈచర్య జూచిన నాకు ఒడలు మండుచున్నది.

---

* "మాతరం పితరంచైవ సాక్షాత్ ప్రత్యక్షదేవతామ్,
మత్వా గృహీ నిషేవేత సదా సర్వప్రయత్నతః.
తుష్టాయాం మాతరి శివే తుష్టే పితరి పార్వతి,
తవ ప్రీతిర్భవేద్దేవి పరబ్రహ్మ ప్రసీదతి."

—మహానిర్వాణతంత్రము, 8-25, 26.

"మాతృదేవో భవ; పితృదేవో భవ."

—తైత్తిరీయోపనిషత్తు.

† "జాయమానో విప్రః త్రిభిః ఋణవాన్ జాయతే—యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్యః, స్వాధ్యాయేన ఋషిభ్యః." —శ్రుతి.

**444.** కాని ఒక్క విషయమును పరిగణింపవలయును. మానవుడు భగవత్ప్రేమోన్మత్తుడైనయెడల అట్టివానికి తల్లి యెవరు? తండ్రి యెవరు! భార్య యెవరు? భగవంతు నాతడు అమితముగా ప్రేమించును, ప్రేమోన్మత్తుడౌను. వాని కిక కర్తవ్యమనునదిలేదు. ఆత డన్ని బాధ్యతలనుండియు విముక్తు డగుచున్నాడు. ఈ స్థితిని బొందినవాడు ప్రపంచమునే మఱచును; సర్వజనులకును ప్రాణతుల్యమగు శరీరమునుగూర్చియైనను వానికి స్పృహ లేకుండును.

**445.** లోకమున నెల్లరకును తల్లిదండ్రు లెంతయు పూజార్హులు.* వారు జీవించియున్నంతవఱకు శక్తికొలదియు వారిని సేవింపవలయును. మరణానంతరము యథోచితముగా వారికి శ్రాద్ధకర్మముల నొనర్పవలయును. పుత్రుడు గర్భదరిద్రుడై యున్నను, శ్రాద్ధము జరుపుటకు శక్తలేనివాడై యున్నను, వనమునకుపోయి, తనయశక్తత నెంచి కన్నీరు విడువవలయును. అప్పుడు తల్లిదండ్రులయెడ ఋణవిముక్తు డగును. భగవద్విషయమున దన కడ్డుతగులునెడమాత్రమే ఎవ్వడైనను తల్లిదండ్రులయెడ అవిధేయుడై వర్తింపవచ్చును. దానిచే వానికి పాపము రాదు. ఇందులకు ఉదాహరణముగా ప్రహ్లాదుడు తన్ను తండ్రి యెంత వలదనినను హరినామస్మరణచేయుట మానలేదు. మఱియు ధ్రువుడు తల్లి నిరోధించినను తప మొనర్చుటకై అడవుల కేగుట మానలేదు. ఇందు వారు చేసినది తప్పిదముకాదు.

* "మాతృదేవో భవ; పితృదేవో భవ."—తైత్తిరీయోపనిషత్తు.

## ప్రార్థన: శ్రద్ధాభక్తులు

446. ప్రశ్న: భగవంతుని బిగ్గఱగా ప్రార్థింపవచ్చునా?

ఉ. వానిని నీ యిచ్ఛవచ్చిన రీతిని ప్రార్థింపుము. భగవంతుడు నీప్రార్థన నాలకించితీరును. చీమ చిటుకుమన్న భగవంతుడు వినును. (చూ. 456.)

447. ప్రశ్న: ప్రార్థనలవలన ఏమైనను ప్రయోజనము కలదా?

ఉ. లేకేమి! తప్పక కలదు. ప్రార్థించునప్పుడు మనస్సును వాక్కును ఏకీభవించునెడల భగవంతుడట్టి ప్రార్థన నాలకించి సఫలముచేయును. ఊరక నోటితో, "ప్రభూ! ఈ సకలము నీదిసుమా" యని పలుకుచు, అంతరంగమున నన్నియు తనవే యని భావించు నరుని ప్రార్థనలు నిరర్థకములు.

448. నీ మనోభావములయెడ ద్రోహివి కాకుము. నిష్కపటివై యుండుము; నీ మనోభావములకు అనుగుణముగ వర్తింపుము. నిష్కపటహృదయముతో—వినిర్మలహృదయముతో—ప్రార్థింపుము. అపుడు భగవంతుడు నీప్రార్థన నాలకించి తీరును. (చూ. 489.)

449. నీవేమి సంకల్పింతువో దానినే పలుకుము. వాక్కును సంకల్పమును ఏకీభవింపవలయును. ఇందులకు బదులు నోటితో భగవంతుడే నీ సర్వస్వమని పలుకుచు, హృదయమున సంసారమే నీ సర్వస్వమని నమ్ముకొనియున్న యెడల నీకు దాని వలన రవంతయు ప్రయోజనము ఉండబోదు.

450. సార్వభౌముని దర్శింప గోరువాడు ముందుగా ద్వార

పాలకులను గద్దెదాపుననుండు అంగరక్షకులను తన కనుకూలు రను జేసికొనవలయును,—ముందుగా వారిదయ సంపాదింప వలయును. రాజరాజేశ్వరుని సన్నిధిని జేరి వాని యనుగ్రహ ముకు బడయదలచువాడు ఎన్నియో భక్తిసాధనలను జేయ వలయును, ఎందఱనో భక్తులను సేవింపవలయును. చిరకాలము సాంగత్యము చేయవలయును.

451. లౌకికచింతలు, తాపత్రయమును నీ మనస్సును కలవరపెట్టనీయకుము. విధ్యుక్తకర్మములను సకాలమున నిర్వర్తించుచు నీ మనస్సును మాత్రము సదా భగవానునిపై నిలుపుము.

452. ఓడలోని దిక్సూచీయంత్రము సరిగా ఉత్తరదిశను జూపుచుండునంతవఱకు ఓడ దారి తప్పుననికాని, అపాయము వాటిల్లుననికాని భయపడనక్కఱలేదు. జీవననౌకకు దిక్సూచి యనదగు మనస్సు భగవానునివైపు తిరిగియుండి చలింపకుండునంతవఱకు నరునకు ఏ యనర్థమును వాటిల్లదు.

453. భగవాను నేమని ప్రార్థింపవలయునంటిరా, మీ ప్రశ్న ? ఐహికవిషయములకొఱకు ప్రార్థింపక నారదమహర్షి వలె (నిర్హేతుకభక్తికొఱకు) ప్రార్థింతము! శ్రీరామచంద్రు నితో నారదు డిట్లు పలికెను: "శ్రీరామచంద్రా! నీపాదార విందములందు నాకు భక్తి ననుగ్రహింపుము." శ్రీరామచంద్రు డందులకు, "తథాస్తు!" అని వచించి, "నారదా! ఇంకేమియు వలదా?" అని ప్రశ్నించెను. నారదు డిట్లు పలికెను: "జగత్తు నంతయు సమ్మోహిత మొనర్చు నీమాయచే నేనాకృష్టుడను గాకుండునట్లు కటాక్షింపుము." రామచంద్రుడు, "తథాస్తు!"

అని మరల నిట్లు ప్రశ్నించెను: "నారదా! ఇంకేమియు వలదా?" "ప్రభూ! అదియే నా ప్రార్థన, ఇంకేమియు వలదు" అని నారదుడు బదులుచెప్పెను.

**454.** భగవానుడు సాకారుడో, నిరాకారుడో నీవు నిర్ణయించుకొనజాలవేని యిట్లు ప్రార్థింపుము: "ఓ సర్వేశ్వరా! నీవు సాకారుడవో, నిరాకారుడవో నేను గ్రహింపజాలను. ఏటులైనను నన్ను కృపజూడుము. నాకు ప్రసన్నుడవు గమ్ము!"

**455.** సామాన్యముగా జనులు విశ్వసించు భగవద్రూపములను అవతారములను కేవల మనఃకల్పితములని కొందఱు నిరసింతురుగాక, వానిని నమ్మక పోవుదురుగాక. కాని జగత్తును సృష్టించునట్టియు, నియమించునట్టియు ఒకానొక దివ్యశక్తికలదని నమ్మి, హృదయపూర్వకముగా, "ఓ సర్వేశ్వరా! నీ యథార్థస్వరూపమును నే నెఱుగను. నన్ననుగ్రహించి నీ సత్యస్వరూపమును నాకు జూపుము, నాకు సాక్షాత్కరింపుము" అని పరితాపముతో ప్రార్థించు వానిపై భగవానుడు తన కరుణాకటాక్షమును బఱపును.

**456.** నాయనలారా! భగవానుడు చీమ చిటుకుమన్న గ్రహించును. మీరు వానిని ప్రార్థించినపుడెల్ల మీ ప్రార్థన నతడాలకించియే యున్నాడు. ఎన్నటికైనను, తుదకు అవసానకాలముననైనను మీ కాతడు తప్పక సాక్షాత్కరించును. (చూ. 446.)

పదునొకండవ ప్రకరణము

# సాధకులు : మతభేదములు : సర్వమత సామరస్యము

**సర్వమతారాధ్యుడగు భగవంతు డొక్కడే—వివిధమతములు భగవత్ప్రాప్తి కనువగు వివిధమార్గములు—స్వమతదురభిమానమునకు కారణము, తన్నివారణము—మతభేదములయెడ నుండవలయు మనోభావము—రహస్యసంప్రదాయములయెడ నుండవలయు మనోభావము**

## సర్వమతారాధ్యుడగు భగవంతు డొక్కడే

457. నీరు ఒక్కటే. ఐనను దానిని జనులు వేర్వేఱు పేళ్లతో బిలుచుచుందురు. కొందఱు 'వాటర్' అందురు; కొందఱు 'వారి' యందురు; కొందఱు 'ఆక్వా' యందురు; మఱి కొందఱు 'పానీ' యందురు. ఇట్లే సచ్చిదానందస్వరూపమగు బ్రహ్మ మొక్కటే యయ్యును కొందఱు దానిని దేవుడనియు, కొందఱు అల్లాయనియు, కొందఱు హరి యనియు మఱికొందఱు బ్రహ్మమనియు సంబోధింతురు.

458. కుమ్మరిదుకాణములో కుండలు, కూజాలు, దాకలు, మూంకుళ్లు మొదలగునవి వేర్వేఱు ఆకృతులతో వేర్వేఱు పరిమాణములు గలవియై యుండును. కాని యివి యన్నియు ఒకే మట్టితో జేయబడుచున్నవి. అటులనే భగవంతు డొక్కడే యయ్యును వివిధ దేశకాలములందు వివిధనామరూపములతో పూజింపబడుచున్నాడు.

459. ఒకే పంచదారను చిలుకలు, ఏనుగులు మొదలగు వేర్వేఱు రూపములుగా పోతపోయవచ్చును. అటులనే మాధుర్యస్వరూపిణి యగు జగజ్జనని వివిధ దేశకాలములలో వివిధ నామరూపములతో పూజింపబడుచున్నది.

460. ఒకే బంగారముతో వేర్వేఱు నామరూపములుగల నగలు చేయబడుచందమున ఒకే భగవానుడు వివిధ దేశకాలములలో వివిధ నామరూపములతో ఆరాధింపబడుచున్నాడు. వేర్వేఱు భావముల, వేర్వేఱు విధానముల నాతడారాధింపబడుచున్నను.—అనగా భగవంతుని కొందఱు తండ్రియనియు, కొందఱు తల్లియనియు, కొందఱు సఖుడనియు, కొందఱు నాథుడనియు, కొందఱు తమ పెన్నిధానమనియు, మఱికొందఱు తమ చిన్ని ముద్దుబిడ్డడనియు భావనచేసి యారాధించుచున్నను—ఈవివిధ భావసంబంధములన్నిటి మూలముగను ఆరాధింపబడువాడు ఒకే భగవానుడు. (చూ. 477.)

461. శివుడా, విష్ణువా, ఎవరధికులని యొకసారి బర్ద్వాన్ మహారాజు నాస్థానమున పండితులనడుమ చర్చ బయలుదేఱినది. సభ్యులలో కొందఱు శివుడు అధికుడనిరి, మఱి కొందఱు విష్ణువనిరి. చర్చ తీవ్రరూపమును దాల్ప నొక పండితు డిట్లు విమర్శించి పలికెను: "అయ్యలారా! నేను శివుని జూడలేదు, విష్ణుని జూడలేదు. వారిరువురిలో ఎవరధికులో నే నెట్లు చెప్పగలను?" ఆవిధముగనే ఒక దేవతను మఱియొక దేవతతో బోల్చి తారతమ్యము నెంచబోకుము. దేవతలలో నీ కొక్కరి సాక్షాత్కారము లభించెనా, సమస్త

దేవతలును ఒకే బ్రహ్మముయొక్క స్వరూపములని నీవు గ్రహింపగలవు.

## వివిధమతములు భగవత్ప్రాప్తి కనువగు వివిధ మార్గములు

462. పెద్ద చెఱువునకు అనేకమైన రేవులుండును. స్నానము చేయుటకుగాని, పాత్రతో నీరు తీసికొనిపోవుటకుగాని యీ రేవులలో దేనిలో దిగినను నీటిని జేరవచ్చును. ఒక రేవు మఱియొక రేవుకంటె శ్రేష్ఠమైనదని వాదులాడుట వ్యర్థము. అటులనే బ్రహ్మానందసరోవరమునకు అనేకమైన రేవులున్నవి. ప్రపంచమందలి ప్రతిమతమును అట్టి యొకానొక రేవు. వినిర్మల హృదయుడవై నీ వీ రేవులలో దేనియందు ప్రవేశించినను తన్మూలమున బ్రహ్మానందమను జలమును జేరగలవు. కావున "నామతము మఱియొకని మతముకంటె శ్రేష్ఠ"మని వాదులాడబోకుము.

463. భగవంతుని నామరూపము లనంతములు. వీనిలో దేనిమూలముననైనను భగవంతుని ప్రాపింపవచ్చును. ఏ నామమున, ఏ రూపమున నీవు వాని నారాధించినను సరియే, తన్మూలముననే నీకు వాని సాక్షాత్కారము లభింపగలదు.

464. వేర్వేఱుమతసంప్రదాయములు ఒకే భగవంతుని ప్రాపించుట కనువగు వేర్వేఱుమార్గములు. కాళీఘట్టమందలి కాళీమాత యాలయమును జేరుటకు అనేకమార్గము లున్నవి. అటులనే ఈశ్వర సదనమును జేరుటకు మనకు అనేకమార్గము లున్నవి. ప్రతిమతమును ఇట్టి మార్గములలో కేవలము ఒకానొకమార్గము. (చూ. 467.)

465. కొన్ని సంవత్సరములకు పూర్వము హిందువులును బ్రాహ్మసమాజమువారును తమ తమ మతధర్మములను గూర్చి విశేషదీక్షతో—ఉత్సాహముతో—జనులకు బోధలు సాగించుచుండ, ఆమతములను రెండింటినిగూర్చియు, "మీ యభిప్రాయమే"మని యొకరు శ్రీగురుదేవు నడిగిరి. గురుదేవు డిట్లు సమాధాన మొసగెను: "ఈ యుభయపక్షములవారి మూలమునను నాజగజ్జనని తన కార్యమును సాగించుకొనుచున్నట్లు నాకు గాన్పించుచున్నది."

466. హిందూమతమునకును బ్రాహ్మసమాజ (మత)మునకును గల భేద మేమని యొక బ్రాహ్మసామాజిక భక్తుడు శ్రీగురుదేవుని ప్రశ్నింప, గురుదేవు డిట్లు పలికెను: "ఏకస్వరమునకును శ్రుతిసమ్మేళనముతో గూడిన రాగమునకును గల భేదమే ఈ రెండిటికిని గల భేదము. బ్రాహ్మసమాజము బ్రహ్మమను నొక్క-స్వరముతో తృప్తిపడుచున్నది; హిందూమతము వివిధ స్వరములతో గూడి మధురమైన రాగమై యొప్పుచున్నది." *

467. మేడమీదికి నిచ్చెనతోడనో, వెదురుసాయముననో, మెట్లమీదుగనో, త్రాటితో ఎగబ్రాకియో పోవచ్చును. అటులనే భగవంతుని జేరుటకు మార్గములును ఉపాయములును అనేకముగా నున్నవి. ప్రపంచమున ప్రతిమతమును అట్టి

---

* "సన్నాయిమేళమునం దొకడు 'ఊ' అని శ్రుతి నూదుచుండును. రెండవవా డనేక స్వరములతోడ సన్నాయిని వాయించుచుండును" అని యీసందర్భమున శ్రీరామకృష్ణపరమహంస తనతో బలికియున్నటుల శ్రీ అశ్వినీకుమారదత్తు తన 'భక్తియోగము'న వ్రాసియున్నాడు.

మార్గములలో ఒకానొకదానిని జూపును. (చూ. 464.)

468. (ఇచట 186-వ ప్రవచనమును జదువుకొనుడు.)

469. నక్కలన్నియు ఒక్కరీతిగనే ఊలవేయును. ఇట్లే జ్ఞానులందఱి బోధలును ఒకేవిధముగా నుండును.

## స్వమతదురభిమానమునకు కారణము, తన్నివారణము

470. సామాన్యుడు అజ్ఞానవశమున తన మతమే సర్వోత్కృష్టమని తలచుచు దానినిగూర్చి గడబిడచేయుచుండును; కాని తత్త్వజ్ఞానముచే వానిహృదయము వికసించినప్పుడు ఈ స్వమతాభిమాన కలహములన్నియు అంతరించును.

471. ఇద్దఱు మనుజులు ఊసరవిల్లిరంగునుగుఱించి తీవ్రముగా వాదులాడుచుండిరి. వారిలో నొక డిట్లు పల్కెను: "ఆ తాటిచెట్టుమీాది ఊసరవిల్లి చక్కనియెఱ్ఱరంగుగలది." ఆ మాటలను ఖండించుచు రెండవవా డిట్లనెను: "నీవు పొరపడినావు. ఆ ఊసరవిల్లి యెఱ్ఱనిది కాదు, నీలిది." వాదనచే నిర్ధారణకు రాజాలక వా రిరువురును వేఱొక మనుష్యునికడకు పోయిరి. ఆతడు ఆ చెట్టుక్రిందనే నివసించువాడు, ఆ ఊసరవిల్లిరంగుల నన్నిటిని గమనించినవాడు. వివాదపరులలో ఒకడు ఆతని గాంచి యిట్లనెను: "అయ్యా! ఆ చెట్టుమీాది ఊసరవిల్లి యెఱ్ఱగా నుండును కాదండీ?" అందుల కామనుష్యుడు, "ఔనయ్యా!" అనెను. అంత రెండవవాడు ఇట్లు ప్రతిఘటించెను: "ఏమి చెప్పెదరు? అట్లు పొసగును? అది యెఱ్ఱనిదికాదు, నీలిది." అందుల కా పెద్దమనుష్యుడు సవినయముగా, "ఔనండీ" అనెను.

ఆతనికి ఊసరవిల్లి రంగులు తఱచు మాఱుచుండునని తెలి యును. అందుచే నాత డిరువురివాదములకును "ఔా" నని యెను. అట్లే సచ్చిదానందమయు డగు భగవంతుడు వివిధ రూపములతో నొప్పుచుండును. ఒక్కరూపమున మాత్రమే భగవంతుని దర్శించినభక్తుడు ఆ రూపముదక్క మఱియొక రూప మెఱుగడు. కాని వివిధరూపములందు దైవసాక్షా త్కారము నొందిన యుత్తమభక్తుడుమాత్రమే "ఈ రూపము లన్నియు ఒకే భగవంతునివి, భగవాను డనంతరూపుడు గదా!" యనగల్గును. సాకారు డాతడే, నిరాకారుడు నాతడే. మఱియు నెవ్వరెఱుంగని యాతనిరూపము లనంత ముగా గలవు.

472. శాఖోపశాఖలతో గూడిన నాచి మురుగుగుంటల లోనే కాని మంచినీరు గల పెద్దచెఱువులలో పెరుగదు. అటు లనే స్వార్థపరత, కాపట్యము, స్వమతదురభిమానము మొద లగు దుర్గుణములకు దాసులగువారల కూటములందే శాఖోప శాఖలు పెరుగుచుండునుగాని, అకలంకులును, ఉదారభావ ములు కలవారును, స్వార్థరహితులు నగు సజ్జనులతోగూడిన మతములందు (శాఖోపశాఖలు) పెరుగజాలవు.

473. (మతధర్మములందు) శాఖోపశాఖలను గల్పింప వచ్చునా? ప్రవాహమున శాఖోపశాఖలు (నాచుతీగలు) పెరుగజాలవు, మురుగుగుంటలందు మాత్రమే పెరుగును. ఎవ్వనిమనస్సు సదా భగవానునిపై పునకు ప్రసరించుచుండునో అట్టిభక్తుడు ఇతరవిషయములనుగూర్చి చింతింపజాలడు. పేరు ప్రఖ్యాతుల నాశించువాడు మాత్రమే (మతధర్మము

లందు) శాఖోపశాఖలను సృష్టించుచుండును.

474. కోలకోలలతో, హద్దుగీతలతో నరులు తమ భూము లను పంపకము చేసికొనవచ్చును, కాని పైనున్న ఆకాశము నెవ్వరును పంచుకొనజాలరు. అఖండమైన యీ యాకాశము సర్వము నావరించుచున్నది. సర్వము (తనలో) ఇముడ్చు కొనుచున్నది. అజ్ఞుడు అవివేకముచే తన మత మొక్కటియే యథార్థమనియు, సర్వోత్కృష్టమైనదనియు వాదులాడు చుండును. కాని బ్రహ్మజ్ఞానముచే వానిహృదయము వికసించిన పిమ్మటనో, ఈ శాఖాసంప్రదాయ యుద్ధములకు అతీతమై అఖండసచ్చిదానంద బ్రహ్మము వెల్గొందు చున్నదని గ్రహించును.

## మతభేదములయెడ నుండవలయు మనోభావము

475. ఏ నామరూపములచే భగవాను నర్చించినను ఒకే భగవంతుడు కలడను నమ్మకముతో సాధనచేయువా రెల్ల రును భగవానుని బ్రాపించితీరుదురు.

476. ఏవిధముగా నీవు భగవానుని ధ్యానించినను, వాని నామములను కీర్తించినను, అభ్యుదయము నందగలవు. పంచ దారతో జేసిన యప్పమును తినునప్పుడు దానిని నిబ్బరముగా బట్టుకొనినను, వంకరగా బట్టుకొనినను సమానముగనే మధురముగా నుండును.

477. ప్రశ్న : అన్నిమతములవా రర్చించు దేవుడును ఒక్కడే యగునెడల వివిధమతావలంబకులు దేవుని వివిధ రీతులుగా వర్ణించు టేల ?

ఉ. భగవంతు డొక్కడే, కాని వాని నామరూపము లనేకములు. ఒకే గృహయజమానుడు ఒకనికి తండ్రి, ఒకనికి తమ్ముడు, ఒకనికి అన్న, ఒకామెకు మామ, మఱియొకామెకు భర్తయు గావచ్చును గదా? భక్తులు వారివారి భావనా విశేషములననుసరించి, అనుభవముల ననుసరించి, భగవంతుని వేర్వేఱువిధములుగా అభివర్ణించుచుందురు. (చూ. 460.)

478. జబ్బుపడిన తనబిడ్డలలో తల్లి యొకనికి అన్నము కూరయును, మఱియొకనికి సగ్గుజావను, వేఱొకనికి రొట్టెయు వెన్నయును బెట్టురీతిని భగవంతుడు వారివారి స్వభావముల కనుకూలించునటుల జనులకు వేర్వేఱుమార్గముల ననుగ్రహించియున్నాడు. (చూ. 327.)

479. వేదాంతమునకు శంకరాచార్యులు చేసిన యర్థము సత్యమైనదే, రామానుజులు చెప్పినదియు—అనగా వారి విశిష్టాద్వైతమును—సత్యమే!

480. కారుణ్యమున క్రైస్తవునివలెను, బాహ్యాచారములందు పట్టుదల జూపుచో మహమ్మదీయునివలెను, సర్వభూతహితమొనర్చునెడ హిందువునిగను వర్తించుట పాడి. (చూ. 482.)

481. ప్రజలతో మెలగునప్పుడు అందఱియందును నీకు ప్రేమానురాగము లుండవలయును; వారితో కలసి మెలసి వర్తింపుము, ఏకీభవింపుము. అంతియేకాని, "నీరు నిరాకార బ్రహ్మమును నమ్మక సాకారదైవమును నమ్ముదురు" అనియో, "సాకారదైవమును నమ్మక నిరాకార బ్రహ్మమును నమ్ముదురు" అనియో, "వీడు క్రైస్తవుడు,

వీడు హిందువుడు, వీడు మహమ్మదీయుడు" అని యో భేదము లెంచుచు, పెడమొగముపెట్టి వారిని ద్వేషింపబోకుము. భగవానుడు తన్నెంతవఱకు గ్రహింప ననుగ్రహించునో అంతవఱకే మానవుడు వానిని గ్రహింపగల్గుచున్నాడు.

అదిగాక, లోకులు భిన్నప్రవృత్తులు గలవారని* గ్రహించి, సాధ్యమైనంతవఱకు వారితో నీవు కలసిమెలసి వర్తింపవలయును, అందఱిని ప్రేమింపవలయును. అప్పుడు నీయింటికి (అంతరంగమునకు) మఱలి శాంతిని ఆనందము ననుభవింపగలవు. అందు స్వస్వరూపము గోచరించును.

482. ప్రతివ్యక్తియు తన మత ధర్మముల ననుసరింపవలయును. క్రైస్తవుడు క్రైస్తవమతమును మహమ్మదీయుడు మహమ్మదీయమతమును అనుసరింపవలయును. హిందువుడు ఋషులు అవలంబించిన సనాతనధర్మము నవలంబించుటయే సర్వోత్తమము. † (చూ. 480.)

483. నిజమైన జిజ్ఞాసువు ఇతరమతములనుగూర్చి బ్రహ్మజ్ఞానము నొందుటకు అవి యనేకమార్గములని భావింపవలయును. మన మెల్లప్పుడును ఇతరమతములయెడ గౌరవభావము గలిగి యుండవలయును.

---

* "లోకో భిన్నరుచిః."

† "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః."

లెస్సగా నాచరింపబడిన పరధర్మముకంటె గుణము లేనిదైనను స్వధర్మమే మేలు. స్వధర్మమునందు మరణము నొందుటయైనను మేలే. పరధర్మము భయావహము.

—భగవద్గీత, 3-3-5.

**484. వాదులాడకుము.** నీకు నీ మతమునందును అభిప్రాయములందును పట్టుదల యున్నపక్షమున పరులు తమ మతములందును అభిప్రాయములందును పట్టుదల గలిగియుండుటకు సమానస్వాతంత్ర్యము గలవారని యంగీకరింపుము. ఒకవేళ ఇతరులు పొరపడినను కేవలవాదముచే వారిని నీ వెన్నడును ఒప్పింపజాలవు. ఈశ్వరానుగ్రహము గలిగిననాడు ప్రతిమానవుడును తన పొరపాటును తానె తెలిసికొనగల్గును.

**485.** దివ్యభావపరవశుఁడై శ్రీగురుదేవు డొకనాడు జగన్మాతతో నిట్లు పలుకుచుండుట(ఒకరికి)వినవచ్చెను : "అమ్మా! ప్రతిమానవుడును తన గడియారమే సరియైనదని చెప్పుచుండును. క్రైస్తవులేమి, మహమ్మదీయు లేమి, హిందువులేమి, ఎల్లరును 'మామతమే యథార్థమత' మనుచుందురు. కాని, తల్లీ! ఎవ్వరి గడియారమును సరియైన కాలము తెలుపదు. నీతత్త్వము నెవ్వరు గ్రహింపగలరు? కాని పరితాపముతో నిన్ను వెదకువా డేమత మవలంబించినను, ఏమార్గ మనుసరించినను నీకృపవలన నిన్ను జేరును."

## రహస్య సంప్రదాయములయెడ నుండవలయు మనోభావము

486. విశేషమైన ఆత్మవికాసమును గాంచిన కొందఱు జనులు శాక్తేయులయొక్కయు వైష్ణవులయొక్కయు(సామాన్య నీతివిరుద్ధములుగ గాన్పించు) వామాచారములను గొన్నిటి నవలంబించుచుండిరను కారణమున శ్రీగురుదేవుని శిష్యులలో ప్రబలనైతికవాదులు కొందఱు తఱచు వారి మార్గము నధిక్షేపించుచు, అయ్యది తప్పని చెప్పసాగిరి. గురుదేవుడు ఆశిష్యుల

ఇట్లు తెల్పెను: "అందులకై వారిని నిందింపరాదు. ఏలన; ఆమార్గములు ఈశ్వరసాక్షాత్కారము గల్గించునని వారిదృఢ విశ్వాసము, మనఃపూర్వకముగా దేనిని నమ్మి సాక్షాత్కారమునకు సాధనగా నవలంబించినను దాని నధిక్షేపింప రాదు. ఏమార్గమైనను మనఃపూర్వకముగా నవలంబించిన యెడల సమస్త సాధనలకును పరిమావధియగు భగవంతుని పొందించును గావున ఏసాధకుని మార్గమును నిరసింపరాదు—ఖండింపరాదు. తనపద్ధతినే ప్రతిమానవుని భగవానుని ప్రార్థింప నిండు. పరుల మార్గముల నధిక్షేపింపకుడు, మఱియు స్వయముగా మీరు వానిని అవలంబింపను అవలంబింపకుడు.

487. రహస్య సంప్రదాయములయెడ తన శిష్యుల తీవ్ర విరోధభావమును తొలగించు తలంపున శ్రీగురుదేవుడు వానిని గూర్చి తన యభిప్రాయముల నొక్కక్కప్పు డిట్లు వెల్లడించు వాడు: "సరి, మీ రామార్గముల నెందులకు ద్వేషింపవల యును? అసహ్యకరమైనవైనను అవియు (భగవంతుని జేరు) మార్గములే యని గ్రహింపుడు. సింహద్వారమని, పెరటి గుమ్మమని, మఱుగుదొడ్డి నూడ్చుటకై పాకీవాండ్రు ప్రవేశించు గంతగుమ్మమని—ఇంటి కీవిధముగా అనేక ద్వారము లుండవచ్చును. వామాచారములును రహస్యసంప్రదాయ ములును ఇందు తుదిని జెప్పబడిన వానివంటివని గ్రహింపుడు. ఏద్వారమున బ్రవేశించిన నేమి? ఇంటిలోనికి వచ్చినంతనే ఎల్లరును ఒకేతావును జేరుచున్నారు కదా? కాని వారిని మీరు అనుకరింపబోయెదరా? వారితో మెలగెదరా? వలదు,

వలదు. కాని యేవిధమునను వారిని ద్వేషించుట మాత్రము తగదు.''*

*''త్రయీ సాఙ్ఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ,
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాపథజుషాం
నృణామేకో గమ్య స్త్వమసి పయసామర్ణవ ఇవ.''

శివమహిమ్న స్తోత్రము, 7.

వేదములు, సాంఖ్యమతము, యోగమతము, పాశుపతమతము, వైష్ణవ మతము, ఇవన్నియు మోక్షమునకు వివిధమార్గములను విధించుచున్నవి. తమతమ రుచిభేదము ననుసరించి ఈ మత ముత్తమమనియు, ఆ మతము తగినదనియు జను లవలంబించు మార్గములు వక్రములుగా గాన్పించినను, తిన్నగా గాన్పించినను సముద్రమును నదులవలె, ఓ పరమేశ్వరా! నిన్నే ప్రాపించుచున్నవి.

''యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః.''

—భగవద్గీత, 4-11.

అర్జునా! ఎవరెవరు ఏ ప్రకారముగా నన్ను తెలిసికొనుచున్నారో, వారలను అలాగుననే అనుగ్రహించుచున్నాను. మానవులు సర్వప్రకారములచేతను నా మార్గమునే అనుసరించుచున్నారు.

పంద్రెండవ ప్రకరణము

# పారమార్థిక జీవన ప్రధాన నియమములు

**ఆత్మవికాసమునకు ముఖ్యనియమములు—విశ్వాసము—శరణాగతి—ఇష్ట నిష్ఠ—సత్యము—బ్రహ్మచర్యము—వివేకము—వైరాగ్యము—సాధనయందు దీక్ష—సాధనయొక్క ఆవశ్యకత—ఏకాగ్రత : ధ్యానము**

## ఆత్మవికాసమునకు ముఖ్యనియమములు

488. దయ్యము పట్టిన వ్యక్తి తనకు దయ్యము పట్టినట్లు గ్రహింపగనే, అది వానిని విడిచివేయును. అటులనే మాయాభూతముచే ఆవిష్టుడైన జీవుడు తన్ను మాయ ఆవేశించినటుల గ్రహింపగనే మాయావిముక్తుడగును.

489. తనభావములయెడ ద్రోహి కానివాడే ఉత్తమగతిని బొందును. అనగా నిష్కాపట్యము, మనఃపూర్వకమైన నమ్మకము—ఇవియే భగవంతుని బొందుమార్గములు. (చూ. 448, 449.)

490. "'పుట్టెను బుట్టిన బుద్ధి పుడకలతోఁగాని పోదు' అనునట్లు ఎవ్వరికైనను నైజగుణము పోదు" అని యొకడు పలికెను. మఱియొకడు, "నిప్పు బొగ్గులలో బ్రవేశించి దానికి నైజగుణమగు నలుపును నాశనము చేయుటలేదా?" యని సమాధానము చెప్పెను. అటులనే జ్ఞానాగ్నిచే మనస్సు దహింపబడునేని, దాని నైజము నశింప, అది మనల నిక బంధింపజాలదు.

491. మనస్సే సర్వము. మనస్సు (సంసార) బద్ధమైన యెడల నీవును బద్ధుడవే. మనస్సు ముక్తమైనయెడల నీవును

ముక్తుడవే. చాకలి యింటికి తెచ్చిన తెల్లనిబట్టవలె మనస్సు ఏరంగునైనను దాల్పగలదు. ఆంగ్లభాష చదివితివా, నీయెఱుక లేకయే నీ సంభాషణలందు ఆంగ్ల పదములు దొరలుచుండును. సంస్కృత పారంగతుడైన పండితుడు శ్లోకముల నుదాహరించు చుండును. అది తప్పదు. దుస్సాంగత్యముచే మనస్సునకు గలుగు దుష్ప్రభావము తలపులందును సంభాషణలందును గనబడక తీరదు. సత్సాంగత్యమున నుండెనా, భగవంతుని దక్క మఱి దేనినిగూర్చియు చింతింపకుండును. మనస్సుయొక్క నైజము మన స్థితిగతుల ననుసరించి మాఱుచుండును.

492. మనస్సే సర్వము. భార్యయందలి అనురాగము ఒక విధమైనది, బిడ్డయందలి అనురాగము మఱియొకవిధమైనది. నరు డిద్దఱను ముద్దిడుకొనుచున్నాడు, కాని మనోభావ ములు వేఱు.

493. బంధము మనస్సుచే గలుగుచున్నది; ముక్తియు మనస్సుచేతనే గలుగుచున్నది. "నేను ముక్తుడను, భగవ త్పుత్రుడను! నన్ను బంధించువా రెవరు?" అని (మనఃపూర్వక ముగా) పలికినయెడల నీవు ముక్తుడవే యగుచున్నావు. ఒకనిని పాము కఱచినయెడల అతడు పూర్ణవిశ్వాసముతో—దృఢ సంకల్పముతో—"లేదు, విషము లేదు, లేనే లేదు" అని చెప్ప గల్గినయెడల నిశ్చయముగా వానికి విషమువలని బాధ తొలగి పోవును. (చూ. 514.)

494. (ఇచట 109-వ ప్రవచనము జదువుకొనుడు.)

## వి శ్వా స ము

495. కొందఱువిశ్వాసమును గ్రుడ్డినమ్మకమని నిరసింప మొదలిడిన యొక శిష్యునితో శ్రీగురుదేవు డిట్లు పలికెను: "మంచిది, 'గ్రుడ్డినమ్మక' మనగా నీయభిప్రాయమేమో చెప్ప గలవా? నమ్మక మనునదియే గ్రుడ్డిది కాదా? నమ్మకమునకు కన్నులున్నవా? 'నమ్మకము' అనికాని, 'జ్ఞానము' అనికాని చెప్పుము. కాదేని కొన్నిటియెడల నమ్మకము 'గ్రుడ్డి' దనియు, మఱికొన్నిటియెడల 'కన్నులు కల'దనియు చెప్పు నీవిచిత్ర భావ మేమో నాకు బోధపడకున్నది!"

496. నారాయణునియెడ విశ్వాసము లేకుండుటచేతనే నరుడు బాధపడుచున్నాడు. (చూ. 44.)

497. భగవంతునియందు శ్రద్ధాభక్తులు ఎవరికి అబ్బునో, ఎవరికి అబ్బవో శరీరలక్షణములచేతనే తెలిసికోవచ్చును. ఎముకలు పొటకరించుకొనియుండు బక్కవాడు, గుంటకన్నుల వాడు, మెల్లకంటివాడు—ఈజాతివానికి భక్తివిశ్వాసము లబ్బుట దుర్లభము.

498. పరుని జంపవలయు ననిన, కత్తులును కటారులును కావలయును, తనను తాను జంపుకొనుటకు సూదియే చాలును. ఇతరులకు బోధింపవలయు ననిన, అనేక శాస్త్రములను జదువ వలసియుండును; స్వయముగా సాక్షాత్కారము నొందుటకు ఒక్క మంత్రమునందు శ్రద్ధాభక్తులున్న జాలును.

499. ప్రశ్న: హిందువులలో అనేకశాఖాసంప్రదాయము లున్నవి గదా, మనము వానిలో దేని నవలంబింపవలయును?

ఉ. పార్వతి యొకసారి పరమేశ్వరు నిట్లు ప్రశ్నించెను: "నాథా! శాశ్వత బ్రహ్మానందమును బొందుటకు కీలక మేది?" "అందులకు శ్రద్ధయే కీలకము" అని పరమేశ్వరుడు సమాధానము చెప్పెను. కావున శాఖా సంప్రదాయములలో ఏమియు లేదు. ప్రతిమానవుడును తన సంప్రదాయమునందలి నియమములను సాధనలను శ్రద్ధాభక్తులతో అవలంబించుట పాడి. (చూ. 482.)

500. 'పిండి కొలదియు రొట్టె' యనునట్లు భక్తికొలదియు పారమార్థికజ్ఞానము. శ్రద్ధాభక్తులు లేనితావున తత్త్వజ్ఞానమును వెదకుట పిచ్చిపని. మేతవిషయమున ఊరక లేని బోని విచక్షణచేయు నావు పాల విషయమున వెనుకబడియుండు టంద తెలిసినదే. కాని, గడ్డి, గాదము, చిట్టు, తవుడు, ఆకులు మొదలగు అన్ని విధములైన ఆహారమును ఆప్యాయముతో దిను నావు చక్కగా పాలిచ్చును. అట్టి యావుపొదుగునుండి కుంభవృష్టిగా పాలు లభించును.

501. ఎవ్వనికి నమ్మిక కలదో వానికి అన్నియు నున్నట్లే; ఎవ్వనికి నమ్మిక లేదో వానికి అన్నియు లోటే.

502. ఈశ్వరసాక్షాత్కారము కావలయు నందువా, పూనికతో—దృఢవిశ్వాసముతో—నామజపముచేయుము: నిత్య మేదియో అనిత్య మేదియో వివేచనచేయుము.

503. పసిబాలుని నమ్మికను బోలు నమ్మిక లేనియెడల ఈశ్వరసాక్షాత్కారము పొందుట యసాధ్యము. ఎవనినైనను జూపి, "ఆతడు నీయన్న" యని తల్లి చెప్పినయెడల బిడ్డడు వానిని నిజముగా తన యన్నయని భావించును.

"అలు పోకుము. అక్కడ బూచి యున్నది" అని తల్లి చెప్పిన పక్షమున అక్కడ ఏదియో బూచి యున్నదనియే బిడ్డడు నమ్మును. ఇట్టి పసివాని విశ్వాసమువంటి విశ్వాసముగల నరునిపైని భగవంతునకు కరుణ గల్గును. ఊరక లాభనష్టములనుగుఱించి అంచనాలు వేయుచుండు లౌకిక బుద్ధులు భగవంతుని బొందుట దుర్లభము.

504. ఒకనాడు శ్రీకృష్ణుడు అర్జునునితో రథమెక్కి వెడలుచు, ఆకసమువంక జూచి, "అర్జునా! పావురములు ఎంతచక్కగా బారులుతీరి యెగురుచున్నవో. చూడు!" మనియెను. అర్జునుడు వెంటనే ఆయనవైపు దృష్టినిగిడ్చి, "బావా! నిజమే. చాలచక్కనిపావురములు సుమీ!" అనియెను. మఱుక్షణముననే శ్రీకృష్ణుడు మఱల చూచి యిట్లు పలికెను: "కాదోయి! అవి పావురములవలె గాన్పించుటలేదు." అర్జునుడు మఱల చూచి, "నిజమే! అవి పావురములు కావే!" అనియెను. ఇందలి భావమేమో గ్రహింపుడు. సత్యసంధుడగు నర్జునుడు కేవలము శ్రీకృష్ణుని పొగడుటకై ఆతడు చెప్పినదానికెల్ల తలయూపెనని తలపజాలము. కాని యాతడు శ్రీకృష్ణుడేమి చెప్పినను వెంటనే ప్రత్యక్షముగా గాంచునంతటి దృఢవిశ్వాసము గలవాడు.

505. పంచదారపానకమును కనకనలాడు నిప్పుపై బెట్టి పాకము పట్టుము. దానిలో మాలిన్యమున్నంతవఱకు ఆపాకమునుండి పొగయు కళపెళమను శబ్దమును వచ్చుచుండును. కాని మాలిన్యమును లేక తెట్టను తొలగించినపిమ్మట పొగయు శబ్దమును అణగును; స్వచ్ఛమైన పాకము పొంగుల్ను

దేఱుచుండును, అప్పుడది గడ్డకట్టినను పలుచగా నున్నను దివ్యముగా నుండును; దేవతలకుగాని, మానవులకుగాని పరమానందప్రదమై యొప్పును. శ్రద్ధాభక్తులు గలవానినడవడి యిట్టిది.

**506.** ఒకడు నదిని దాటవలసివచ్చెను. ఒక సిద్ధుడు వానికొక తాయెతు నిచ్చి, "ఇది నిన్ను నదిని దాటించును" అని చెప్పెను. ఆతడు దానిని గైకొని నదిమీదుగా నడచి పోవుచుండెను. కాని సగముదూరము పోవుసరికి, తన కంత యద్భుతశక్తి నొసగిన యాతాయెతులో నే మున్నదో చూడవలయునని వానికి కుతూహలము కలిగెను. అంత దానిని విప్పిచూడ నొకకాగితముపై పావనమగు రామనామము లిఖింపబడియుండెను. అది గని, "ఇదియేనా ఇందలిరహస్యము" అని తృణీకారభావము పొందెను. ఈ యవిశ్వాసము కలిగినంతనే ఆతడు నదిలో బుడుంగున మునిగిపోయినాడు. భగవన్నామమందలి శ్రద్ధాభక్తులు అద్భుతకార్యములను జేయగలవు. శ్రద్ధయే జీవనము, అశ్రద్ధయే మరణము.*

**507.** ఒకశిష్యుడు తనగురువనంతశక్తియందఖండవిశ్వాసము గలవాడై, గురునామస్మరణమాత్రమున నీటిపై నడచి పోవుచుండెను. దానిని గాంచి యాగురువు ఇట్లు తలచెను: "ఆహా! కేవలము నా నామమునందే యింతటి మహిమ మున్నయెడల నే నెంతటి మహాత్ముడనో, శక్తిమంతుడనో!" మఱునాడు గురువు, 'నేను,' 'నేను,' 'నేను;' అనుచు ఆనది

---

* "శ్రద్ధామయోఽయం పురుషః యో యచ్ఛ్రద్ధస్స ఏవసః."-గీత, 17-3.

పైని నడచిపోవ యత్నించెను. కాని యతడు నదిలో అడుగు పెట్టెనో లేదో, అందు మునిగిపోయెను. ఈదుద మనుకొన్నను పాప మాతనికి ఈతకూడ తెలియదయ్యెను. విశ్వాసము అద్భుతకార్యములను సాధించును; అహంభావమో, వినాశము దెచ్చిపెట్టును.

508. సాక్షాదవతారమూర్తియగు శ్రీరామచంద్రుడు లంకలోనికి బోవుటకై సముద్రమునకు సేతువు గట్టవలసి వచ్చెను. కాని యాతని భక్తుడును సేవకుడునగు హనుమంతుడు రామనామమందలి యఖండ విశ్వాసముచే ఒక్కదుముకున సాగరమును లంఘించెను. కేవల విశ్వాసమహిమచే స్వామికంటె సేవకుడే ఎట్లు ఘనతరకార్యమును జేయగల్గెనో చూడుడు!

509. బ్రహ్మహత్యాపాపమునకు పాల్పడిన యొకరాజు తాను ఎట్టి ప్రాయశ్చిత్తము చేసికొని పునీతుడు కాగల్గునో తెలిసికొనుటకై యొక ఋష్యాశ్రమమునకు వెడలెను. ఆశ్రమమున ఋషి లేడుగాని యాతనికుమారు డుండెను. రాజు వచ్చినపనిని దెలిసికొని, "ముమ్మారు రామనామ స్మరణముచేయుము, నీ పాపపరిహారమగును" అని యాతడు ప్రాయశ్చిత్తము విధించెను. పిమ్మట ఋషి వచ్చి తన కుమారుడు విధించిన ప్రాయశ్చిత్తమునుగూర్చి విని కుపితుడై యిట్లు పలికెను: "రామభగవానుని నామమును ఒక్కసారి యుచ్చరించినంతనే కోటిజన్మములలో జేసిన పాపము లన్నియు హరించునే! ఓరీ! మూఢుడా! నీవెంతటి విశ్వాసహీనుడవు! అట్టి పవిత్రనామమును మూడుసార్లు ఉచ్చరింపుమని విధిం

చితివా ? నీవిశ్వాసహీనతకు ఫలముగా చండాలుడవై పుట్టుము." ఆతడే రామాయణమున పేర్కొనబడిన గుహుడు.

510. సామ్మురాయి అనేకసంవత్సరములు నీటిలో బడి యుండవచ్చును, కాని యొకచుక్క నీరైనను దానిలోని కెక్కదు. కాని మృత్తిక నీటిస్పర్శ తగులగానే మెత్తబడి పోవును. అటులనే దృఢవిశ్వాసముగలవాని హృదయము ఎన్ని బాధలు వచ్చినను, ఎన్ని హింసలకు గుఱియైనను క్రుంగి పోదు. దుర్బలవిశ్వాసము కలవానికో, ఇసుమంత కష్టము ప్రాప్తించినంతనే చంచలించిపోవును. (చూ. 201.)

511. (ఇచట 240-వ ప్రవచనము జనువుకొనుడు.)

512. భావన ననుసరించియే సిద్ధియు గలుగును.* భ్రమరమునుగూర్చి కీటకము సదా భావనచేయుటవలన ఆ కీటకమే భ్రమరముగా నగునని చెప్పుదురు.† అటులనే బ్రహ్మానందమునుగూర్చి సదా భావనచేయువాడు (తుదకు) బ్రహ్మానందమయుడగును. (చూ. 515.)

513. ఆజన్మాంతము పాపమునుగూర్చియు నరకమును గూర్చియు ప్రలాపింపనేల ? భగవన్నామస్మరణమొనర్చి, "ఓతండ్రీ! పరమేశ్వరా! నేను చేయరానిపనుల నెన్నో

---

* "యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ,
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః
మన్త్రే తీర్థే ద్విజే దైవే దైవజ్ఞే భేషజే గురౌ,
యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ.'

† దీనినే భ్రమరకీటన్యాయ మందురు.

చేసితిని ; చేయవలసినపనుల నెన్నో చేయక విడిచితిని.. తండ్రీ! నన్ను క్షమింపుము!'' అని యొక్కసారి మొఱపెట్టుము; భగవంతునియందు సుస్థిరవిశ్వాసముంచుము, తప్పక పాప విముక్తుడ వగుదువు.

514. మన దేశమున వైద్యులలో కేవలము విశ్వాసమును గొలిపి రోగమును కుదుర్చువారు కలరు. రోగులకు వారు, '' 'రోగమనునదియే లేదు' అని పూర్ణవిశ్వాసముతో మఱల మఱల స్మరింపుడు''అని విధింతురు. రోగగ్రస్తులటుల స్మరించి యామనోభావముయొక్క మహిమచేతనే ఆరోగ్యమును బొందగల్గుదురు. పాపినని—నైతిక దుర్బలుడనని—తలపోయసాగితివా, అచిరకాలముననే అటులగుదువు. నీవు అఖండ శక్తిమంతుడవని—మహా మహిమాన్వితుడవని—గ్రహింపుము, విశ్వాసము పూనుము ; తుదకు నీవు అఖండ శక్తిమంతుడ వగుదువు, మహామహిమాన్వితుడ వగుదువు. (చూ. 493.)

515. జీవుడనని భావించువాడు జీవుడుగనే యుండును ; దేవుడనని భావించువాడు దేవుడే యగును. మనము ఎట్లు భావింతుమో అట్లగుదుము. (చూ. 512, 513.)

## శ ర ణా గ తి

516. ''పరమేశ్వరేచ్ఛయే జరుగుగాక'' యని నిర్మలమైనభక్తితోడను నిష్కపటమైనవిశ్వాసముతోడను ఎవ్వడు పరమేశ్వరునకు తన్ను తాను సమర్పించుకొనునో అట్టివాడు శీఘ్రముగా సాక్షాత్కారము బొందును.

517. సంసారమున నుండుటకాని సంసారమును త్యజించుట కాని పరమేశ్వరేచ్ఛపై నాధారపడియున్నది. కాబట్టి సర్వము ఆ పరమేశ్వరునికే సమర్పించి కర్మముల నొనర్పుము. అంతకంటె నీవు చేయగల్గినదేమి ?

518. ఆరుబయటను పొలములో నున్న చిన్న గుంటయందలి నీరు, ఎవ్వరును వాడుకొని హరింపకున్నను త్వరలోనే ఎండిపోవును. అటులనే పాపాత్ములొక్కొక్కప్పుడు పరమేశ్వరుని కరుణను కృపను అనన్యగతిగా నమ్ముకొని కేవలము వానికి ఆత్మార్పణముచేసికొని తరింతురు.

519. (ఇచట 271-వ ప్రవచనము జదువుకొనుడు.)

520. ముక్త్యారునామా (Power of attorney) కు మించిన సులభతరమును సురక్షితమునగు మార్గము వేఱులేదు. ఇచట ముక్త్యారునామా అనగా 'నాది' యనుభావము పూర్తిగా విడిచి సర్వేశ్వరేచ్ఛకు సంపూర్ణముగా తన్ను తాను సమర్పించుకొనుట యని భావము.

521. కోతి తిరుగులాడుచుండ దానిపిల్ల తల్లిని గట్టిగా అంటిపట్టుకొనియుండును. పిల్లికూనయో, అటులగాక జాలి పుట్టునట్లు 'మ్యావు, మ్యావు' మనుచుండును; అంత తల్లి దానిని మెడపట్టుకొని (సురక్షితమైనచోటికి) తీసికొని పోవును. కోతిపిల్ల తనయొక్క పట్టును విడిచెనా, క్రిందపడి హానిపొందును. ఎందుచేత ననగా అది తన బలమునే నమ్ముకొనియున్నది. కాని పిల్లిపిల్లకు అటువంటిభయము లేశమును లేదు, తల్లియే దానిని ఒకచోటినుండి మఱియొకచోటికి తీసికొనిపోవును. పరమేశ్వరునకు పూర్తిగా ఆత్మా

ర్పణము చేసికొనుటకును తన్ను తాను నమ్ముకొనియుండుట కును గల భేద మిటువంటిది. * (చూ. 805.)

522. ఒకడు తన ఇరువురు బిడ్డలను (కుమారులను) దీసికొని పొలముమీదుగా బోవుచుండెను. ఒక బాలు నెత్తికొనినాడు. రెండవవాడు తండ్రిచేతిని బట్టుకొని నడచు చుండెను. అంత వారికి ఆకాశమున నెగురుచున్నయొక గాలి పటము కాన్పింప, తండ్రిచేతిని బట్టుకొనిన బాలుడు తన పట్టును విడిచి చప్పట్లుగొట్టుచు, "నాన్నా! నాన్నా! అదిగో; గాలిపటము!" అని యానందముతో కేకలిడసాగెను. ఇంతలో ఆ బాలుడు తడబడి పడిపోయెను. దెబ్బలు తగిలి నవి. తండ్రి యెత్తుకొనిన బాలుడును ఆనందముతో చప్పట్లు గొట్టినాడు. కాని తండ్రి పట్టుకొనియుండుటచే క్రిందబడ లేదు. ఆధ్యాత్మికవిషయమున స్వయంసాహాయ్యమును—పురుషకారమును—నమ్ముకొనువాడే ఇందు మొదటిబాలుడు, భగవంతునకు ఆత్మార్పణము చేసికొనువాడే రెండవ వాడు.

523. వేయిచిల్లులు గల కడవతో నీళ్లు తెచ్చి శ్రీమతి (రాధాదేవి) తన పవిత్రతను ఋజువుచేసికొనవలసివచ్చి నప్పుడు ఒక్క నీటిబొట్టైన క్రిందబడకుండ తేగల్గెను. దానిని గాంచి యందఱును "ఇట్టి పతివ్రత ఇంతకు ముందు లేదు. ఇకముందు ఉండబోదు" అని వక్కాణించుచు ఆ మెను

* ఇందు మొదటిది (ఈశ్వరునకు ఆత్మార్పణము) మార్జాల కిశోర న్యాయమనియు రెండవది (ఆత్మవిశ్వాసము, లేక పురుషకారమందలి నమ్మిక) మర్కట కిశోరన్యాయమనియు జెప్పబడును.

విశేషముగా కొనియాడసాగిరి. అంత రాధాదేవి యిట్లు పలికెను : “ నన్నేల నుతించెదరు ? కృష్ణునకు జేజేలుపెట్టుడు ! ఆ మహిమమంతయు ఆతనిదికాని నాదికాదు. నేను కేవలము ఆతని సేవకురాలను ! ”

524. సంపూర్ణమైన ఆత్మార్పణస్థితి యెట్టిదో తెలియునా? దినమంతయు కష్టపడి పనిచేసి యలసియున్నవాడు దిండుపై జేరబడి తీఱుబడిగా చుట్టకాల్చుకొనుచు అనుభవించు సుఖవిశ్రాంతి వంటిది. అపు డంతయు కేవల నిర్విచారము!

525. అన్నము తిని పారవేసిన ఆకువలె లోకమున మనుము. అది యొకప్పు డింటిలోనికిని మఱియొకప్పుడు పెంటమీదికిని గాలిచే నెగురగొట్టబడుచు, దానికి వశమై యుండును. దైవవశమున నీ విప్పుడిక్కడ నున్నావు, మంచిది, ఇట్లేయుండుము. ఇందుండి తీసివేసి దైవము మఱల ని న్నింత కంటె ఉత్తమస్థితిలో నుంచుననుకొనుము. అపుడు నుపూర్తిగా అసంగుడవై, “ దైవేచ్ఛయే జరుగుగాక ! ” యను నాత్మార్పణబుద్ధితో నుండుము. ఏమి జరిగినను జరుగుగాక, నీవుమాత్రము నిశ్చింతుడవై యుండుము.

## ఇ ష్ట ని ష్ఠ

526. కుటుంబమున అత్తమామలయెడ కోడలు విధేయురాలై వారిని గౌరవించుచు వారికి సేవలుచేయుచుండును. వారి నెన్నడును నిరసింపదు, వారిమాటను జవదాటదు. ఐనను తనపెనిమిటిని అందఱికంటెను హెచ్చుగా ప్రేమించును. అటులనే నీయిష్టదైవమునెడ భక్తిశ్రద్ధలు వహింపుము ; కాని

యితర దేవతలను నిరసింపకుము. వారినిగూడ పూజింపుము. సమస్తదేవతలును ప్రేమమూర్తియగు పరమేశ్వరుని రూపములే కదా!

527. అష్టకాష్ఠము అనునాటలో పాచికలు అన్ని గదులను దాటిపోయి, తిరిగిరాకుండ నడిమిగదిని జేరి పండవలయును. నడిమిగదిని జేరువఱకును ఏపాచికైనను ప్రారంభించిన చోటికే మఱలమఱల పోవుచు చాలసార్లు పాడిన పాటనే పాడవలసివచ్చును. కాని రెండుపాచికలు జంటగా ఒకగదినుండి మఱియొకగదికి బోవుచుండు నెడల, ఏయాటకాడును వానిని వెనుకకు నెట్టివేయజాలడు. అటులనే లోకము (అనునాటపాళి)లో ఆధ్యాత్మికయాత్ర సాగించువారు గురువును ఇష్టదైవమును శరణుజొచ్చినయెడల మార్గమున అవరోధములను బాధలను గుఱించి భయపడవలసిన అవసరము ఉండదు. వారి పురోగమనము సరళముగా, నిరాటంకముగా సాగును.

528. కలకత్తాకు పోవుమార్గము లనేకములు కలవు. సంశయశర్మ యనువాడు అచటికి పోవలయునని దూరముననున్న తన యూరినుండి బయలుదేఱెను. దారిలో అతడు, "నేను శీఘ్రముగా కలకత్తా జేరు మార్గమేది?" అని యొకని నడుగగా ఆతడు, "ఇదిగో, ఈమార్గము ననుసరించి పొమ్ము" అని చెప్పెను. ఆదారిని కొంతదూరము వెడలి సంశయశర్మ వేఱొకని జూచి, "కలకత్తాకు దగ్గఱత్రోవ ఇదేనా?" అని యడిగెను. ఆ మనుష్యుడు, "అయ్యో! ఇది కాదు, వెనుకకు మఱలి యెడమచేతివైపుననున్న త్రోవను బోవలయును" అనెను. ఆ మార్గమునుబట్టి కొంతదూరము పోయి సంశయ

శర్మ మఱల మఱియొకని జూచి త్రోవ యడిగెను. ఆతడు మఱియొకత్రోవ జూపినాడు. ఇట్లు పదేపదే త్రోవలను మార్చుకొనుచు సంశయశర్మ ప్రొద్దు గ్రుంకువఱకు నడిచెను, కాని బయలుదేఱినచోటినుండి ఎంతయో దూరము పోలేదు. నిజముగా కలకత్తాకు బోదలచినవాడు నమ్మదగిన యొకడు చూపిన ఏదియో యొక మార్గమునుబట్టి పోవలయును. అటులనే భగవంతుని ప్రాపింపగోరువాడు ఉత్తముడగు నొకానొక గురువు నాశ్రయించి యాతడు జూపు మార్గమును శ్రద్ధాభక్తులతో అనుసరింపవలయును.

529. ఒకడు నూయి త్రవ్వనారంభించినాడు. నాలుగైదు బారలలోతు త్రవ్వి నీరు గానక మఱియొకచోటును నిర్ణయించి అక్కడ ఇంకను లోతుగా త్రవ్వినాడు. కాని అక్కడను నీరు పడకపోవుటచే మఱియొకతావును నిర్ణయించి అక్కడ మఱింత లోతుగా త్రవ్వినాడు, కాని ఫలము కలుగలేదు. తుదకు విసిగివేసారి ఆపనినే విడిచిపెట్టినాడు. ఈమూడు నూతులలోతును కలిపిన పాతికబారలకు కొంచెము తక్కువగా నుండును. ఒకచోటు విడిచి మఱియొకచోట త్రవ్వనారంభించుటకుబదులు తాను బడిన శ్రమలో సగబాలైనను ఓపికతో మొదటి నూతికే వినియోగించిన పక్షమున వానికి నీరు లభించియుండెడిది. ఈ మతముకాదని ఆమతము, ఆమతము కాదని మఱియొకమతము—ఈ విధముగా మతధర్మములను ఊరక మార్చుకొనుచుండువారి విషయము కూడ నిట్టిదే. ఏదైన ఒక్కమతమును నమ్ముకొని దానినే శ్రద్ధాభక్తులతో సాధనచేసినయెడల తప్పక విజయము చేకూరును.

530. పతివ్రతయగు స్త్రీ జన్మజన్మాంతరములయందు సైతము భర్తతో ఎడబాటు లేకుండును. అటులనే ఇష్ట దైవమునెడ శ్రద్ధాభక్తులుగలవాడు నిశ్చయముగా భగవానునితో ఐక్యము పొందును.

## సత్యము

531. కాపట్యమును వంచనను విడిచి యంతరంగమున భక్తికలిగియుండుము. వర్తకముగాని, ఇతరమైన ఉద్యోగముగాని జేయువారు కూడ సత్యమును పరిపాలింపవలయును: సత్యమే ఈ కలియుగమునకు విధింపబడిన తపస్సు.

532. సదా సత్యసంధులై యుండిననేకాని యెవ్వరును సత్యమూర్తియగు భగవంతుని గనజాలరు.

533. పూనికతో సదా సత్యమునే పలుకవలయును.* సత్యసంధతమూలమున భగవంతుని గాంచనగును.

534. కృత్రిమ మెప్పుడును చెడుగే. కృత్రిమవేషము సైతము చెడ్డదియే. మనస్సు నీవేషమునకు అనుగుణముగా నుండనియెడల మహాపదల పాలగుదువు, ఘోరవినాశము పాలగుదువు. ఈరీతిగనే నరుడు మోసగాడై తప్పుపనులు చేయుటకుగాని, అసత్య మాడుటకుగాని జంకకుండును.

535. ఒకడు చాల ఋణములుచేసి తన బాధ్యతను తప్పించుకొనునిమిత్తము పిచ్చియెత్తినటుల నటింపసాగెను.

---

* "సత్యం వద"—తైత్తిరీయోపనిషత్తు.

"సత్యాన్నాస్తి పరో ధర్మః." (సత్యమును మించిన ధర్మము లేదు.)

వైద్యులు వానికి రోగనివారణచేయజాలరైరి; ఔషధములు ఇచ్చినకొలదియు వానిపిచ్చి హెచ్చగుచుండెను. తుదకొక బుద్ధిశాలియగు వైద్యుడు నిజము కనుగొని వానిని చాటునకు దీసికొనిపోయి యిట్లు మంత్రలించెను: "అయ్యా! ఇటుల చేయుట తగునా? పిచ్చియెత్తినటుల నటించుటచే నిజముగా పిచ్చివాడవే కాగలవుసుమీ! ఇప్పటికే నీయందు కొన్ని ఉన్మాదచిహ్నములు నాకు గాన్పించుచున్నవి." ఈ హెచ్చరిక వానిని మేల్కొల్పెను. వానిదోషము వానికి గోచరించెను. అంత నాతడు పిచ్చివానివలె నటించుట మానివేసెను. మానవుడు సదా ఎట్లు నటించునో నిజముగా అట్టివాడే యగును.

## బ్రహ్మచర్యము

536. అస్ఖలిత బ్రహ్మచర్యమూలమున తనశక్తిసామర్థ్యములను పవిత్రతను కాపాడుకొనువాని నిర్మలహృదయమున పరమేశ్వరుని దివ్యమంగళస్వరూపము అద్దమున ముఖము ప్రతిబింబించునటుల ప్రతిబింబించును. (చూ. 221, 650.)

537. అఖండబ్రహ్మచర్య మవలంబించిననేకాని ఆధ్యాత్మికరహస్యముల నెవ్వరును గ్రహింపజాలరు.

538. శుకదేవుడు ఊర్ధ్వరేతస్కుడు—ఆత డెన్నడును వీర్యస్ఖలనము పొందలేదు. ధైర్యరేతస్కులను నింకొకతరగతివారు కలరు. వీరిదివఱకు వీర్యస్ఖలనము నొందినను ఇప్పుడు అస్ఖలితబ్రహ్మచర్యమును బరిపాలించుచున్నారు. పండ్రెండేండ్లు ఎవ్వడైనను ధైర్యరేతస్కుడై యుండునేని అమానుషశక్తిని బొందును. వానియందొక క్రొత్తనాడి బయలు

దేఱును. అదియే మేధానాడి. తన్మూలమునవాతడు సమస్తము జ్ఞప్తికి దెచ్చుకొనగల్గును, సమస్తము గ్రహింపగల్గును.

539. పండ్రెండేండ్లు ఎవ్వడైనను బ్రహ్మచర్యమును బరిపాలించునేని వానియందు మేధానాడి వికసించును. (అనగా వాని శక్తిసామర్థ్యములును గ్రహణశక్తియు వికాసము నొందును.) అత్యంతసూక్ష్మవిషయములను సైతము అవలీలగా గ్రహించునంతటి శక్తిసంపన్నుడగును. ఇట్టిగ్రహణ శక్తితోడనే మానవుడు భగవంతుని దెలిసికొనగల్గును. ఈరీతి నిర్మలప్రజ్ఞచేతనేకాని భగవత్సాక్షాత్కారము పొందజాలము.

540. వీర్యనష్టమువలన శక్తిసామర్థ్యములు క్షీణించును.* తన యెఱుకలేకయే కలుగు (స్వప్న)స్ఖలనము ఒక లెక్కలోనిదికాదు. అయ్యది ఆహారదోషముచే సంభవించును. కాని, ఉత్తమపారమార్థికుడగువానికి స్త్రీతో ఎట్టిసంపర్కము నుండరాదు.

541. స్త్రీభోగమును విడిచినవాడే ప్రపంచమును త్యజించినవాడు! భగవానుడు వానికి అత్యంతసన్నిహితుడు!

## వి వే క ము

542. వివేకము నవలంబింపుము. కామినీకాంచనములు మిథ్యాభూతములు, భగవంతుడొక్కడే సత్యము. ధనము

* "మరణం బిన్దుపాతేన జీవనం బిన్దు ధారణాత్"—శివసంహిత.
"బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్య లాభః."
—పాతంజలయోగసూత్రములు, 2. 38.

వలన నేమి ప్రయోజనము? మన కది అన్నవస్త్రములను నివసించుటకు ఇంటిని ఇచ్చును,—అంతే. ధనమువలన నీ వెన్నటికిని భగవంతుని గనజాలవు. ధనము పరమపురుషార్థము కాదు. ఈవిధమైన విచారమే వివేకము. కాంచనములోగాని, స్త్రీసౌందర్యములోగాని ఏమున్నది? వివేకము వినియోగించి చూచినచో, మహాసుందర స్త్రీశరీరము సైతము రక్తము, మాంసము, చర్మము, ఎముకలు, క్రొవ్వు, మజ్జ,—తుదకు ఇతర జంతు శరీరములవలెనే—ప్రేగులు, మలము, మూత్రము మొదలగువానితో గూడుకొనియున్నదని బోధపడును. భగవంతుని మఱచి యీ తుచ్ఛకళేబరముపై మానవుడు తనమనసు నిలుపుట ఎంతవిచిత్రము!*(చూ. 395,545.)

543. వివేకవైరాగ్యముల నవలంబింపుడు. నిత్యమేదియో అనిత్య మేదియో గ్రహించుటయే వివేకము; విషయ భోగములందు రాగములేకుండుటయే వైరాగ్యము. వివేక వైరాగ్యములు ఆకస్మికముగా లభించునవి కావు, వానిని అనుదినము అభ్యాసము చేయవలయును. కామినీకాంచనములను మొట్టమొదట మానసికముగా విడచిపెట్టవలయును; భగవదనుగ్రహమువలనే చిత్తశుద్ధి కల్గినప్పుడు బాహ్యముగను ఆంతరముగనుకూడ విసర్జింపనగును. అభ్యాసయోగముచే—నిరంతరధ్యాన సాధనలచే—కామినీకాంచనములయెడ వైరాగ్య మబ్బును—

* "అమేధ్య పూర్ణం క్రిమి జన్తు సఙ్కులమ్
స్వభావ దుర్గన్ధ మశౌచ మధ్రువమ్,
కళేబరే మూత్ర పురీష భాజనే
రమేత మూఢో న రమేత పణ్డితః."

గీతయందును ఇట్లే చెప్పబడియున్నది. † నిరంతరసాధనచే అసాధారణశక్తి కలుగును. అపు డింద్రియములను—కామాదులను—సులభముగా నిగ్రహింపగల్గుదుము. అవయవములను బొరుసులోనికి లాగుకొనిన తాబేటిని నీవు ముక్కముక్కలుగా నఱికినను అది తన యవయవములను ఈవలికి తీయదు. ఇంద్రియనిగ్రహమనగా ఇట్టిది. ‡

**544.** ప్రశ్న : జగత్తు మిథ్యయా?

ఉ. నీవు భగవంతుని గనజాలనంతవఱకు జగత్తు మిథ్యయే. సమస్తము భగవత్స్వరూపముగా గనుటకుబదులు, "నేను, నాది" యను పాశములచే మానవుడు సంసారబద్ధు డగుచున్నాడు. అట్లు అజ్ఞానమోహితుడై, విషయాసక్తుడై, సంసారకూపమున బడిపోవుచున్నాడు. తరణోపాయము స్పష్టముగా గోచరించుచున్నను మాయ తనజాలమునుండి మానవులను వెలువడనీయదు, తనయొక్క మోహముచే వారిని అంధులను జేసివైచును. విచారించిన, ఈ సంసార మెంత అనిత్యమో నీకే తెలియగలదు. మనము నివసించు నింటినిగూర్చి క్షణమాలోచింపుము. ఇం దెందఱు పుట్టిరో! ఎందఱు గిట్టిరో! ప్రాపంచికవిషయములు ఒక్క క్షణమున మనయెదుట గాన్పించి

† "అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే." 6-35.
—భగవద్గీత.

‡ "యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా." 2-58.
—భగవద్గీత.

ఉత్తరక్షణమున అదృశ్యమైపోవును. "నావారు" అని నీవు భావించువారు కనుమూసినంతనే (మరణించినంతనే) లేకపోవుచున్నారు. సంసారులకు మోహపాశము లెంత బలీయములో కదా! తాను సంరక్షింపవలసినవారు కుటుంబమున తన కెవ్వరును లేకున్నను ఏ మనుమనియందో గల మమకారముచే నరుడు కాశికి వెడలజాలకున్నాడు. "నేను లేని పక్షమున మాహరి యేమైపోవునో" అనుచింతయే వానిని సంసారబద్ధుని జేసి వేయుచున్నది. వెదురుమావుయొక్క ద్వారములు తెఱచియే యున్నను అందలి చేపలు పైకి పోజాలకుండును. గొంగళిపురుగు తానల్లుకొనిన గూటిలో తన్ను తాను బంధించుకొని నశించుచున్నది. ఇటువంటి సంసారము మిథ్యకాదా? (చూ. 191, 371, 555.)

545. అహంకారము నెట్లు నశింపజేసికొనవలయునో తెలియునా? వడ్లు దంచువారు అప్పుడప్పుడాగి, ఊక మొదలగునవి పూర్తిగా పోయెనో లేదో యని పరిశీలించుచుందురు. వగలను త్రాసులో వైచి తూచువారు ముల్లు సరిగా నడుమ నిలుచుచున్నదో లేదో తఱచుగా ఆగి కనిపట్టుచుందురు. అటులనే అహంకారము ఇంకను తలయెత్తుచున్నదో, అడగిపోయినదో తెలిసికొనుటకు అప్పుడప్పుడు నన్ను నేను నిందించుకొనెడివాడను. ఒక్కొక్కప్పుడు శరీరస్వభావమునుగూర్చి యిట్లు పర్యాలోచించుకొనువాడను: "చూడు! ఈ శరీరము ఎట్టిదో! మాంసముతోడను ఎముకలతోడను గూడిన పంజరముకాక మఱేమి ఇది? ఇందులో నెత్తురు, చీము మొదలగు కులినపదార్థములు తప్ప మఱేమున్నవి? దీనినిగుఱించి యింత

అభిమానమును అహంకారమును పూనుట ఎంతవిచిత్రము!" (చూ. 395.)

546. పొయ్యిమీద అన్నము ఉడుకుచున్నదనుకొనుము. సరిగా ఉడికినదో, లేదో కనుగొనుటకై నీ వొకమెదుకును దీసి నొక్కిచూతువుగదా? దానివలన వెంటనే నీకు పాత్రలోని అన్నమంతయు ఉడికినదియు లేనిదియు తెలియుగలదు.* అందులకై అన్నపు మెదుకుల నన్నిటిని పట్టిచూడనక్కఅలేదు. కొన్ని మెదుకులను బట్టిచూచి అన్నముయొక్క స్థితిని దెలిసికొను తీరుననే ప్రపంచము శాశ్వతమో, అశాశ్వతమో, సత్యమో, మిథ్యయో ప్రపంచమందలి రెండుమూడు విషయములను బరిశీలించినంతనే నీకు బోధపడగలదు. మానవుడు జన్మించుచున్నాడు, కొంతకాలము మనుచున్నాడు, చనిపోవుచున్నాడు. జంతువులును వృక్షములునుగూడ నిట్లే పుట్టుచు గిట్టుచున్నవి. నామరూపములుగల సర్వమునకును—సూర్యచంద్రాదులకును గూడ—ఇదియే గతియని వివేచనచే నీకు తెలియుగలదు. జగత్తునందలి సమస్తవస్తువుల తత్త్వమును ఈ విధముగా నీకు బోధపడును. ఇట్లు జగత్తు అశాశ్వతమనియు, మిథ్యయనియు నీవు గ్రహించినంతనే దానియందిక నీకు మోహము ఉండజాలదు. అపుడు సంసారమును మానసికముగా త్యజించి కోరికలనుండి విముక్తుడ వగుదువు. ఇట్లు విషయపరిత్యాగము చేయుగల్గినయెడల జగత్తునకు ఆధారభూతుడగు పరమాత్ముని గనజాలుదువు. ఈ విధముగా బ్రహ్మ

* దీనినే స్థాలీపులాకన్యాయమందురు.

సాక్షాత్కారమును బొందినవాడు సర్వజ్ఞుడు కానిచో మతేమగును?

## వై రా గ్య ము

547. మన యైహికవాంఛలన్నియు నెఱవేఱినను, దానిచే మనము ఒడలు తెలియకున్నను, "ఈభోగముల నన్నిటిని అనుభవించు నే నెవడను?" అను ప్రశ్న అంతరంగమున బయలుదేఱక మానదు. ఉన్నకిటుకు వెల్లడికా నారంభించు సమయ మదియే కావచ్చును.

548. ముండ్లతోడను తుప్పలతోడను నిండియుండు వనమున చెప్పులు లేకుండ నడచుట దుస్సాధ్యము. వనమంతయు తోలుచే గప్పబడియున్నపక్షమున నట్లు నడవవచ్చును. లేదా మన పాదములకు చెప్పులు తొడిగికొనినను నడవవచ్చును. వనమంతటిని తోలుచే గప్పుట యసాధ్యము, కావున మనమే చెప్పులు తొడుగుకొనుట లెస్స. సంసారమున మానవుడు అంతులేని కోరికలతో బాధపడుచున్నాడు. అందుండి తప్పించు కొనుటకు రెండేమార్గము లున్నవి: సమస్తమైన కోరికలను ఈడేర్చుకొనవలయును, లేదా, వాని నన్నిటిని పరిత్యజింపవలయును. కాని కోరికల నన్నిటిని ఈడేర్చుకొనుట యసంభవము; ఏలన ఒకకోరికను తృప్తి నొందించుకొన బ్రయత్నించితిమో లేదో, మఱియొకటి తలచూపుచుండును. కావున సంతుష్టిచేతను జ్ఞానముచేతను కోరికల నడచివేయుటయే దొడ్డబుద్ధి!

549. తామర గోళినకొలదియు హాయిగా నుండును. కాని

తరువాత గల్లు మంటలో, దుర్భరమైయుండును. అటులనే సంసారసుఖములు మొదట చాల ఇంపుగా గాన్పించినను తరువాత వానివలన గలుగు బాధలు దుర్భరమై చెప్పనలవి గాకుండును. *

550. ఒకగద్ద ముక్కున చేపను గఱచుకొని యెగిరిపోవుచుండ, అనేకమైన కాకులును గద్దలును దానివెంటబడి కూయుచు, ముక్కులతో గొడుచుచు, ఆ చేపను లాగికొన బ్రయత్నించుచుండెను. అది యే దిక్కునకు పోయినను కాకులు, గద్దలును వెంటాడుచునే యుండెను. ఆ బాధ పడలేక ప్రాణము విసిగి యాగద్ద ముక్కుననున్న చేపను విడిచివేసినది. వెంటనే యింకొకగద్ద దానిని ముక్కున గఱచుకొనెను. తత్క్షణమే యాకాకులును గద్దలును చేపను కఱచుకొనిన రెండవ గద్ద వైపు తిరిగి దానివెంటబడసాగెను. మొదటిగద్ద ఏబాధయు లేకుండ ఒక చెట్టుకొమ్మమీద వాలి శాంతముగా గూర్చుండెను. దాని ప్రశాంతస్థితిని గాంచి యవధూత దానికి నమస్కరించి యిట్లనును: "ఓపక్షిరాజమా! నీవే నాకు గురుడవు, ఐహికవిషయముల భారమును విడువకుండునంతవఱకు నరుడు సంసారబాధలనుండి విముక్తుడుగాడని, శాంతిని బొందజాలడని, నీవు నాకు బోధించుచున్నావు."

* "విషయేన్ద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్."

విషయేంద్రియ సంబంధమువలన గలుగు రాజససుఖము మొదట అమృతతుల్యముగను కడపట విషమువలెను ఉండును.

—భగవద్గీత, 18-38.

**551.** గంతలుకట్టిననేకాని బెదురుగుఱ్ఱము తిన్నగ నడవజాలదు. లౌకికునిమనస్సునకు వివేకవైరాగ్యము లనెడు గంతలు లేనియెడల తొట్రుపాటునకు లోనగును, పెడత్రోవను బోయి తప్పుపనులు చేయనారంభించును. (చూ. 752.)

**552.** చమురుచే తడిసిన కాగితముపై వ్రాయజాలము. అటులనే దుర్గుణములు, విషయభోగములును అను నూనెచే నాని పాడైన మనస్సు పారమార్థిక సాధనలకు పనికిరాకుండును. కాని నూనెకాగితముపై సుద్ద నలదినయెడల మఱల దానిపై వ్రాయనగును; అట్లే వైరాగ్యమను సుద్ద నలదిన యెడల సాంసారికునిమనస్సు మఱల సాధనలకు పనికివచ్చును.

**553.** విసపు సాలెపురుగు కలదు. అది కుట్టినయెడల పుండును ముందు పసుపువేళ్లు తెచ్చి వానితో మంత్రించిననే కాని ఏ యౌషధమును పనిచేయజాలదు. అటు పిమ్మటనే ఔషధములు గుణమిచ్చును. అటులనే కామినీ కాంచనములను సాలెపురుగుయొక్క విషము హృదయమున ప్రవేశించిన పక్షమున వైరాగ్యమను మూలికచే మంత్రించుకొనిననే కాని నరుడు సాధనలను సాగించి శ్రేయస్సును బొందజాలడు.

**554.** ఇండుపగంధమునుగాని, పటికనఱుగదీసి యాద్రావకమునుగాని మడ్డినీటిలో గలిపినయెడల యానీరు తేటుకొనును, మడ్డియంతయు అడుగునకు బోవును. వివేకవైరాగ్యములే నరుని మనస్సను మడ్డినీటిని నిర్మలముచేయు ద్రావకములు. వీనిమూలముననేకాని నరులు పరిశుద్ధులు గాజాలరు.

**555.** గొంగళిపురుగు తానల్లుకొనిన గూటియందే తన్ను బంధించుకొనుచున్నది. అటులనే సంసారి తన కోర్కె

లను వలలో తాను చిక్కుకొనుచున్నాడు. కాని గొంగళి పురుగు రమ్యమైన సీతాకోకచిలుకగా పరిణమించినప్పుడు తనగూటిని ఛేదించుకొని గాలిని వెలుతురును యథేచ్ఛముగా ననుభవించుచు ఎగురుచుండును. అట్లనే సంసారియు వివేక వైరాగ్యము లను రెక్కలతో మాయాజాలమును ఛేదించు కొని వెలువడగలడు.

556. దేవాలయమగు హృదయముయొక్క తాళము తీయవలయు ననిన చెవి వెనుకకు త్రిప్పవలయును. అనగా భగవంతుని ప్రాపించుటకై (రాగద్వేషములను విడిచి) వివేకవైరాగ్యముల నవలంబింపవలయును.

557. వివేకవైరాగ్యములు లేనియెడల శాస్త్రములను వేదాంత గ్రంథములను ఊరక వల్లించుటచే నేమి ప్రయోజనము? అవి (వివేక వైరాగ్యములు) లేనిదే ఎట్టి ఆత్మ వికాసమును గలుగజాలదు. (చూ. 137.)

558. భగవంతుని ప్రాపించుటెట్లు? సిరిసంపదలను మన శ్శరీరములను అందులకై ధారపోయవలయును.

559. మోక్షమును బొందుటకుముందు లౌకికుని మనః స్థితి యెటులుండవలయును? భగవదనుగ్రహమువలన భోగ ములయెడ అఖండ వైరాగ్యము కలిగిననే కాని కామినీ కాంచనముల ఆకర్షణనుండి నరుడు విముక్తిని బొందజాలడు. ఇక నీయఖండవైరాగ్య మెట్టిది? "క్రమక్రమముగా భగ వంతుని ప్రాపింతును"—ఇది మందవైరాగ్యముయొక్క ధోరణి. కాని యెవనివైరాగ్యము తీవ్రమైయుండునో అట్టి వాడు తల్లి బిడ్డకోసము పరితపించునట్లు భగవంతునికొఱకై

పరితపించును. భగవంతుని విడిచి యితరము నాతడు కోరడు. సంసార మాతనికి ఏనిముసమునన్నైనను తన్ను ముంచివేయు భయంకరసాగరముగా గాన్పించును. అందుగు లాతనికి విష సర్పములుగా దోప వానిబారినుండి తప్పించుకొని పోజూచును. భగవంతునిసాక్షాత్కారము పొందుటకు ముందు సంసార పరిస్థితుల నాత డెన్నడును జక్కపెట్టుకొనదలపడు, సంసార స్పృహయే వానికి ఉండదు. తీవ్రవైరాగ్యమనగా ఇట్టిది,—ముముక్షుత్వమనగా ఇట్టిది. (చూ. 566.)

560. భగవంతునికొఱకై భక్తు డెందుచే సమస్తము త్యజించును? దివ్యమగు దీపమును జూచిన పిమ్మట మిడుత వెనుకకు మఱల సిచ్ఛగింపదు: చీమ పంచదారరాశిలో ప్రాణములు విడుచునే కాని వెనుకకు మెరుగదు. భగవద్భక్తుడును ఇట్లే తనప్రాణములను సతము బ్రహ్మప్రాప్తికై ధారపోయునే కాని అన్యమును లక్ష్యపెడు.

561. పరిశీలనచే, ఆప్తవాక్యములచె, స్వానుభవముచే, పాశివానిపైనుండి సార్వభౌమునిపరకు గల సమస్తదశలను పరిశోధించి, విషయభోగములు తుచ్ఛములని మనస్సునకు నిశ్చయము కలిగిననేకాని యెవ్వడును నిజమైనజ్ఞాని—పరమహంస—కానేరడు.

562. కామకాంచనములను త్యజించిననేకాని బ్రహ్మజ్ఞాన మెన్నటికిని గలుగజాలదు. త్యాగోదయమైనంతనే అవిద్యాంధకారము పటాపంచలగును. దుర్బినిని సూర్యకిరణముల కెదురుగా బట్టుకొని తనమ్మాలమున ననేకవస్తువులను తగులబెట్టవచ్చును, కాని నీడనున్న గదిలో దానినట్లు వినియోగింప

జాలము. మనస్సువిషయముకూడ నిట్టిదే. మనస్సను దుర్బి నిని సంసారమను నంధకారమునుండి యీవలకు దీసి స్వయం జ్యోతిస్వరూపుడగు పరమేశ్వరుని దివ్యతేజమును దానిపై బడనీయ వలయును. అపుడు త్యాగవైరాగ్యము లుదయించును, అజ్ఞానము అంతరించును. (చూ. 274.)

563. ఎట్టిగురుడైనను జ్ఞానము నొక్కుమ్మడి కలిగింప జాలడు. అందులకు కాలపరిపాకము కావలయును. * తీవ్ర మైన జ్వరము వచ్చిన దనుకొనుము. అప్పుడు వైద్యుడు కొయినా (Quinine) ఈయగల్గునా? ఆ సమయమున దాని వలన ప్రయోజనము ఉండదని వైద్యునకు తెలియును; అందుచే ఈడుడు. జ్వరముయొక్క వడి తగ్గవలయును. అందులకు కొంతకాలము పట్టును. పిమ్మట కొయినాగాని, మఱేమందుగాని ఈయనగును. జ్ఞానార్థులవిషయముకూడ నిట్టిదే. నరుడు సంసారతాపత్రయమున మునిగియున్నంత వఱకు వానికి చేయు ధర్మోపదేశములు వ్యర్థములు. కొంత కాలము విషయానుభవమును పొందనిండు. విషయములందలి రాగము కొంతవఱకు తగ్గినపిమ్మట ధర్మోపదేశములు ఫలించు సమయము వచ్చును. అంతవఱకు వానికి చేయు నుపదేశము లన్నియు వ్యర్థములే. (చూ. 223.)

564. (ఇచట 12_వ ప్రవచనము జదువుకొనుడు.)

---

* "తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి."
—భగవద్గీత. 4-38.

565. వైరాగ్యము అనేకవిధములుగా నుండును.* ఘోరమైన సంసారదుఃఖానుభవముచే గలుగునది ఒకవిధమైన వైరాగ్యము. కాని తనకు అందుబాటుగా నున్నను ఐహిక భోగభాగ్యములు అశాశ్వతములనియు తుచ్ఛములనియు గ్రహించుటచే గలుగు వైరాగ్యము ఉత్తమమైనది. ఇట్టి వైరాగ్యము గలవానికి సమస్తభోగభాగ్యము లున్నను లేనివిగనే యెంచవలయును.

566. వైరాగ్యము ఎన్ని విధములు? తీవ్రవైరాగ్యమని, మందవైరాగ్యమని సాధారణముగా రెండువిధములు. ఒక్కరాత్రిలో చెఱువు త్రవ్వి అప్పటికప్పుడు నీటితో నింపవలయునని దీక్షవహించుట వంటిది తీవ్రవైరాగ్యము. నెమ్మదిగా అడుగడుగునను ఆగుచు, కాలవిలంబముచేయుచు, వృద్ధిపొందునది మందవైరాగ్యము. అది యెప్పుడు పరిపక్వదశకు వచ్చునో పరమాత్మునకె తెలియక! (సూ. 559.)

567. ఒకడు స్నానముచేయుటకై నదికి పోవుచు, చాల దినములుగా ఎవరో యొక పెద్దమనిసి సన్న్యసించుటకై ప్రయత్నించుచున్నట్లు వినెను. ఈమాటవలన సన్న్యాస జీవనమే సర్వోత్తమమని వానికెట్లో మనసునకు తట్టెను. వెంటనే యాతడు సన్న్యసింపవలయునని నిశ్చయించుకొని యింటికి మఱలకుండ కట్టుకొనిన అంగవస్త్రముతోడనే వెడలిపోయినాడు. తీవ్రవైరాగ్యమనగా ఇటువంటిది.

568. అఖండసచ్చిదానందసాగరమున నిమగ్నుడవు

---

* పురాణవైరాగ్యము, ప్రసూతివైరాగ్యము, శ్మశానవైరాగ్యము మొదలగునవి.

కమ్ము. కామక్రోధము లను మొసళ్లకు వెలవకుము. వివేక వైరాగ్యము లను పసుపును దట్టముగా ఒడలినిండ రాచు కొనుము. దాని యగరుచే కామక్రోధము లను మొసళ్లు నిన్ను సమీపింపజాలవు.

## సాధనయందు దీక్ష

569. వ్యవసాయులు గిత్తల నెట్లు కొందురో తెలి యునా? ఓ! ఆవిషయములలో వారు ఎంతయో నేర్పరులు. ఏవి మంచివో, ఏవి చెడ్డవో వారు ఇట్టె గ్రహింపగలరు; గిత్తయొక్క చుఱుకుదనము ఎట్టిదో కనుగొనుట వారికి చక్కగా తెలియును. వారు ఊరక తోకను తాకెదరు; ఫలితమో, అద్భుతము. చుఱుకుదనము లేనివి చలింపక నిద్రపోవుచున్నవో యనునటుల పరుండియుండును. చుఱుకైనవియో, తమజోలికి వచ్చినందులకై ఆగ్రహపడు చున్నవో యనునటుల ఎగిరి గంతులువేయును. వ్యవసా యులు ఈరకమువానినే ఎన్నుకొందురు.

జీవితము సఫలము కావలయుననిన, మానవునకు నిజమైన పౌరుషము ఉండవలయును. కాని పాలలో నానవేసిన మర మరాలవలె మెత్తనై ఎందునబొందని పౌరుషవిహీను లనేకు లుందురు! వారిలో సామర్థ్యము సున్న! దీక్షవహించి నేకార్యమునైనను కొనసాగించుటకు సంకల్పశక్తి శూన్యము! మనోబలము అంతకుమునుపే పూజ్యము! ఇట్టి వారి జీవితములు ఎందులకును కొఱగానివి. (చూ. 627.)

570. పెద్దచేపను బట్టదలచిన జాలరి నీటిలో గాలమును వైచి గంటలకొలది కనిపెట్టుకొనియుండును. అటులనే దీక్ష

తోడను ఓరిమితోడను సాధనలను సాగించు భక్తుడు తుదకు తప్పక భగవంతుని గాంచును. (చూ. 146, 583, 588, 681.)

571. పరంపరగా వ్యవసాయము చేయుచుండు రైతు పండ్రెండేండ్లు అనావృష్టి వచ్చి యేమియు పండకున్నను వ్యవసాయముచేయుట మానడు. కాని క్రొత్తగా వ్యవసాయమునకు దిగిన వర్తకుడు ఒక్కఋతువు అనావృష్టి సంభవించినంతనే దిగులుపడి, 'మన కిది అచ్చిరాలే'దని ఆ వ్యవసాయమును కట్టిపెట్టును. అదేతీరున జీవితకాలమంతయు సాధనచేసి తుదకు భగవంతుని గనజాలకున్నను నిజమైన భక్తుడు నిరుత్సాహము చెందడు. (సాధన మానివేయడు.)

572. ఈత నేర్వదలచినవాడు కొన్నాళ్లు తత్ప్రియత్నము చేయవలయును. ఒక్కనాడు సాధనచేసినంతనే సముద్రమున ఈదులాడుటకై యెవ్వడును సాహసింపరాదు. అటులనే సచ్చిదానందసాగరమున ఈదులాడదలచెదవేని నీవు కృతార్థుడ వగుటకుముందు కష్టనష్టముల నోర్చి యనేక సాధనలు చేయవలసియుండును. (చూ. 13.)

573. అప్పుడు పుట్టిన దూడ స్థిరముగా నిలువగలుగుటకు ముందు అనేక పర్యాయములు తడబడును, పడును. అటులనే బ్రహ్మసాక్షాత్కారము సిద్ధించుపర్యంతము సాధకునకు బ్రహ్మమార్గమున ఎన్నియోసారులు తొట్రుపాటు గలుగును.

574. భయంకరమగు శవసాధన (రాత్రి శ్మశానమున శవముపై గూర్చుండి చేయు తాంత్రికసాధన)ను పూని యిరువురు కాళికాదేవిని ప్రత్యక్షము చేసికొన ప్రయత్నించిరట. అందొకడు అర్ధరాత్రమునకు ముందుగా కాన్పింపసాగిన

భయంకరదృశ్యములను గాంచి భీతిల్లి పిచ్చివా డయ్యెను. రెండవవాడు రాత్రితుదిని కాళీప్రసాదమున ఆమె సాక్షాత్కారమును బడసెను. అప్పు డాత డామె నిట్లడిగెను: "అమ్మా! జగజ్జననీ! ఈరెండవవాడు పిచ్చివాడై పోయినాడు, ఎందుచేత నమ్మా!" దేవి యిట్లు సమాధాన మొసగెను: "నాయనా! నీవును పూర్వజన్మములందు అనేక పర్యాయములు ఇట్లే పిచ్చివాడవయితివి, కాని యిప్పుడు, తుదకు, నన్ను గాంచగల్గితివి."

575. ప్రశ్న: అరుదుగాగాని మనకు చిత్తశాంతి లభింపదుగదా, అటుల లభించిన శాంతియైనను చిరకాలము నిలువకుండుటకు హేతువేమి?

ఉ. నిరంతరము ఊదుచుండిననేకాని వెదురుకఱ్ఱల నిప్పు ఆఱిపోవును. ఆధ్యాత్మికాగ్నిని ప్రజ్వలింపజేయుటకు నిరంతరమైనసాధన ఆవశ్యకము.

576. కూజాను నిండుగా నింపి ఉట్టిమీద బెట్టియుంచుము. కొలది దినములలో నీరంతయు ఇగిరిపోవును. కాని దానినే నీటిలో నుంచితివేని, అటు లచట నున్నంతకాలము నిండుగనే యుండును. నీ భగవద్భక్తివిషయముకూడ నిట్టిదే. కొంతకాలము భక్తిసాధనచేసి, పిమ్మట ఆవిషయమే మఱచి, యితరవ్యవహారములలో దిగినపక్షమున నీహృదయమందలి భక్తి రవంతయు హరించిపోవును. కాని నీ యానందమయ హృదయమును పవిత్రభక్తివిశ్వాసము లను నమృతసాగరమున సదా ముంచియుంచితివేని వానితో నెప్పుడును పరిపూర్ణమై యొప్పుచుండును.

577. పాలకుండక్రింద నిప్పున్నంతపర్యంతము పాలు పొంగుచునే యుండును. కాని నిప్పును తీసివేసినంతనే పొంగు చల్లారును. అటులనే నూతనసాధకుడు తన పారమార్థిక సాధనలను సాగించుచున్నంతవఱకే ఆవేశముతోడను ఉత్సాహముతోడను పొంగుచుండును.

578. నరునియం దెంతకాలము దైవభక్తియు ధర్మబుద్ధియు నిలుచును? కనకనలాడు నిప్పులో నున్నంతవఱకు ఇనుము ఎఱ్ఱగానుండును. వెలుపలికి తీయగానే నల్లబడును. అటులనే నరుడు బ్రహ్మానుసంధానము చేయుచుండునంతవఱకు బ్రహ్మభావము గలిగియుండును. (చూ. 580.)

579. మనస్సు సిద్ధీవాని ఉంగరాలజుట్టువంటిది. దానిని నీ వెంతగా సవరించి వక్రగతిని మాన్పజూచినను తిరిగి వక్రమగుచునే యుండును. మనస్సును పట్టి బిన్నగా నిలిపి యుంచునంతకాలము సన్మార్గమున చక్కగనే నడచును, ప్రయోజనకారిగనే యుండును. కాని నిజాగరూకత రవంత కొఱవడినంతనే అది సన్మార్గము వీడి పెడత్రోవను బట్టును.

580. "ఇత్తడిచెంబు అనుదినము తోముచుండనియెడల చిలుముపట్టి కగ్గిపోవును. అట్లే అనుదినము దైవధ్యానము చేయనియెడల నరుని హృదయము మలినమగును" అని శ్రీతోతాపురి * వచించువాడు. శ్రీగురుదేవు డొకప్పు డందులకిట్లు సమాధాన మొసగెను: "చెంబు బంగారుదైనయెడల ప్రతిదినము తోముట అనావశ్యకము." బ్రహ్మసాక్షాత్కారము

* శ్రీరామకృష్ణపరమహంసకు అద్వైతవేదాంతగురువగు దిగంబర సన్న్యాసి.

పొందినవానికిక ప్రార్థనలతో నిమిత్తము లేదు.

## సాధనావశ్యకత

581. లోతులేని చెఱువునుండి శుభ్రమైన నీటిని గైకొని త్రాగవలయుననిన, నీటిని కలపకుండ, జాగ్రత్తగా, మెల్లగా, పైభాగమునుండి గైకొనవలయును. కలచినయెడల అడుగున నున్న బురద పైకి వచ్చి నీటినంతయు మలినముచేయును. నీవు పరిశుద్ధుడవు కాదలచెదవేని నీశక్తిసామర్థ్యములను నిరుపయోగమైన చర్చలందును వాగ్వాదములందును వ్యర్థము చేసికొనక, దృఢవిశ్వాసముతో క్రమముగా సాధనలను సాగింపుము. లేనిపక్షమున నీయల్పబుద్ధి కలవరపడును.

582. (కలకత్తాలోని కోటీశ్వరుడగు) యదునాథమల్లికుని వంటి శ్రీమంతుని సిరిసంపదలను గూర్చియు భవనములను గూర్చియు భోగట్టా చేయువారనేకు లుందురు. కాని స్వయముగా ఆతని దర్శనముచేసి పరిచయము సంపాదించువారేకొలదిమందియో యుందురు. అటులనే ధర్మశాస్త్రములను జదువువారును మతధర్మములనుగూర్చి ప్రసంగించువారును అనేకు లుందురు, కాని భగవద్దర్శనము గోరి యందులకై కష్టించి సాధనలుచేయువారరుదు.

583. కార్యసిద్ధికి తగిన మార్గము అవలంబింపుము. "పాలలో వెన్న కలదు" అని గొంతు బొంగురుపోవునట్లు నీవు ఎంత యఱచినను వెన్న చిక్కదు. నీకు వెన్న కావలసిన యెడల పాలను తోడుపెట్టి పెరుగు చేయవలయును, పిమ్మట దానిని చిలుకవలయును. అప్పుడు నీకు వెన్న లభించును.

అటులనే దేవుడు నీకు ప్రత్యక్షము కావలయునని కోరుదువేని శ్రద్ధాభక్తులతో సాధనచేయుము. అంతియేకాని ఊరక, "ఓ దేవుడా! దేవుడా!" యని యఱచిన నేమి ప్రయోజనము? (చూ. 146, 588, 681.)

584. నగరులోనికి పోయి రాజదర్శనము చేయగోరువాడు అచటికి వెడలి ద్వారములనన్నిటిని దాటవలయును. అటుల గాక, వెలుపలి కోటగుమ్మము దాటగనే, "రాజుగారెక్కడ?" అని యడిగినయెడల వానికి రాజుగారు కానరారు. సప్త ద్వారములను దాటిననేకాని రాజును దర్శింపజాలడు.

585. సాక్షాత్కారము వలయునని, సాధన చేసితీర వలయును. ఒకనాడు నేను భావసమాధిస్థితిలో నుండగా హాలధరపుష్కరమున * ఒక దృశ్యమును గంటిని. ఒకపల్లెటూరివాడు నీటిమీదినాచును తొలగించి నీటిని పుడిసిట బట్టి మఱల మఱల పరీక్షించుచుండెను. నాచును తొలగింపనిదే నీరు బాగుగా కానబడనిచందమున కష్టించి సాధనలు సాగింపనిదే భగవంతునియందు నిర్మల భక్తియు వానిసాక్షాత్కారమును గలుగనేరవని తెలుపుటకో యనునటుల జగజ్జనని యాదృశ్యమును జూపెను. ధ్యానము, నామస్మరణము, సంకీర్తనము, ప్రార్థన, దానధర్మయజ్ఞయాగాచరణము మొదలగు సత్కార్యములు భగవత్ప్రాప్తిని గలుగజేయును.

586. శ్రీకృష్ణుడు సైతము రాధాయంత్రార్చనకు సంబం

* శ్రీరామకృష్ణుని జన్మస్థలమగు కామారిపుష్కరమున వారి యింటికి ఎదుటనున్న పెద్ద చెఱువు.

ధించిన మహాసాధనల ననేకము చేసెను. బ్రహ్మయోని (బ్రహ్మముయొక్క సృజనశక్తి) యే యీయంత్రము. దానిని గూర్చిన ధ్యానార్చనలే (శ్రీకృష్ణుడు సాగించిన) సాధనలు. అనంతమైన బ్రహ్మాండములు ఈ బ్రహ్మయోనినుండి ప్రభవించుచున్నవి!

587. (1) విహంగమార్గము, (2) మర్కటమార్గము, (3) పిపీలికా మార్గము నని సాధన మూడువిధములు.

(1) పక్షి వచ్చి పండును పొడుచును. బహుశః ఆ పోటుతో పండు పడిపోవును, ఇక నది పక్షికి దక్కదు. అటులనే అతితీవ్రముగా సాధనలు సాగింపయత్నించువారు కొందఱుందురు. ఆ తీవ్రతయే తఱచు వారి ప్రయత్నములను భగ్నముచేయుచుండును.

(2) కోతి పండును నోట గఱచుకొని కొమ్మనుండి కొమ్మకు దుముకుట దాని స్వభావము. ఇట్లు దుముకునప్పుడు పండు తఱచు నోటినుండి పడిపోవుచుండును. అటులనే సాధకుడు పట్టువదలినయెడల జీవితమున సంభవించు నొడుదొడుకులచే తనసాధనవిధానమును జాఱవిడుచుచుండును—బ్రహ్మమార్గభ్రష్టు డగుచుండును.

(3) చీమ నెమ్మదిగా, నిశ్చయముగా, ఆహారమున్నచోటికి ప్రాకి వెడలి దానిని బట్టుకొని తిరిగి తనకన్నములోనికి తీసికొనిపోయి సురక్షితముగా భుజించును. ఇట్టి పిపీలికా మార్గము ననుసరించు సాధనవిధానమే సర్వోత్తమము. ఇందు ఫలప్రాప్తి నిశ్చయము.

588. చేపలను బట్టుకొనువాడు ఒకగుంటలో మంచిచేపలు

దొరకునో, లేదో తెలిసికొనుటకై అంత దిదివఱకు చేపలను బట్టినవారికడకుపోయి ఆత్రముతో నిట్లు విచారించును: "ఫలానిగుంటలో పెద్దపెద్ద చేపలు దొరకుట నిజమేనా? వానిని బట్టుటకు ఏలాటి ఎర వేయవలయును?" కావలసిన విషయములను వారివలన దెలిసికొని పరికరములతో గుంట యొద్దకు వెడలి, గాలము వైచి, ఓపికపట్టి, నేరిమితో చేపల నాకర్షించును. తుదకు చక్కని పెద్దచేపను బట్టుకొనగల్గును. అటులనే మహాత్ములయొక్కయు ఋషులయొక్కయు వాక్కులందు పరిపూర్ణవిశ్వాసముంచి, భక్తియను ఎరతోడను మనోనిశ్చయమను గాలపుగోలతోడను భగవంతుని బట్టుకొని హృదయమున నిలుపుకొనవలయును. అందులకై అఖండమైన ఓరిమితో కాలపరిపాకమునకై వేచియుండవలయును. అటులొనర్చినచో ఆ దివ్యమీనము లభింపగలదు. (చూ. 146, 570, 583, 648, 681.)

589. శ్రీగురుదేవుడు తఱచుగా నిట్లు వచించువాడు: "నేను విధించు నియమములను పరిపూర్ణముగా మీరు పరిపాలింపగల్గుదురా? అందు పదునాఱవవంతు మీ రనుష్ఠింపగల్గినయెడల మోక్షప్రాప్తి మీకు నిశ్చయమని నమ్ముడు."

590. ఆత్మసాక్షాత్కారము కావలయుననిన, సాధనలను ఆచరించితీరవలయును. కాని పరిపూర్ణశ్రద్ధ యుండునెడల స్వల్ప సాధనమైనను జాలును.

**591. పరమపావనమైన భగవన్నామముయొక్క ప్రభావమున సంపూర్ణవిశ్వాస మున్నయెడల—నిరంతర నామస్మరణమున మనస్సు రమించునెడల—అట్టివానికి మఱే యే**

యితరసాధనగాని, విచారముగాని అనావశ్యకము. అపుడు సర్వసంశయములును సమసిపోవును. మనస్సు నిర్మలమగును. పావననామ ప్రభావమున భగవానుడే స్వయముగా వానికి సాక్షాత్కరించును.

592. వేదములును పురాణములును పఠింపదగినవి, వినదగినవి. కాని తంత్రములు సాధనచేయదగినవి. హరినామమును నోరార పలుకవలయును. చెవులార వినవలయును. కొన్నిరోగముల నివారణకై పైకి మందు రాయవలయును, లోనికిని మందు పుచ్చుకొనవలయును. (భవరోగనివారణకై భగవన్నామశ్రవణమును కీర్తనమునుగూడ జేయవలయును.)

593. సాధనసిద్ధులనియు కృపాసిద్ధులనియు సిద్ధులు (లేక ముక్తులు) రెండువిధములుగా నుందురు. మంచిపంట లభించుటకై కొందఱు తమ పొలములకు కాలువలు త్రవ్వియో, నీటిని తోడియో, చాల శ్రమపడవలసియుందురు. కాని నీటికొఱకై ఇట్టిశ్రమ నెంతమాత్రము పడ నక్కఱలేని యదృష్టవంతులు కొందఱుందురు. ఎట్లన, వానలు వచ్చి వారి పొలము నంతయు చక్కగా నింపును. మాయాబంధమునుండి విముక్తి పొందుటకై ఇంచుమించుగా అందఱును దీక్షతో సాధన చేయవలసియే యున్నారు. కాని కృపాసిద్ధుల కీశ్రమ యంతయు అనావశ్యకము. భగవత్కృపచేతనే వారు ముక్తులగుదురు. కాని వీరిసంఖ్య అత్యల్పము! (చూ. 680.)

## ఏకాగ్రత : ధ్యానము

594. జపతపములను సదా ఆచరించుచుండవలయును.

595. అన్ని పనులను కట్టిపెట్టి సాయంకాలము నీవు భగవంతుని ధ్యానింపవలయును. సంధ్యాసమయమున సహజముగా భగవద్భావన మనస్సు నావరించును. "కొంతసేపటి క్రిందట సమస్తము దృగ్గోచరమై యున్నది. కాని, అహా! ఇంతలోనే సర్వము చీకటిచే ఆవరింపబడినదే! ఇట్లు చేయువారెవ్వరు?" ఇట్టిభావములు మనస్సున పొడమును. సాయంకాలమున మహమ్మదీయులెట్లు అన్నిపనులను విడిచిపెట్టి నమాజునకు గూర్చుందురో మీరు చూడలేదా?

596. పొట్లము చినుగ కాఱిపోయి నలుదిక్కులందును చెల్లాచెదరగు నావగింజలను ప్రోవుచేయుట చాల కష్టము. విషయముల వెంటబడి నలుదిక్కులను బరుగెత్తు మనస్సును అంతర్ముఖముచేసి నేకాగ్రము చేయుట బహుకష్టసాధ్యము.

597. ఏమాఱుమూలలనో, నిర్జనప్రదేశమగు నరణ్యమునో, నిశ్శబ్దమగు నీహృదయదేవాలయముననో భగవంతుని ధ్యానింపుము.

598. సాధకుడు ప్రారంభదశలో ఎప్పుడును ఏకాంత స్థలమునకు బోయి మనస్సు నేకాగ్రముచేయ యత్నింపవలయును. లేనిచో నానా విషయములును మనస్సు నాకర్షించి కలవరపెట్టును. పాలకు నీటిచేరిక కలిగించినయెడల రెండును కలిసిపోవును. కాని పాలను చిలికి వెన్నగా మార్చితిమేని, అటుల పరిణామము పొందిన పాలు (అనగా వెన్న) ఇక నీటితో గలియుటకుమాఱు నీటిపైన తేలియాడుచుండును. అటులనే నిరంతరసాధనచే చిత్తైకాగ్రతను బొందిన మానవు డెచటనున్నను వానిచుట్టున్న పరిస్థితులకు లొంగక సదా బ్రహ్మ

భావమున నిలుకడ కలిగియుండును. (చూ. 89.)

599. తనశరీరమును జూపుచు శ్రీగురుదేవుడు శిష్యుల కిట్లు బోధించువాడు: "ధ్యాన మారంభించుటకుముందు దీనిని గూర్చి కొంతసేపు భావింపుడు. నే నిట్లు చెప్పుటకు కారణమేమో తెలియునా? మీకు దీని (నా) యందలి నమ్మకచే మీ భావములు దీని (నా) వైపునకు త్రిప్పబడిన పక్షమున వెంటనే భగవంతునివైపునకు మఱలును. ఇయ్యది ఆవులమంద కాన్పింపగనే ఎవ్వనికైనను ఆలకాపరి తలపునకు వచ్చుటవంటిది; లేదా, కుమారుని జూచినంతనే తండ్రియు, వకీలును జూచినంతనే కోర్టును జ్ఞప్తికి వచ్చుటవంటిది. వేయి విషయములందు చెల్లాచెదరై యుండు మనస్సు దీనిని (నన్ను) గూర్చి భావించునప్పుడు ఏకాగ్రమగును; * అటు లేకాగ్రమైనంతనే భగవానునిమీదికి మఱలును, అంత సరియైన ధ్యానము సాధ్యమగును." (చూ. 341.)

600. మనస్సును ఏకాగ్రముచేయుటకు దీపముపై నిలుపుట అతిసులభమైనమార్గము. † దానికి సరిగా నడుమనుండు నీలిభాగము కారణశరీరమునకు సరివచ్చును. దానిపై మనస్సును నిలుపయత్నించుటచే ఏకాగ్రతాశక్తి త్వరితముగా

---

* "వీతరాగవిషయం వా చిత్తమ్"—(విషయములందు వైరాగ్యము పొందిన చిత్తమును ధ్యానించుటచేనైనను చిత్తప్రసన్నత గలుగును అని) పాతంజలయోగసూత్రములు, 1-37.

† "విశోకా వా జ్యోతిష్మతీ"—(సమస్తదుఃఖాతీతమైన దివ్య జ్యోతిని ధ్యానించుటవలనగాని చిత్తప్రసన్నత గలుగును అని) పాతంజలయోగసూత్రములు, 1-36.

అలవడును. దీపమున నీలాంశముచుట్టునుండు తేజోవంతమైన భాగము సూక్ష్మశరీరమును బోలును. దాని నావరించుకొని యుండు భాగమే స్థూలశరీరము.

601. శ్రీగురుదేవుడు తనసాధనదశనుగూర్చి ముచ్చటించుచు శిష్యుల కిట్లు తెల్పువాడు: "నాయనలారా! ఆ దినములలో భగవంతుని ధ్యానించుటకుముందు నేను వివిధ మాలిన్యములను (చెడుతలంపులు, కోరికలు మొదలైనవి) అన్నిటిని మనస్సునుండి శుభ్రముగా కడిగివేయుచున్నటులను పిమ్మట దైవమును అందు ప్రతిష్ఠించుచున్నటులను భావించువాడను. మీరును అటుల చేయుడు."

602. ధ్యానకాలమున మనస్సు చలింపకుండుటకై భగవత్పాదపద్మములకు పట్టుదారముతో దానిని గట్టినటుల భావింపవలయును. దారము పట్టుదై యుండనేల యందురా? భగవానుని పాదపద్మములు అత్యంత మృదులము కావున ఇతరమైన త్రాళ్లు వానికి బాధ కల్గించును. (చూ. 777.)

603. ఆరంభదశలో సాధకుడు ధ్యానసమయమున తూగనిద్రయను నొకవిధమైన నిద్రను బొందును. అపుడాతని కేవియో కొన్ని దివ్యదృశ్యములు తప్పక గోచరించును.

604. సాత్త్వికస్వభావుడగువా డెట్లు ధ్యానించునో తెలియునా? అర్ధరాత్రమున పడకపై దోమతెరలో నాతడు ఇతరులకు గానరాకుండులాగున ధ్యానము సాగించును.

605. సారాయమున ద్రావకమువలె భగవంతుడను అమృతసాగరమున లీనము కమ్ము.

606. మనఃకల్లోలము పూర్తిగా శాంతించినపుడు

శ్వాసలు కట్టువడుటచే కుంభకము సిద్ధించును. భక్తియోగ మార్గమునగూడ కుంభకస్థితి లభించును,—గాఢమగు భగవద్భక్తివలనసైతము శ్వాసలు కట్టువడును.

607. గాఢమగు ధ్యానము ధ్యేయవస్తు తత్త్వమును గోచరింపజేసి ధ్యాతయొక్క అంతరంగమున నెలకొల్పును.

608. అవధూత యొకప్పుడు ఒకమైదానము దాపుననుండి డోళ్లు, బాకాలు మొదలగు వాద్యవిశేషములతో పెండ్లివారి యూరేగింపుటుత్సవము సాగుచుండుట గాంచెను. దానికి సమీపముననే యొక వేటకాడు ఆ వాద్యఘోషను లక్ష్యపెట్టక, ఉత్సవమును క్రేగంటనైనను జూడక, తదేకదృష్టితో ఒకపక్షిపై గురిపెట్టుచుండుట యవధూతచూచెను. అవధూత యాబోయవానికి నమస్కరించి యిట్లనెను: "ఓయీ! నీవు నాకు గురుడవు. పక్షిపై నీమనస్సు ఎట్లు లగ్నమైయున్నదో అట్లే నేను ధ్యానమునకు గూర్చుండు సమయమున నామనస్సు ధ్యేయముపై లగ్నమగుగాక!"

609. ఒక జాలరి చెఱువులో గాలము వేసి చేపలను బట్టుచుండెను. అవధూత వానిని సమీపించి యిట్లడిగెను: "అన్నా! కాశికి పోవు త్రోవ యేది?" ఆసమయముననే గాలపుబెండు చేప యెరను గొఱుకుచున్నట్లు తెలియజేయుచుండ, జాలరి తనగాలమునందే దృష్టి నిలిపియుండెను. అందుచే నాతడేమియు మాఱు పలుకలేదు. చేప పట్టువడిన పిమ్మట నాతడు వెనుకకు దిరిగి, "అయ్యా! మీరేమి సెలవిచ్చుచుంటిరి?" అని యడిగెను. అవధూత వానికి నమస్క-

రించి యిట్లనెను : "ఓయీ! నీవు నాకు గురుడవు. నేను బ్రహ్మమును ధ్యానించునపుడు నీమార్గమునే యనుసరించి ధ్యానము ముగియువఱకును మఱిదేనిని లక్షింపకుందునుగాక!"

610. ఒకకొంగ చేపను బట్టుకొనవలయునని గుంట యొడ్డునకు నెమ్మదిగా బోవుచుండెను. దానివెనుకనే బోయ వాడు దానిపై గుఱిపెట్టుచుండెను. కాని కొంగ కావిషయ మైన స్ఫురణగా లేకుండెను. అవధూత యంత కొంగకు మ్రొక్కి యిట్లనెను : "నేను ధ్యానించునపుడు నీమార్గమునే యనుసరింతునుగాక! వెనుక నెవ రున్నారో యని తిరిగి చూడకుందునుగాక!"

611. "ధ్యానసిద్ధునకు మోక్షము కరతలామలకము" అను సామెత కలదు. ధ్యానమున నెపుడు సిద్ధి కలుగునో తెలి యునా? ధ్యానమునకు గూర్చుండగనే దివ్య భావముల చే ఆవరింపబడి బ్రహ్మానుసంధానము చేయగల్గునపుడు.

612. ధ్యానమున తీక్ష్ణమైన ఏకాగ్రత గలుగునపుడు అన్యమేదియు గానబడదు, వినబడదు. బాహ్యస్పర్శలుగాని, విషయానుభవములుగాని లేకుండును. శరీరముపై పాము ప్రాకుచున్నను అపుడు తెలియరాదు. ధ్యాతకుగాని, పాము నకుగాని ఆవిషయమైన ఎఱుకయే లేకుండును.

613. ధ్యాననిష్ఠలో నుండ పక్షులు తనతలపై గూండ్లు కట్టుకొనినను ఏవిధమైన బాహ్యస్ఫురణయు లేకుండునట్టివాడే ధ్యానసిద్ధుడు, ధ్యానమున బరిపూర్ణుడు.

614. గాఢమైన ధ్యానమున ఇంద్రియవ్యాపారము లన్నియు కట్టువడును. బాహ్యప్రపంచద్వారములు బంధింప

బడినవో యనునటుల మనస్సు అంతర్ముఖమై వృత్తిరహితమై యుండును. శబ్ద స్పర్శ రూప రస గంధము లైదును వెలుపలనే యుండి గోచరింపకుండును. ధ్యానమున మొట్టమొదట విషయములు మనస్సునకు గోచరించును, కాని ధ్యానము గాఢమైనప్పుడు విషయానుభవములు కలుగనే కలుగవు— అవి బహిష్కరింపబడును.

615. భగవత్సాక్షాత్కారమునకై నీ వేమార్గ మవలంబించినను మనస్సు సంపూర్ణముగా అడగిపోయిననే కాని— వృత్తిశూన్యమైననే కాని—యోగము సిద్ధింపదు. ఇదియే రహస్యము. యోగి యెప్పుడును మనస్సునకు అధీనుడుగాక మనస్సును సదా తనయధీనమున నుంచుకొని యుండును.

పదుమూడవ ప్రకరణము

# భగవత్ పరితాపము

సాక్షాత్కారమునకై పరితపింపుము—నిజమైన పరితాప మెట్టిది?—భగవత్సాక్షాత్కారమునకు ప్రధాననియమము

## సాక్షాత్కారమునకై పరితపింపుము

616. ఎట్లైనను పరితాపము తప్పనిచో ప్రాపంచిక విషయముల కోసము కాక, భగవత్సాక్షాత్కారమునకై పరితపింపుము—భగవద్భక్తిచే ఉన్మత్తుడవు కమ్ము.

617. లోకులు పుత్త్రసంతానము లేదనియో, కలిమి కలుగ లేదనియో కన్నీరు కాలువలు గట్టునట్లు విలపింతురు. కాని, ఆహా! భగవద్దర్శనము కాలేదని విలపించు వారెవ్వరు? నిజముగా అట్టివారు కోటికొకరుండుట దుర్లభము. * భగవంతుని వెదకుచు, ఎవ్వడు పరితపించునో, విలపించునో, నిశ్చయముగా అట్టివాడు భగవంతుని గాంచును. (చూ. 146, 570, 583, 588, 621, 629, 681.)

618. భగవంతునికోసము పరితపించువాడు, "ఏమి

---

* "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః."

వేలకొలదిజనులలో ఆత్మసిద్ధికొఱకు ఒకానొకడు ప్రయత్నము చేయుచున్నాడు. అట్టియత్నము చేయుచున్నవారలలో ఒకానొకడు నన్ను తత్త్వతః తెలిసికొనుచున్నాడు.

—భగవద్గీత. 7-3

తిందును? ఏమి త్రాగుదును?'' అను స్వల్పవిషయములను గూర్చి యెంతమాత్రము యోచన చేయజాలడు.

619. దాహముచే నోరు ఎండిపోవువాడు బురదగా నున్నదని నదీజలమును విడిచి శుభ్రమైన నీటికొఱకు నూతిని త్రవ్వ నారంభించునా? అటులనే ఎవ్వనికి ధర్మపిపాస కలదో అట్టి వాడు దాపుననున్న మతము—హిందూమతము కానిండు, మఱేమతము కానిండు—విడిచివేయజాలడు. స్వయముగా తన నిమిత్తము క్రొత్తమతమును సృష్టింపను బూనుకొనడు. నిజమైన జిజ్ఞాసకలవానికి ఇటువంటి లేనిపోని విమర్శలు చేయుటకు వ్యవధి యెక్కడిది?

## నిజమైన పరితాప మెట్టిది ?

620. ధనముకోసము లోభి పరితపించునట్లు భగవానుని కోసము పరితపింపుము.

621. నీట మునిగిపోవువాడు ఊపిరాడక పరితపించునట్లు భగవంతునికోసము పరితపింపవలయును,—అపుడు భగవద్దర్శనము లభించును. (చూ. 617.)

622. భగవద్దర్శనలాభమును బొందుటకై ఎట్టి భక్తి కావలయునో తెలియునా? తల గీఱుకొనిపోయిన కుక్క యెట్లు అశాంతితో నానా దిశలను పరుగెత్తునో అట్లు భగవంతుని కోసము ఆవేదనపడవలయును.

623. ఓమనసా! నీ దివ్యమాతను ఎలుగెత్తి పిలువుము, ఆమెకోసము విలపింపుము. ఆమె యెంత వేగిరముగా నీకడకు

పర్విడివచ్చునో చూతువుగాక. మనసార భగవంతుని బిలుచు నెడల భగవంతుడు ఉపేక్ష వహించి యూరకుండజాలడు. (చూ. 629.)

624. భగవత్ప్రేమ యెంత గాఢముగా నుండవలయునో తెలియునా? పతివ్రతకు భర్తపైనుండు ప్రేమ, లోభికి తాను కూడబెట్టుకొనిన ధనముపైనుండు మక్కువ, లోకులకు ఐహిక విషయములందుండు రాగము—ఇవి ముప్పిరిగొనినంత తీవ్రముగా నీహృదయము భగవంతునికై పరితపించునపుడు నీకు భగవత్సాక్షాత్కారము కాగలదు. *

625. ఏసుక్రీస్తు ఒకనాడు సముద్రతీరమున నడుచుచుండ నొకభక్తుడు సమీపించి యిట్లు ప్రశ్నించెను: "ప్రభూ! భగవంతుని బొందు టెట్లు?" ఏసుక్రీస్తు ఆభక్తునితోగూడ సముద్రములోనికి దిగి వానిని నీళ్లలో అదిమిపట్టెను, కొంత సేపటికి వానిని లేవదీసి, "నీ కెట్లున్నది?" అని యడిగెను. "'ప్రాణము పోవుచున్నదా' యనిపించినది. గిలగిల కొట్టి కొంటిని!" అని భక్తుడు బదులుచెప్పెను. అంతట ఏసుక్రీస్తు ఇట్లు వచించెను: "ఊపిరి ఆడక నీ విపుడు ఉక్కిబిక్కిరియై యెట్లు పరితపించితివో అట్లు భగవంతునికోసము పరిత

* "యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ,
త్వాం అనుస్మరత సా మే హృదయాన్మాపసర్పతు."

'క్షణికములగు విషయసుఖములయందు అవివేకుల కెట్టిప్రీతి యుండునో,—నిన్ను ధ్యానించునపుడు—(నీయందు) అట్టిగాఢమగుప్రీతి నాహృదయమునుండి తొలగిపోకుండునుగాక!' అని ప్రహ్లాదుడు.

పించు నెడల ఆ తండ్రి నీకు కానవచ్చును.''†

626. ''ఈ జన్మముననే నేను భగవంతుని గాంచవల యును, మూడుదినములలో నే నాతని ప్రత్యక్షము చేసికొన వలయును ; ఇంతేల, ఒక్కసారి వాని నామస్మరణము చేసి వాని నాకర్షించుకొందును''— అనునిట్టి తీవ్రమైన భక్తిచే భగవంతుడు ఆకృష్టుడై భక్తునకు సాక్షాత్కరించును. కాని 'సంసారపక్షమగు' భక్తిగలవారు భగవంతుని గాంచుటయే తటస్థించు నెడల ఎన్నియుగములకో కాని అట్టిది సంఘటిల్లదు.

627. ''బ్రహ్మసాక్షాత్కారము ఈ జన్మమున సాధ్యము కానిచో మఱుసటి జన్మమున గలుగును'' అను నిట్టి మంద బుద్ధి యేల? శ్రద్ధాభక్తులవిషయమున నిట్టి మాంద్యము కూడదు. ఈ జన్మముననే—ఏల? ఈ క్షణముననే—వాని సాక్షాత్కారము నొందవలయు నను దృఢనిశ్చయముతో భల్లూకపు బట్టు పట్టిననే కాని పరమపురుషార్థమగు మోక్షము సిద్ధింపజాలదు. పల్లెటూళ్లలో వ్యవసాయులు గిత్తలను కొనబోవునపుడు వాని తోకలను అట్టె తాకుదురు. అందులకు గొన్ని యేమియు కదలవు, మెదలవు, సరికదా, అవయవముల నన్నిటిని చాచుకొని నేలపై బరుండియుండును. వ్యవసా యులు అవి యెందులకు పనికిరానివని వెంటనే తెలిసి కొందురు. కాని మఱికొన్ని వానితోకను తాకినంతనే ఎగిరి గంతులు వేయును. రైతులు అవి చాల ఉపయోగకరమైన

† ఈకథ బైబిలులో కానరాదు. ఐనను ఇయ్యది అందలి ప్రక్షిప్త భాగములలో నొకటియై, శ్రీరామకృష్ణుడు దానినెఱిగినవారినుండి విని యుండవచ్చును.

వని వెంటనే గ్రహింతురు. ఈ విధమైన చులుకుగల గిత్తలనే వారు ఎన్నుకొందురు. మాంద్యము ఎన్నటికిని తగదు. బలాఢ్యుడవు కమ్ము, దృఢవిశ్వాసమును బూనుము. ఈక్షణముననే నేను వాని సాక్షాత్కారమును బొందవలయు నని పలుకుము. అపుడు నీకు తప్పక విజయము సిద్ధించును. (చూ. 569.)

## భగవత్సాక్షాత్కారమునకు ప్రధాననియమము

628. మాయాబంధమునుండి తప్పించుకొను మార్గమేమి? అందులకై పరితపించువారికి భగవంతుడే మార్గమును జూపును. వలయునది నిరంతరపరితాపము.

629. "భగవంతుని సాక్షాత్కారమును బొందుట కుపాయమేమి?" అని యొకశిష్యుడు ప్రశ్నింప శ్రీగురుదేవు డిట్లు సమాధాన మొసగెను: "భగవంతునికోసము నీవు పరితపింపగలవా? విలపింపగలవా? భార్యకోసమో, బిడ్డలకోసమో, ధనముకోసమో లోకులు కడవలకొలది కన్నీటిని గార్తురు. కాని భగవంతునికోసము విలపించువా రెవ్వరు? బిడ్డడు ఆటల మరగియున్నంతవఱకు తల్లి వంటను ఇతర గృహాకృత్యములను జేసికొనుచుండును. కాని బిడ్డడు ఆటవస్తువులతో సంతుష్టిపొందక వాని నావల త్రోసిపాఱవేసి తల్లికోసము విలపించునేని, తల్లి యిక జాగుచేయజాలదు, వంటయింటిలో నుండజాలదు. బహుశః పొయ్యిమీాదినుండి వంటకుండను జాఱవిడిచి, 'నాయన! మాతండ్రి!' యనుచు, ఆత్రముతో బిడ్డనికడ కేగి వాని నెత్తుకొనును." (చూ. 12.

146, 570, 583, 588, 621, 681.)

630. ఎవనిపరితాపము తీవ్రమై యుండునో, ఏకాగ్రత గాఢమై యుండునో, ఆతడు త్వరితముగా భగవంతుని గాంచ గల్గును. (చూ. 275, 633, 636.)

631. భగవంతుని గాంచనై తినని మూడుదినములు తీవ్ర పరితాపము పొందనిండు, నరు డీకలియుగమున భగవదను గ్రహము పొందగల్గును.

632. చందమామ అందఱకును మామయే. అటులనే భగవంతుడు ఎల్లరయొక్కయు సొమ్ము. భగవంతుని ప్రార్థించుటకు ఎల్లరకును హక్కు కలదు. మనఃపూర్వకముగా భగవంతు నెవ్వడు ప్రార్థించునో వాడు సాక్షాత్కారభాగ్యము నొందగలడు. వానిని ప్రార్థించినచో, నీవును ఆ మహాభాగ్యమును పొందగలవు.

633. నిజముగా, నిశ్చయముగా జెప్పుచున్నాను వినుడు: భగవంతునికై పరితపించువాడు వానిని కనుగొనును. ఇందలి సత్యమును స్వయముగా మీజీవితముననే పరీక్షించుకొనుడు. పోయి త్రికరణశుద్ధిగా మూడుదినములు ప్రయత్నింపుడు, తప్పక విజయము నందుదురు. (చూ. 275, 630, 636.)

634. చలింపని భక్తిని తిరుగులేని శ్రద్ధను ఒసగుమని జగజ్జననిని వేడుకొనుము.

635. భక్తునిబల మెందున్నది? ఆతడు భగవానుని బిడ్డడు, అశ్రువులే వాని బ్రహ్మాస్త్రము. మారాముపట్టి యేడ్చు బిడ్డని కోర్కెను తల్లి తీర్చు చందమున విలపించుచున్న తనబిడ్డని కోర్కె నెట్టిదైనను భగవానుడు తప్పక తీర్చును. (చూ. 638.)

636. శ్రీగురుదేవునితో నొకడిట్లు పల్కెను: "నాకిప్పుడు ఏబదియైదేండ్లు నిండినవి. పదునాలుగేండ్లుగా భగవంతుని వెదకుచున్నాను. అనేకగురువుల యుపదేశముల ననుసరించినాను, సమస్తపుణ్యస్థలములను దర్శించినాను, అనేకమహాత్ములను సందర్శించినాను, కాని నాకేమియు లభ్యము కాలేదు." శ్రీగురుదేవు డిట్లు సమాధాన మొసగెను: "నిజముగా, నిశ్చయముగా జెప్పుచున్నాను వినుము: భగవంతునికై పరితపించువాడు వానిని కనుగొనితీరును. నన్ను జూచి ధైర్యము పూనుము." (చూ. 275, 630, 633.)

637. "అమ్మా! నా కాకలి యగునప్పుడు నన్ను లేపుము" అని బిడ్డ పలుక, "నాయనా! నీయాకలియే నిన్ను లేపును!" అని తల్లి సమాధానము చెప్పెను.

638. బొమ్మలకోసమో, డబ్బుకోసమో పోరుపెట్టి యేడ్చుచు, తల్లిని పీడించు బిడ్డవలె నెవ్వడు భగవానుడు తనకు ఆప్తుడని తెలిసికొని వానిని గాంచుటకై లోలోన వెక్కివెక్కి నేడ్చునో వానికి భగవానుడు సాక్షాత్కరించును. నిష్కపటముగా అట్లు బతిమాలుకొనువానికి—తనకై వెదకులాడు భక్తునికి—గాన్పింపకుండ భగవానుడు దాగియుండజాలడు. (చూ. 635.)

639. వీధినాటకములను జూచితిరికదా? అందు కృష్ణలీలానాటకమున తాళమృదంగాదులతో పాటకాండ్రు ఎలుగెత్తి, "రావయ్య, యోకృష్ణ! ఇమ్ము దర్శనము!" అని పాడుచుండునంతకాలము కృష్ణవేషధారి వారిఘోషను కొంచెమైనను ఆలకింపడు. చుట్టకాల్చుకొనుచు తెరచాటున వేష

ములు వేయుచోట గూర్చుండి దగ్గఱవారితో ప్రగల్భములు గొట్టుచుండును. వారి రొద యణఁగి నారదమహర్షి, మార్దవము, మనోహరమునగు కంఠస్వరముతో, "శరణం తవచరణం భవహరణం మమ గోవింద!" అని గాన మారంభింపగనే శ్రీకృష్ణు డిక విలంబముచేయక వెంటనే రంగమున ప్రత్యక్షమగును. సాధకుడు, "ప్రభూ! అనుగ్రహింపుము, నాకు దర్శనమిమ్ము" అని యూరక అఱచుచుండునంతవఱకు జగత్ప్రభువు దర్శన మీయడు. భగవంతుడు సాక్షాత్కరించునపుడు భక్తుని హృదయము ప్రేమసాగరమున లీనమై యుండును. అపుడెంతయు ప్రశాంతచిత్తుడై యుండును. మునుపటిగోల అంతయు పూర్తిగా అంతరించును. ప్రేమపూరితహృదయుడై, మనసార భక్తుడు ప్రార్థించినంతనే భగవాను డిక ప్రత్యక్షమగుటకు ఒకనిముసమైనను జాగుచేయజాలడు. *

---

* శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

—శ్రీమదాంధ్రభాగవతము, 8-90, 97.

స వృక్షకాలాకృతిభిః పరోన్యో
యస్మాత్ ప్రపఞ్చః పరివర్తతేయం,
ధర్మావహం పాపనుదం భగేశం
జ్ఞాత్వాత్మస్థమమృతం విశ్వధామ. —శ్వేతాశ్వతర. 6-6.

ఆతడు సంసారవృక్షముకంటె భిన్నుడు—సంసారాతీతుడు—కాలరూపాతీతుడు. జగత్ సృష్టికిని ప్రళయమునకును ఆతడే కారణము. ధర్మమునకు మూల మాతడే, ఆతడే పాపములను హరించువాడు, సద్గుణములకు ప్రభువు, శాశ్వతుడు, జగత్తునకు నిలయము. ఆతడు ఆత్మయందు నెలకొనియున్నవాడు. అట్టి పరమేశ్వరుని దెలిసికొని యుపాసించువారు మోక్షము నొందుదురు.

తమీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమం చ దైవతం,
పతిం పతీనాం పరమం పరస్తాత్
విదామ దేవం భువనేశమీడ్యమ్. —శ్వేతాశ్వతర. 6-7.

ఆతడు సర్వశ్రేష్ఠుడు—మహేశ్వరుడు,—ప్రజాపతి మొదలగు వారికంటె నధికుడు, సమస్తదేవతలకును దైవతము, సకలలోకములకును ప్రభువు, స్తవనీయుడు,—ఇట్టి పరమేశ్వరుని దెలిసికొందముగాక !

న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం
నేమా విద్యుతో భాన్తి కుతోయమగ్నిః,
తమేవ భాన్త మనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి. —కఠోపనిషత్తు, 5-51.

ఆ పరమాత్మను సూర్యుడుగాని, చంద్రుడుగాని, నక్షత్రములుగాని, మెఱుపులుగాని ప్రకాశింపజేయజాలవు. ఇక అగ్నిమాట చెప్పెడి దేమి? (స్వయంజ్యోతియగు) ఆ పరమాత్ముని ప్రకాశముచేతనే ఈ సర్వము ప్రకాశించుచున్నది.

పదునాల్గవ ప్రకరణము

# భక్తుడు: భగవంతుడు

**భగవంతుడు ఎందుచే కాన్పింపడు?—భగవంతుడు: భక్తుడు—భక్తుడు: సంసారము—భగవదనుభవము—భగవంతుడు సిరిసంపదలను లక్షించునా?**—పురుషప్రయత్నము: భగవదనుగ్రహము

## భగవంతుడు ఎందుచే కాన్పింపడు?

640. సూర్యమండలము భూమికంటె ఎన్నియో రెట్లు పెద్దది; కాని ఎంతయో దవ్వున నుండుటచే చిన్నబిబ్బవలె కాన్పించుచున్నది. అటులనే భగవంతుడు అనంతుడును అఖండుడునై యున్నాడు. కాని మనము (అజ్ఞానముచే) వానికి అతిదూరమున నుండుటచే వాని యఖండస్వరూపమును గ్రహింపజాలకున్నాము.

641. నాచుచేతను రెల్లుచేతను గప్పబడిన చెఱువులో ఈదులాడుచేపలు పైకి గాన్పింపనిరీతిని భగవంతుడు నరులకు గానరాకుండ మాయావృతుడై మానవహృదయమున క్రీడించుచున్నాడు.

642. జగజ్జననిని మనము ఎందుచే జూడజాలము? ఆమె తెరచాటుననుండి వ్యవహారమునంతయు జక్కబెట్టుకొను గొప్పకుటుంబమునందలి స్త్రీవంటిది. ఆమె యందఱను జూచుచుండును, కాని యామె నెవ్వరును జూడజాలరు. ఆమె ప్రియపుత్త్రులగు భక్తులుమాత్రము తెరను తొలగించుకొని యామెను దర్శింతురు.

643. పోలీసు జవాను తన దొంగలాంతరు మూలమున నెవ్వరి నైనను జూడగలడు, కాని యతడు దానివెలుగును తనపైకి త్రిప్పుకొననిదే ఎవ్వరును వానిని గనజాలరు. అటులనే భగవంతుడందఱను జూచుచునేయుండును. కాని కృపాపూర్ణుడై స్వయముగా సాక్షాత్కరింపనిదే వాని నెవ్వరును గనజాలరు.

## భగవంతుడు : భక్తుడు

644. భూస్వామి గొప్ప జమీందారై యుండవచ్చును. కాని బీదరైతు ప్రేమతో ఏదోయొక చిన్నకానుకను తనకు సమర్పించునేని మహానందముతో ఆతడు స్వీకరించును. అటులనే సర్వేశ్వరుడు అఖండ మహిమాన్వితుడయ్యును మనఃపూర్వకముగా తన కర్పింపబడు నైవేద్య మెట్టిదైనను మహానందముతో స్వీకరించును. * (చూ. 1084.)

645. సంస్కృతము రానిచో నాకేమి కొదువ? భగవంతుని సాక్షాత్కారము నొందినచో నేను సంతుష్టుడను. పండితులు కానిండు, పామరులు గానిండు, తన్ను దెలిసికొనుటకు పరితపించు తనబిడ్డలందఱియందును సమానముగా భగవంతుడు ప్రేమానురాగములను జూపును. ఒకనికి ఐదు

* "పత్త్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః."

—భగవద్గీత. 9-26.

ఎవడు భక్తితో నాకు ఆకునైనను, పువ్వైనను, పండైనను, ఉదకమునైనను సమర్పించుచున్నాడో అట్టి శుద్ధిమంతునిచే భక్తిపూర్వకముగా సమర్పింపబడిన యావస్తువులను నేను ఆరగించుచున్నాను."

గురు బిడ్డలున్నారనుకొనుము. వారిలో గొందఱు వానిని 'నాన్న'యని పిలువగలుగుదురు; మఱికొందఱు ఆమాటను పూర్తిగా ఉచ్చరింపజాలక, 'నా' యనిమాత్రమే ఉచ్చరింప గలిగియుండవచ్చును. కాని తండ్రి వారిని తక్కువ ప్రేమిం చునా? వారు కేవలము పసిబాలురు కావున తన్ను సరిగా పిలువజాలకున్నారని యాత డెఱుగును. నిశ్చయముగా ఆత డందఱను సమానముగనే ప్రేమించును.

646. ధూళిలోను ఇసుకలోను పొరలాడి ఒడలెల్ల మలి నము చేసికొనుట బిడ్డల స్వభావము, కాని తల్లి యా బిడ్డల నట్లే మలినముగా నుండనీయదు. పదే పదే కడిగి శుభ్రము చేయుచుండును. అటులనే పాపముచేయుట నరునికి సహజము; కాని యాతడు పాపముచేయు టెంత నిశ్చయమో, భగవంతుడు వానికి తరణోపాయమును జూపుటయు అంతకు పదిరెట్లు నిశ్చయము.

647. ఒకే పెద్దచేపతో తల్లి చేయు పులుసు, కూర మొద లగువానిలో నెవరికి హితవగునది వారు గైకొనునట్లు భక్తుల యభీష్టముననుసరించి ఒకే భగవానుడు వేర్వేఱు రూపము లతో సాక్షాత్కరించుచుండును. ప్రతిభక్తుడును భగవానుని గూర్చి ప్రత్యేకమగు భావనను గలిగియుండవచ్చును: తదను గుణమగురూపమును పూజించుచుండవచ్చును. కొందఱికి భగవంతుడు ప్రభువు, కొందఱికి తండ్రి, కొందఱికి తల్లి, కొంద ఱికి ప్రాణసఖుడు, కొందఱికి ప్రాణనాథుడు, మఱికొందఱికి విధేయుడగు సుతుడునై యొప్పుచుండును. (చూ. 827.)

648. చెఱువులో చేపలు ఎంతమాత్రమునను న్నను

నోరూర జేయునెర నీట వైచినంతనే నల్దిక్కులనుండియు అవి యచటికి వచ్చిచేరును. అటులనే శ్రద్ధాభక్తు లనునెరతో నెవరిహృదయము పూర్ణమైయుండునో భగవాను డట్టిభక్తునకు అతిశీఘ్రముగా ప్రసన్నుడగును. (చూ. 146, 570, 583, 588, 681.)

649. దేవఋషులు భగవంతునకు ఆప్తకోటిలోనివా రన వచ్చును. వారే భగవంతునికి మిత్రులు, సన్నిహితులు,— నెచ్చెల, స్వజనము అని చెప్పవచ్చును. సామాన్యులగు నితరు లందఱును భగవంతునికి దూరపు బంధువులవంటివారు, కేవలము వాని సృష్టిజాతములోనివారు.

650. ఒకేసూర్యరశ్మి అనేకప్రదేశములందు పడుచున్నది. కాని కాంతిని గ్రహించునట్టి అద్దముగాని, నీరుగాని, మెఱుగువెట్టిన లోహములుగాని దానిని చక్కగా ప్రతిఫలింప జేయును. భగవంతుని దివ్యతేజము విషయము నిట్టిదే. అది సమానముగా—నిష్పక్షపాతముగా—అందఱిహృదయములందును ప్రసరించును. కాని సజ్జనులయొక్కయు సాధుసత్తములయొక్కయు వినిర్మలహృదయములు మాత్రమే ఆ దివ్యతేజమును స్వీకరించి చక్కగా ప్రతిఫలింపజేయును. (చూ. 211, 536.)

651. వెలుగు నొసగుట దీపస్వభావము. దాని సాయమున గొందఱు అన్నము వండుకొందురు, కొందఱు దొంగదస్తావేజులను సృష్టింతురు. కొందఱు సద్గ్రంథములను జదువుకొందురు. అటులనే కొందఱు భగవన్నామకీర్తనచే ముక్తి పడయుజూతురు, కొందఱు తమ దుష్కార్యములను

సాధింపజూతురు. ఎవరెట్టుల వినియోగించుకొనినను భగవన్నామము మాత్రము నిష్కళంకముగనే—పరమపవిత్రముగనే—యుండును. (చూ. 839.)

652. భగవానుడు, భాగవతము, భక్తుడు—ఈమూడును ఒక్కటియే.

653. ఉత్తమభక్తుడు భగవంతు నెట్లు భావించును? బృందావనగోపికలు శ్రీకృష్ణుని జగన్నాథునిగాగాక, తమ కత్యంతప్రియుడగు గోపీనాథునిగా గాంచిన చందమున ఉత్తమ భక్తుడు భగవంతుని దన కత్యంతము ఆప్తునిగా భావించును. (చూ. 780.)

654. భక్తుడు భగవంతుని "అమ్మా!" యనిపిలిచి యానంద పరవశుడగుటకు కారణమేమి? బిడ్డకు ఇతరు లందఱియొద్ద కంటెను తల్లియొద్ద చన వెక్కువ. అందువలన తల్లియనిన మక్కువ.

655. తాపజ్వరముచే దాహపీడితుడగు రోగి సరోవరము లోని నీటినంతయు త్రాగివేయగలనని తలచును. ఆజ్వరము తగ్గి యాతడు పూర్వస్థితికి వచ్చినప్పుడు గిన్నెడు నీటినైనను త్రాగడు, అందు అల్పభాగముతోడనే సంతుష్టుడగును. అటులనే మాయయను తాపజ్వరముచే తన యల్పత్వమును మఱచిన నరుడు అఖండుడగు భగవానుని—వాని యనంత విభూతులను—తన చిన్నిహృదయమున నిల్పుకొనగలనని తలచును. కాని యీభ్రాంతి తొలగినంతనే పరంజ్యోతియొక్క జ్ఞానకిరణ మొక్కటి చాలును, వానిని పరమానందభరితుని జేయుటకు!

656. కొందఱికి గుక్కెడుసారా త్రాగినంతనే నిషా కలుగును, మఱికొందఱికి రెండుమూడు సీసాలు త్రాగినగాని కలుగదు. కాని యిరుతెఱగులవారికిని నిషావలన గలుగు నానంద మొక్కటియే. అటులనే కొందఱుభక్తులకు పరంజ్యోతి యొక్క కిరణమొక్కటిచేతనే పరవశత్వము గలుగును, మఱి కొందఱికి ఆపరంజ్యోతియొక్క సంపూర్ణసాక్షాత్కారము లభించిననేకాని పారవశ్యము గలుగదు. కాని యిరుతెఱగుల వారును బ్రహ్మానందపరవశులై సమానముగనే ధన్యులగుచున్నారు.

657. భగవంతుడు పంచదారకొండవంటివాడు. చిన్న చీమ వెడలి యొక చిన్నపలుకును దెచ్చుకొనును, పెద్దకండ చీమ యొకపలుకును దెచ్చుకొనును. కాని కొండ యెప్పటి వలెనే యుండును, తఱుగదు. భగవద్భక్తుల విషయముకూడ నిట్టిదే. భగవంతుని యనంతకల్యాణ గుణములలో—విభూతులలో—ఒక్కదానిచేతనే వారు బ్రహ్మానందపరవశులగుదురు. వాని నన్నిటిని సాక్షాత్కరించుకొనగల్గినవారు ఎవ్వరును లేరు.

658. బ్రహ్మానందసాగరమునుండి వెలువడు నానంద వీచికలు ఎవ్వని హృదయమును సోకినను దానిని పరివర్తన మొందించును. సనకసనందనాదిమునివరు లీవీచికలచే ముగ్ధులైరి. భగవద్భక్తిపరవశుడగు నారదుడు నిజముగా దూరము నుండి యా బ్రహ్మాసాగరమును గాంచెను, కాంచి వివశుడై సదా భగవన్నామ సంకీర్తన మొనర్చుచు ఉన్మత్తుడై త్రిలోకములందును దిరుగాడుచున్నాడు. ఆజన్మయోగివరిష్ఠు

డగు శుకదేవుడు ఆ బ్రహ్మసాగరమును కేవలము తన హస్తముతో ముమ్మాఱు తాకెను. నాటినుండియు బ్రహ్మానందపరవశుడై పసిపాపవలె దొరలాడుచున్నాడు. జగదీశ్వరుడగు మహాదేవుడు అందలి మూడుపుడిసెండ్ల జలము త్రావి బ్రహ్మానందపారవశ్యమున శవమువలె అచలుడై పడియున్నాడు. ఈ బ్రహ్మసాగరముయొక్క లోతును—అగోచరమగు దాని ప్రభావమును—ఎవరు గ్రహింపగలరు?

659. కేశవచంద్రసేనునితో శ్రీ గురుదేవు డిట్లు పలికెను: "మీ బ్రాహ్మసమాజమువారు భగవంతుని చెయిదములను గూర్చియు, తద్వైభవమును గూర్చియు అంతగా స్తోత్రము చేయుచుందు రేల? 'ఓ దేవా! నీవు సూర్యుని, చంద్రుని, నక్షత్రములను సృష్టించినావు' అనుచు, అదియే మహావిశేషమని భావించుచుందు రేల? పూలతోటయొక్క సొగసును, అందలి దివ్యమైన పూవులను, వాని పరిమళమును గాంచి ముగ్ధులగువా రేకాని తోటయొక్క అధిపతిని కనుగొనువా రెవ్వరు? తోటయా ఘనమైనది? దాని యధిపతియా, ఘనుడు? సదా మృత్యువు మననడుమ విహరించుచుండ ప్రపంచమున నీవనము కేవలము బూటకమనియు దీని కధిపతియగు భగవానుడొక్కడే సత్యమనియు గ్రహింతము గాక!

"సారాదుకాణమున నొకటిరెండుపాత్రలను గైకొనిన పిమ్మట లోపల ఎన్నిపీపాల సారాయ మున్నదో ఎవరికి గావలయును? మైమఱచుటకు ఒక్కసీసా చాలదా!

"నరేంద్రుని * జూచినంతనే పట్టరానియానందమున మైమఱతును. 'మీనాయన యెవరు?' అనిగాని, 'మీ కెన్ని యిండ్లు, వాకిండ్లు కలవు?' అనికాని నే నెన్నడును అతని నడుగలేదు.

"నరులు తమ సిరిసంపదలను ఎంతయో గొప్పగా గణన చేయుదురు. కాంచనము, వస్తువాహనములు—ఇవియే వారి దృష్టిలో గణనీయములు. తమవలెనే భగవంతుడును సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు మొదలగు తన సృష్టిజాతమును ఎంతయో విశేషముగా నెంచునని వారి యభిప్రాయము! భగవంతుని చెయిదములను నుతించినయెడల అతడు సంతసించునని వారిభావము!" (చూ. 754.)

660. పసిబిడ్డయొక్క అమాయకత్వము ఎంత మనోహరము! లోకమందలి సిరిసంపద లన్నిటికంటెను ఒక్క బొమ్మయనిన ఎంత సంతసించును! ఎంత మక్కువ జూపును! శ్రద్ధావంతుడగు భక్తుడు నిట్టివాడే, పేరుప్రతిష్ఠలను సిరిసంపదలను ఈసడించి దేవునితోడిదే లోకమని కూర్చుండువారు మఱెవ్వరు?

661. ఉత్తమసాధువు (లేక సజ్జనుడు) తన మనస్సులో ముప్పాతిక భాగమును భగవానున కర్పించును. మిగిలిన నాలవవంతుమాత్రమే ఐహికవిషయములం దుంచును. ఇతర భాగము లన్నిటియందుకంటెను తోకయందే తనప్రజ్ఞ కేంద్రీకరింపబడియున్నదో యనునటుల, ఎవ్వరైనను తోకను

* శ్రీగురుదేవుని శిష్యవరేణ్యుడగు శ్రీ వివేకానందస్వామియొక్క పూర్వనామము 'నరేంద్రుడు.'

త్రొక్కినంతనే పాము బుస్సుమనును. అట్లే సాధువు భగవద్విషయమునం దెక్కువ మెలకువ గలిగియుండును.

662. శ్రీరామకృష్ణు నుద్దేశించి ప్రఖ్యాత బ్రాహ్మసామాజిక ప్రచారకు డొకడు పరమహంస వట్టి పిచ్చివాడనియు, ఒకేవిషయముపై విధివిరామములు లేని చింతనయాతనికి మనోవైకల్యము గల్గించెననియు ఐరోపాదేశపు విజ్ఞానులలో గూడ ననేకులకు ఈగతియే పట్టెననియు జెప్పసాగెను. అనంతరము శ్రీగురుదేవు డీ ప్రచారకుని సంబోధించుచు నిట్లు సమాధాన మొసగెను: "ఒకేవిషయమునుగూర్చి నిరంతర చింతనచేయుటవలన ఐరోపాపండితులకు గూడ మతిపోయెననియా మీరు చెప్పుచున్నారు? సరి, వారు చింతించుచుండిన విషయము ఐహికమా, ఆముష్మికమా? ఐహికమైన పక్షమున దానినిగూర్చి నిరంతర యోచన చేయువారు పిచ్చి వా రగుటలో ఆశ్చర్యమేమున్నది! కాని దేని దివ్యతేజముచే జగమంతయు భాసించుచున్నదో అట్టి చిద్రూపమునుగూర్చి—ఆముష్మికమునుగూర్చి — చింతనచేయుటవలన నరుడు ప్రజ్ఞ నెట్లు కోల్పోవును? మతిమాలినవా డెట్లగును? ఇదియేనా, మీకు మీ శాస్త్రములు బోధించుచున్న మహా విషయము!"

663. భగవద్భక్తిసాగరమున నిమగ్నుడవు కమ్ము. భయపడకుము. నే నొకప్పుడు నరేంద్రునితో నిట్లంటిని: "భగవానుడు అమృతసాగరము. ఆసాగరమున నీవు నిమగ్నుడవు కాగోరవా? పంచదారపానకముతో నిండిన బిందె కలదను

కొనుము, నీవొక మక్షికవలె నగుకొనుము. నాయనా! అప్పుడు నీ వెట్లా పానకమును గ్రోలెదవు?" నరేంద్రుడు తానందు పడిపోయినచో మునిగిపోవుట నిశ్చయము కావున అంచుపై వ్రాలి త్రాగుదు ననియెను. అంత నే నిట్లంటిని: "ఇది యమృత సాగరమోయి! ఇందు మునిగినవారికి మరణభయ మెక్కడిది? సచ్చిదానందసాగరము అమృతసాగర మను మాట మఱవకుము. అమృతసాగరమగు భగవానునియందమిత భక్తి వలదనువా రవివేకులు. వారివలెనే నీవును భయమందకుము. ఈయమృతసాగరమున నిమగ్నుడవుకమ్ము!"

## భక్తుడు : సంసారము

664. దేవకీదేవికి చెఱసాలలో శ్రీకృష్ణదివ్యదర్శన ప్రాప్తి కలిగినను అది యామెకు చెఱనుండి విముక్తిని గల్గింపజాలక పోయెను.

665. పవిత్రమైన గంగాస్నానముచే ఒకప్పుడొక గ్రుడ్డివాడు పాప విముక్తుడైనను వాని గ్రుడ్డితనముమాత్రము పోలేదు.

666. కట్టెలుకొట్టు నొకభక్తుని కొకప్పుడు అల జగజ్జనని ప్రత్యక్షమై వాని ననుగ్రహించెను. కాని వానికి కట్టెలు కొట్టు వృత్తిమాత్రము తప్పలేదు. ఎప్పటివలెనే కట్టెలు కొట్టు కొని యమ్ముకొనుచు కష్టజీవనము చేయుచుండెను.

667. అంపశయ్యపై మరణమునకై వేచియున్న భీష్మదేవునికన్నులనుండి బాష్పములు కాఱుచుండెను. అపుడు శ్రీకృష్ణుడును పాండవులును దగ్గఱ నిలుచుండియుండిరి. అంత

నర్జునుడు శ్రీకృష్ణునితో నిట్లు పల్కెను: "బావా! ఏమిది! మా తాతగారు (భీష్ములు) నిత్యసత్యవ్రతులు, జితేంద్రియులు, బ్రహ్మజ్ఞానసంపన్నులు, స్వయముగా అష్టవసువులలో నొకరు గదా; ఆయనకూడ అవసానకాలమున మాయలోబడి కన్నీరు విడుచుచున్నాడే!" శ్రీకృష్ణభగవాను డంత భీష్మున కీవిషయము దెలుప భీష్ము డిట్లు వచించెను: "కృష్ణా! నేను అందులకు విలపించుట లేదని నీకు పూర్తిగ దెలిసినదే. 'ఎవ్వని పావన నామస్మరణమువలన నరులు సమస్తకష్టములనుండియు తరింతురో అట్టిభగవంతుడే స్వయముగా పార్థసారథియై పాండవ పక్షము నవలంబించినను వారికష్టముల కంతము లేకున్నది గదా! ఆహా! భగవల్లీల లెంత దురవగాహములు!' అని తలచునప్పుడు పొరలివచ్చు కన్నీటి నాపుకొనజాలకున్నాను."

## భ గ వ ద ను భ వ ము

668. ఒక చీకటిగది కలదు. అందొకడు కలడు. దాని లోనికి ఒక చిన్నరంధ్రముగుండా బైటనుండి సూర్యకిరణములు వచ్చుచున్నవి. ఎన్ని కిరణములు వచ్చునో లోపల నున్నవానికి అంత కాంతి గోచరించునుగదా? ద్వారముల యందును కిటికీలయందును సందులు హెచ్చుగా నున్నకొలదియు వెలుతురును హెచ్చుగా గోచరించుచుండును. తలుపులను కిటికీలను తెఱచివైచినయెడల మఱింత వెలుతురును గాంచును. కాని బహిరంగమైనచోట నిలిచినవానికి అంతయు వెలుతురే! ఇదేవిధమున భక్తుడు తనయంతఃకరణముయొక్క

శక్తిసామర్థ్యములను స్వభావము ననుసరించి భగవదను భవము నొందుచుండును.

669. జీవుడు పరమాత్ముని సమీపించినకొలదియు అపూర్వములగు నాతని విభూతులను అనంతకల్యాణగుణములను గాంచుచుండును; తుదకు జ్ఞానపరిపాకమున పరమాత్మయం దైక్యము నొందును. (చూ. 753.)

## భగవంతుడు సిరిసంపదలను లక్షించునా?

670. తనకు అర్పింపబడు సిరిసంపదలను భగవంతుడు లక్షించునా? లక్షింపడు, లక్షింపడు! తన కెవ్వడు ప్రేమను భక్తిని సమర్పించునో వానియందే భగవానునకు కృపగల్గును. ప్రేమ, భక్తి, వివేకము, వైరాగ్యము—ఇవియే భగవంతుడు లక్షించునవి.

671. శంభుమల్లికుడు ఒకసారి నాతో నిట్లు పల్కెను: "అయ్యా, నా సంపదనంతయు జగజ్జనని పాదపద్మముల చెంత సమర్పించి మరణించునటుల నన్నాశీర్వదింపుడు." అందులకు నే నిట్లంటిని: "ఏమేమి? ఇది యంతయు నీవు గొప్పసంపదగా నెంచుకొనవచ్చును, కాని నీ సంపద నీవు పాదములతో త్రొక్కు ధూళికంటె అతిశయముగా అలజగజ్జననికి గాన్పింపదుసుమీ!"

672. దక్షిణేశ్వరమున రాణిరాసమణి (కట్టించిన) దేవాలయమున నొకసారి దొంగతనము జరిగినది. విష్ణ్వాలయ మందలి విగ్రహములకు అలంకరింపబడిన ఆభరణములన్నియు పోయినవి. (దేవాలయనిర్వాహకుడును రాణియల్లుడునగు) మథురనాథుడును శ్రీగురుదేవుడును సంగతిసందర్భములను

కనుగొనుటకై అచటికి వెడలిరి. మథురు డిట్లు అఱచెను: "ఓ దేవుడా! నీవు అసమర్థుడవు! నీయాభరణముల నన్నిటిని దొంగ లెత్తుకొనిపోవ నీవు నివారింపజాలవైతివి!" అది విని శ్రీగురుదేవుడు మథురనాథు నిట్లు గట్టిగా మందలించెను: "నీ విట్లు పలుకుట ఎంత బుద్ధిహీనత! విగ్రహమున నీవు అర్చించు జగదీశ్వరునకు ఈ నగలన్నియు ఒక మట్టిపెల్ల పాటిచేయవు సుమీ! సాక్షాద్భాగ్యదేవతయగు శ్రీమహాలక్ష్మి తన వైభవమునంతయు ఆ జగదీశ్వరునివలననే పొందుచున్నదని జ్ఞప్తి నుంచుకొనుము!"

## పురుషప్రయత్నము: భగవదనుగ్రహము

673. మనకు ఆహారము సమకూర్చుచున్నాడు కావున భగవంతుడు దయామయుడని చెప్పజాలము. 'ఆలికి కూడు పెట్టుకొనుట ఊరికి ఉపకారమా?' యనునట్లు బిడ్డలకు అన్నమిడుట తండ్రివిధి కాదా? కాని మనలను దుష్ప్రేరణలనుండి కాపాడుచు, పెడత్రోవ త్రొక్కకుండ రక్షించుపట్ల భగవంతుడు నిజముగా దయామయుడని చెప్పవలయును.

674. ప్రశ్న: ఎట్టికర్మముల నొనర్చుటచే భగవంతుని బొందనగును?

ఉ. కర్మములలో నేమియు లేదు. 'ఈకర్మ మొనర్చిన భగవంతుని బొందగలము, ఆకర్మ మొనర్చిన బొందజాలము' అని భావింపరాదు.

సర్వము భగవదనుగ్రహముపై నాధారపడియున్నది. వాని యనుగ్రహము పొందవలెనేని, నీ వేకర్మ మొనర్చినను

మనఃపూర్వకముగా నొనర్పుము, భగవంతుని బొందవలయు నను పరితాపముతో నొనర్పుము. వాని కృపవలన నీపరిస్థితు లనుకూలపడగలవు; సాక్షాత్కారమునకు వలయు స్థితిగతు లేర్పడగలవు. నీవు సన్న్యసింపదలచియుండ, కుటుంబము నీపై నాధారపడియుండ, బహుశః నీసోదరుడు ఆ భారమును వహించును. నీభార్య నీకు అడ్డము వచ్చుటకు బదులు నీకు తోడ్పడవచ్చును. లేదా, నీవు వివాహమే చేసికొనకపోవచ్చును. అపుడు నీకు సంసారబాధ్యతయే యుండదు. అంతయు దైవానుగ్రహము! (చూ. 55, 686.)

675. శతాబ్దములకొలది గది నావరించియున్న చీకటి దీపము వెలిగించినంతనే మటుమాయ మగుచున్నది. కోట్లకొలదిజన్మములలో జేసిన పాపములు భగవానుని కరుణాకటాక్ష మొక్కటి ప్రాప్తించినంతనే పటాపంచలై పోవుచున్నవి.

676. కొన్నిచేపలకు చాలవరుసలయెముక లుండును, మఱికొన్నిటికి ఒకేవరుస యెముకలుండును. అవి హెచ్చుగా నున్నను తక్కువగానున్నను చేపలను దినువారుమాత్రము వానినన్నిటిని తీసిపాఱవేయుదురు. అటులనే కొందఱిపాపములు విశేషముగా నుండును. మఱికొందఱివి కొలదిగా నుండును. కాని యీశ్వరానుగ్రహము సకాలమున వానినన్నిటిని తొలగించి నరులను పాపవిముక్తులను జేయును.

677. మలయమారుతము వీచునప్పుడు చేవగల చెట్లన్నియు మంచిగంధపుచెట్లుగా మాఱునందురు. చేవలేని బూరుగు, వెదురు, అరటి మొదలగునవి మార్పుచెందక యథాప్రకార ముగనే యుండును. అటులనే ఈశ్వరానుగ్రహము లోకము

నను ప్రాప్తించునపుడు సౌజన్యపుణ్యాంకురములు గలవారు శీఘ్రముగా మహనీయు లగుదురు—భక్తు లగుదురు. ఇక నిర్భాగ్యులగు విషయాసక్తులుమాత్రము ఎట్టిమార్పును జెందక ఎప్పటివలెనే యుందురు.

678. ఒకపుణ్యాత్ముడు జపమాల త్రిప్పుచు భగవన్నామ స్మరణ చేయుచుండెడివాడు. శ్రీగురుదేవు డాతని కిట్లనియె : "ఒకేతావును (సాధనను) అంటిపట్టుకొనియుండ నేల ? ముందునకు సాగి పొమ్ము." ఆతడు, "అందులకు భగవదనుగ్రహము కావలయునుగదా !" అనియెను. అంత శ్రీగురుదేవు డాతని కిట్లు బోధించెను : "భగవదనుగ్రహమను మారుతము అహర్నిశము నీశిరస్సుమీదుగా వీచుచునేయున్నది. సంసార సాగరమును శీఘ్రముగా తరింపగోరెదవేని నీ మనస్సను నౌకయొక్క తెరచాపలను విప్పుము."

679. ఈశ్వరానుగ్రహ మను గాలి సర్వదా వీచుచునే యున్నది. సోమరులై సంసారసాగరమున బడియుండువారు దానిలాభమును బొందరు. కాని కార్యదక్షులు, బలాఢ్యులు నగువారు తమ మనస్సను తెరచాపను నిండార విప్పుకొని, ఆ యనుకూలవాయువును గ్రహించి శీఘ్రముగా పరమావధిని బొందుదురు.

680. ప్రశ్న : ఆకస్మికముగా నేమియు సిద్ధింపదా ?

ఉ. ముక్తినొందుటకుముందు సర్వసాధారణముగా అందఱును దీర్ఘకాలము సాధనచేయవలసియే యున్నారు. ద్వారకనాథబాబు ఒక్కసారిగ్గా 'హైకోర్టు జడ్జి'గా లేదు, ఆ పదు

విని బొందుటకుముం దాయన అనేకసంవత్సరములు కష్టపడి పనిచేసెను—శ్రమపడి చదువుకొనెను. అట్లు శ్రమకోర్వ నిచ్ఛగింపనివారు కక్షిదారులులేని "బల్లదండుగ ప్లీడరు"లై యుండుటకు సిద్ధపడవలసినదే! ఐనను భగవదనుగ్రహముచే అకస్మాత్తుగా అభ్యుదయము నొందుటయు గలదు. కాళిదాసువిషయ మిట్టిది. సరస్వతీదేవి యనుగ్రహమున పరమపామరస్థితినుండి యాతఁ డొక్కసారిగా భారతదేశకవీశ్వరుఁ డనిపించుకొను స్థితిని బొందెను. (చూ. 593.)

681. ఒకగృహస్థభక్తుడు : దేవా! మీరు భగవంతుని జూచితిరని విని యున్నాము. కావున మమ్మనుగ్రహించి మేముకూడ భగవంతుని జూచునట్లు చేయుడు. ఆభగవానుని చెలిమి సంపాదించు టెట్లు?

ఉ. సర్వము ఈశ్వరేచ్ఛ ననుసరించి నడచును. భగవద్దర్శనము నొందుటకై సాధనచేయవలయును. కేవలము చెఱువుగట్టున గూర్చుండి, "ఈచెఱువులో చేపలున్నవి, ఈ చెఱువులో చేపలున్నవి" అని యఱచుటచే చేపలు చేచిక్కునా? వానిని బట్టుటకు వలయు పరికరములను సంపాదింపుము,—గాలపుజువ్వ, దారము, ఎర—వీనిని దెచ్చి ముందు చేపల నాకర్షించు నాహారము నీటిలో చల్లుము. అంతట లోతున నున్న చేపలు పైకి వచ్చును. అప్పుడు నీవు వానిని పట్టుకొనవచ్చును. ఏప్రయత్నమును చేయక మీ రూరక కూర్చుండియుండ నన్ను మీకు భగవంతుని జూపింపుమని యడుగుచున్నారా! పెరుగు తోడుపెట్టి, వెన్నచిలికి మీనోటికి అందీయవలయునా! చేపను బట్టుకొని మీ చేతిలో

బెట్టవలయునా! ఎంత విపరీతముగా నున్నది మీకోరిక !!
(చూ. 146, 570, 583, 588.)

682. నడిసముద్రమున బోవు నోడ తెరచాపకొయ్యమీద నొక పక్షి వాలియున్నదనుకొనుడు. అది యచట చాలసేపు కూర్చుండుటకు విసుగు చెందును; మఱియొక తావును వెదకుటకై యెగిరి వెడలును; దేనిని గానక, ఎంతయో అలసి సొలసి తుదకు పూర్వపు ఓడకొయ్యనే చేరును. అట్లే సామాన్యసాధకుడు తన శ్రేయోభిలాషియు, అనుభవశాలియునగు గురువు విధించు శిక్షణమును సాధనలను సాగింప విసుగు చెందును; నిరాశుడగును, గురువునందు విశ్వాసము కోల్పోవును; ఇక స్వప్రయత్నముచే భగవంతుని గనుగొందమను ఆశతో ఎందెందో తిరుగాడును; ఎంతయో వృథాయత్నముచేసి, తుదకు తనపూర్వపు గురునియొద్దకు—ఆతని యనుగ్రహమును ఆశీర్వాదమును బొందుటకై—తిరిగి వచ్చును.

683. ఉక్కగా నుండగా గాలి వీచనంతకాలము విసనకఱ్ఱతో విసరుకొందుము. ధనవంతులకును దరిద్రులకును ఎల్లరకును సమానముగా హాయి నొసగు మలయమారుతము వీచ నారంభించినంతనే విసనకఱ్ఱ నావల బెట్టుదుము. పరమావధిని బొందుటకై దైవసాహాయ్యము లేకుండునంతకాలము స్వప్రయత్నమును సాగింపవలయును; కాని యదృష్టవశమున ఆ తోడ్పాటు లభించునపుడు ఇక శ్రమపడుట—సాధనచేయుట—అనావశ్యకము. అంతట అంతమాత్రము శ్రమపడవలసి తీరదు.

684. మలయమారుతమే వీచునపుడు విసనకఱ్ఱ యెందులకు ? భగవత్కృపయే లభించునపుడు జపతపము లెందులకు?

685. "భగవంతునియొక్కయు గురునియొక్కయు సద్భక్తునియొక్కయు అనుగ్రహము లభించినను ఒక్కదాని యనుగ్రహము లేకపోయెనా, నరుడు నశించును." ఈ మూడువిధములైన యనుగ్రహమును అదృష్టవశమున బొందినను అంతఃకరణముయొక్క అనుగ్రహము లేనియెడల— అనగా తరణోపాయమునకై పరితపింపనియెడల— అన్నియు నిష్ఫలము.

686. నీ వెంతగా ప్రయత్నించినను భగవదనుగ్రహము లేనిదే ఏమియు లభింపదు : వాని కృపలేనిదే నీవు వాని సాక్షాత్కారమును బొందజాలవు. కాని భగవత్కృప సులభముగ చేచిక్కునది కాదు. హృదయమునుండి యహంకారమును నిర్మూలము చేయవలయును. "నేను కర్తను" అను నహంకారము ఏ మాత్రమున్నను నీవు భగవంతుని గనజాలవు. (ఇంటిసామగ్రి పెట్టుకొను) గదిలో ఎవరో యొకరుండగా ఇంటియజమానుని మఱియొకరు ఏదియో యొకవస్తువును అందుండి తెమ్మనినయెడల వెంటనే యాతడు, "గదిలో ఎవరో ఉన్నట్లున్నారు, చూడు, వాని నడిగి పుచ్చుకో" అని చెప్పునుగదా? "నేను కర్తను" అని భావించువానికి భగవంతుడు ప్రసన్నుడు కాడు. (చూ. 55, 674.)

687. తనకు ఎపుడు కృపగలుగునో అపుడే భగవంతుడు సాక్షాత్కరించును. ఆతడు పరంజ్యోతి,జ్ఞానభాస్కరుడు. వాని కిరణమొక్కటి ప్రసరించి లోకమునకంతకును ధీశక్తి నొసగు

చున్నది. తన్మూలముననే మనము ఒండొరులను దెలిసికొనగలుగుచున్నాము. బహువిధములైన జ్ఞానమును బొందగలుగుచున్నాము.* తన దివ్యతేజమును తనపై బ్రసరింపజేసికొనునప్పుడే మనము వానిని గాంచగల్గుదుము.

---

* "న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం
నేమా విద్యుతో భాన్తి కుతోయ మగ్నిః,
తమేవ భాన్త మనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి."

—కఠోపనిషత్తు, 5-51.

ఆ పరమాత్మను సూర్యుడుగాని, చంద్రుడుగాని, నక్షత్రములుగాని ప్రకాశింపజేయజాలవు. ఇక, అగ్నిమాట చెప్పెడిదేమి? (స్వయంజ్యోతియగు) ఆ పరమాత్ముని ప్రకాశముచేతనే ఈ సర్వము ప్రకాశించుచున్నది.

పదునైదవ ప్రకరణము

# పారమార్థిక మార్గదర్శకులు

**౧. గురువు : గురుని లక్షణములు—గురుని ఆవశ్యకత—గురుశిష్యుల యన్యోన్యసంబంధము—౨. అవతారమూర్తి : భగవదవతారమనగా నెట్టిది?—భగవదవతారమూర్తులను గ్రహించుట దుర్లభము—అవతారములు : భగవంతుడు— ముక్తపురుషులకును అవతారమూర్తులకును గల భేదము**

౧

# గురువు

## గురుని లక్షణములు

688. ఎవ్వరి కెవరు గురువు? భగవంతుడే జగద్గురువు, ఎల్లరకును దారి చూపగలవాడు.

689. తనగురు నెవ్వడు మానవమాత్రునిగా గణించునో అట్టివా డెన్ని జపతపములు చేసినను ప్రార్థనలు చేసినను అన్నియు నిష్ఫలము. గురుని మనము మనుష్యమాత్రునిగా ఎన్నదగదు.* శిష్యునకు భగవత్సాక్షాత్కారము కలు

* "ఆచార్యం మాం విజానీయా న్నావమన్యేత కర్హిచిత్,
న మర్త్యబుద్ధ్యాసూయేత సర్వదేవమయో గురుః."
—భాగవతము, 11-17-27.

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః."
—శుకోపనిషత్తు.

గుటకు పూర్వము, బ్రహ్మానుభవమున మొట్టమొదట గురు సాక్షాత్కారము నొందును. పిమ్మట విచిత్రముగా తానే భగవద్రూపమును గొంది శిష్యునకు భగవత్సాక్షాత్కారమును ప్రసాదించును. అప్పుడు గురువును దైవమును ఏకమే యని శిష్యుడు గ్రహించును. శిష్యుడు కోరువరముల నెల్ల భగవద్రూపమున గురువే వానికొసగును. వేదాంత, సర్వమును, జీవబ్రహ్మైక్యపదమగు నిర్వాణమును సైతము, గురువే వానికి చేకూర్చును. లేదా, భగవంతుడు సేవ్యుడనియు తాను సేవకుడననియు భగవంతునియెడ సేవ్యసేవకభావమును నిలుపుకొనగోరు నరుడు ద్వైతస్ఫురణము గలిగియు నుండవచ్చును. శిష్యు డేమి కోరినను గురువు వానికి ప్రసాదింపగలడు.

690. ద్వి. "మంత్రంబు చెవి నూదు మానవగురుఁడు,
ఆత్మలో ముద్రించు నల శివగురుఁడు."

691. గురువు మధ్యవర్తి. సంధానకర్త ప్రియుని ప్రియురాలిని ఒండొరులతో గూర్చునటుల గురువు నరునకు నారాయణ సమాగమము గలిగించును.

692. గురువు గంగాభవానివంటివాడు. గంగానదిలో నరు లెంత మాలిన్యము వైచినను గంగ తన పవిత్రతను గోల్పోదు. అటులనే గురువు దూషణతిరస్కారాదులకు అతీతుడు.

693. ఉత్తములనియు మధ్యములనియు అధములనియు మూడువిధములైన వైద్యులు గలరు, అటులనే మూడు విధములైన గురువులును గలరు. క్రొగ్గి, హాకిన్సాదిని, జ్ఞాని

యేదో మందుపుచ్చుకొనుమని చెప్పి వెడలిపోవువారు ఇందు మూడవతరగతి వైద్యులు. వీరు రోగి నిజముగా ఆ యౌషధమును సేవించుచున్నాడా, లేదా యని విచారింపనైన విచారింపరు. ఆలాగుననే తమ యుపదేశమును పాటించి శిష్యుడు తదనుగుణముగా వర్తించుచున్నాడా, లేదా యను విషయమునే కనుగొనని గురువులు కొందఱుందురు. ఇక రెండవ తరగతి వైద్యులు తాము నియమించిన మందు పుచ్చుకొనిన స్వస్థత కలుగునని రోగికి నచ్చజెప్పి, మందు మ్రింగుట కిష్టపడనియెడల సామోపాయములచే వానిని ప్రోత్సహింతురు. ఇదేవిధమున సన్మార్గమున నడచుచు, భక్తి కలిగియుండి సత్యాన్వేషణచేయుడని సామోపాయములచే జనులకు బోధించుచు, వారి నట్లు ప్రవర్తింపజేయుటకై కొందఱు గురువులు సకల కష్టముల బడుదురు. వీరు రెండవతరగతి వారని చెప్పవచ్చును. (ఉత్తములగు) మొదటి తరగతి వైద్యులు రోగి 'మందు మ్రింగ' నని భీష్మించినను జంకక వాని ఱొమ్ముపై మోకాలు మోపి బలవంతముగ మందును గొంతుకలో పోయుటకు వెనుదీయరు. ఇటులనే శిష్యుని బ్రహ్మమార్గమున నడిపించుటకై, ఆవశ్యకమగునేని, బలాత్కరించుటకు సైతము వెనుదీయని గురువులు కొందఱుందురు. వీరే గురూత్తములు.

## గురుని ఆవశ్యకత

694. మన కేదేని బోధించిన వారి నెల్ల గురువు లనకుండ, ఒకానొకని ప్రత్యేకముగా మనగురు వనుకొన నేల?

పర దేశమునకు పోవునప్పుడు దారి తెలిసిన యొక మార్గదర్శిని మనము నమ్ముకొనవలయును. అటులగాక కనబడినవారి సలహాల నెల్ల అనుసరించినయెడల తుదకు మార్గభ్రష్టులమై దారి తెన్ను గానకుండ పోదుము. అటులనే భగవంతుని జేరగోరుదువేని బ్రహ్మవేత్తయగు నొకానొక గురుని నమ్ముకొని వానియుపదేశములను యథావిధిగా—'తు, చ' తప్పకుండ—అనుసరింపవలయును.

695. చతురంగమును ఆడువారికంటె చూచువారికి సరియైన యెత్తులు గోచరించుచుండును. సంసారులు తామెంతయో తెలివి గలవారమని తలచుచుందురు. కాని తుదకు ధనము, కీర్తి, ఇంద్రియసుఖములు మొదలగు నైహిక విషయములలో చిక్కుకొందురు. వీరు ఆటలో నిమగ్నులై యుండుటవలన సరియైన యెత్తును గ్రహింపలేరు. సంసారత్యాగులగు సాధుసత్తములు ఐహికవిషయములచే మోహితులు గారు. వారు చతురంగమును పైనుండి చూచువారిని బోలుదురు. సంసారులకంటె సంసారస్వభావమును—వస్తుతత్త్వమును—వారే సరిగా గ్రహింతురు. కావున సాధకులుగానెంచువారు భగవద్ధ్యానశీలురగు మహాత్ముల—భగవంతుని గాంచిన మహానీయుల—మాటలను విశ్వసింపవలయును. నీకు వ్యాజ్యెపుసలహా కావలసినప్పుడు ఆ వృత్తి నవలంబించు వకీలుయొద్దకే గదా పోవుదువు? దారిని బోవునెవని సలహానైనను గ్రహింపవుగదా!

696. భగవన్మహిమములను గ్రహించుటకై నీవు నిజముగ్గా పరితపించునెడల భగవంతుడే నీకడకు సద్గురుని బంపును;

గురుని వెదకుటకై నీవు పరితపింపనక్కఱలేదు.

697. నిష్కళంక హృదయముతో, తీవ్రపరితాపముతో మనఃపూర్వకమగు ప్రార్థనలతో, భగవానుని సన్నిధానము నాశించువానికి గురువు అనావశ్యకము. కాని యిట్టి తీవ్రపరితాపము బొందువా రరుదు,—కావుననే గురుని యావశ్యకత. గురువు ఒక్కఁడే, కాని ఉపగురువు లనేకు లుండ వచ్చును. ఎవ్వనియొద్ద నేమి నేర్చినను ఆత డుపగురు వన బడును. అవధూతకు ఇట్టి యుపగురువులు ఇరువదినలుగు రుండినట్లు (భాగవతమున) చెప్పబడియున్నది.

## గురుశిష్యుల యన్యోన్యసంబంధము

698. స్వాతినక్షత్రము మింట నున్నప్పుడు పడు వాన చినుకు తనకు లభించుటకై ముత్తెపుజేప సముద్రపుటడుగునుండి పైభాగమునకు వచ్చును. అది తన చిప్పలను దెఱచుకొని ప్రశస్తమైన స్వాతివర్షపు బిందువు పట్టువడువఱకును నీటిపై దేలుచుండును. చినుకు పట్టువడినంతనే సముద్రపుటడుగునకు —తననివాసమునకు—బోయి ఆచినుకును చక్కని మంచి ముత్తెముగా మార్చువఱకును స్తిమితముగా అచటనే యుండును. అటులనే తారకమంత్రోపదేశముచేయు సద్గురువు లభించుటకై ఎల్లెడల సంచారము చేయు ముముక్షువులు కొందఱుందురు. అట్టిసద్గురుని గాంచు భాగ్యమబ్బి వానివలన తారకమంత్రోపదేశమును బొందినంతనే వారు (ముముక్షువులు) సమస్తసంగములను వీడి, హృదయగుహాంతరాళమున ప్రవేశించి, బ్రహ్మానంద ప్రాప్తిపర్యంతము (మంత్రజప

మొనర్చుచు) అందే నెలకొని యుందురు.

699. బ్రహ్మవేత్తయగు సద్గురువు పండితుడుగా గాన్పింపనిచో భయపడకుము—ఆతడు శాస్త్రపండితుడు గాడని నిరాశుడవు గాకుము. ఏల? జీవనజ్యోతి యగు జ్ఞానమున నాతని కెన్నటికైనను కొఱత గాన్పించునా? పుస్తకములలో గల జ్ఞానము నంతటిని మించు దివ్యజ్ఞానము—సాక్షాత్కారరూపమగు తత్త్వజ్ఞానసంపద—వానికడ అపారముగా, అనంతముగా వెలయుచుండును.

700. తనగురుని నడవడినిగూర్చి యొకడు తర్కించుచుండ శ్రీగురుదేవు డిట్లు పల్కెను: "ఓయీ! నిరర్థక చర్చతో ఎందులకు కాలయాపనచేసెదవు? ముత్యమును గైకొని చిప్పల నావల బాఱవేయుము. గురునియొద్ద మానవసహజములగు లోపముల నెంచబోక, ఆతడు నీ కుపదేశించిన మంత్రమును జపింపుము, పొమ్ము!"

701. గురునిందాలాపములను వినబోకుము. నీతల్లిదండ్రుల కంటెను గురు డధికుడు. నీయెదుటనే నీ తల్లిదండ్రుల నెవ్వడైనను తిట్టిన నీ వూరకుందువా? ఆవశ్యకమగుచో దెబ్బలాడియైనను నీ గురుని గౌరవమర్యాదలను కాపాడుము.

702. శిష్యుడు గురువు నెన్నడును అధిక్షేపింపరాదు, గురువర్తనమును ఖండింపరాదు. ఆతనియాజ్ఞను జవదాటక గురునియెడ అత్యంత విధేయుడై వర్తింపవలయును. "నా గురువు కల్లుపాకకు బోవుగాక, నా కాతడు పూజ్యుడగు నిత్యానందరాయుడే. నా గురువు త్రాగుబోతులపజ్జ నుండు గాక, పాపాత్ములు కూటముల గలియుగాక, నా కాతడు

పావనగురుమూర్తియే'' అను సామ్యము కలదుగదా ?

**703.** నిజమైన భక్తునకు అతిసామాన్య వస్తువులుకూడ భగవంతుని తలపునకు దెచ్చును: భగవంతునియందు తన్మయత గల్గించును. "ఈమట్టియేనా మద్దెలలు చేయుట కుపయోగింపబడునది?'' అను భావము తోచినంతనే శ్రీచైతన్యుడెట్లు సమాధినిమగ్నుడయ్యెనో మీరు వినలేదా? శ్రీచైతన్యుడొకప్పుడొక గ్రామముమీదుగా బోవుచు, ఆ గ్రామనివాసులు మద్దెలలుచేసి జీవనోపాధి నార్జించుకొనుచున్నారని వినెను. తత్‌క్షణమే యాతడు, "ఈమట్టియేనా, మద్దెలలను జేయుట కుపయోగింపబడునది ?'' అని శరీరస్మృతిరహితుడయ్యెను. ఏలన, ఆమట్టితో మద్దెలలు చేయబడుననియు అవి సంకీర్తనమున కుపయోగింపబడుననియు ఆ సంకీర్తనము దివ్యసుందరమూర్తియు మన ప్రాణేశ్వరుడునగు భగవానుని గుణానుకీర్తనమనియు నాతడు సంభావించెను. ఇట్లనేక భావలతలు మనస్సున నొక్కుమ్మడి తళ్కొత్తి, నాతని మనస్సు వెంటనే భగవానునియందు లగ్నమయ్యెను. ఇదేవిధమున గురునియందు గాఢమైన భక్తికలవాడు ఆతని బంధువులను గాంచిన మాత్రముననే గురుని స్మరించును. అంతేకాదు, గురుగ్రామవాసులను జూచినంతనే వానిమనస్సు గురునిపై లగ్నమగును. వారి కాతడు పదేపదే ప్రణామ మాచరించును, వారిపాదధూళిని శిరమునదాల్చును, భోజనమిడి వారల సంతుష్టుల నొనర్చును. ఇట్టిదశలో శిష్యునకు గురునియం దెట్టి లోపములును గాన్పింపవు. అపుడే యాతడు, "నాగురువు కల్లుపాకలకు బోవుగాక, నా కాతడు నిత్యానందరాయుడే''

యనగల్గును. కానిచో మానవు డగు వానియం దెప్పు డును సుగుణ దుర్గుణములు కలిసియే యుండునుగదా? కాని పచ్చకామెర గలవానికి ప్రపంచమంతయు పచ్చగనే కాన్పించు రీతిని శిష్యుడు తన భక్తిచే గురుని నరునిగా గాక, సాక్షాన్నారాయణునిగా గాంచును. సమస్తము భగవత్స్వరూపమేయని గురుభక్తికలవానికి వెల్లడియగును; భగవంతుడే గురువై యున్నాడు, తల్లియై యున్నాడు, తండ్రియై యున్నాడు, మానవుడై యున్నాడు, మృగమై యున్నాడు, వేయేల, చేతనా చేతన సృష్టిజాతమంతయు భగవంతుడే.

౨

# అవతారమూర్తి

## భగవదవతార మనగా నెట్టిది?

704. అవతార మనగా భగవంతుని మానవదూతయని చెప్పవచ్చును. ఆతడు రాజప్రతినిధివంటివాడు. దూరమున నేరాష్ట్రమునందైనను అల్లరులు సంభవించినయెడల వాని నణచుటకై రాజు తనప్రతినిధిని బంపును. అటులనే ప్రపంచమున నేభాగమునందైనను ధర్మహాని సంభవించునేని, ధర్మ రక్షణార్థము భగవంతుడు తన యవతారమును బంపును.

705. సీతారాములు, రాధాకృష్ణులు మొదలగు వారెవ్వరును చారిత్రకవ్యక్తులు గారనియు కేవలము నీతిబోధకై కవులచే గల్పింపబడినవారనియు భావింపకుడు; పురాణేతిహాసములకు గూఢార్థము మాత్రమే కలదని తలపకుడు. నిజముగా

రామకృష్ణాదులు మీవలెర క్తమాంసశరీరులే. ఐనను వారు భగవదవతారమూర్తులు కావున వారి జీవితచరిత్రములకు నైతికముగను చారిత్రకముగనుగూడ అర్థము చెప్పవచ్చును. సముద్రమునకు అల లెట్టివో భగవంతునకు అవతారమూర్తు లట్టివారు.

706. అవతారమనునది యెల్లెడలను ఒకటియే, భేదము లేదు. ఒకేభగవానుడు జీవసాగరమున మునిగి, ఒకతావున వెలువడి కృష్ణు డనబడుచున్నాడు; మఱల మునిగి మఱియొక తావున గోచరించి క్రీస్తు అనబడుచున్నాడు.

707. సచ్చిదానందవృక్షమున రాములును కృష్ణులును బుద్ధులును క్రీస్తులును గుత్తులుగుత్తులుగా వ్రేలాడుచున్నారు. అందుండి యొకరిద్దరు అప్పుడప్పుడు ఈ లోకములోనికి దిగి వచ్చి మహాపరివర్తనములను గలిగించుచుందురు.

708. అవతారమూర్తులు దైవశక్తులతోడను దైవసంపద తోడను ఆవిర్భవింతురు. బ్రహ్మానుభవమున మహోత్తమాను భవమునుండి అతిసామాన్యానుభవమువఱకును గల యే యనుభవమునైనను, స్థితినైనను సంకల్పమాత్రముననే వారు పొందగలరు, అందు నెలకొనియుండగలరు. క్రొత్తవాడు రాచనగరున దర్బారువఱకే పోగలడుగాని యువరాజగు రాజ కుమారుడు ఏసౌధములోనికైనను, ఏమూలకైనను యథేచ్ఛ ముగా పోగలడుకదా? (చూ. 813.)

709. అవతారమూర్తుల యహంకారము పలుచని పొర వలెనుండును. అందుండి భగవంతుడు వారికి సదా గోచ రించుచునే యుండును. ఒకడొక గోడప్రక్క నిలుచుండి

యున్నాడనుకొనుడు; దానికి ఇరువైపులను విస్తీర్ణమైన పొలములు గలవనుకొనుడు. గోడలో ఒక కన్నమున్నయెడల అందుండి ఆవలిప్రక్క పొలములన్నియు గనబడునుగదా? మఱియు ఆకన్నము తగినంత పెద్దదైయున్నయెడల దాని యందుండి ఆవలికి పోవచ్చునుగదా? అవతారమూర్తుల యహంకారము కన్నములోగూడిన యీగోడవంటిది. వారు గోడ కీవలివైపుననున్నను ఆవలివైపునగల అపారమైన భూమినంతయు జూడగలరు. అనగా మానవశరీరమును దాల్చియున్నను సదా యోగస్థితులై ఇచ్ఛానుసారము వారు గోడ కవ్వలనున్న సమాధిక్షేత్రములోనికి బోగలరు. ఆ కన్నము తగినంత పెద్దదైయున్నయెడల అందుండి వెలుపలికి పోయి మఱల ఇవతలకు రాగలరు. అనగా సమాధ్యవస్థను బొందినపిమ్మట కూడ వారు సామాన్యమైన బాహ్యస్ఫురణమును బొందగలరు.

## అవతారమూర్తులను గుర్తించుట దుర్లభము

710. భగవదవతారమును గ్రహించుట దుర్లభము. అది పరిచ్ఛిన్నమగు జగత్తున అపరిచ్ఛిన్నమగు బ్రహ్మము యొక్కలీల.

711. రామచంద్ర భగవానుడు లోకమున అవతరించి నప్పుడు సప్తర్షులు మాత్రమే ఆతడు భగవదవతారమని గ్రహింపగలిగిరి. అటులనే భగవంతు డీలోకమున నవతరించు నప్పుడు ఏకొలదిమందిమాత్రమో వాని దివ్యత్వమును గ్రహింపగల్గుదురు. (చూ. 719.)

712. మహనీయుడైన ఆచార్యుడు స్వస్థానమున తన బంధువర్గముచే మన్ననల బొందడేల? గారడివాని విద్యను జూచుటకు ఆతని బంధుజనులు వచ్చి చుట్టును మూగరు. కాని యితరులో, నోరు తెఱచికొని వానియింద్రజాలమును జూచి యబ్బురపడుచుందురు.

713. బూరుగచెట్టు వి త్తనములు దానిక్రింద బడవు. అవి గాలిలో కొట్టుకొనిపోయి ఎక్కడనో పడి మొలచును. అటులనే మహాత్మునిబోధలు వాని స్వస్థానమునగాక, దూర దేశమున వ్యక్తమై ప్రకాశించును; దూరదేశీయులే వానిని కీర్తింతురు.

714. దీపముక్రింద నుండునది క్రీనీడయే కాని దీపకాంతిచే చుట్టునున్న వస్తువులు ప్రకాశించుచుండును. అట్లే మహనీయుడైన యాచార్యునకు అతిసమీపమున నున్నవారు వాని బోధలను వ్యక్తిత్వమును గ్రహింపజాలరు. దూరమున నున్న వారు వాని ప్రభావమును అమానుషశక్తిని జూచి సమ్మోహితు లగుచుందురు.

715. వెలుపలికోఱలు,లోపలిదంతములు నని యేనుగునకు రెండువిధములైన పండ్లు ఉండురీతినే శ్రీకృష్ణుడు మొదలగు నవతారమూర్తులు బాహ్యమునకు సామాన్యజనులవలెనే వర్తించుచుండియు, సమస్తకర్మాతీతులై అంతరంగమున బ్రహ్మానందమయులై వెల్గొందుచుందురు.

## అవతారములు : భగవంతుడు

716. భగవంతుడు అనంతుడు, అపరిచ్ఛిన్నుడు, సర్వశక్తిమంతుడు. ప్రేమమూలమున తనదివ్యత్వము స్థూలశరీరమును దాల్చి యవతారమూర్తియై మన నడుమ మెలగునటుల అతడు నియమింపగలడు. అప్పుడు భగవదవతారమునుండి ప్రేమ వెల్లువలై ప్రవహించి మనల నావరించును. భగవదవతారము యథార్థమగు సంఘటనము. దీనిని మాటలచే విశదీకరించుట దుర్లభము. ఇయ్యది సాక్షాత్కారమునకు సంబంధించిన సంగతి, జ్ఞాననేత్రముతో అవలోకింపవలసిన విషయము. ఈ తత్త్వము ఋజువుకావలయు ననిన, భగవత్సాక్షాత్కారము నొందవలయును, వేఱుమార్గము లేదు. ఉపమానములమూలమున విషయము కేవలము చూచాయగా దెలుపనగును. ఎవ్వడైనను ఆవుకొమ్ములనో, పాదములనో, తోకనో, పొదుగునో తాకు ననుకొనుడు. అది ఆవును తాకుట కాదా? ఐనను మానవులమగు మనకు అందలి ముఖ్యవిషయము పొదుగునుండి లభించు పాలు,—మిగిలిన వానితో మనకు నిమిత్తములేదు. మనకు గావలసిన భక్తి యను పాలు భగవదవతారమూర్తులయొద్ద పుష్కలముగా లభించును.

717. భగవంతుని (తత్త్వమును) పూర్తిగా ఎవరు గ్రహింపగలరు? అందులకు మనము నోచుకొనను లేదు, అది మన విధియునుగాదు. మనము వానిదర్శనభాగ్యము నొందగల్గినచో జాలును,—భగవంతు డొక్కడే సత్యమని

స్వానుభవముచే గ్రహింపగల్గిన జాలును. పావన గంగానదికి వచ్చి యొకడు అందలి జలమును తాకు ననుకొనుడు. అప్పుడాతడు తాను గోముఖినుండి గంగాసాగరము(మూలమునుండి సాగరసంగమము) వఱకును గంగాదర్శనలాభమును గంగాస్పర్శనభాగ్యమును బొందితినని పలుకును గదా!

718. నీవు నారాయణుని వెదకజూచెదవా? నరునందు వెదకుము. మఱి యే యితరవస్తువునందుకంటెను నరునందు వాని దివ్యత్వము ఎక్కువగా వ్యక్తమగుచుండును. ఎవ్వని మానససరోవరము భగవత్ప్రేమామృతముతో వెల్లివిరియుచుండునో, ఎవ్వడు భగవంతునియందు నెలకొని వానియందే చరించుచు రమించుచుండునో, ఎవ్వడు భగవత్ప్రేమోన్మత్తుడై యొప్పుచుండునో—అట్టివానిని వెదకుము. ఆతడే భగవత్స్వరూపుడు!

719. ఆతడే అవ్యయుడు, శుద్ధబ్రహ్మము; మఱియు నాతడే లీలారూపుడు. వానిలీల ఈశ్వరలీల, దేవలీల, జగల్లీల, నరలీలయునని నాలుగువిధములుగా ప్రకాశించుచున్నది. నరలీలయందే భగవదవతారము సంఘటిల్లగలదు. నరలీల యెట్టిదో తెలియునా? పెద్దమేడడాబానుండి విరివైనతూముగుండా కడువేగమున నీరు ప్రవహించుటవంటిది. అల సచ్చిదానందబ్రహ్మశక్తి వెలువడి (అవతారమూర్తియను) ఒకకాలువగుండా వ్యక్తమగుచున్నదని చెప్పవచ్చును. అవతారమూర్తుల నందఱును గ్రహింపజాలరు. అత్రి, కశ్యపుడు, భరద్వాజుడు మొదలగు సప్తర్షులుమాత్రమే శ్రీరామచంద్రమూర్తిని అవతారపురుషుడని గ్రహింపగల్గిరి. నిజమైన భక్తిజ్ఞానములను

మానవకోటికి బోధించుటకై నరరూపమున భగవంతు డవత రించుచుండును.

## ముక్తులకును అవతారమూర్తులకును గల భేదము

720. వాడుకలేక పూడిపోయిన ప్రాతనుతిపైనున్న మంటిని చెత్తను తొలగించి బయల్పఱచు పురాతనవస్తుశోధకునివంటివాడు సిద్ధుడు లేక ముక్తపురుషుడు. అవతారమూర్తియో, అంతకుమునుపు నీరు దొరకని తావున క్రొత్తగా బావిని త్రవ్వు మహాయంత్రకారునివంటివాడు. సిద్ధుడు మోక్షజలము దాపున నున్నవారికిమాత్రమే దాని నొసగగల్గును; అవతారమూర్తియో, ఎవనిహృదయము బొత్తిగా భక్తిచెనుమాటయైనా లేక ఎడారివలె శుష్కమై యుండునో అట్టివానిని సైతము తరింపజేయగలడు.

721. ఉప్పెన వచ్చి నదులను కాలువలను పొలములను అన్నిటిని ముంచివేయును. వానసేరో, మామూలుకాలువ వెంబడినిమాత్రమే ప్రవహించును. ఇటులనే అవతారమూర్తి వేంచేయునపుడు వానికృపచే ఎల్లరును తరింతురు. కాని సిద్ధులో, జపతపములనొనర్చి ఎంతయో శ్రమపడి తాము మాత్రమే తరింపగల్గుదురు.

722. పెద్దమ్రాను ఒకటి ప్రవాహమున బోవునపుడు వందలకొలది పక్షులను తనపై మోసికొనిపోగల్గును, అది మునుగదు. రెల్లుపుల్లయో, కాకి వాలిన జాలును, మునిగిపోవును. అటులనే అవతారపురుషుడు వెలువడునపుడు వానినాశ్రయించి యనేకులు ముక్తినొందగలరు. సిద్ధు డెంతయో

కష్టపడి తానుమాత్రమే తరింపగల్గును.

723. పెద్దపొగయోడ నీటిపై అతివేగముగా బోవుచు అనేకమైన నావలను తెప్పలను తనతోడ తీసికొనిపోగలదు. అట్లే అవతారమూర్తి వేలకొలదిజనులను సంసారసాగరము నుండి తరింపజేసి మోక్షధామమున జేర్పగల్గును.

724. రైలుఇంజను తాను వేగముగాపోయి గమ్యస్థానము చేరుటయే గాక సరకుబండ్ల నెన్నిటినో తనతో లాగుకొని పోగల్గుచున్నది. అవతారమూర్తులట్టివారు. పాపభారముచే క్రుంగియున్న జనసమూహములను వారు భగవత్సన్నిధాన మునకు గొనిపోగల్గుదురు.

725. సాధారణఋతువులందు నూతినీరు ఎంతయో కష్టము మీదగాని చేచిక్కదు, వానకాలమున వరదలు వచ్చినప్పుడో, శ్రమలేకయే ఎక్కడపట్టిన అక్కడ నీరు లభించును. అటులనే సాధారణముగా భగవంతుడు జనులెంతయో శ్రమపడి జప తపముల నొనర్చినపిమ్మట కాని ప్రత్యక్షముకాడు. కాని లోకము లోనికి అవతారమను వరద వచ్చినపుడు భగవాను డెల్లెడలను దర్శనీయుడగును.

726. ఒకస్థలముచుట్టును చాలయెత్తగు గోడ కలదు. బైటనున్నవారికి అది యెట్టిదో తెలియదు. ఒకసారి నలుగురు నిచ్చెన వేసికొని లోపల నేమున్నదో కనుగొనగోరిరి. మొదటి వాడు గోడచివర కెక్కినంతనే, "ఆహా! ఆహాహా!!" యని సంతోషము పట్టజాలక నవ్వుచు లోనికి దుమికెను. రెండవ వాడును గోడ నెక్కినంతనే మొదటివానివలెనే మహానంద ముతో నవ్వుచు లోనికి దుమికినాడు. మూడవవాడును అటు

లనే చేసినాడు. ఇక నాల్గవవాడు గోడ నెక్కినరికి వానికి కట్టెదుట రకరకముల మధురఫలములతో నొప్పునొక దివ్య సుందరవనము కాన్పించెను. లోనికి దుమికి వాని ననుభవింప వలయునని తీవ్రమైన కోరిక పుట్టినను ఆతడు నిగ్రహించుకొని, నిచ్చెనమీదుగా దిగి వచ్చి ఆవనవైభవమునుగూర్చి బైట నున్నవారికి దెల్పెను.

బ్రహ్మమే ఈగోడ కవ్వలనున్న దివ్యవనము. దానిని గాంచినవారెల్ల తమ వ్యక్తిత్వమును మఱచి అందైక్య మొందుటకై గుభాలున దుమికెదరు. మహాత్ములును ముక్తులును ఇట్టివారు. కాని బ్రహ్మమును దర్శించియు తమ అపరోక్షానుభూతిని — పరమానందమును — ఇతరులతో గూడ పంచుకొని యనుభవించుటకై నిర్వాణమహావకాశ మును నిరాకరించి సంసారసాగరమున దరిగానని మానవ కోటికి తరణోపాయము జూపుటకై మనఃపూర్వకముగా జీవిత భారమును వహించునట్టివారు లోకరక్షకులు.

727. బాణసంచున ఒకవిధమైన చిచ్చుబుడ్డినుండి ముందు కొంతసేపటివఱకు ఒకవిధమైన పూవులును తరువాత మఱి యొకవిధమైన పూవులును వెలువడుచు, ఇట్లు అనంతవిధమైన పూవులు అందున్నవా యనిపించును. అవతారమూర్తుల విషయముకూడ నిట్టిదే. బాణసంచులో మఱియొకవిధమైన చిచ్చుబుడ్డి కొంచెముసేపు కాంతులను విరజిమ్మి అకస్మా త్తుగా ఆఱిపోవును. ఇటులనే సాధారణజీవులు దీర్ఘకాలము సాధనల నొనర్చి సమాధిస్థితిని బొంది మఱల రారు.

728. ప్రశ్న : భగవంతుడు నరరూపమున జన్మింప నేల

ఉ. మానవకోటికి పరిపూర్ణదివ్యత్వమును ప్రకటించుటకు. భగవదవతారములమూలమున నరుడు భగవానునితో సంభాషించి వారి లీలలను ప్రత్యక్షముగా గాంచగలుగును. అవతారమున భగవంతుడు తన యలౌకికమాధుర్యమును సంపూర్ణముగా అనుభవించునని చెప్పనొప్పును. నీ వొక పూవును బట్టి పిల్చినయెడల అందు కొంచెము మధువు లభించును. అవతారములలో అంతయు మధువే— మాధుర్యమే— పరమానందమే.

729. అవతారమూర్తులకు అసాధ్యమగున దేదియులేదు. జీవితమందలి మహాకఠినసమస్యలను — గూఢవిషయములను—సైతము అత్యంతసామాన్యవిషయములవలెనే అవలీలగా వారు పసిపిల్లలకుగూడ బోధపడునట్లు పరిష్కరింపగలరు. అవతారమూర్తి జ్ఞానభాస్కరుడు. వాని దివ్యతేజము తరతరములుగా పేరుకొనియున్న అజ్ఞానాంధకారమును పటాపంచలుచేసి వేయును.

730. ఒక్కొక్కప్పుడు సూర్యచంద్రులకాంతులు సమ్మిశ్రితమైయున్నవా యనిపించు నపూర్వమైన కాంతి గోచరించును. భక్తి జ్ఞానములకు (రెండిటికిని) పట్టుకొమ్మయగు శ్రీచైతన్యదేవునివంటి అపూర్వావతారమూర్తులు ఇట్టివారు. వీరిప్రతిభ సూర్యచంద్రులు మింట నేకకాలమున వెల్గొందుచున్నారా యనునట్లు ప్రకాశించును. కాని ఇది యెంతటి యపూర్వమో భక్తిజ్ఞానములు ఒకేవ్యక్తియందు వెల్గొందుటయు నంతటి యపూర్వము, అసామాన్యము.

731. తన్ను ప్రేమించు పరిశుద్ధాత్ములకోసము భగవం

తుడు మానవరూపమున నవతరించును. *

732. అవతారమూర్తులతో వచ్చువారు నిత్యముక్తులై యుందురు, లేదా, వారి కదియే తుదిజన్మమై యుండును.

* మ. "సకలస్థావరజంగమప్రతతికిం జర్చింపఁ దా నాథుఁడై
యకలంకశ్రుతిగర్భుఁడౌం బరముఁడున్నైనట్టియీశుండా సే
వకయోగీంద్రకుమారసిద్ధమునిదేవశ్రేణి యోగప్రవ
ర్తకమై తన్ను భజింపఁ జూపు సగుణబ్రహ్మంబు లీలాగతిన్."

—భాగవతము. 3-1019.

సీ. "దనుజారిలీలావతారంబులందలి శౌర్యకర్మంబులు సద్గుణములు
విని భక్తుఁడగువాఁడు వేడ్కతోఁ బులకించి కన్నుల హర్షాశ్రుకణము లొలుక
గద్గదస్వరముతోఁ గమలాక్ష వైకుంఠ వరద నారాయణ వాసుదేవ
యనుచు నొత్తిలిపాడు నాడు నాక్రోశించు నగు జింతనము సేయు నతియొనర్చు

తే. మరులుకొనియుండుఁ దనలోన మాటలాడు
వేల్పు సోఁకిన పురుషుని వృత్తిఁ దిరుగు
బంధములఁబాసి యజ్ఞానపటలిఁ గాల్చి
విష్ణుఁ బ్రాపించుఁ దుది భక్తివివశుఁడగుచు."

—భాగవతము. 7-240.

"అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితం,
పరంభావమజానన్తో మమ భూతమహేశ్వరమ్."

—భగవద్గీత. 9-11.

పరమోత్కృష్టమయి ప్రపంచనియామకమైన నా తత్త్వమును దెలియని మూఢులు నేను మనుష్యశరీరమును దాల్చిన హేతువుచే నన్నలక్ష్యము చేయుచున్నారు.

పదునాఱవ ప్రకరణము

# జ్ఞానము: భక్తి: కర్మము

౧. జ్ఞానయోగము : జ్ఞానయోగమనగా నెట్టిది?—జ్ఞానయోగవిధానము—జ్ఞానయోగము దుర్లభము—౨. భక్తియోగము : భక్తి యెట్లు వృద్ధియగును?—భక్తి : ప్రాపంచిక ప్రేమ—భక్తి ప్రభావము—భక్తి యందలి అంతరువులు—ప్రేమ, లేక పరభక్తి—గోపికలప్రేమ—విరహము : మహాభావము—౩ భక్తి : జ్ఞానము : పర్యవసానమున భక్తి జ్ఞానములు రెండు నొక్కటే—భక్తి యెట్లు జ్ఞానముగా పరిణమించును? —జ్ఞానికిని భక్తునకును మనోభావము నందుగల భేదము—౪. కర్మయోగము : కర్మయోగమనగా నెట్టిది?—భక్తి కర్మము నెట్లు పరిరక్షించును?—సేవారూపమైనకర్మము భగవదారాధనతో తుల్యము—కర్మము సాధనముకాని సాధ్యము కాదు—కర్మము : నైష్కర్మ్యము

౧

## జ్ఞానయోగము

### జ్ఞానయోగ మనగా నెట్టిది?

733. జ్ఞానమూలమున భగవదనుసంధానమే జ్ఞానయోగము. బ్రహ్మసాక్షాత్కారమే జ్ఞానయోగి ఆశయము. ఆతడు "నేతి, నేతి" (ఇది కాదు, ఇది కాదు) * అనుచు, ఒకదానివెంబడి నొకటిగా అసత్యవిషయములను విడిచి

* "అథాత ఆదేశో నేతి, నేతి."—బృహదారణ్యక. 2-3-6; అథవా, "స ఏష నేతి నేత్యాత్మా."

—బృహదారణ్యక. 4-6-15.

వేయుచు, సదసద్విచారము నిలిచిపోవు స్థితిని బొందును. అంతట సమాధిస్థితిలో వానికి బ్రహ్మసాక్షాత్కారము లభించును.

734. దొంగ చీకటిగదిలో బ్రవేశించి యందలివస్తువులను తడవ నారంభించును. బహుశః ఒకబల్లపై చేయివైచి, "ఇది కాదు" అని ముందునకు బోవును; పిమ్మట మఱియొక వస్తువుమీద చేయివేయును—అది యొకకుర్చీ కావచ్చును. "ఇది కాదు" అని దానిని దాటిపోయి ధనపు బెట్టెను జేర గల్గువఱకు తన యన్వేషణమును సాగించును. ధనపుబెట్టె చేచిక్కినంతనే "ఇదిగో, ఇదే!" అనుకొనును. వాని వెదకు లాట అంతటితో సరి. బ్రహ్మాన్వేషణమును సరిగా నిట్టిదే. (చూ. 927.)

735. అనుభవముచే నిట్లు గ్రహించినాను: "ధ్యానముచే గలుగు జ్ఞానము ఒకవిధమైనది, వివేచనచే గలుగు జ్ఞానము మఱియొకవిధమైనది. మఱియు సాక్షాత్కారసంజనితమైన జ్ఞానము వేఱు."

736. తారతమ్యముచే నేమి, స్వభావముచే నేమి, జ్ఞానము అనేకవిధములు. ఇందు మొదటిది సామాన్యులగు లౌకికుల జ్ఞానము. ఇది యంతగా నిశితమైనది కాదు; పటువైనదికాదు. ఇది గదిలోనున్న దీపమువంటిది. దాని ప్రకాశము గదిలోమాత్రమే యుండును. భక్తుని జ్ఞానము ఇంతకంటె ప్రకాశవంతమైనది. ఇది వెన్నెలవంటిది. వెన్నెలచే గదిలోపలి వస్తువులును వెలుపలి వస్తువులునుగూడ కాన్పించును. కాని అవతారపురుషుని జ్ఞానమో, సూర్య

తేజమువలె అఖండ ప్రకాశమానము. ఆతడు కేవలము జ్ఞాన భాస్కరుడు. వాని జ్ఞానతేజము యుగయుగములనుండియు జనుల నావరించియున్న అజ్ఞానాంధకారమును పటాపంచలు చేయును.

## జ్ఞానయోగ విధానము

737. నిన్ను నీవు తెలిసికొంటివా, పరులను పరాత్పరుని గూడ తెలిసికొనిన వాడ వగుదువు. 'నేను' అనగా నేమి? అది నీచేయియా, పాదమా, రక్తమా, మాంసమా, కండర ములా? బాగుగా విచారింపుము. విచారించినయెడల 'నేను' అనునదేమియు లేదని నీకే విశదమగును. నీరుల్లిపాయను ఒలిచిన కొలదియు పొరలే వచ్చుచుండునుగాని అందు పలు కేమియు గానబడదు. అట్లే 'నేను' అనుదానియొక్క స్వరూప మేమని పరిశీలించినపక్షమున అది యదృశ్యమై పోవును. ఇట్టివిచారముచే తుదకు మిగులునది భగవంతు డొక్కడే యని బోధపడును. అహంకారము నశించినతోడనే భగవం తుడు ప్రత్యక్షమగును.

738. భగవంతుడు మనకు బాహ్యమున దూరముగా నున్నట్లు తోచునంతవఱకు ఉండునది అజ్ఞానమే. అంతరంగ మున భగవత్సాక్షాత్కారము నొందునప్పుడు ఉండునది నిజమైనజ్ఞానము.

739. హృదయమును జూపుచు శ్రీగురుదేవు డిట్లు వచించువాడు : ఇచట భగవంతుని గాంచినవానికి (బాహ్య ప్రపంచమును జూపుచు) అచటను గోచరించును. తనలో

భగవంతుని గాంచనివాడు బాహ్యమున నెన్నటికిని గాంచ నేరడు. కాని యెవ్వడు తనహృదయాలయమున భగవంతుని దర్శించునో వాడు విశ్వాలయమునగూడ భగవంతుని గాంచును. (చూ. 336, 337.)

740. ఒకడు అర్ధరాత్రమున లేచి చుట్టకాల్చుకొన గోరెను. అందులకు నిప్పు కావలసివచ్చుటచే పొరుగున నున్న యింటికి పోయి తలుపు తట్టినాడు. ఒకడు తలుపు తీసి, "ఏమి కావలయును?" అని యడిగెను. "చుట్టకాల్చు కొనవలయును. కొంచెము అగ్గియుగలదా?" అని యాతడడిగెను. అందులకాపొరుగువాడు, "అబ్బా! నీకేమి మతి పోయినదా? నీచేతిలోనే దీపమున్న లాంతరుండ, నీవింత శ్రమపడి యిపుడు వచ్చి మమ్ము నిద్ర లేపితివే!" అనెను. అట్లే నరుడు అన్వేషించునది వాని హృదయముననే కలదు; * ఐనను దానికొఱకై యాతడు ఎందెందో తిరుగులాడు చుండును.

741. అనులోమము, విలోమము—అని విచారము రెండు విధములు. అనులోమవిచారముచే జిజ్ఞాసువు సృష్టినాధారము చేసికొని సృష్టికర్తను, అనగా కార్యమునుండి కారణము నూహించును. అంతట విలోమవిచారము ప్రారంభమగును. ముందు బ్రహ్మమును పొంది విశ్వమునందలి ప్రతికార్యము నందును ప్రత్యంశమునందును వాని వ్యక్తీకరణమును (లేక రూపమును) గాంచనేర్చును. ఇందు మొదటిది పృథక్కరణ పద్ధతి, రెండవది సమీకరణపద్ధతి: మొదటిది అరటిదొప్ప

* "హృద్యన్తర్జ్యోతిః"—శ్రుతి.

లను ఒలుచుచు వాని నడుమనుండు దూటను గనుగొనుట వంటిది, రెండవది (దూటపై) దొప్పలను ఒకదానిపై నొకటి పేర్చుటవంటిది. (చూ. 866, 928.)

742. జ్ఞానము ఏకత్వమునకును అజ్ఞానము భిన్నత్వమునకును దారి చూపును.

743. విశేష వేదాంత గ్రంథపఠనము చేయుచుండిన యొక బాల శిష్యునితో శ్రీగురుదేవు డొకప్పు డిట్లు పల్కెను: "నాయనా! నీ వీమధ్య వేదాంతవిచారములో నిమగ్నుడవై యున్నావుకదా, మంచిది. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా'— ఇదియేకదా వేదాంతసారము? * ఇంతకంటె మఱేమైన నున్నదా?" అదిగో వేదాంతసారమని బాలశిష్యుడు అంగీకరించెను. గురువచనములు ఆతనికి వేదాంతతత్త్వములపై నూతన తేజమును బఱపి ప్రకాశింపజేసెను. గురువచనములను దలచి యాతడు ఆశ్చర్యచకితు డయ్యెను. గురుదేవుని వచనములను చక్కగా గ్రహించి నమ్మినచో వేదాంత తత్త్వము పూర్తిగా అవగాహనమైనట్లే యని యాతనికి దట్టెను. శ్రీగురుదేవుడు మఱల నాతని కిట్లు బోధించెను: "శ్రవణము, మననము, నిదిధ్యాసనము. † —బ్రహ్మమే సత్యము, ప్రపంచ మసత్యమని మొదట వినవలయును. పిమ్మట మననము చేయవలయును. తరువాతిది దానినిగూర్చిన

---

* "శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రన్థకోటిభిః,
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః."

† "ఆత్మా వా అరే ద్రష్టవ్యః, శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః."
—బృహదారణ్యకోపనిషత్తు.

ధ్యానము, అనగా మనస్సును అసత్యమగు ప్రపంచమునుండి మఱల్చి సత్యమగు బ్రహ్మముపై నిలుపవలయును. ఇదే వేదాంతవిచారక్రమము. అంతేకాని తత్త్వమును విని, దానిని కేవలము ధీశక్తిచే ఇట్టిదని గ్రహించి అసత్ప్రపంచమును విడువ యత్నింపని పక్షమున అట్టిజ్ఞానమువలన నేమి లాభము? అది లౌకికుల ధోరణి. తత్త్వమును దెలిసికొనుట కది సాహాయ్యకారి కాదు. దృఢనిశ్చయము, త్యాగము—ఇవి గా వలయునవి. ఇవి లేనిదే తత్త్వమును దర్శింపజాలము. కానిచో జగత్తు మిథ్యయనియు బ్రహ్మము సత్యమనియు చిలుకపలుకులను బలుకుచు, శబ్దాది విషయములు ఎదుట బడినంతనే వానివలలో దగుల్కొనుటగా కాని మఱియొకటి కాదు. అట్టివాడు నోటిమాటగా, ముండ్లు లేవని చెప్పుచు, చేతికి ముల్లు గ్రుచ్చుకొనినంతనే, 'అమ్మయ్యో!' అని యేడువ నారంభించును. ఒకప్పుడు పంచవటి కొకసాధువు వచ్చినాడు. ఆతడు ఇతరుల యెదుట వేదాంతమునుగూర్చి విశేషముగా ప్రసంగములు సాగించువాడు. ఆత డొక స్త్రీతో వ్యభిచరించుచుండెనని నే నొకనాడు వింటిని. కొంతసేపటికి నే నావైపునకు బోవుసరికి ఆత డక్కడ కూర్చుండియుండెను. అంత నే నాతనితో ఇట్లంటిని: 'వేదాంతమునుగూర్చి నీ వింతగా ఉపన్యసించుచుందువే! కాని నిన్నుగూర్చి వారు చెప్పుకొనున దంతయు నేమి?' ఆత డిట్లు బదులుచెప్పెను: 'దానికేమి లెండు, దీనిలో నేమియు బాధలేదని నేను మీకు నిరూపింపగలను. జగత్తుఅంతా అసత్యమైయుండ నాపతనము మాత్రము నిజమా? అదియు మిథ్యయే.' వానిధోరణిని జూచిన

నాకు '-ఛీ! ఛీ!' యనిపించినది. నే నిట్లంటిని; 'ఇట్టి వేదాంతము పై నే నుమియుదును! ఇది నిజమైనజ్ఞానము కాదు, బూటకము! సంసార మోహముచే శుద్ధలౌకికులు—పండితంమన్యులు—సాయించు మిట్టవేదాంతము!''

## జ్ఞానయోగము దుర్లభము

744. జ్ఞానయోగము ఈకలియుగమున నెంతయు దుర్లభము. మనము అన్నగతప్రాణులమని మొట్టమొదట గమనింపవలసియున్నది. రెండవది, కలియుగమునందలి జనుల ఆయుఃప్రమాణము అల్పము, జ్ఞానయోగసాధనకు ఇది చాలదు. మూడవది, మనల నావేశించియున్న దేహబుద్ధిని వదల్చుకొనుట ఇంచుమించుగా అసాధ్యము. ''నేను దేహము కాను, అఖండబ్రహ్మమను, సచ్చిదానందమయ పరమాత్మను. దేహమను కాకుండుటచే క్షుత్పిపాసలు, జననమరణములు మొదలగు శరీరధర్మములేవియు నావికావు''— అని జ్ఞానయోగికి నిశ్చితబుద్ధి కలుగవలయును. ఈ శరీరధర్మములకు వశుడయ్యును తాను జ్ఞాని ననుకొనువాడు చేతికి ముల్లు గ్రుచ్చుకొని యఖండబాధపడుచుండియు, ''ఏల? నాచేతికి ముల్లు గ్రుచ్చుకొనలేదు, నాచేయి గీచుకొనిపో లేదు, బాగుగనేయున్నది'' అనువానివంటివాడు! ఇట్టిమిట్ట వేదాంతము నిష్ప్రయోజనము. జ్ఞానాగ్నిచే దేహబుద్ధియను ముల్లు మొట్టమొదట భస్మీభూతము కావలయును.

745. ఏకొలదిమందియో జ్ఞానప్రాప్తికర్హులై యుందురు. ''వేలకొలది జనులలో ఒకానొకడు నన్ను బొంద యత్నిం

చును, అట్టివారిలో ఒకానొకడుమాత్రమే నిజముగా నన్ను తెలిసికొనగల్గుచున్నాడు''* అని గీత వక్కాణించుచున్నది. సంసారమునెడ అనగా కామినీకాంచనములయెడ రాగము తగ్గినకొలదియు మానవుని జ్ఞానము వికసించుచుండును.

746. జ్ఞానయోగి, ''సోఽహం'' (ఆత్మను నేను)అనును. కాని నరునకు దేహాభిమాన మున్నంతవఱకు ఈ యహం కారము హానికరము.† దీనివలన శ్రేయస్సు కలుగదు. సరి కదా, వినాశము కలుగును. అట్టివాడు తన్నుతాను వంచించు కొనుటయే కాక ఇతరులనుగూడ వంచించుచున్నాడు.

747. రామచంద్రుడను బ్రహ్మచారి యొకనాడు దక్షిణే శ్వరాలయమున శ్రీరామకృష్ణుని సందర్శించెను. ఆతడు బైరాగివలె పొడుగాటి జడలను పెంచుకొనియుండెను. ఒక తావున గూర్చుండి యాతడప్పుడప్పుడు 'శివోఽహం, శివోఽహం' అనుటతప్ప అన్యథా సహానముదాల్చియుండెను. శ్రీరామకృష్ణుడు నెమ్మదిగా కొంతకాలము అది కనిపట్టి వానితో నొకనాడిట్లు విమర్శించి పలికెను : '' 'శివోఽహం' అని కేవలము పాటపాడినందువలన నేమి లాభము? హృదయ దేవాలయమున పరమశివుని ధ్యానించుచు, దేహస్మృతిరహి తుడై అంతరంగమున సచ్చిదానందమయుడగు అల పరమ

* ''మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః.'' 7-30.

† ''క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసాం,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే.'' 12-5.

—భగవద్గీత.

శివుని ప్రత్యక్షముచేసికొన్నవాడు మాత్రమే పరమపవిత్రమగు నిట్టిమంత్రము నుచ్చరించుటకు అధికారి, సాక్షాత్కారము లేని వట్టి సూత్రావృత్తివలన నేమి ప్రయోజనము? సాక్షాత్కారమహాదశ ప్రాప్తము కాకుండునంతవఱకు భగవంతునియందు సేవ్యసేవకభావము, అనగా భగవంతుడు ప్రభువనియు తాను సేవకుడనియు భావించుట మేలు.'' అంతట బ్రహ్మచారి తనతప్పు గ్రహించి యీ మహోపదేశము వలనను అట్టి యితరోపదేశములవలనను జ్ఞానవంతుడయ్యెను. ఆత డాచోటు విడిచిపోవుటకుముందు శ్రీరామకృష్ణుడుండిన గది కీవలి గోడపై (వంగభాషలో) నిట్లు వ్రాసెను: ''స్వామి చేసిన యుపదేశము ననుసరించి రామచంద్రబ్రహ్మచారి యింతటినుండి భగవంతునియందు సేవ్యసేవకభావము గలిగి యుండును.''* (చూ. 798.)

## ౨

# భక్తియోగము

## భక్తి యెట్లు వృద్ధియగును?

748. సామాన్యమగు నద్దముపై బొమ్మలు పడవు, కాని ఛాయాగ్రహణములోవలె రసాయనములు పూయబడిన అద్దముపై బడును. అటులనే మానవహృదయముపై భక్తి

* ఈ వాక్యము అచటిగోడపై అద్దమునం దమర్పబడియుండుట కనియున్నాను.

—అనువాదకుడు.

యను రసాయనము వ్రాయబడినపక్షమున దానిపై భగవ త్ప్రతిబింబము చక్కగా పడును.

749. ఈ భగవద్భక్తి కడు దుర్లభమైన వస్తువు. పతివ్రతకు మగనిపైనుండు హృదయపూర్వకమగు ననురాగము భగవంతునియందు గలుగవలయును. అపుడు భక్తి లభించును. పరిశుద్ధమగు భక్తి యలవడుట మహాదుర్లభము. అందు అంతఃకరణము భగవానునియందు లయముగాంచును. అపుడు 'భావము' (ఉత్తమ భక్తచే తన్మయత) గలుగును. 'భావము' నందు వాగ్బంధనమగును. అపుడు లక్ష్యమును భేదించు విలుకాని కెట్లు వాగ్బంధనమై శ్వాసలు కట్టువడునో అట్లు కుంభకము తనంతట అదియే సిద్ధించును.

750. విషయములయందు రాగము తగ్గినకొలదియు భగవద్భక్తి వృద్ధియగుచుండును. (చూ. 429.)

751. నిజముగా ఈ బేరగాండ్రు (లౌకికులు) చచ్చుమినుపపప్పునకై (ఇంద్రియభోగములకై) దేవులాడుచున్నారు! సంసారకళంకితులుగాని పరిశుద్ధాత్ములకుమాత్రమే భగవద్భక్తి లభించును. వారికి ఒకటే దృష్టి, భగవత్పాదారవిందములయందు మనసు నిలుపుటే వారి యేకైకవాంఛ.

752. మచ్చిక చేయబడని గుఱ్ఱములకు గంతలుకట్టిననే కాని అవి యొక్కఅడుగైనను ముందునకు వేయవు. ఇంద్రియనిగ్రహములేనిదే భగవద్దర్శనము సాధ్యమగునా? ఒక యర్థమున కాదని చెప్పవలసియున్నది. కాని యిది జ్ఞానయోగవిషయముననే వర్తించును. ''ఆత్మసాక్షాత్కారము కోరువాడు నిష్కల్మషుడు గావలయును. కామక్రోధాదులను నిగ్ర

హింపవలయును. ముందు ఇంద్రియనిగ్రహము, తరువాత బ్రహ్మసాక్షాత్కారము''—అని జ్ఞానయోగి వక్కాణించును. కాని భగవంతుని బొందు మార్గము మఱియొకటి కలదు—అదియే భక్తియోగము. భగవద్భక్తి హృదయమున వెల్లివిరియ, ఆనందపారవశ్యమున భగవన్నామసంకీర్తనచే పులకాంకురము గలుగునేని, అట్టివాడిక ఇంద్రియనిగ్రహమునకై ప్రయత్నింపనేల? ఇంద్రియనిగ్రహ మపుడు స్వతస్సిద్ధముగనే లభించును. ఘోరదుఃఖము ననుభవించువాడు నృత్యమున ప్రవేశింపగలుగునా? విందులు గుడువగల్గునా? ఇంద్రియసుఖములకై పరుగిడగలుగునా? అటులనే భగవత్ప్రేమోన్మత్తుడగువాడు విషయభోగములకై దేవులాడజాలడు. (చూ. 551.)

753. శ్రీమతి (రాధాదేవి) శ్రీకృష్ణుని సమీపించినకొలదియు వాని దివ్యశరీరగంధము ఆమెకు సోకుచుండెను. భగవంతుని సమీపించినకొలదియు భక్తి వృద్ధియగుచుండును. సముద్రమును సమీపించినకొలదియు నదియందలి పోటుపాటులు హెచ్చుచుండునుగదా? (చూ. 669.)

754. భగవదారాధననుగూర్చి శ్రీగురుదేవు డొకప్పుడు కేశవచంద్రసేనునితోడను అతని యనుచరులతోడను ఇట్లు పలికెను: ''భగవానుని వైభవమునుగూర్చియు శక్తులనుగూర్చియు మీ రంతగా స్తోత్రములు చేయుచుందు రేల? తండ్రియెదుట నున్న బిడ్డ, 'మా నాయనకిన్ని యిండ్లు, వాకిండ్లు, నున్నవి, ఇన్ని గుఱ్ఱము లున్నవి, ఇన్ని యావు లున్నవి, ఇన్ని తోట లున్నవి' అని తలపోయునా? లేక తనపై తండ్రి కెంతటి గాఢానురాగము కలదో, తన్నెంత మక్కువతో

జూచునో తలపోయునా? తండ్రి తనబిడ్డలకు అన్నవస్త్రము లిచ్చి పోషించి వారిని సుఖపెట్టుట అబ్బురమా? మన మంద అము వానిబిడ్డలము కామా? మనయోగక్షేమముల నాతడు ప్రేమతో వహించుటలో ఆశ్చర్యమేమున్నది? కావున నిజమైన భగవద్భక్తుడు వానివైభవమునుగూర్చి చింతించుటకు బదులు వానితో సన్నిహితసంబంధము నేర్పఱుచుకొని వానిని తనవానినిగా నొనర్చుకొనును, తనముద్దు చెల్లింపుమని పట్టు పట్టును, 'భగవంతుడు నావా'డని గర్వించును, 'నాకు నీవు సాక్షాత్కరింపక తప్పదు' అని నిర్బంధించును. వాని వైభవమునుగూర్చి— విభూతులనుగూర్చి— మీ రంతగా చింతించుచున్న పక్షమున వానిని మీరు సన్నిహితునిగా— ఆప్తునిగా—భావింపజాలరు; వానిని నిర్బంధింపజాలరు, మీ యభీష్టము నొసగుమని పట్టుపట్టజాలరు. అపుడు 'భగవంతు డెంత మహిమాన్వితుడో! ఎంత యతీతుడో!'—ఇట్టి భావములే మీతలపునకు వచ్చును. భగవంతుని వీలైనంతవఱకు ఆప్తునిగా భావింపుడు, అపుడు మీరు వానిని వశమొనర్చు కొనగలరు.'' (మూ. 659.)

755. స్థిరముగా ఏదియో యొకభావము నవలంబించి భగవంతుని మీవానినిగా జేసికొనవలయును. అపు డాతడు మీయభీష్టమును దీర్పవలసినవా డగును. ఇరువురువ్యక్తులకు అంతగా పరిచయము లేనప్పుడు వారు తమ సంభాషణలందు "మీరు, మీరు' అని సంబోధించుకొనుచు, గౌరవమర్యాద లను విశేషముగా పాటించుచుందురు. పరిచయము ముదిరి ప్రాణస్నేహమైనంతనే ఆ మర్యాదలన్నియు వెనుకబడ, అర

మరిక లేకుండ, 'నీవు, నీవు' అని సంబోధించుకొనుచు మాట లాడుకొందురు. అటులనే భగవానునితో మనము అత్యంత సన్నిహితమైన సంబంధము గలిగియుండవలయును. వ్యభిచారిణి యగు స్త్రీ తనప్రియునితో మెలగు విషయమున ప్రారంభమున నెంతయో సిగ్గుబిడియములు గలిగియుండును, తనప్రియునిసంగతి అతిరహస్యముగా నుంచి కడు జాగరూకతతో మెలగును. కాని ప్రేమ గాఢమైనంతనే ఇక సిగ్గు బిడియములు వెనుకబడును. అప్పుడామె నిర్భయముగా తన యింటిని వాకిలిని విడిచిపెట్టి తనప్రియునితో నడివీధిలో గాన్పించును. అటుపిమ్మట ప్రియునకు తనపై వలపు తగ్గినను, తన్ను విడనాడజూచినను వానిని మెడ వంచి పట్టుకొని బాహాటముగా— నిర్భయముగా— నిట్లడుగును: "నీకోసము నా యిల్లు వాకిలి విడిచినానుగదా, ఇక నన్ను సంరక్షించెదవా, లేదా, చెప్పుము!"

## భక్తి: ప్రాపంచిక ప్రేమ

756. జ...అనువానితల్లి వృద్ధురాలయ్యెను. సంసారమును విడిచి యామె తనయంత్యదశను ప్రశాంతముగా బృందావనమున గడపుట విధ్యుక్తమని భావించి తన యభిప్రాయమును శ్రీరామకృష్ణునకు దెలిపెను. కాని శ్రీగురుదేవుడామెపరిస్థితులనుబాగుగానెఱిగియుండుటచే అందులకుఆమోదింపక యిట్లు సమాధాన మొసగెను: "నీమనుమరాలు (కుమారుని కూతురు) అనిన నీకు పంచప్రాణములు గదా, నీ వెచ్చటికి వెడలినను ఆబిడ్డ తలపునకు వచ్చి నిన్ను ఆందో

శనపడుచును. నీకిష్టమైనపక్షమున బృందావనములో నుండ వచ్చును గాని నీమనస్సు సదా నీయింటిమీఁదనే యుండును. ఇందులకు బదులు నీమనుమరాలు సాక్షాత్తు శ్రీరాధికయని భావనచేసి ఆమెపై ప్రేమానురాగములను జూపుదువేని బృందావనమున నివసించు పుణ్యము స్వయముగా నీకు లభించును. నీకు ఆమెపై నెంత గారాబము కలదో అంత గారాబమును జూపుము; నీమనసార ఆమెను పోషింపుము, సింగారింపుము; కాని యాకృత్యము లన్నిటిమూలమునను బృందావనగోపాలునే ఆరాధించుచున్నానని మాత్రము అంతరంగమున భావించుచుండుము.''

757. ఒకభక్తునకు బంధుగులలో నొకరియం దమితమైన రాగమనియు అందుచే మనస్సును నిగ్రహింపజాలకున్నాడనియు గ్రహించి శ్రీ గురుదేవు డాతని కిట్లుపదేశించెను : ''నీప్రియవస్తువు సాక్షాత్తు భగవత్స్వరూపమని భావింపుము, ఈ భావనతో సేవింపుము.'' ఈవిషయమునే విశదీకరించుచు శ్రీగురుదేవుడు వైష్ణవచరణుడు నిట్లే తెలిపియున్నాడని యిట్లు వెల్లడించెను : ''తన ప్రియవస్తువు నెవ్వఁడైనను ఇష్టదైవమని భావించునెడల మనస్సు సులభముగా భగవానుని వైపు మఱలును. ఇదియే వైష్ణవచరణుని బోధన.''

## భక్తి ప్రభావము

758. ఒకభక్తుడు : దేవా! విచారముచే మొట్టమొదట ఇంద్రియములను నిగ్రహించుట ఆవశ్యకమా?

శ్రీగురుదేవుడు : ఔను, అదియొక మార్గము : అది విచార-

మార్గము. భక్తిమార్గమున ఇంద్రియనిగ్రహము తనంత టదియే లభించును,—అతిసులభముగా లభించును. (ఇచట 350-వ ప్రవచనమును జదువుకొనుడు.)

759. హరినామమును విన్నంతనే ఆనందాశ్రువులు స్రవింప కుండునంతవఱకే (భక్తి) సాధనలు ఆవశ్యకము. భగవన్నామమును విన్నంతమాత్రమున ఆనందబాష్పములు వెల్లివిరియ, ఎవ్వనిహృదయము ఉప్పొంగునో వాని కిక సాధనలు అనావశ్యకము. (చూ. 795.)

760. భగవద్భక్తిని ఒకకవి పులితో బోల్చియున్నాడు. జంతువులను పులివలె భగవద్భక్తి నరుని కామక్రోధాది శత్రువర్గమును కబళించివేయును. భక్త్యగ్ని ప్రజ్వలించి నంతనే కామక్రోధాదులు దానిలో భస్మీపటలమై పోవును. శ్రీకృష్ణునందలి గాఢానురక్తిచే బృందావన గోపికల కట్టి మహాదశ లభించెను.

761. భక్తి మఱల కాటుకతో బోల్పబడియున్నది. శ్రీమతి (రాధ) యొకప్పు డిట్లు పలికెను: "ఓహో! సఖులారా! సర్వత్ర నాకు నాకృష్ణుడే కాన్పించుచున్నాడు!" ఇతరగోపికలు అందుల కిట్లనిరి: "నీ కన్నులకు ప్రేమయను కాటుకను బెట్టుకొనియున్నావు, అందుచే నీకట్లు కాన్పించుచున్నది!"

762. ప్రశ్న: భగవంతునికై భక్తు డెందుచే సమస్తము విడనాడును?

ఉ. దీపము కాన్పింపగనే చీకటినుండి కీటకము ఎగిరివచ్చి దానిపై బడును; చీమ పానకమును విడువక అందే ప్రాణము విడుచును. అటులనే భక్తుడు సమస్తము విడనాడి భగవంతు

నాశ్రయించును. (చూ. 560.)

763. శ్రీగురుదేవుడు: దీపమును జూచిన పిమ్మట మిడుత మఱల చీకటిని ఆశ్రయించునా?

వైద్యుడు (నవ్వుచు): ఒల్లదు, ఒల్లదు,—జ్యోతిలో బడి ప్రాణములు విడిచిపెట్టును.

గురుదేవుడు: కాని నిజమైన భగవద్భక్తుని విషయము వేఱు. వాని నాకర్షించు పరంజ్యోతి వానిని దగ్ధముచేయదు, నశింపజేయదు. అయ్యది దీప్తిమంతమయ్యును మార్దవముగను, మనోహరముగను ప్రశాంతికరముగను ప్రకాశించు మాణిక్యకాంతివంటిది. అది దగ్ధము చేయదు, కాని శాంతిని, ఆనందము నొసగి హృదయమును ప్రకాశింపజేయును.

764. ఒకనికి సరియైనమార్గము తెలియకున్నను భగవద్భక్తియు భగవంతుని దెలిసికొనవలయునను తీవ్రవాంఛయు నుండవచ్చును. అట్టివాడు తనభక్తియొక్క ప్రభావమువలననే భగవల్లాభమును బొందగల్గును. ఒకమహాభక్తుడు జగన్నాథుని దర్శింపవలయునని పయనమైనాడు. కాని (పూరీ) జగన్నాథమునకు త్రోవ నెఱుగక మఱియొకవైపునకు బోయి నాడు. కాని దారిలో కనుపించినవారి నెల్ల ఆత్రముతో త్రోవ నడుగుచు బోయెను. వారందఱును ఆతనికి "ఇది కాదు త్రోవ, అల్లదిగో, అది, ఆమార్గమున బొమ్ము" అని చెప్పిరి. తుద కాతడు జగన్నాథమును జేరి కృతార్థుడయ్యెను. అటులనే మార్గము తెలియకున్నను ఇచ్ఛయున్నచో ఎవ్వరో యొక రాతనికి మార్గదర్శకులు లభింతురు. మొదట పొరపడినను పర్యవసానమున నాతనికి ఎవరో యొకరు సరియైన

మార్గము చూపకపోరు.

765. వివేకము, వైరాగ్యము, సర్వభూతప్రేమ, సాధుసేవ, సాధుసాంగత్యము, భగవన్నామ సంకీర్తనము, సత్యసంధత మొదలగు సుగుణములన్నియు భక్తిలతనుండి వికసించును.

766. ఎవ్వనియందు భక్త్యావేశము గోచరించునో అట్టివాడు భగవత్సాక్షాత్కారభాగ్యము నొందు తరుణము సమీపించినదని గ్రహింపుడు: సాక్షాత్కారమున కిదియే సూచన. (చూ. 938.)

767. సముద్రమునందలి సూదంటుపర్వతము ఓడ నాకర్షించి యందలి మేకుల నన్నిటిని లాగివేయును. అంతట బల్లచెక్కలన్నియు విడిపోవ నోడ సముద్రమున మునిగిపోవును. అటులనే జీవాత్మ భగవంతు డను సూదంటుఱాతిచే ఆకర్షింపబడునపుడు ఒక్కక్షణములో నరుని స్వార్థపరతయు, వ్యక్తిత్వభావనయు రూపుమాయును. అంతట జీవాత్మ భగవంతు డను అనంత ప్రేమసాగరమున మునుగును.

## భక్తియందలి అంతరువులు

768. ప్రేమ మూడువిధములు : (1) స్వార్థరహితమగు సమర్థప్రేమ, (2) అన్యోన్యమగు సమంజసప్రేమ, (3) స్వార్థపరమగు సాధారణప్రేమ. సమర్థప్రేమ మన్నిటిలో ఉత్తమము. ఇందు ప్రియుడు ప్రియురాలి క్షేమమునే గమనించును గాని తన కష్టనిష్ఠురములను లేశమును సరకుచేయుడు. అన్యోన్యమగు సమంజసప్రేమమున ప్రియుడు ప్రియురాలి

సౌఖ్యమునేగాక తన సౌఖ్యముమాటగూడ చూచుకొనుచుండును. సాధారణప్రేమ అధమము. ఇందు నరుడు ఎంతసేపు తన సుఖమునే చూచుకొనునుగాని ప్రియురాలి కష్టనిష్ఠురములను గమనింపడు. (భగవద్భక్తివిషయము కూడ నిట్టిదే.)

769. సాంసారికచింతయందు సాత్త్వికరాజసిక తామసికము లను తారతమ్య మున్నటులనే భక్తియందును తారతమ్యము గలదు. సత్త్వగుణశోభితమగు నమ్రతయే లక్షణముగా గల్గినది ఉత్తమభక్తి. రజోగుణ విశేషమగు డంబముతో గూడుకొనునది మధ్యమభక్తి. కేవల తమోలక్షణమగు పశుబలముతో గూడుకొనునది అధమభక్తి.

సాత్త్వికభక్తుడు రహస్యముగ తన సాధనలను సాగించును. రాత్రి పక్కలో దోమతెరచాటున నాతడు ధ్యానించును, అందుచే ఉదయమున ఆలస్యముగా లేచును. 'పాపము! నిద్రపట్టలేదు కాబోలు' నని వాని మిత్రు లనుకొందురు. కేవల సాత్త్వికాహారమును—కొంచెము అన్నము కూరను—శరీరమునకు సమకూర్చుకొనుటతో వాని శరీరసంరక్షణము సరి. భోగమో, భోజనవిషయమునకాని, బట్టల విషయమునగాని వానియం దేవిధమైన భోగమును కానరింపదు. (అత్యావశ్యకమైన సామగ్రియేకాని) ఇంటిలో అలంకారసంబంధమైన ఆడంబర మేమియు గోచరింపదు. ఒకరిని స్తుతించి పైకిరావలయునని యాత డెన్నడును ప్రాకులాడడు.

రాజసికభక్తుడు బహుశః ఒడలిపై నామాలనో, విభూతినో దట్టముగా ధరించి మెడనిండ, మధ్య మధ్య బహుశః

బంగారు పూసలు గలిగిన తులసిమాలలనో, రుద్రాక్షమాల లనో అలంకరించుకొనును. దేవతార్చన సమయమున పీతాంబరములు గట్టుకొనుట, మేళతాళములతో అట్టహాసముగా పూజలుజరుపుట మొదలగు బాహ్యాచారములలో అతడు చాల పట్టుదల వహించును.

తామసికభక్తునకు ప్రచండాగ్నివంటి విశ్వాసముండును. బందిపోటుదొంగలు దోపిడిచేయునటుల భగవంతునిపై ఈతడు పశుబలము ప్రయోగింపజూచును. "ఏమి! నేను వాని నామమును ఉచ్చరించియు పాపినై యుండుటయా! నేను దేవుని బిడ్డను! వాని సంపదకు వారసుడను." తామసికభక్తుని ధోరణి యిట్లుండును. (చూ. 239.)

770. ప్రశ్న: హఠభక్తి యనగా నెట్టిది?

ఉ. నిరంతరము 'జయ! కాళీ' యని భీకరముగ అఱచుచు, భక్తిచే ఉన్మత్తుడగుటయే హఠభక్తిలక్షణము. లేదా, చేతులు పైకెత్తి, 'హరి బోల్! హరి బోల్!' అని కేకలు వేయుచు, పిచ్చివానివలె చిందులు త్రొక్కుట హఠభక్తికి లక్షణము. ఈ కలియుగమునకు హఠభక్తియే యెక్కువ అనుకూలించునది: శాంతరూపములగు ధ్యానాదులకంటె దీని వలననే శీఘ్రముగా ఫలము గలుగును. భగవానునికోటను బలాత్కారముగా స్వాధీనము చేసికొనవలయును.

771. ఆత్మపరిశుద్ధికి తోడ్పడు సాధనాంగము లివి:

(1) సాధుసంగము, (2) శ్రద్ధ (గురువాక్యాదులందు భక్తి విశ్వాసములు), (3) నిష్ఠ, (4) భక్తి, (5) భావము (భగవద్భావనయందు తన్మయత్వము), (6) మహాభావము: భావము

తీవ్రమైనపుడు మహాభావ మనబడును. భక్తుడు పిచ్చివానివలె ఒకప్పుడు నవ్వును, మఱియొకప్పుడు ఏడ్చును.* ఆతడు ఇంద్రియములను సంపూర్ణముగా జయించియుండును, శరీర స్పృహయే వాని కుండదు. మహాపురుషులకు లేక అవతార మూర్తులకేకాని జీవుల కీదశ సాధారణముగా లభించునది కాదు. (7) ప్రేమ (అఖండమైన భగవద్భక్తి): ఇయ్యది మహాభావమునకు సహచారియై యొప్పును. (1) ప్రపంచ స్ఫురణ లేకపోవుట, (2) సంపూర్ణమైన శరీరవిస్మృతి ఇవి యీ స్థితికి చిహ్నములు. ఇయ్యది భగవానుని ముఖాముఖిని దర్శింపజేయును—జీవిత పరమావధిని బొందించును. (చూ. 809.)

772. "శాస్త్రములు ఈకర్మములను విధించుచున్నవి, కావున నేను చేయుచున్నాను"—అనుభావనతోఁగూడినది వైధభక్తి. ప్రహ్లాదునకువలె అఖండమైన భగవత్ప్రేమచే లభించు మఱియొకవిధమైన భక్తికలదు—అదియే రాగభక్తి. రాగభక్తి కలుగునపుడు ఇక శాస్త్రవిహిత కర్మములను జేయ టనావశ్యకము.

773. శాస్త్రవిధులననుసరించునది 'వైధభక్తి.' నియ

---

* సీ. వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై యొక్కచోఁ బేడుచునొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁడింతయుగాని వేఱొండు లేదని యెత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుఁ డనునిధానముఁ గంటి నేనని యుబ్బి గంతులువైచు నొక్కచోట.

మితవిధుల ననుసరించి నామజపముచేయుట, ఏకాదశ్యాది పుణ్యతిథులందు ఉపవాసముండుట, తీర్థయాత్రలుచేయుట, శాస్త్రోక్తమైన పూజాద్రవ్యములతో భగవంతు నర్చించుట—ఇట్టినియమము లన్నియు వైధభక్తికి లక్షణములు. చాలకాల మిట్లు సాధనచేసినయెడల ఉత్తమమగు రాగభక్తి లభించును. వలయునది ప్రేమ—అఖండమైన భక్తి. ఐహిక వాంఛలు పూర్తిగా నశించి మనస్సును పదునాఱణాలవంతు (అనగా సంపూర్ణముగా) భగవంతునిపై నిలుపవలయును. అపుడే వానిని పొందనగును. రాగభక్తి లేపదే ఎవ్వరును భగవానుని ప్రాపింపజాలరు.

774. భగవద్భక్తి రెండు విధములు: మొదటిది (శాస్త్రోక్తమైన) వైధభక్తి—'భగవంతు నిట్లు పూజింపవలయును, భగవన్నామము నిన్నిసార్లు జపింపవలయును'—అను నియమములతో గూడుకొని యుండునది. ఇయ్యది పరభక్తిని (తన్మూలమున) సమాధిస్థితియందు బ్రహ్మసాక్షాత్కారమును లభింపజేయగలదు. అపుడు జీవాత్మ పరమాత్మయందు లయము గాంచును. ఇక నందుండి తిరిగిరాదు. సామాన్యభక్తుల విషయ మిట్టిది, కాని భగవదవతారమూర్తులయొక్కయు ఈశ్వరకోటియొక్కయు విషయము వేఱు. వారిభక్తి శాస్త్ర

అ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ, బ్రణయహర్ష జనిత బాష్పసలిల
మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై, యొక్కచోట నిలిచి యూరకుండు.
—ఆంధ్రభాగవతము, ప్రహ్లాదచరిత్ర, 7-124.

విధులచే ఏర్పడునదికాదు. అయ్యది అంతరంగమునుండి వెల్లి విరియును. (శ్రీచైతన్యునివంటి) అవతారపురుషులకును ఈశ్వరుని యంతరంగకోటిలోనివారికిని సమాధిస్థితియందు లభించు బ్రహ్మజ్ఞానము దాపుననే యున్నను వారు తమ మహోన్నతస్థితినుండి దిగివచ్చి తమవ్యక్తిభావనను నిలుపుకొని భగవానుని "తల్లీ!" "తండ్రీ!" యని పిలుచుచు భక్తి సలుపుచుందురు. మఱియు 'నేతి, నేతి—ఇదికాదు, ఇదికాదు' అనుచు, మెట్టు వెంబడిని మెట్టు విడిచివేసి, శిఖరమును జేరుదురు. అపుడు 'ఇదియే బ్రహ్మము' అందురు. కాని తాము ఎక్కి వచ్చిన మెట్లవరుసయు తాము చేరిన శిఖరము లేక గోపురమువలెనే ఒకేతీరు సున్నము, ఇటుకలు, ఇటుకపొడి మొదలగువానిచే కూర్పబడినదని వెంటనే గ్రహింతురు. అందుచే వారు ఒకప్పుడు గోపురముపైని ఆగుచు, మఱియొకప్పుడు మెట్లపైని సంచారముచేయుచు, పైకి క్రిందికిని ఎక్కుచు, దిగుచునుందురు. (చూ. 135, 811, 835.)

విషయానుభవములకు కారణభూతమైన మనస్సు ఎందు నిర్మూలమగునో అట్టి సమాధిస్థితిలో సాక్షాత్కరించు బ్రహ్మమే యీగోపురము. నామరూపాత్మకమైన దృశ్యప్రపంచమే మెట్ల వరుస, ఇంద్రియగోచరమగు ప్రపంచము బ్రహ్మస్వరూపమే యని (సమాధిమూలకమైన) యీ గోపురమును జేరునపుడు విశదమగును. (చూ. 866, 927, 928.)

## 'ప్రేమ' లేక పరభక్తి

775. భగవత్సాక్షాత్కారముకానిదే 'ప్రేమ' లభింపదు.

776. మాంసములోపల ఎముకలును వానిలోపల మజ్జయు — ఈ విధముగా నున్న వనియు — అన్నిటిలోపలను 'ప్రేమ' కలదనియు పారసీక గ్రంథములలో వ్రాయబడి యున్నది.

777. సచ్చిదానందస్వరూపుడగు భగవానునితో శాశ్వతముగా తన్ను బంధించుకొనుటకై భక్తునిచేతిలో నుండు దారమే 'ప్రేమ'. భక్తుడు భగవానుని తన యధీనమున నుంచుకొనునని చెప్పవచ్చును. ఆతడు పిలుచునప్పుడెల్ల భగవానుడు వానికడకు వచ్చును. (చూ. 602.)

778. (బ్రహ్మానందపారవశ్యమును బొందించు) 'భావము' అనుస్థితి పచ్చిమామిడికాయవంటిది; 'ప్రేమ'యో, మామిడి పండువంటిది.

779. నరకభయాదులచే భగవంతుని పూజించుట ప్రారంభదశలోనివారికి తగును. పాపభయము కలిగియుండుట తోడనే ధర్మము (పరవిద్య) పూర్తియగుచున్నదని కొందఱి యభిప్రాయము. పారమార్థికజీవితమున అది కేవలము క్షుద్రమగు ప్రారంభదశ యనుసంగతి వారు మఱచుచున్నారు. ఇంతకంటె ఉత్తమాశయము కలదు, — ఉత్తమపారమార్థిక దశ కలదు; భగవంతుని మనతల్లి యనియో, తండ్రియనియో ప్రేమింపవలయును.

780. పరభక్తి యనగా నెట్టిది? ఈ దశను ప్రాపించిన

భక్తుడు భగవానుని తనకు అత్యంతాప్తునిగా భావించును. ఇయ్యది శ్రీకృష్ణునియందలి గోపికలప్రేమను బోలును. వారాతని జగన్నాథునిగాగాక గోపీనాథునిగా నెఱింగి యెల్లప్పుడు అట్లే సంబోధించిరి. (చూ. 653.)

781. ఎందువలననో తెలియకుండగనే భగవంతుని భజించుట కలదు. ఈస్థితి లభించెనా, ఇక కోరదగిన దేదియు నుండదు. ఇట్టి భక్తిని బడసినవా డిట్లు పల్కును: "పరమేశ్వరా! నాకు ఐశ్వర్యము వలదు, కీర్తి వలదు, సౌఖ్యము వలదు, మఱేమియు వలదు; నీపాదారవిందములయందు నాకు వినిర్మల భక్తి ననుగ్రహింపుము! ఇదియే నాకు వలయునది"*

782. బాహ్యప్రపంచమును మఱచుట, శరీరమును మఱచుట—యనునివి రెండును 'ప్రేమ'కు లక్షణములు.

783. ప్రేమభక్తిలో 'నేను, నాది' అనగా నేను భక్తుడను, భగవంతుడు పూర్తిగా నావాడు అను రెండుభావములును గలవు. యశోద తానుదక్క మఱెవ్వరును తన గోపాలుని సంరక్షింపలేరనియు తనపోషణలేనిచో వాని యారోగ్యము చెడుననియు భావించెడిది. కృష్ణుడు జగన్నాథుడని భావింప

* శ్లో. "ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే,
కుర్వన్త్యహైతుకీం భక్తి మిత్థం భూతగుణో హరిః."

క. "ధీరులు, నిరపేక్షులు నా,త్మారాములు నైనమునులు హరిభజనము ని
ష్కారణము చేయుచుందురు, నారాయణుఁడట్టివాఁడనవద్యచరిత్రా."
—భాగవతము, 1-138.

శ్లో. "న ధనం న జనం న సున్దరీం కవితాం వా జగదీశ కామయే,
మమజన్మని జన్మనీశ్వరో భవతా ద్భక్తి రహైతుకీ త్వయి."
—శ్రీకృష్ణచైతన్యవిరచితము, శిక్షాష్టకము 4.

నామె యెన్నడును ఇష్టపడలేదు. "భగవంతుడు నావాడు, నాసొంతము; నాగోపాలుడు!"—భక్తుని మమత యిట్టిది. ఉద్ధవుడు యశోదతో నిట్లనియెను: "అమ్మా! నీకృష్ణుడు సాక్షాత్తు జగదీశ్వరుడు, లోకైకచింతామణి, కృష్ణుడు మానవ మాత్రుడు కాడు." ఆ పలుకులు విని యశోద యిట్లనియెను: "నీచింతామణినిగూర్చి నేనడుగుట లేదయ్యా! నాగోపాలుడు ఎట్లున్నాడని యడుగుచున్నాను. చింతామణి కేమి లెమ్ము, నాగోపాలుని క్షేమసమాచారము చెప్పుము."

784. 'ప్రేమ' (పరభక్తి) యేకొలదిమందికో లభించును. వారు ఈశ్వరాదేశము కలవారు, అలౌకికమహిమాన్వితులు. ఈశ్వరమహిమమునకును ఈశ్వరసంపదకును 'వారసులగు' వారు ప్రత్యేకవర్గముగ నేర్పడియుందురు. చైతన్యదేవునివంటి అవతారమూర్తులును వీరి యుత్తమభక్తులగు భగవదంశ సంభూతులును ఈ వర్గములోనివారు.

785. స్వతస్సిద్ధముగా బాల్యమునుండియు ఈ యఖండ ప్రేమతో నొప్పు మహనీయులు గొందఱుందురు. ఔను,

---

జగదీశ్వరా! నాకు ధనము వలదు, జనము వలదు, సుందరులు వలదు, కవిత్వము వలదు, జన్మజన్మాంతరములందు నీయందలి అహేతుక భక్తియే నాకు వలయునది.

శ్లో. "నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం,
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాన్తరేపి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు."

—ముకుందమాల, 8.

ప్రహ్లాదునివలె వారు చిన్ననాటనే భగవంతునికొఱకు పరితపింతురు, విలపింతురు. వారే నిత్యసిద్ధులు, అజన్మసిద్ధులు.

## గోపికల ప్రేమ

786. రాధాకృష్ణులు భగవదవతారమూర్తులని మీరు నమ్మకపోయినను సరియే. భగవదవతారములు యథార్థములని కొందఱు (హిందువులవలెను, క్రైస్తవులవలెను) నమ్మవచ్చును, లేదా, మానవరూపమునగాక మఱిఏ రూపమునగాని భగవంతుడు అవతరించునని (బ్రాహ్మసామాజికులవలె) నమ్మకపోయిన పోవచ్చును. కాని (భగవంతుని యందలి) యీ యనురాగమునకై ఎల్లరును పరితపింపవలయును. వలయున దీగాఢానురక్తి యొక్కటియే.

787. గోపికల ప్రేమనుగూర్చి ముచ్చటించుచు శ్రీగురుదేవుడు 'మ' అను నొకశిష్యున కిట్లు తెల్పెను: "ఆహా! గోపికల ప్రేమ యెంత గాఢమైనదో! తమాలవృక్షమును జూచినంతనే వారు ప్రేమోన్మత్తలైరి! (ఏలన తమాల వృక్షముయొక్క శ్యామలవర్ణము వారికి శ్యామసుందరుడగు కృష్ణుని తలపునకు దెచ్చెను.) గౌరాంగుని (చైతన్యుని) విషయము కూడ నిట్టిదే. ఎదుటనున్న వనమును గాంచి యాతడు బృందావనమని భావించెను! ఆహా! ఈ ప్రేమయందణుమాత్రము లభించినవా డెంతటి ధన్యుడోకదా! ఏమి ప్రేమపారవశ్యము! ఈ దివ్యప్రేమ వారియందు పరిపూర్ణమై యుండుటయేగాక, నిరంతరము వారిహృదయ సరోవరమునుండి పొరలి ప్రవహించెను.

788. గోపికలనిష్ఠ యేమి యద్భుతము! శ్రీకృష్ణుడు మధురానగరముననుండగా గోపికలు ద్వారపాలకులను బతిమాలుకొని సభామందిరమును జేరిరి. అచట కిరీటధారియై యున్న కృష్ణుని గాంచి నేలచూపులు చూచుచు, "ఈకిరీటధారి యెవడు? మనము వీనితో మాటలాడతగదు. మాటలాడిన యెడ కృష్ణునియెడ అపచారముచేసినవార మగుదుము. అయ్యో! మనస్వామి యేడి? పీతాంబరమును నెమిలి పింఛమును దాల్చు మన ప్రియుడేడి?" అని తమలోతాము గొణుగుకొనసాగిరి. ఆహా! ఈగోపికల అనన్యభక్తి యెట్టిదో!

789. గోపికలభక్తి ప్రేమభక్తి. దీనినే 'అవ్యభిచారభక్తి' యనియు 'నిష్ఠాభక్తి' యనియు జెప్పుదురు. 'వ్యభిచారభక్తి' యెట్టిదో తెలియునా? అది జ్ఞానముతో మిశ్రితమై యుండును. —"కృష్ణుడే సర్వమయుడు, ఆతడే పరబ్రహ్మము. ఆతడే రాముడు, శివుడు, శక్తి, పరాశక్తి"—ఈవిధమైన జ్ఞానముతో గూడుకొని యుండునది. ప్రేమభక్తిలో ఇటువంటి కలగలుపు ఉండదు. హనుమంతుడు ద్వారక కేగి తాను సీతారాములను మాత్రమే చూడ నిచ్ఛగింతు ననెను. అపుడు శ్రీకృష్ణుడు రుక్మిణితో, "నీవు సీతరూపు దాల్పవలయును, లేనిచో హనుమంతుడు సమాధానపడడు" అనియెను. పాండవులు రాజసూయయాగము జరిపినప్పుడు యుధిష్ఠిరుడు సింహాసనాసీనుడై యుండ రాజులందఱును ఆతనికి సాష్టాంగప్రణామ మాచరించిరి. కాని విభీషణుడు తాను నారాయణునకు దక్క మఱెవ్వరికిని ప్రణామముచేయనని

పట్టుపట్టెను. అంతట సాక్షాన్నారాయణుడగు శ్రీకృష్ణుడే స్వయముగా యుధిష్ఠిరునకు ప్రణామమాచరింప విభీషణుడు కిరీటమండితమగు తనమస్తకమును నేల మోపి యుధిష్ఠిరునకు సాగిలబడి మ్రొక్కెను.

## విరహము : మహాభావము

790. విరహవేదన, అనగా భగవంతుని యెడబాటుచే గలుగుబాధ, అబ్బా! చెప్ప నలవికానిది! ఇట్టిస్థితిలో రూప సనాతనులు * ఒక చెట్టుక్రింద గూర్చుండియుండ ఆచెట్టు ఆకులు వాడిపోయెడివట! విరహస్థితిలో నేను మూడుదినములు ఇంచుమించు శరీరస్మృతి లేకుండ నుంటిని. కదలలేక నేనపుడు ఒకచోట పడియుంటిని! నాకు కొంచెము స్మృతి వచ్చినప్పుడు బ్రాహ్మణి † నన్ను తీసికొనివెడలి స్నానము చేయించెడిది; కాని యామె నాశరీరమునంతయు దళమగు గుడ్డలతో గప్పి వానిపై చేయివైచి నన్ను పట్టుకొనెడిది; లేనిచో నాశరీరమును తాకజాలకుండెడిది. శరీరమునకు అలదిన రేగడి మన్ను కాలిపోయెడిది! అపుడు నా వెన్నెముక గుండా పెద్ద యీటెను గ్రుచ్చినట్లు తోచెడిది! ఆ బాధకు తాళజాలక, "చచ్చిపోవుచున్నాను" అని యొక్కొక్కప్పుడు బొబ్బలు పెట్టువాడను. కాని దానివెంబడినే అఖండదివ్యా

* వీరు ఇరువురును శ్రీ చైతన్యదేవుని ముఖ్యశిష్యులు. బృందావనమున సుప్రసిద్ధమగు గోవిందదేవాలయమును వీరు కట్టించిరి.

† శ్రీరామకృష్ణునకు తాంత్రికసాధనలను ఉపదేశించిన భైరవీ బ్రాహ్మణి.

నందము లభించెడిది.

791. 'మహాభావము' అనగా అఖండ బ్రహ్మానుభవము; అది మనశ్శరీరములను ఉద్ఘాతలూగించివేయును; మదపు టేనుగు చిన్నగుడిసెలో దూరి దానిని భీకరముగా ఊపివేసి యొక్కొక్కప్పుడు నేల గూల్చివేయునటుల మహాభావము మనశ్శరీరములను అల్లల్లాడించివేయును. మహాభావమునకు పూర్వ మెంతటి దుర్భర వేదన యుండునో అనంతర మంతటి పరమానందము లభించును. (చూ. 400.)

## 3

## భక్తి : జ్ఞానము

### పర్యవసానమున భక్తిజ్ఞానములు రెండు నొక్కటే

792. పరభక్తియు పరజ్ఞానము (అనగా పరిశుద్ధభక్తియు పరిశుద్ధజ్ఞానము) నొక్కటే.

793. ఎవనిని వేదాంతులు బ్రహ్మమందురో వానినే యోగులు ఆత్మయనియు భక్తులు భగవానుడనియు జెప్పుదురు. ఒకే బ్రాహ్మణుడు అర్చనచేయునపుడు అర్చకుడనియు వంటచేయుటకై నియోగింపబడినపుడు వంట బ్రాహ్మణుడనియు జెప్పబడునుగదా ?

794. నిజమైన జ్ఞానమనగా నెట్టిది? జ్ఞాని యిట్లు పల్కును: "పరమేశ్వరా ! లోకమున నీ వొక్కడవే కర్తవు. నేను నీ చేతిలోని అత్యల్పమైన ఉపకరణమాత్రమను. నాదేమియు లేదు. అంతయు నీదే. నేను, నా కుటుంబము, నా సంపదలు,

నా గుణగణములు—సమస్తము నీవే.'' (చూ. 125.)

795. ఒక భక్తుడు: ఒకానొకడు గృహస్థుడైయుండియు బ్రహ్మజ్ఞానము నొందెనని గ్రహించు టెట్లు?

శ్రీ గురుదేవుడు : హరినామమును విన్నంతనే అశ్రువులును గగుర్పాటును గలుగుటయే అందులకు గుఱుతు. భగవన్నామ శ్రవణమాత్రమున ఎవ్వని కన్నులనుండి బాష్పములు వెల్లివిరియునో, ఎవ్వనికి రోమాంచమగునో (రోమములు నిక్కబొడుచుకొనునో) అతడే జ్ఞానలాభమును బొందినవాడు. (చూ. 759.)

796. జ్ఞానమును భక్తిని సమన్వయించు నొక పురాణ కథ కలదు. భగవానుడగు రామచంద్రుడు తన ప్రియభక్తుడగు హనుమంతు నొకప్పు డిట్లడిగెను : ''వత్సా! నన్ను నీ వెట్లు భావింతువో, ధ్యానింతువో, చెప్పుము.''

హనుమంతు డిట్లు విన్నవించెను : ''ని న్నొకప్పుడు పరిపూర్ణునిగా భావించి యారాధింతును. అపుడు నన్ను నీ యందలి అంశముగా భావించుకొందును. మఱియొకప్పుడు నిన్ను ప్రభునిగను నన్ను నీ సేవకునిగను భావించి యుపాసింతును. ఐనను తత్త్వజ్ఞానదశలో 'త్వమేవాహం'-నీవే నేను అనియు నేనే నీవు అనియు నాకు అనుభూతమగుచుండును.''*

797. చెఱువులో నీటిపై దేలు చెత్తను పాచిని కొంచెము తొలగద్రోసినయెడల మఱల వచ్చి యవి నీటి నావరించును;

* శ్లో. ''దేహబుద్ధ్యాతు దాసోఽస్మి జీవబుద్ధ్యా త్వదంశకః,
ఆత్మబుద్ధ్యా త్వమేవాహ మితి మే నిశ్చితా మతిః.''

కాని వానిని బాగుగా తొలగించి వెదురుకఱ్ఱలను అడ్డముగా గట్టినయెడల అవి మఱల క్రమ్ముకొనజాలవు. అటులనే మాయను ఎన్నడో యొకసారి నిరోధించినయెడల మఱల వచ్చి యది మనలను బాధించుచునే యుండును. కాని హృదయమున భక్తిజ్ఞానము లను ఆవరణమును నిర్మించుకొందుమేని మాయ యిక మనల నావరింపజాలదు, అపు డది శాశ్వతముగా తొలగిపోవును. ఇదియే భగవత్సాక్షాత్కారము లభించు మార్గము.

## భక్తియెట్లు జ్ఞానముగా పరిణమించును?

798. అద్వైతజ్ఞానమే మహోత్తమము, కాని భగవంతుని మొదట సేవ్యసేవకభావముతో (అనగా భగవంతుడు ప్రభువనియు తాను సేవకుడనియు భావించి) యుపాసింపవలయును. ఇదియే అత్యంత సులభమైన మార్గము; అచిరకాలముననే ఇయ్యది మహోత్తమమగు అద్వైతజ్ఞానమును బొందించును. (చూ. 747.)

799. అద్వైతజ్ఞానమే అత్యుత్తమమయ్యును భక్తిక్రమమున నీవు మొట్టమొదట భగవంతుని ఉపాస్యునిగను నిన్ను ఉపాసకునిగను భావించుకొని భక్తిచేయవలయును. అపుడు సులభముగా నీకు జ్ఞానలాభము గలుగగలదు.

800. పంచభూతాత్మకపంజరమున జిక్కి స్వయముగా బ్రహ్మమే రోదనముచేయుచున్నది. కన్నులు మూసికొని నీవు "ముల్లు లేదు, ముల్లు లేదు" అనుకొందువుగాక, కాని నీవు ముండ్లను తాకినంతనే అవి గ్రుచ్చుకొనుటచే "అబ్బా!"

అని చేతిని యీవలకు లాగికొందువు. అటులనే జననమరణములు, పుణ్యపాపములు మొదలగు ద్వంద్వములకు అతీతుడనని—అఖండసచ్చిదానందమయ బ్రహ్మమనని—నీ వెంతగా భావించుకొనినను, శరీరమునకు ఏవ్యాధియో సంభవించినంతనే, లేదా, మనస్సు విషయాకర్షణలకు లోనై కామినీకాంచనముల దగుల్కొని పాపకార్యములను జేయ నిన్ను ప్రేరేపించునపుడు నీవు మోహితుడ వగుచున్నావు, దుఃఖాధీనుడ వగుచున్నావు. తుదకు అవివేకివై సత్ప్రవర్తనమును విడనాడి మాయాజాలమున జిక్కుకొనుచున్నావు. కావున భగవంతుడు స్వయముగా కరుణింపనిదే—మహామాయ నీకొఱకు మోక్షద్వారమును తెఱవనిదే—నీ వెన్నటికిని ఆత్మసాక్షాత్కారమునొంది దుఃఖాతీతుడవు కాజాలవని గ్రహింపుము. "సైషా ప్రసన్నా వరదా నృణాం భవతి ముక్తయే—* వరప్రదాయినియైన యీ దేవి సుప్రసన్నయైనపుడు నరులను సంసారబంధ విముక్తులను జేయుచున్నది" అని దేవీమాహాత్మ్యమున మీరు వినలేదా ? మార్గమునుండి జగజ్జనని అవరోధములను తొలగించిననేకాని యెవ్వరును దేనిని సాధింపజాలరు. మహామాయ కరుణించి సాధకుని మార్గమునుండి ఒత్తిగిలిననే కాని, బ్రహ్మసాక్షాత్కారము వాని కెన్నటికిని లభింపదు. ఆ తల్లి తన కృపాకటాక్షమును వానిపై బఱపి

* "సైషా ప్రసన్నా వరదా నృణాం భవతి ముక్తయే,
సా విద్యా పరమా ముక్తేర్హేతు భూతా సనాతనీ."
—దేవీమాహాత్మ్యము, 1-57.

నంతనే ఆతడు ధన్యుడై భగవత్సాక్షాత్కారము నొందును, సమస్తదుఃఖాతీతు డగును. లేనిచో మీ రెంతటి వివేక వైరాగ్యాదిసాధనల నవలంబించినను అన్నియు నిష్ప్రయో జనములే. "ఒక్క ఓమము పాయ నూఱు మెదుకులను అఱి గించును" అని చెప్పుదురు. కాని జీర్ణకోశము చెడిపోయిన పక్షమున నూఱుఓమముపాయ లైనను ఒక్క మెదుకును అఱి గింపజాలవు! (చూ. 55, 674, 686.)

801. నిర్గుణబ్రహ్మసాక్షాత్కారము నొందుటయే జ్ఞాన యోగి యభీష్టము. కాని సర్వసాధారణముగా అట్టివా డీకలి యుగమున భగవంతుని భజించుచు, ప్రార్థించుచు, వానికి ఆత్మార్పణ మొనర్చుకొనుటయే శ్రేయస్కరమని చెప్పవలసి యున్నది. భగవానుడు తనభక్తుని రక్షించును; మఱియు భక్తుడు పరితపించునేని బ్రహ్మజ్ఞానమును సైతము తప్పక యొసగును. జ్ఞానయోగి యిట్లు భక్తిజ్ఞానములను రెంటిని గూడ బొందవచ్చును. ఆతడు బ్రహ్మసాక్షాత్కారమును బడయగలడు; భగవదనుగ్రహ మున్నచో, ఆతడు భక్తు లారాధించు సగుణబ్రహ్మముయొక్క సాక్షాత్కారమును గూడ పొందును. భక్తుడు సర్వసాధారణముగా సగుణ బ్రహ్మసాక్షాత్కారముతో తృప్తినొందును. కాని భగవా నుడు వానిని తన యఖండైశ్వర్యమునకు 'వారసుని'గా నొనర్చి భక్తిజ్ఞానములను రెంటినిగూడ ప్రసాదించును,— సగుణబ్రహ్మసాక్షాత్కారమే కాక, నిర్గుణబ్రహ్మసాక్షాత్కా

రముగూడ వానికి లభించును. * ఎవ్వడైనను కలకత్తా జేర గల్గినచో అందలి మైదానమును, ఆక్టర్ లోనీ స్థూపము (Ochterlony Monument)ను, మ్యూజియమును, చూడదగిన యితర వస్తువులను జూడజాలకపోవునా? (చూ. 804.)

802. ప్రశ్న : భక్తు డెన్నడైనను భగవంతునితో పరిపూర్ణైక్యమును బొందునా? ఐనచో నెట్లు పొందును ?

ఉ. జీవాత్మ భగవంతునితో పరిపూర్ణైక్యమును బొందును; అటులైక్యమును బొందునప్పుడే "నేనే బ్రహ్మమను" ('అహం బ్రహ్మాస్మి') యని చెప్పగలుగును. ఇంటియందలి వృద్ధసేవకుడు కాలక్రమమున నింటిలో నొకడుగ పరిగణింపబడును, గృహయజమానుడు వానిసేవను జూచి చాల సంతోషించి యొకానొకదినమున వానిని తాను గూర్చుండు గౌరవస్థానమున గూర్చుండబెట్టి నాటినుండి తనకును వానికిని భేదములేదని తనచుట్టునున్న వారికి జెప్పవచ్చును, మఱియు "ఇతడును నేనును ఒక్కటియే; నాయెడ మీరు విధేయులై వర్తించురీతిని ఈతనియెడల వర్తింపుడు. అటులచేయనివారు శిక్షాపాత్రులగుదు"రని చెప్పవచ్చును. ఇట్టి గౌరవము నొందుట కాతడు వినయముచే సంకోచించినను యజమానుడే

* "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే.
తేషామేవానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా."
—భగవద్గీత, 10-10, 11.

బలవంతముగ వానిని ఉత్తమాసనమున గూర్చుండబెట్టును. చిరకాలము భగవంతుని సేవించి వానితో నైక్యమునొందు భక్తులవిషయముకూడ నిట్టిదే. భగవంతుడు కృపాపూర్ణుడై తన యఖండైశ్వర్యమును అనంతకల్యాణగుణములను అట్టి భక్తునకు సంపూర్ణముగా నొసగి వానికి స్వయముగా తన లోకేశ్వరపదవి ననుగ్రహించును.

803. భక్తుడు సర్వసాధారణముగా బ్రహ్మజ్ఞానము నభిలషింపడు, కానియాతడు శ్రీకృష్ణుని, శ్రీచైతన్యునివంటి నాజగజ్జనని దివ్యావతారములనో, స్వయముగా నాజగజ్జననినో సాక్షాత్కరించుకొన్నంతమాత్రముననే సంతుష్టుడగును. సమాధిస్థితిలో తన ప్రత్యేకత నిర్మూలముకారాదని యాతడు భావించును. బ్రహ్మమును పురుషోత్తమునిగా గాంచి యట్టిదివ్యానుభవము నొందుటకు దగినంతవ్యక్తిత్వము తనకు నిలిచియుండవలయునని యాతని యభిలాష. ఆతడు స్వయముగా పంచదార కాగోరడు. కాని పంచదారను రుచిచూడదలచును!

804. నాదివ్యజనని తానే వేదాంతోక్తమగు బ్రహ్మమని వక్కాణించుచున్నది. ఆమెయే అహంకారమును నిర్మూలించి బ్రహ్మజ్ఞానము నొసగగలదు. నిత్యమేది, అనిత్యమేది యను విచారమూలమునను నీవిట్లు బ్రహ్మజ్ఞానము నొందవచ్చును. మఱియు భక్తిమూలమునను బ్రహ్మజ్ఞానమును

---

ఈవిధముగ నెల్లెడల నాయందాసక్తి కలిగి విశ్వాసపూర్వకముగ సేవించెడు వారలకు నాలో నైక్యమునకు గారణమైన జ్ఞానయోగమును నేనిచ్చెదను. అట్టివారిని మాత్రమే నేననుగ్రహించి నాసర్వవ్యాపకమైన జ్ఞానప్రకాశముచేత వారల ప్రకృతిసంబంధమైన అవివేకమనెడి యంధకారమును నశింపజేయుచున్నాను. (చూ. 801.)

బడయవచ్చును. భక్తికోసము—వికాసముకోసము—ఆత్మ సమర్పణకోసము—నిరంతరము ఆమెను ప్రార్థించుటగా భక్తియోగతత్త్వము. వీనిమూలమున మొదట నాజగజ్జనని సాన్నిధ్యమును బొందుము. నీప్రార్థన హృదయపూర్వకమైనచో, నా దివ్యమాత దాని నాలకించితీరునని నామాటగా నమ్ముము; కాని నీవందులకై వేచియుండవలయును. ఆమె నిర్గుణతత్త్వమును సాక్షాత్కరించుకొనదలచెదవా, మఱల ఆమెనే ప్రార్థింపుము. ఆమె నీప్రార్థన నాలకించునేని—ఆమె సర్వశక్తిమయిగదా—సమాధిస్థితిలో నీకామె నిర్గుణతత్త్వము అనుభూతమగును. (అనగా నిర్గుణబ్రహ్మసాక్షాత్కారము నొందుదువు.) ఇదియే బ్రహ్మజ్ఞానము. (చూ. 801.)

## జ్ఞానికిని భక్తునకును మనోభావమునందుగల భేదము

805. సాధకులు ఇరుతెఱగులుగా గాన్పించుచున్నారు. ఒకతెగవారిని కోతిపిల్లతోడను రెండవతెగవారిని పిల్లికూనతోడను బోల్పవచ్చును. (521-వ ప్రవచనము జూడుడు.) ఇట్లే జ్ఞానమార్గమును లేదా, నిష్కామకర్మమార్గమును అవలంబించు సాధకుడు మోక్షమునకై స్వప్రయత్నముపై నాధారపడును. భక్తిమార్గము నవలంబించువాడో, సమస్తము ఈశ్వరేచ్ఛచేతనే జరుగుచున్నదని గ్రహించి పూర్ణవిశ్వాసముతో వానియనుగ్రహముపై నాధారపడియుండి వానికి సంపూర్ణముగా ఆత్మార్పణ మొనర్చుకొనును. ఇందు ముందు జెప్పినవాడు (అనగా పురుషప్రయత్నము నాశ్రయించువాడు) కోతిపిల్లవంటివాడు (మర్కటకిశోరన్యాయము). తరువాత

చెప్పినవాడు (అనగా ఈశ్వరునకు ఆత్మార్పణము గావించుకొను సాధకుడు) పిల్లి పిల్ల వంటివాడు (మార్జాలకిశోర న్యాయము).

806. జ్ఞాని "నేనే శుద్ధబ్రహ్మము" ననును; కాని భక్తుడు, "ఆహా! ఈ సర్వము ఈశ్వరవిభూతిగదా!" యనును.

807. "ఈ సమస్తప్రపంచము నేనే"; "ఈ సమస్త ప్రపంచము నీవే"; "నీవు ప్రభుడవు, నేను సేవకుడను"— ఈమూడు మనోభావములందును ఏదేని యొకదానియందు చక్కగా నెలకొనియుండువాడుమాత్రమే భగవత్సాక్షాత్కారము నొందగల్గును.

808. శివాంశముచే జన్మించునట్టివాడు జ్ఞానియగును. "బ్రహ్మమే సత్యము, జగత్తు మిథ్య" యను జ్ఞానము నొందుటయే వానియభీష్టము. కాని విష్ణ్వంశముచే జన్మించినవానికి భక్తివిశ్వాసము లెన్నడును కొఱవడవు. నిత్యానిత్యవస్తు విచారముచే, లేక తార్కికజ్ఞానమహిమచే తాత్కాలికముగా వానిభక్తివిశ్వాసము లొకప్పుడు ఒకించుక క్షీణించినను సకాలమున అయ్యవి యాదవకులనాశకమైన ముసలము వలె విజృంభించును.

809. జ్ఞానిహృదయమున బ్రవహించు "ప్రజ్ఞానగంగ" ఒకేదిశగా బ్రవహించుచుండును. వానికి సమస్తజగత్తును స్వప్నతుల్యముగా దోచును. ఆతడు సదా ఆత్మయందే నెలకొనియుండును. కాని భక్తుని హృదయమందలి "ప్రేమగంగ"యో, సదా ఒకేదిశగా ప్రవహింపదు; దానిలో పోటుపాటు లుండును. భక్తుడు ఒకప్పుడు నవ్వును, ఒకప్పుడేడ్చును; ఒకప్పుడు ఆడును, మఱియొకప్పుడు పాడును.

భక్తుడు ఎప్పుడును భగవత్సాన్నిధ్యముచే గలుగు నానందము ననుభవింపగోరును. సముద్రమున దేలియాడు మంచుకొండ వలె ఆయానందసాగరమున నొకప్పు డాతడు ఈదులాడుచు, ఒకప్పుడు మునుగుచు, ఒకప్పుడు తేలుచు, అందే నెలకొని యుండ నభిలషించును. (చూ. 771.)

810. పురాణముల ప్రకారము భక్తుడు భగవంతునికంటె భిన్నుడు,—భక్తుడు ఒకతత్త్వము, భగవంతుడు వేఱొక తత్త్వము. ఈ దేహము ఘటమువంటిది; మనోబుద్ధ్యహంకారములే ఇందలి నీరు. బ్రహ్మము సూర్యునివంటిది. అయ్యది అంతఃకరణ మను నీటిలో ప్రతిఫలించుచున్నది, కావున భక్తుడు వివిధ దివ్యరూపములను దర్శించుచుండును. కాని వేదాంతముప్రకారము బ్రహ్మ మొక్కటియే సత్యము, మిగిలినదంతయు మాయ—స్వప్నమువలె మిథ్య. బ్రహ్మసాగరమున "నేను" అనునొకకట్ట పడియున్నది. ఈకట్టను నీవు తొలగించితివా, అఖండజలము (ఒక్కటియే) గోచరించును; కాని కట్ట యున్నంతవఱకు జలము రెండు భాగములుగా విభజింపబడినట్లు కట్టకు ఇరువైపులను గాన్పించును. నరుడు సమాధిస్థితినొందినంతనే బ్రహ్మజ్ఞానము ఉదయించును. అహంకార మపుడు నిర్మూలమగును. వేదాంతప్రకారము జాగ్రదవస్థకూడ మిథ్యయే. * (చూ. 118, 131.)

811. నారదుడు మొదలగు నాచార్యపురుషులు బ్రహ్మజ్ఞానమును బొందినపిమ్మటకూడ లోకహితార్థము భక్తి

* ఇచట వేదాంత మనగా అద్వైతవేదాంతమని భావము.

నవలంబించిరి. (చూ. 135, 774, 835, 927.)

812. శ్రీగురుదేవుడు: భక్తి చంద్రునివంటిది, జ్ఞానమో, సూర్యునివంటిది. ఉత్తరదక్షిణధ్రువములకడ సముద్రములు కలవనియు అందలి నీరు చాలభాగము మంచుగడ్డలుగా నేర్పడుననియు వానియందు ఓడలు చిక్కుకొనుచుండుననియు వినియున్నాను.

ఒకభక్తుడు: భక్తిమార్గమునగూడ జను లిట్లే మార్గ మధ్యమున చిక్కుకొనుచుందురా యేమి?

శ్రీగురుదేవుడు: ఔను, చిక్కుకొనుచుందురు. కాని దానివలన భయము లేదు; వారిని బంధించు మంచుగడ్డలు అఖండసచ్చిదానంద సాగరమందలి జలమేకాని మఱియొకటి కావు. 'బ్రహ్మమే సత్యము, జగత్తు మిథ్య'యని నీవు వివేచన చేయుదువేని ఆమంచుగడ్డలు జ్ఞానతేజమున గరగిపోవును. అప్పుడిక మిగులున దేమి?—అఖండసచ్చిదానంద సాగర మందలి నిరాకారబ్రహ్మమను జలము.

813. జ్ఞానము పురుషునివంటిది; భక్తి స్త్రీవంటిది. భగవంతుని కొలువుకూటమువఱకే జ్ఞానమునకు ప్రవేశము లభించును. కాని భక్తి భగవంతుని యంతఃపురమునగూడ బ్రవేశింపగలదు. (చూ. 708.)

814. ఒకప్పుడొకజ్ఞానియు ఒక భక్తుడును అరణ్యము నుండి పోవుచుండిరి. దారిలో వారి కొక పెద్దపులి కాన్పించెను. "మనము పాఱిపోవు టెందులకు? సర్వశక్తిమంతుడగు భగవంతుడే మనలను రక్షించునుగదా?" అన్నాడు జ్ఞాని.

"కాదు, అన్నా! మనము పరుగెత్తుదము. స్వప్రయత్నము చేతనే మనము నెఱవేర్పగలిగిన పనికై భగవంతుని శ్రమ పెట్టుటెందులకు?" అన్నాడు భక్తుడు.

## ౪

# కర్మయోగము

## కర్మయోగ మనగా నెట్టిది ?

815. కర్మమూలమున భగవదనుసంధానమే కర్మయోగము. సంగరహితముగా అవలంబించినయెడల అష్టాంగ యోగము * లేక రాజయోగము కర్మయోగమే యగును. ధ్యానధారణలమూలమున అయ్యది ఆత్మతో సంయోగమును గల్గించును. భగవత్ప్రీతికై గృహస్థధర్మములను నిష్కామముగా అవలంబించుట కర్మయోగమే. మఱియు శాస్త్రోక్తమైన ఆరాధన, నామజపము మొదలగు పుణ్యకర్మములను నిష్కాములమై భగవత్ప్రీతికొఱకు ఆచరించుటయు కర్మయోగమే. ఇతర యోగముల పరమావధియే, అనగా బ్రహ్మసాక్షాత్కారమే కర్మయోగ పరమావధి. అయ్యది (ఆ బ్రహ్మసాక్షాత్కారము) సగుణము కావచ్చును, నిర్గుణము కావచ్చును, రెండును గావచ్చును.

816. సత్త్వగుణాధిక్యముగల వ్యక్తినుండి కర్మములు తమంతతామే తొలగిపోవును. ఆతడు ప్రయత్నించియు కర్మ

---

* యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనునవి రాజయోగమందలి అష్టాంగములు.

-ములను జేయజాలడు. భగవంతుడు వానిని కర్మములను జేయనీయడు. ఇందుల కొక యుదాహరణము. గర్భవతియగు కోడలికి క్రమముగా గృహకృత్యభారము తొలగింపబడును. ఇక బిడ్డ పుట్టినంతనే బిడ్డను సంరక్షించుకొనుట తప్ప ఆమెకు మఱేపనియు నుండదు, ఉండనీయరు. సత్త్వగుణపూర్ణులు కానివారు సాంసారికకృత్యముల నన్నిటిని నిర్వర్తింపవల యును. భగవంతునికి పూర్తిగా ఆత్మార్పణ మొనర్చుకొని వారు భాగ్యవంతుని యింటిలోని దాసివలె వర్తింపవలయును. ఇదియే కర్మయోగము. భగవన్నామమును స్మరించుచు, శక్తికొలదియు భగవంతుని ధ్యానించుచు, తోడ్తోడనే పైని చెప్పినరీతిని స్వధర్మమును నిర్వర్తించుకొనుటయే కర్మయోగ తత్త్వము. * (చూ. 286, 288, 971.)

817. నీవు భగవంతునికి దేనిని సమర్పించినను వేయిరెట్లు అదనముగా నీకు తిరిగి లభించును. కావున కర్మాంతమున "కృష్ణార్పణమస్తు!" అని నీళ్లు విడువవలయును.†

* "తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ,
మయ్యర్పిత మనోబుద్ధిర్మామేవైష్య స్యసంశయః. 8-7.
తస్మాదసక్తస్సతతం కార్యంకర్మ సమాచర,
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః." 3-19.

† "యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్."
—భగవద్గీత, 9-27.

అర్జునా! నీవేమి యొనర్చినను, భుజించినను, వ్రేల్చినను, దాన మొనర్చినను, తపసానరించినను నాకు సమర్పణగా జేయుము.

818. యుధిష్ఠిరుడు శ్రీకృష్ణునకు తన పాపములనుగూడ సమర్పింపబోవ భీము డిట్లు వారించెను: "వలదు, వలదు; మీరటుల చేయవలదు. ఏలన కృష్ణునకు దేనిని సమర్పించినను సహస్రగుణాధికముగా మీకు తిరిగివచ్చును."

## భక్తి కర్మము నెట్లు పరిరక్షించును ?

819. ఏమైనను నిష్కామకర్మము ముఖ్యముగా ఈ కలియుగమున దుస్సాధ్యము. కావున శ్రద్ధాభక్తులతో భగవంతుని ప్రార్థించుటయే కర్మయోగముకంటెను జ్ఞానయోగముకంటెను భగవదనుసంధానమున కెక్కువగా తగియున్నది. ఐనను కర్మము నెవ్వడును తప్పించుకొజాలడు, * మనోవ్యాపారమంతయు కర్మమే. 'నేను అనుభవించుచున్నాను,' లేక 'నేను తలచుచున్నాను' అను భావనకూడ కర్మమే. కర్మయుక్తమగు భక్తియోగ మనగా, భగవద్భక్తిచే కర్మము క్షీణించుచున్న దన్నమాట. గమ్యమున, అనగా భగవంతునియందు మనసు నిలుపుటచే కర్మము క్షీణించునని మొదట మనము గుర్తింపవలసియున్నది. రెండవది, నిష్కామకర్మాచరణమున కిది తోడ్పడును. భగవంతుని భజించుచున్నచో సిరిసంపదలయందును, భోగభాగ్యములందును, పేరుప్రతిష్ఠలందును, అధికారమునందును ఎవ్వడును అనురక్తుడు కాజాలడు. మేలైన 'ఓలా కలకండపానకము'ను ఒకసారి రుచిచూచిన

* "న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః."—భగవద్గీత, 3-5.

వాడు బెల్లపు నీళ్లకై దేవులాడజాలడు. (చూ. 244, 245.)

820. ఈ కలియుగమున భగవద్భక్తిరహితమైన కర్మము నిలువజాలదు. ఇయ్యది యిసుకపై మేడకట్టజూచుటవంటిది. మొదట భక్తి నలవరుచుకొనుము. అటుపిమ్మట నీకిష్టమైన యెడల ఇతరమైనవన్నియు, అనగా పాఠశాలలు, ఆసుపత్రులు మొదలగునవన్నియు నీవు ప్రారంభింపవచ్చును. మొదట భక్తి, తరువాత కర్మము. భగవద్భక్తిలేని కర్మము పునాదిలేని గోడ, అది నిలువజాలదు. (చూ. 6, 8, 826.)

821. ఈ కలియుగమునకు నారదీయభక్తి, అనగా శ్రద్ధ, భక్తి, ఆత్మార్పణము—వీనిమూలమున నారదమహర్షి అనుష్ఠానపూర్వకముగా బోధించిన భగవదనుసంధానమార్గమే తగియున్నది. కర్మయోగానుష్ఠానమునకు, అనగా శాస్త్రవిహితమైన కర్మముల నన్నిటిని ఆచరించుటకు తగినంత వ్యవధిలేదు. నేటిజ్వరములకు సుప్రసిద్ధమైన దశమూల పచనము ఔషధము కాజాలకున్నదనుసంగతి మీకు తెలియదా? ఆ యౌషధము గుణమీయగలుగుటకుముందే రోగి పరమపదించును. (డాక్టరు డి. గుప్తగారి) 'ఫీవర్ మిక్శ్చర్' (Fever mixture) నేటిజ్వరములకు నియమితమైనఔషధము.

822. ఒకభక్తుడు: భగవంతునిపై మనసు నిలుపుటకు (సాంసారిక) కార్యభారము అడ్డువచ్చునుకాదా?

శ్రీగురుదేవుడు: ఔను, నిస్సందేహముగా అడ్డువచ్చుచుండును; కాని జ్ఞానియగువాడు నిష్కామముగా కర్మమాచరింపవచ్చును. అపుడు కర్మము వానిని బంధింపజాలదు.

హృదయపూర్వకముగా నీవు వాంఛించినపక్షమున భగవంతుడే నీకు తోడ్పడును; అపుడు కర్మబంధము క్రమముగా తొలగిపోవును. (చూ. 684.)

823. ప్రజోపకారియై ప్రఖ్యాతినొందిన ఈశ్వరచంద్ర విద్యాసాగరునితో శ్రీగురుదేవు డిట్లు పల్కెను: "మీ స్వభావము జ్ఞానప్రదమగు సత్త్వముతో గూడుకొనియున్నది. విశేషము, మిమ్మది సత్కర్మనిరతుని జేసి తీవ్రకార్యదక్షునిగా జేయునట్టి స్థితిలో నున్నది. ఔదార్యము, దయాళుత్వము, పరులయెడ సానుభూతి మొదలగువానినన్నిటిని నిష్కామముగా అవలంబించినపక్షమున మంచివే. వానితోబాటు భగవద్భక్తి యున్నచో అవి భగవంతుని బొందించును."

824. ధ్యానకాలమున మాత్రమే భగవంతునిగూర్చి చింతించుచు, ఇతరసమయములందెల్ల భగవంతుని మఱచి యుండవచ్చుననియా మీ యభిప్రాయము? దుర్గాపూజలో విగ్రహముదాపున సదా దీపము ఎట్లు వెలిగింపబడియుండునో మీరు చూడలేదా? దాని నెప్పుడును ఆఱిపోనీయరు. కర్మము జాలక ఆఱిపోయినపక్షమున గృహయజమానున కేదియో అనర్థము వాటిల్లును. అటులనే నీహృదయకమలమున దేవుని ప్రతిష్ఠించినపిమ్మట దైవచింతన మను దీపమును సదా వెలుగుచుండనీయవలయును. లోకవ్యవహారములను జరుపుచున్నపుడు మధ్యమధ్య దృష్టిని అంతర్ముఖముచేసి యా దీపము వెలుగుచున్నదో, లేదో కనుగొనుచుండవలయును.

20

## సేవారూపమైన కర్మము భగవదారాధనతో తుల్యము

825. చైతన్యమతతత్త్వమును శ్రీగురుదేవు డొకనా డిట్లు వివరింపసాగెను: "భగవన్నామమునందు రుచి, జీవకారుణ్యము, భాగవతసేవ—యను నీమూటిని ప్రతివ్యక్తియు అలవరుచుకొనుటకై సర్వదా ప్రయత్నింపవలయునని చైతన్య సంప్రదాయము బోధించుచున్నది. భగవానుడును వాని నామము నొక్కటియే. ఇయ్యది గ్రహించి ప్రతివ్యక్తియు విశేషశ్రద్ధాభక్తులతో భగవన్నామమును స్మరింపవలయును, కీర్తింపవలయును. కృష్ణునకును వైష్ణవునకును అభేదమను దృఢనిశ్చయముతో భక్తుల నెల్లపుడును సేవింపవలయును, సమస్తప్రపంచమును భగవన్మందిరమను ఎఱుకతో జీవకారుణ్యము కలిగియుండవలయును...." ఉన్నట్టుండి, 'జీవకారుణ్యము' అను తుదిమాట నుచ్చరించి శ్రీగురుదేవుడు సమాధిస్థితుడయ్యెను. ఇంచుక బాహ్యస్మృతి వచ్చినపిమ్మట నాతడి ట్లనుకొనసాగెను: "జీవకారుణ్యమట! జీవకారుణ్యము! ఓయీ, నేలపై ప్రాకు నీచకీటకముకంటెను హీనుడ వగు నీవా, జీవకారుణ్యము జూపువాడవు! చాలు, చాలును. ఒరులయెడ కారుణ్యము జూపుటకు ని వేపాటివాడవు! ప్రతి జీవియు సాక్షాద్భగవత్స్వరూపమని గ్రహించి చేయవలసినది జీవసేవ, జీవకారుణ్యమనునది మూర్ఖప్రలాపము!"

## కర్మము సాధనము కాని సాధ్యము కాదు

826. ఆవేశపూరితులగు కొందఱు సంఘసంస్కర్తలతో శ్రీ గురుదేవు డిట్లనియె: "లోకోపకారము, లోకోపకార"

మని మీ రేదియో ఘోషించుచుందురే. మీ రుపకారము చేయబోవు ప్రపంచ మంత క్షుద్రమైనదియా? అయ్యా, అదిగాక లోకోపకారముచేయుటకు మీ రెవ్వరు? మొదట భక్తిసాధనలుచేసి భగవంతుని గనుడు. అపుడు మీకు భగవదాదేశము గలుగును; లోకహితమొనర్చుటకై శక్తిసామర్థ్యములు లభించును; లోకోపకారమునుగూర్చి మీ రపుడు మాటలాడవచ్చును. అంతియేకాని అంతకుముందు కాదు." (చూ. 823, 828.)

ఒక భక్తుడు: స్వామీ, భగవంతుని జూడకుండునంత వఱకు కర్మముల నన్నిటిని మేము పరిత్యజింపవలయుననియా తమ యభిప్రాయము?

గురుదేవుడు: కాదయ్యా, నే నట్లు చెప్పుటలేదు. కర్మముల నన్నిటిని మీరు పరిత్యజించు టెందులకు? ధ్యానము, పారాయణము, భగవన్నామస్మరణము మొదలగు సాధనల నన్నిటిని మీరు చేయుచుండవలయును.

భక్తుడు: కర్మ మనగా సాంసారిక కర్మమని నా యభిప్రాయము. సాంసారిక కర్మములను—ప్రాపంచికకర్మములను—అన్నిటిని మేము విడిచిపెట్టవలయునా?

గురుదేవుడు: వానినిగూడ చేయవచ్చును. లోకములో జీవించుటకై తప్పనిసరియగు కర్మములను మీరు చేయవచ్చును. * కాని యిహపరములందు ఏవిధమైన ఫలములను

* "నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్."
—భగవద్గీత, 4-21.

ఆశింపకుండ, ఏవిధమైన భయమును లేకుండ మీ కర్తవ్య కర్మములను నెఱవేర్చుటకై వలయు బలము నొసగు మని కండ్ల నీరుపెట్టుకొని మీరు భగవంతుని ప్రార్థింపవలయును.

827. ప్రకృతి లేక స్వభావమే (కర్మమొనర్ప) మిమ్ము నియమించుచుండుటచే కర్మమును మీరు విడువజాలరు.† కాబట్టి విధ్యుక్తమార్గమున కర్మములను చేయవలయును. నిష్కామకర్మాచరణ భగవంతుని పొందించును. నిష్కామ కర్మాచరణ మనగా ఇహపరములందెట్టి ఫలములను ఆశింప కుండ కర్మముల నాచరించుట. అట్టి కర్మాచరణము ప్రాప్య మును బొందుటకు మనకు సాధనము. భగవంతుడే మనకు ప్రాప్యుడు.

828. నిష్కామముగా ఆచరించినయెడల కర్మము మోక్షసాధనము, మన పరమావధి భగవంతుడు, వాని సాక్షా త్కారమే మానవజీవితమునకు పరమప్రయోజనము. సాధ ననే సాధ్యముగా భ్రమింపకుడని—మార్గమున ప్రారంభదశనే

కోరికలను విడిచిపెట్టి చిత్తస్వాధీనత కలిగి యెల్లవిషయముల యందు నభిమానము వదలి శారీరపోషణమాత్రమునకు ఉపయుక్తమైన కర్మములను జేయువానిని పాపము అంటదు.

† "న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః."

—భగవద్గీత, 3-5.

ఎవ్వడును క్షణమైన నెప్పుడును కర్మమును జేయక యుండజాలడు. ఏలన ప్రకృతిజన్యములగు సత్త్వరజస్తమోగుణములు వానిచే కర్మములను జేయింపక విడువవు.

పరమావధిగా భావింపకుడని—పదే పదే చెప్పుచున్నాను. కర్మమే జీవితపరమావధి యని, పరమపురుషార్థ మని యెన్న డును భావింపకుడు. భగవద్భక్తికొఱకు ప్రార్థింపుడు. భగవంతుని దర్శించు మహాభాగ్యము మీకు అబ్బుననుకొనుడు; అపుడు వానిని మీరు దేనికోసము అర్థింతురు? ఆసుపత్రులకోసము, చెఱువులకోసము, నూతులకోసము బాటలకోసము, ధర్మ శాలలకోసము—వీనికై మీరు వానిని అర్థింతురా?* నా మాట వినుడు! ఇవన్నియు మనము భగవంతుని జూడకుండు నంతవఱకే మనకు వాస్తవములు. కాని మన కొక్కసారి భగవద్దర్శనభాగ్యము లభించినపక్షమున వీనినన్నిటిని యథా స్థితిలో— క్షణికముగా— స్వప్నతుల్యముగా—గాంతుము. అపుడు మనము వికాసమునిమిత్తము—నిజమైన జ్ఞానము నిమిత్తము—ఉత్తమభక్తి నిమిత్తము—ఎయ్యది నరుని నారాయణుని బొందించునో, ఏనారాయణుడు సత్తామాత్రు డని—సచ్చిదానందమయుడని—చెప్పనగునో అట్టి నారా యణునకు నిజముగా మనము పుత్త్రులమని గ్రహింపజేయునో —అట్టి భక్తినిమిత్తమె ప్రార్థింతుము. (చూ. 826.)

829. ఒకభక్తు నుద్దేశించి శ్రీ గురుదేవు డిట్లు పల్కెను: శంభుమల్లికు డొకసారి లోకోపకారముకోసము ఆసుపత్రు

---

* మ. "ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ధాటిన్ ఫలీకార మి
మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుం డైనట్టి పంకేజలో
చనుఁడే చాలఁ బ్రసన్నుడైన నతనిన్ సాంసారికం బర్థిఁ గో
రిన నావంటి విమూఢమానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్!"
—శ్రీమదాంధ్రభాగవతము, ధ్రువోపాఖ్యానము, 4-300.

లను, పాఠశాలలను కళాశాలలను స్థాపించుటనుగూర్చియు, బాటలు వేయుటను, నూతులు, చెఱువులును త్రవ్వించుటను గూర్చియు ప్రస్తావించినాడు. అంత నే నిట్లంటిని : 'నిజమేకాని లోకహిత మొనర్చుటలో నీవు నిష్కాముడవై యుండవలయును. మఱియు ఎయ్యవి ప్రాప్తకర్మములో, అనగా ఆవశ్యకమై తోచు కర్మములో, వానినిమాత్రమే చేయుటకై జాగరూకుడవై యుండవలయును. కర్మములను నీవు తెచ్చి పెట్టుకొనకు—వానికై ప్రాకులాడకు—చక్కగా నిర్వహింపగల్గుటకు మించిన కర్మములను నీతలపై బెట్టుకొనకు; పెట్టుకొంటివా, భగవంతుని మఱచిపోవుదువు.''

## కర్మము : నైష్కర్మ్యము

830. శుద్ధసత్త్వము ఉదయించినంతనే నరుడు కేవలము నారాయణుని ధ్యానించుచుండును, ఇతరమున రమింపజాలడు. పూర్వకర్మానుగుణముగా కొంద ఱిట్టి శుద్ధసత్త్వముతోడనే జన్మింతురు. కాని భక్తితోడను ఈశ్వరార్పణబుద్ధితోడను స్వార్థరహితకర్మము జేయుచుందురేని నరు డీసత్త్వగుణమును వృద్ధిపొందించుకొనవచ్చును. కాని సత్త్వమున రజోగుణము మిశ్రితమైనపక్షమున మనస్సునకు అనేక విక్షేపములు గలుగ నారంభించును. ఇక ''నేను లోకోపకారము చేయవలయును'' అను దురభిమానము బయలుదేఱును. సాధారణజీవులు లోకోపకారము చేయనెంచుట చాల సాహసకృత్యము. కాని పరహితార్థమై నిష్కామముగా ఎవ్వడైనను సత్కర్మ మాచరించునేని అది మంచిదే. దానివలన హాని కలుగదు. అదియే

నిష్కామకర్మము. అట్టికర్మము కోరదగినదే. కాని యెల్లరును నిష్కామకర్మము చేయగలరా? దుర్లభము! దుర్లభము!!

831. అందఱును కర్మము చేయవలసియేయున్నారు— కొలదిమంది మాత్రమే కర్మత్యాగము చేయగలరు. అందులకు దగిన శుద్ధసత్త్వము కొలదిమందియందు మాత్రమే యుండును. శ్రద్ధాభక్తులతో స్వలాభాపేక్ష లేకుండ కర్మము చేయగా చేయగా, రజస్సుతో గలిసియున్న సత్త్వము ఆ రజోగుణాంశమునుండి విడివడును. అట్టి శుద్ధసత్త్వముచేతనే నరుడు బ్రహ్మసాక్షాత్కారమును బొందగల్గును. ఈ శుద్ధ సాత్త్వికస్థితి యెట్టిదో సామాన్యులకు అవగాహన కాదు.

832. హృదయమున భగవద్భక్తి వెల్లివిరియగనే కర్మత్యాగము దానంతటదియే సిద్ధించును. ఎవరిని విధాత కర్మములను జేయ నియమించియున్నాడో వారు కర్మములను జేయుచుందురుగాక. కాలపరిపాకమున నరుడు సమస్తము పరిత్యజించి యిట్లు పలుకగలడు: "ఓ మనసా! రమ్ము! హృదయసింహాసనము నధిష్ఠించియున్న పరమేశ్వరుని వీక్షింతము!"

833. సంధ్య గాయత్రియందు లయమందుచున్నది. గాయత్రి ప్రణవమున లయమగుచున్నది. ప్రణవమో, సమాధియందు లయము గాంచుచున్నది. ఇట్లు సంధ్యావందనాది కర్మమంతయు సమాధియందు పరిసమాప్తి నొందుచున్నది. *

---

*"సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే."—భగవద్గీత, 4-33.

ఎల్లకర్మములును బ్రహ్మజ్ఞానమున లయించుచున్నవి. ఇచట 'సమాధి'యనినను బ్రహ్మజ్ఞానమనినను బ్రహ్మసాక్షాత్కారమని భావము.

834. సచ్చిదానందమయునందు చిత్తము లయమంద కుండునంతవఱకు నరుడు భగవత్ప్రార్థనమును సంసారమున కర్మమును—రెంటినిగూడ చేయవలసియుండును. కాని భగవానునియందు చిత్తము లయమందినవాడిక నేకర్మమును చేయనక్కఱలేదు. ఉదాహరణమునకు సంకీర్తనమును గైకొందము. "నితాయ్ అమార్ మత్తా హాతి" (మత్త గజము నా నిత్యానందుడు) అనుకీర్తనము నొకడు పాడ నారంభించును. మొదట పల్లవిని పాడునపుడు గాయకుడు రాగతాళాదివివరముల నన్నిటినిగూర్చియు శ్రద్ధవహించును. కాని కీర్తనయందాతడించుక తన్మయుడైనంతనే కేవలము "మత్తా హాతి, మత్తా హాతి" అనుచుండును. ఇంకను తన్మయుడైనప్పుడు కేవలము "హాతి, హాతి" అనుచుండును. బాగుగా తన్మయుడైనప్పుడు "హా, హా" అని మాత్రమే ఉచ్చరింపగల్గును.

835. కాబట్టి నేను చెప్పునదేమన, ప్రారంభదశలో కర్మసంబంధమైన గందరగోళము ఎక్కువగా నుండును. కాని నీవు భగవానుని సమీపించినకొలదియు కర్మము క్షీణించుచుండును. తుదకు సంపూర్ణమైన కర్మపరిత్యాగమును సమాధిస్థితియు లభించును. సాధారణముగా సమాధిస్థితిని బొందినవెనుక శరీరము విశేషకాలము నిలువదు. కాని కొందఱివిషయము వేఱు. లోకమునకు బోధించునిమిత్తము వారి శరీరము నిలుచును. నారదునివంటి మహర్షులును శ్రీచైతన్యునివంటి అవతారపురుషులును ఇట్టివారు. నూయి త్రవ్విన వెనుక తట్టలు, పాఱలు మొదలగు పరికరముల నన్ని

టిని కొందఱు పాఱవేయుదురు. కాని మఱికొందఱు ఇరుగు పొరుగువారి కవి పనికివచ్చునని వానిని భద్రముగా దాచి యుంతురు. అట్టి మహనీయులు లోకులను జూచి జాలిపడు దురు, పరితపింతురు. తమ జ్ఞానప్రాప్తిమాత్రమే చూచు కొను నంతటి స్వార్థపరులు కారు వారు. * (చూ. 135, 774, 811, 907, 927.)

---

* "ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మచేదహం,
సఙ్కరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః."
—భగవద్గీత. 3-24.

నేను కర్మముచేయనియెడల, ఈలోకులు చెడిపోవుదురు. సంకరము కూడ చేసిన వాడనగుదును, ఈ ప్రజలను చెఱచినవాడనగుదును.

మ. "భగవద్దివ్యగుణానువర్తనసుధా ప్రాప్త్యైక చిత్తుండనై
బెగడక సంసరణోగ్రవైతరణికిన్ భిన్నాత్ములై తావకీ
యగుణస్తోత్రపరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్యభావంబులన్
సుగతిం గానని మూఢులం గని మదిన్ శోకింతు సర్వేశ్వరా."
—శ్రీమదాంధ్రభాగవతము, ప్రహ్లాదచరిత్ర, 7-365.

పదునేడవ ప్రకరణము

# బ్రహ్మతత్త్వము

బ్రహ్మము—బ్రహ్మము: వ్యావహారికసత్త—ఈశ్వరుడనియు మాయయనియు శక్తియనియు జెప్పబడు సగుణబ్రహ్మము—'సర్వం ఖల్విదం బ్రహ్మ' లేక 'సర్వం విష్ణుమయం జగత్'—సాకారబ్రహ్మము : నిరాకార బ్రహ్మము—కొన్ని బ్రహ్మస్వరూపములు—బ్రహ్మము సర్వాంతర్యామి —బ్రహ్మము : మానవుని ధార్మిక బాధ్యత

## బ్రహ్మము

836. బ్రహ్మస్వరూపభావన యెటులుండును ? అది మాటలచే నిరూపింప శక్యముకానిది. ఎన్నడును సముద్రము జూచి యుండనివానికి అది యెట్టిదో యొకడు తెలుపవలసివచ్చిన యెడల ఆతడు, ''అదియా, విశాలమగు నీటిపట్టు. నీటిమయమగు పెద్దతావు; అది యెటు చూచినను నీరే'' అనిమాత్రమే చెప్పగలుగును గదా !

837. మానవులు పదేపదే పఠించుటచేతను వారి నోటినుండి వెలువడుటచేతను వేదములు, తంత్రములు, పురాణములు. మఱి యీ లోకములోని మతగ్రంథములన్నియు ఉచ్ఛిష్టము లైపోయినవని చెప్పవలసియున్నది. కాని బ్రహ్మముమాత్రము అట్లు ఉచ్ఛిష్టము కాలేదు. ఏలన అది యిట్టిదని యింతవఱ కెవ్వరును మాటలచే నిరూపింపజాలినది లేదు.

838. బ్రహ్మమనగా నెట్టిది ? అది గుణరహితము, చలింప

జేయరానిది, మేరుపర్వతమువలె సుస్థిరమైనది.

839. బ్రహ్మము అసంగము. పుణ్యపాపములు, సుఖదుఃఖములు మొదలగు సమస్తద్వంద్వములకును బ్రహ్మము అతీతము. బ్రహ్మము దీపమువంటిది, దాని వెలుతురులో నీవు భాగవతమును జదువుకొనవచ్చును, దొంగదస్తావేజులనుగూడ సృష్టింపవచ్చును. మఱియు బ్రహ్మము పామువంటిది. పాము కోఱలందు విషమున్నచో పామున కేమి బాధ? విషము వలన దానికి హాని లేదు, అది దానిని చంపదు. అది కఱచునట్టి జంతువులకుమాత్రమే విషము ప్రాణాంతక మగును. ఇట్లే పాపము, దుఃఖము మఱియు లోకమున మనకు గోచరించు సమస్తమైన దోషములును మనలనుమాత్రమే బాధించును. బ్రహ్మము వీని కన్నిటికిని అతీతము. ప్రపంచమందలి కీడుమేళ్లు బ్రహ్మమునకు కీడుమేళ్లు కావు. మంచిచెడుగులకు సంబంధించు మనయొక్క నీతినియమములను బ్రహ్మమునకు అనువర్తింపజేయజాలము, వానినిబట్టి బ్రహ్మముయొక్క స్వభావమును ఎంచదగదు. (చూ. 651.)

840. జ్ఞానాజ్ఞానములు, పుణ్యపాపములు, ధర్మాధర్మములు—వీని కన్నిటికిని బ్రహ్మము అతీతము. అయ్యది సమస్త ద్వంద్వాతీతము.

841. బ్రహ్మము మనస్సునకును వాక్కునకును అందరానిది (అవాఙ్మానసగోచరము); * ధ్యానధారణాతీతము; తెలివి, తెలియువాడు, తెలియదగినది—అను నీ మూటికిని అతీతము: సదసత్తులకు రెంటికినిగూడ అతీతము; వేయేల,

* "యతో వాచో నివర్తన్తే అప్రాప్యమనసా సహ."—తైత్తిరీయ.

సమస్తద్వంద్వములకును అతీతము.

842. సుగంధమును దుర్గంధమునుగూడ వహించుచు వానిచే కళంకితముకాని వాయువువంటిది బ్రహ్మము (చూ. 957.)

843. బ్రహ్మము సమస్తగుణాతీతము—మాయతో సంబంధించిన సర్వమునకును అతీతము.

## బ్రహ్మము : వ్యావహారికసత్త

844. బ్రహ్మము ఒక్కటియే సత్యము, నిత్యము. జీవజగత్తులు అసత్యము, అనిత్యము.

845. జగత్తు మాయయని చెప్పుట చాల సులభము. కాని నిజముగా దీనియర్థమేమో తెలియునా? కర్పూర నీరాజనము వెలుగగా, వెనుక నేమియు మిగులకుండుట వంటిది. ఇయ్యది కట్టె మండినపిమ్మట బూడిదె మిగిలియుండుట వంటిది కూడ కాదు. సదసద్విచారము ముగియ, నిర్వికల్పసమాధి ప్రాప్తించునపుడుమాత్రమే 'నీవు, నేను, జగత్తు' అను స్ఫురణము సమసిపోవును. (చూ. 923.)

846, శిష్యునకు బోధించుచు గురువు రెండువ్రేళ్లను ఎత్తి చూపెను,—బ్రహ్మము, మాయయునను ద్వంద్వము నాతడట్లు సూచించెను. అపుడు ఒకవేలు దింపి మాయ నివర్తించినంతనే జగత్తును నివర్తించుచున్నదని బోధించెను. ఉండునది బ్రహ్మమొక్కటియే.

847. అవ్యయము, అఖండమునగు బ్రహ్మము సమాధిస్థితియందుమాత్రమే గోచరించును. అపుడంతయు మౌనము

—సదసత్తులు, జీవజగత్తులు, జ్ఞానాజ్ఞానములు—ఈద్వంద్వ సంబంధమైన ప్రస్తావమంతయు సమసిపోవును. అపుడు అస్తిత్వముదక్క మతేమియు మిగులదు. ఉప్పుబొమ్మ అనంతసాగరమం దైక్యమొందినపిమ్మట దాని ప్రస్తావమేది? బ్రహ్మజ్ఞానమనగా ఇటువంటిది.

848. ప్రశ్న : అఖండాత్మ తాను భిన్నభావమును బొంది ప్రత్యగాత్మగా భావించుకొను భ్రాంతి యెటుల జనించినది ?

ఉ. కేవలతర్కముపై నాధారపడు నద్వైతి యుక్తులను నమ్ముకొనియున్నంతవఱకు "నే నెఱుగను" అని యిందులకు సమాధానముచెప్పును. * సాక్షాత్కార సమాధానమే యిందు తుదిమాట—సరియైన సమాధానము. "నే నెఱుగుదును" అనికాని, "ఎఱుగను" అనికాని చెప్పుచున్నంతవఱకు నిన్ను నీవు ఒకవ్యక్తిగా భావించుకొనుచుందువు. ఆస్థితిలో భేదములు వాస్తవములనియే యంగీకరింపవలయును కాని భ్రాంతియని కొట్టివేయరాదు. వ్యక్తిత్వభావన పూర్తిగా రూపుమాసినప్పుడు సమాధిస్థితిలో బ్రహ్మసాక్షాత్కారమగుచున్నది. అపుడే "జగత్తు సత్యమా? మాయయా?" అనునిట్టి సమస్యలన్నియు శాశ్వతముగా సమసిపోవును. (చూ. 126, 853.)

849. నీ వొకవ్యక్తివై యున్నంతవఱకు నీవు బ్రహ్మమును దానిలో జగత్తును, నిత్యమునుదానిలో లీలయు, ద్రవ్యమును దానిలో గుణములును, నిర్గుణమునుదానిలో సగుణమును,

---

* దీనినే అనిర్వచనీయఖ్యాతి యందురు.

ఏకమనుదానిలో మఱియొకటియు ఇమిడియే యుండవలయును. (చూ. 867, 869.)

850. నీవు ద్వైతభావములో నున్నంతవఱకు 'వెన్న'ను 'మజ్జిగ'నుగూడ (అనగా బ్రహ్మమును జగత్తునుగూడ) అంగీకరింపవలసినదే. ఈ దృష్టాంతమును వివరించునెడల, సమాధిస్థితిలో గోచరించు బ్రహ్మమే ఇందులకు మూలమైన పాలు, సగుణనిర్గుణస్వరూపమగు బ్రహ్మమే ఇందలి వెన్న, ఇరువదినాలుగు తత్త్వములతో* గూడిన ప్రపంచమే మజ్జిగ.

851. "నావాదమే సరియైనది, హేతుబద్ధమైనది; సగుణ బ్రహ్మమును నమ్మువారు పొరపడుచున్నారు" అని యద్వైతి పలుకకుండుగాక. మనశ్శరీరములకంటెను బాహ్యప్రపంచము కంటెను బ్రహ్మముయొక్క సగుణరూపములు ఎంతమాత్రము సత్యత్వమున తీసిపోవు, సరికదా, వానికంటె కోటిరెట్లు వాస్తవమైనవి. (చూ. 865, 884.)

852. నీవు అద్వైతమునుగూర్చి మాటలాడినంతనే ద్వైతమును ప్రతిపాదించినవాడవగుచున్నావు. బ్రహ్మమునుగూర్చి ప్రస్తావించునపుడు ద్వైతప్రపంచము నంగీకరించినవాడవే యగుచున్నావు. ఏలన నీబ్రహ్మము సమాధిస్థితిలో నీకు

---

*భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము నను పంచభూతములును; శబ్ద స్పర్శ రూప రస గంధము లను పంచతన్మాత్రలును; మనస్సు, బుద్ధి, అహంకారము, అవ్యక్తము నను తత్త్వములును; వాక్కు, చేతులు, పాదములు, గుదము, ఉపస్థయు నను పంచకర్మేంద్రియములును; చర్మము కన్నులు, చెవులు, ముక్కు, నాలుకయు నను పంచజ్ఞానేంద్రియములను గూడి ఇరువదినాలుగుతత్త్వములు. (ఇరువదియైదవ తత్త్వము ఆత్మ.)

అను భూతము కాకుండునంతవఱకు—కేవల శబ్దాడంబరము కానిచో—ద్వైతజగత్తుతో సంబంధించినదే. యథాస్థితిలో బ్రహ్మ మెట్టిదో ఎన్నటికిని నీవు నిర్వచింపజాలవు, నిర్వచించిన తోడనే నీవ్యక్తిత్వమను (అన్యమైన) రంగునొకదానిని బ్రహ్మమునకు వేయుచునే యున్నావు. (చూ. 918.)

853. నాలో 'నేను' అనునది యున్నంతవఱకు సగుణబ్రహ్మము దివ్యరూపములమూలమున నేమి, జీవజగద్రూపములమూలమున నేమి, భాసించుచు నాయెదుటనే యుండును. (చూ. 126, 848.)

## ఈశ్వరుడనియు మాయయనియు శక్తియనియు జెప్పబడు సగుణబ్రహ్మము

854. పరమాత్మని నిష్క్రియునిగా, అనగా సృష్టిస్థితిలయకర్మములు లేనివానినిగా భావించునప్పుడు నేను వానిని బ్రహ్మమనియు పురుషుడనియు జెప్పుదును. సృష్టిస్థితిలయకర్మములను జేయుచు, కర్మతంత్రుడై యున్నటుల భావన చేయునప్పుడు వానినే శక్తియనియు మాయయనియు ప్రకృతియనియు జెప్పుదును.

855. జగత్తు ప్రకృతిపురుషులవలన జనించినదని తెలుపు సాంఖ్యతత్త్వమును వివరించుచు శ్రీగురుదేవు డిట్లు పల్కెను: "పురుషుడు అకర్తయనియు ప్రకృతియే సమస్తము చేయుచున్నదనియు సాంఖ్యతత్త్వము తెలుపును. పురుషుడు ఈ ప్రకృతివ్యాపారములన్నిటికిని కేవల సాక్షీభూతుడు. ఐనను పురుషుడు లేనిదే ప్రకృతిగూడ స్వయముగా ఏ కార్యమును

జేయజాలదు. పెండ్లి జరుగునపుడు ఇంటిలో కార్యము లన్నియు ఎట్లు జరుగునో మీరు చూడలేదా? యజమానుడు ఒకచోట గూర్చుండి, హుక్కాపట్టుచు, ఆజ్ఞల నొసగు చుండును. కాని వానియిల్లాలు పసుపుబొట్టుపెట్టిన చీర కట్టు కొని యింటిలో సంచరించుచుండును. పెండ్లియేర్పాటు లన్ని టిని పరిశీలించుచు, స్త్రీలను పిల్లలను అందఱను ఆమె ఆదరించుచుండును. తనభర్తయగు యజమానునియొద్దకు అప్పుడప్పుడు వెడలుచు, వ్యవహారములు ఎట్లు సాగుచున్నవో అభినయించి చెప్పుచుండును. ఆమె తెలియజేయనెంచు దాని నంతయు గ్రహించి యజమానుడు అంగీకారసూచకముగా కేవలము తలనూపుచుండును. ప్రకృతిపురుషుల విషయము కూడ నిట్టిదే.”

856. నిష్క్రియమగు బ్రహ్మమును క్రియాయుక్తమగు ప్రకృతియు నొక్కటియే. ఎవ్వడు సచ్చిదానందమయుడో ఆతడే సర్వజ్ఞయు, చిచ్ఛక్తియు, ఆనందమయియు నగు అల జగజ్జనని. రత్నమును దానిప్రకాశము నొక్కటియే. ఇవి రెండును పరస్పరసంబద్ధములు గావున ఒకదానిని విడిచి మఱియొకదానిని మీరు భావింపజాలరు.

857. సగుణబ్రహ్మమును నిర్గుణబ్రహ్మమును (తుదకు) ఒక్కటియే. నీవు ఒకదానిని నమ్మినచో, రెండవదానినిగూడ నమ్మినట్లే. దహనశక్తివినా అగ్నిని భావింపజాలము; ఇట్లే అగ్నివినా దహనశక్తిని భావింపజాలము. ఈరీతిగనే సూర్యుని కిరణములకు భిన్నముగా సూర్యుని, సూర్యునకు భిన్నముగా సూర్యునికిరణములను ఊహింపజాలము. తెల్లదనమును విడిచి

పాలను, పాలను విడిచి తెల్లదనమును తలపజాలము. ఇట్లే సగుణబ్రహ్మమువినా నిర్గుణబ్రహ్మమును నిర్గుణబ్రహ్మమువినా సగుణబ్రహ్మమును చింతింపజాలము.

858. బ్రహ్మమునకును శక్తికిని గల భేదము పేరునకే గాని వాస్తవముగాదు. అగ్నియు దహనశక్తియు నొక్కటియే యగురీతిని బ్రహ్మమును శక్తియు నొక్కటియే. రెంటికిని అభేదము. పాలును తెల్లదనమును ఒక్కటియే యగునట్లు బ్రహ్మమును శక్తియు నొక్కటియే. రత్నమును తత్కాంతియు నొక్కటియే యగురీతిని బ్రహ్మమును శక్తియు నొక్కటియే. ఒకటి విడిచి రెండవదానిని మీరు ఊహింపజాలరు, రెంటికిని భేదమును గల్పింపజాలరు.

859. సృష్టిస్థితిలయము లను వ్యాపారము లెచటనున్నవో శక్తియు అచటనే యున్నది. చలించుచున్నను చలింపకున్నను నీరు నీరేకదా? ఈ 'కాప్టెన్'* ఒకప్పుడేపనియులేక ఊరక యుండును; మఱియొకప్పుడు పూజచేయుచుండును; లేదా, పనిమీద రాజప్రతినిధిని జూడబోవును. ఐనను కాప్టెన్ ఎప్పుడును కాప్టెనే ఐయుండురీతిని సచ్చిదానందస్వరూపమగు బ్రహ్మము ఎప్పుడును సృష్టిస్థితిలయకారణమగు చిచ్ఛక్తియే. ఆతడెప్పుడును కాప్టెనే; ఇవి కేవలము ఆతనియొక్క ఉపాధులు, స్థితులు. (చూ. 48,49.)

---

* కలకత్తాలో విడిసియుండిన నేపాళప్రభుత్వమువారికి ప్రతినిధి యగు విశ్వనాథోపాధ్యాయుని శ్రీరామకృష్ణపరమహంస 'కాప్టెన్' (Captain) అని పిలుచువాడు. కాప్టెన్ అనగా నాయకుడు, లేక నావికుడు.

860. ఒకప్పుడు నేను బట్టలు కట్టుకొని మఱియొకప్పుడు దిగంబరుడనుగా నుండురీతిని బ్రహ్మ మొకప్పుడు సగుణముగను మఱియొకప్పుడు నిర్గుణముగను నుండును. సగుణబ్రహ్మమనగా శక్తితో గూడియున్న బ్రహ్మము. దాని నపుడు ఈశ్వరు డందురు.

861. నా జగన్మాత ఏకమనియు అనేకమనియు మఱియు రెంటికినిగూడ అతీతమనియు గ్రహింతురుగాక.

862. నాజగజ్జననియే అనేకమై గోచరించు ఏకైకతత్త్వము, ఆమె యనంతశక్తిమయి కావున శారీరకము, మానసికము, నైతికము, పారమార్థికమునగు నానావిధశక్తులతో నొప్పు జీవజగత్తులుగా గోచరించుచున్నది. వేదాంతులు బ్రహ్మ మనునది నా జగజ్జననియేగాని వేఱుగాదు. నిర్గుణబ్రహ్మము యొక్క సగుణస్వరూప మామెయే.

'సర్వం ఖల్విదం బ్రహ్మ' లేక 'సర్వం విష్ణుమయం జగత్'

863. పృథక్కరణమనియు,సమీకరణమనియు విచారము రెండువిధములు. మొదటిది దృశ్యప్రపంచమునుండి మనలను బ్రహ్మముకడకు గొనిపోవును; రెండవదానివలన బ్రహ్మ మెట్లు ప్రపంచముగావ్యక్తమగునో తెలియనగును.(చూ.741,866.)

864. సమాధిస్థితిలో బ్రహ్మసాక్షాత్కారము పొందినవారు సైతము సామాన్యమైన బహిఃప్రజ్ఞకు దిగివచ్చి సగుణ బ్రహ్మానుభవము నొందుటకు దగినంతమాత్రము అహంకారము గలిగియుందురు. సప్తస్వరములలో "ని" అను ఉచ్చ స్వరమునందే సదా కంఠధ్వని నిలుపుట కష్టసాధ్యము.

కావునే సగుణాద్వైతమున భక్తియొక్క ఆవశ్యకత.

865. సమాధిస్థితినుండి బహిఃప్రజ్ఞకు దిగివచ్చువానికే తన దివ్యచక్షువును నిలుపుకొనజాలినంతమాత్రము అహంకారము రేఖామాత్రముగ నిలిచియుండును. ఇయ్యది వానిని తనతో గూడ జీవజగత్తుల నొకే బ్రహ్మముయొక్క వివిధరూపములుగా గాంచుటకు సమర్థుని జేయును. జడసమాధియందు, లేక నిర్వికల్పసమాధియందు నిరాకార నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారమును, చేతనసమాధియందు, లేక సవికల్ప సమాధియందు సాకారసగుణ బ్రహ్మసాక్షాత్కారమును బడసిన వానికి మాత్రమే ఈ భవ్యదర్శనము లభించును. అహంకారముతో నీవొక వ్యక్తివై యున్నంతవఱకు — నేను ఫలానివ్యక్తిననుభావముకలిగియున్నంతవఱకు — భగవంతుని నీవొకవ్యక్తిగా దప్ప మఱియొకవిధమున భావనచేయజాలవు, దర్శింపజాలవు; అంతవఱకు నిరుపాధిక (నిర్గుణ) బ్రహ్మము నీకు బాహ్యాభ్యంతరములందు సోపాధికముగ — సగుణబ్రహ్మముగ — గోచరింపక తప్పదు. ఈ సగుణబ్రహ్మస్వరూపములు నీ మనశ్శరీరములకంటెను బాహ్యప్రపంచముకంటెను సత్యత్వమున దీసిపోవునవి కావు, సరికదా, వీనియన్నిటికంటెను కోటిరెట్లు వాస్తవములు. (చూ. 851.)

866. బ్రహ్మమునకును జీవజగత్తులకును గల సంబంధము అనులోమవిచారమునకును విలోమవిచారమునకును గల సంబంధమువంటిది. జీవజగత్తులను విడిచి పరబ్రహ్మమువైపు నకు మఱలినచో, నీవ్యక్తిత్వము బ్రహ్మమున లయించును — అదియే సమాధి. బ్రహ్మజ్ఞానముతో — ఈ దివ్యవ్యక్తిత్వ

ముతో—నీవు బయలుదేఱినచోటికే మఱలితివా, జగత్తును నీవ్యక్తిత్వమునుగూడ ఆ పరబ్రహ్మమునుండియే వ్యక్తమగుచున్నవని—బ్రహ్మము, జీవుడు, ప్రకృతియు తుదకొక్కటియే యని—వీనిలో దేనిని తత్త్వతః తెలిసికొనినను మిగిలినవాని నన్నిటిని దెలిసికొనినట్లయని—నీకు అనుభూతమగును. (చూ. 741, 774, 863, 927, 928.)

867. ఈ జగల్లీల యెవనిదో నిత్యత్వమును వానిదే. మఱియు నెవ్వడు నిత్యుడో వాడే లీలారూపుడు. లీలామూలముననే నీవు నిత్యుని గనుగొనగలవు. మఱియు నిట్టి సమ్యగ్దర్శనము లభించినంతనే లీల యిక నెంతమాత్రము మిథ్యగా గాన్పింపదు. దృశ్యప్రపంచమున నిత్యస్వరూపమై గోచరించును. (చూ. 871, 879.)

868. పండునందలి గుజ్జు, చిప్ప, గింజలు—ఇవన్నియు నొకేవిత్తనమునుండి పుట్టినట్లే చేతనము, అచేతనము, భౌతికము, ఆధ్యాత్మికమునగు సృష్టిజాతమంతయు నొకే బ్రహ్మమునుండి యుద్భవించుచున్నది. (చూ. 929.)

869. శ్రీగురుదేవు డిట్లు వచించువాడు: "నేను సర్వము అంగీకరింతును. తురీయము, జాగరము, స్వప్నము, సుషుప్తి, బ్రహ్మము, జీవుడు, సృష్టి— వీని నన్నిటిని నే నంగీకరింతును: లేనిచో పరిపూర్ణతకు లోటు కలుగును; కావున నాకు బ్రహ్మము దృశ్యప్రపంచమునుగూడ సమ్మతములే." (చూ. 929.)

870. బ్రహ్మ మొక్కటే సత్యమైనపక్షమున జీవులచే గలుగు నీభేదములతోడను తారతమ్యముతోడను గూడిన యీ జగత్తు ఎటు సంభవించినది? ఈ రహస్యమును దెలుపుచు

శ్రీగురుదేవు డిట్లు వచించును: "ఇది వానిలీల, మహాలీల! రాజునకు నలువురు కుమారు లుండవచ్చును. వారందఱును రాజకుమారులే—యువరాజులే. కాని వారు ఆడుకొనునప్పు డొకడు మంత్రియగును, ఒకడు (పోలీసు) జవానగును, మఱి యొకడు మఱియొకడగును. రాజకుమారుడే, ఐనను జవానువలె నటించుచున్నాడు!" (చూ. 898.)

## సాకారబ్రహ్మము : నిరాకారబ్రహ్మము

871. "అయ్యా, ఏది గొప్పది? సాకారబ్రహ్మమా, నిరాకార బ్రహ్మమా?" అని యొకరు ప్రశ్నింప, శ్రీగురుదేవు డిట్లు సమాధానించెను: "నిరాకార తత్త్వజ్ఞానము పక్వమని, అపక్వమని రెండువిధములుగా నున్నది. ఇందు పక్వమగునదే గొప్పది. దానిని సాకారబ్రహ్మమూలముననే పొందవలయును. బ్రాహ్మమతస్థులవలంబించు అపక్వమైన నిరాకారబ్రహ్మభావన కేవలము కండ్లు మూసికొనుటచే గోచరించు చీకటివంటిది." (చూ. 867, 879.)

872. సాకారు డాతడే, నిరాకారుడు నాతడే. మఱియు నాతడు సాకారనిరాకారాతీతుడు. వాని తత్త్వమంతయు వానికే తెలియును.

873. బ్రహ్మముయొక్క సాకార స్థితి యెట్టిదో మీకు తెలియునా? అది నీటినుండి బుడగలు వచ్చుటవంటిది. వివిధ రూపములన్నియు చిదాకాశమునుండి వెలువడుచున్నట్లు ప్రత్యక్షముగా గాంచవచ్చును. ఈ రూపములలో భగవదవతార మొకటి.

874. భగవత్సాక్షాత్కారము నొందిననేకాని ఇదియంతయు బోధపడదు. భక్తులనిమిత్తము భగవానుడు వివిధ రూపములను దాల్చును.

(రంగుల) అద్దకమున చిత్రమైనపద్ధతి నవలంబించువాడొక డుండెను. అద్దకముకొఱకు తనయొద్దకు వచ్చువారితో ఆతడు, "మీ బట్టల కేరంగు నద్దవలయును?" అని యడుగువాడు. ఎఱ్ఱరంగు కావలయునన్నచో, తనతొట్టిలో ఆతడు బట్టను ముంచి, "ఇదిగో, మీబట్టకు ఎఱ్ఱరంగు వేసినాను" అని వెలికి దీసి చూపువాడు. మఱియొకడు పచ్చరంగు వేయవలయుననిన, ఆత డదేతొట్టిలో బట్టను ముంచి పైకి దీయు సరికి అది పచ్చగా నుండెడిది. ఇదేవిధమున నీలి, నారింజ, ఊదా, ఆకుపచ్చ మొదలైన ఏరంగు వేయవలసినను ఆతడు అదే తొట్టెను అదే ప్రకారము వినియోగించువాడు.

ఇదియంతయు గనిపట్టుచుండిన యొకడు రంజకునియొద్దకు వచ్చి యిట్లనెను: "మిత్రుడా, నా కేరంగునందును ప్రీతిలేదు. నీయభిరుచిని దెలిసికొని నాబట్టకు నీయిచ్చవచ్చినరంగు వేయించుకొనుటయే నాయభీష్టము." భక్తుని యభీష్టమ నను సరించి సాకారుడుగా గాని, నిరాకారుడుగా గాని భగవానుడు వానికి సాక్షాత్కరించును. * దివ్యదర్శనములు సాపేక్షములు, అనగా వివిధపరిస్థితులలో నున్న వివిధవ్యక్తుల మనోభావము ననుసరించి యవి యథార్థములై యొప్పు

* "యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం,
మమవర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః."
—భగవద్గీత, 4-11.

చుండును. తన రంగేదియో ఆ దివ్యరంజకుని కొక్కనికే తెలియును. వాని దివ్యరూపముల కెవ్వరును పరిమితిని గల్పింపజాలరు—'భగవంతుడు ఈ రూపమున ప్రత్యక్షము అగును, ఆ రూపమున కానేరడు' అని యెవ్వరును నిర్ణయింపజాలరు.

875. ఒకబైరాగి (పూరీ) జగన్నాథదేవాలయమును దర్శించెను. భగవంతుడు సాకారుడా, నిరాకారుడా యని వాని సంశయము. జగన్నాథుని దివ్యవిగ్రహమును పరీక్షించి యాతడు తన సంశయమును నివర్తించుకొనదలచెను. అంతనాతడు తన దండమును ఎడమవైపునుండి కుడివైపునకు బోనిచ్చి విగ్రహమును తాకునేమో యని చూచెను. కొంతసేపు వానికేమియు గోచరింపలేదు, దండముతో దేనిని తాకలేకపోయెను: దానివలన భగవంతుడు నిరాకారుడని నిశ్చయించుకొనెను. కాని మఱల కుడినుండి యెడమవైపునకు దండమును బోనిచ్చి చూచినంతనే అది విగ్రహమును తాకెను. అంతనాతడు భగవంతుడు సాకారుడు, నిరాకారుడు కూడనని నిశ్చయించుకొనెను.

876. గంట వాయించునప్పుడు వినవచ్చు గణగణ ధ్వనులను ఒకదానినుండి మఱియొకదానిని వేర్వేఱుగా దెలిసికొనవచ్చును. ఎట్లన, అయ్యవి ప్రత్యేకరూపములు గలవియో యనునట్లు తోచుచుండును. కాని వాయించుట మానినంతనే నిరాకారమై తోచు నస్పష్టమైనధ్వని కొంతసేపటివఱకు వినవచ్చి క్రమముగా సమసిపోవును. గంటయొక్క యీ ధ్వనుల వలెనే భగవంతుడు సాకారుడు, నిరాకారుడుగూడ నై

వెలయుచున్నాడు.

877. సాకారబ్రహ్మము దర్శనీయము. ఔను, మనప్రాణ స్నేహితునితోవలెనే భగవానునితో ముఖాముఖమున సంభాషింపవచ్చును, వానిని స్పృశింపవచ్చును. (చూ. 911, 912.)

878. బ్రహ్మము నిరాకారమని భావించుట మంచిదే. కాని ఆ భావనమాత్రమే సమంజసమనియు తదితరమంతయు విరుద్ధమనియు మాత్రము తలపరాదు. బ్రహ్మమును సాకారముగా భావించి ధ్యానించుటయు తత్తుల్యముగా సమంజసమే. కాని నీవు బ్రహ్మసాక్షాత్కారము పొందువఱకును నీ విశిష్ట భావమునే నిలుపుకొనియుండుము. అటుపిమ్మట సర్వము నీకే విశదము కాగలదు. (చూ. 755, 851, 865.)

879. భగవంతుడే నిరామయము, నిత్యమునగు బ్రహ్మము, మఱియు నాతడే జగజ్జనకుడు. కాని శుద్ధసచ్చిదానందమయ మగు నఖండబ్రహ్మము అపారసాగరమువలె దుర్గ్రాహ్యము. దానిని మనము గ్రహింపబోయినచో, కొట్టుకొని తుదకందు మునిగిపోవలసినదే. * కాని లీలామయమగు సాకారబ్రహ్మ మునుగూర్చి భావించునెడల నీట మునిగిపోవువాడు మెల్లగా

* "క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసాం,
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే."
—భగవద్గీత, 12-5.

అవ్యక్తమగు నిర్గుణపరబ్రహ్మమునం దాసక్తమైన చిత్తముగల వారల శ్రమ యధికము, ఏలన శరీరాభిమానులకు పరబ్రహ్మనిష్ఠ కష్టసాధ్యము.

ఒడ్డునకు జేర్పబడునపుడు శాంతిని బొందురీతిని సులభముగా మనము ప్రశాంతిని బొందగల్గుదుము. (చూ. 867, 871.)

880. భక్తిమార్గమున సాధకుడు ఒకానొకదశలో భగవానుని సాకారునిగా భావించి సంతుష్టుడగును, అతడే మఱియొకదశలో భగవంతుని నిరాకారునిగా భావించుటచే సంతుష్టుడగును.

881. భగవానుడు భక్తునకు వివిధ రూపములతో సాక్షాత్కరించును. కాని సమాధిస్థితియందు అత్యుత్తమ జ్ఞానమును బొందినవానికి మఱల ఆభగవానుడే అఖండ నిరాకార బ్రహ్మమై గోచరించును. భక్తి జ్ఞానములకిచట సామరస్య మమరుచున్నది.

882. మంచుగడ్డ ఘనీభూతమైన నీరే. అటులనే పరమాత్ముని దర్శనీయరూపము భౌతికాకృతిని దాల్చిన అఖండనిరాకారబ్రహ్మమే, వేఱుకాదు. సాకారదైవము ఘనీభవించిన సచ్చిదానందరసమని చెప్పవచ్చును. జలాంతర్భూతమగు మంచుగడ్డ జలమున నిలిచియుండి పిమ్మట దానిలో కరగిపోవునటుల నిర్గుణబ్రహ్మాంతర్భూతమగు సాకార దైవము బ్రహ్మమునుండియే వెలువడి, అందు నెలకొనియుండి, మఱల అందే లీనమై, అదృశ్యమైపోవును.

883. అగ్నికి ప్రత్యేకరూపము లేదు, కాని భగభగమండు కట్టెలందది వివిధరూపములను దాల్చుచున్నది. ఇట్లు నిరాకారాగ్ని సాకారముగా గాన్పించును. ఇట్లే నిరాకార బ్రహ్మము ప్రత్యేకరూపములను వహించుచుండును.

# కొన్ని బ్రహ్మస్వరూపములు

884. భగవంతు డనేకరూపములను దాల్చి ప్రసన్ను డగును,—ఒక్కొక్కప్పుడు మానవరూపమునను ఒక్కొక్కప్పుడు చైతన్యరూపమునను ప్రసన్నుడగును. కాని భగవద్రూపములు యథార్థములని నమ్మవలయును. (చూ. 851.)

885. సచ్చిదానందమయు డెట్టివాడో ఎవ్వరును చెప్పజాలరు. ఆతడు మొట్టమొదట అర్ధనారీశ్వరరూపమును దాల్చెను. ఇందులకు కారణమేమో తెలియునా? ప్రకృతియు పురుషుడును తానే యని తెలుపుటకై సచ్చిదానందమయు డటు లొనర్చెను. తన మహోన్నత స్థితినుండి కొంచెము క్రిందికి దిగి యాతడు అనేక పురుషులుగను ప్రకృతులుగను భాసించుచున్నాడు.

886. దూరమునుండి చూచునప్పుడు సముద్రజలము నీలమై కాన్పించును; కాని ఒక్కింతనీటిని పుడిసిట బట్టి చూచితిమా, ఏరంగును లేక స్వచ్ఛముగానుండును. ఇట్లే శ్రీకృష్ణభగవానుడు దూరమునకు నీలవర్ణునిగా గాన్పించును, కాని నిజముగా నాత డట్టివాడుకాడు. శ్రీకృష్ణభగవానుడు అకలంకుడు, వర్ణరహితుడు, శుద్ధబ్రహ్మము.

887. శ్రీకృష్ణునకు త్రిభంగనామము కలదు; త్రిభంగుడు అనగా మూడువంపులు తిరిగినవాడని యర్థము. మెత్తని వస్తువుమాత్రమే యిట్లు వంగగలదు. కాబట్టి శ్రీకృష్ణుని యీ రూపము ఆత డే కారణముచేతనో మెత్తబడెనని తెలుపుచున్నది. ఈ మెత్తదనమునకు ప్రేమయే కారణమందురు.

888. ఒకభక్తుడు : జగజ్జననిని యోగమాయ యందురేల ?

శ్రీగురుదేవుడు : యోగమాయయనగా ప్రకృతిపురుషుల సంయోగమన్నమాట. లోకమున నీకు గోచరించు సర్వమును ఈప్రకృతి పురుషసంయోగమేకాని మఱియొకటి కాదు. కాళి శివునిపై నిలువబడియుండు శివకాళీవిగ్రహమును నీవు చూడలేదా ? శివుడందు శవమువలె—అచలుడై—పడియుండ, కాళి వానిని తదేకముగా లక్షించుచు నిలువబడియుండును, —దీనికంతటికిని ప్రకృతి పురుష సంయోగమనియే యర్థము. పురుషుడు అకర్త. అచలుడు; కావుననే శివుడు శవమువలె అచలుడై పడియున్నాడు. కాని వానితోడి సంయోగప్రభావముచేతనే ప్రకృతి సృష్టిస్థితిలయములను సర్వము చేయుచున్నది. రాధాకృష్ణ విగ్రహమునకుగూడ నిదియే యర్థము. (చూ. 922.)

889. భగవంతుని నీవు సమీపించినకొలదియు వాని వైభవాతిశయము వెనుకబడుచున్నట్లు గోచరించును. పది తలలతోగూడిన జగదీశ్వరి (దుర్గాదేవి) మొట్టమొదట సాధకుడు దర్శించునట్టి దివ్యరూపము. ఆరూపమున దివ్యశక్తియు వైభవమును విశేషముగా ప్రకాశించుచుండును. పిమ్మట నామె రెండుచేతులతో ప్రత్యక్షమగును: వివిధాయుధములతోగూడిన ఇరువదిచేతులును ఇక నందు గాన్పింపవు. పిమ్మట లభించునది గోపాలరూప సాక్షాత్కారము. ఇందు శక్తియు వైభవాతిశయమును ఎంతమాత్రము గోచరింపవు: ఇయ్యది కేవలము ముగ్ధుడగు పసిబాలుని రూపము. ఇంత

కంటెను ఉత్తమసాక్షాత్కారము గలదు—అదియే పరం జ్యోతియొక్క సాక్షాత్కారము. (చూ. 659, 754.)

## బ్రహ్మము సర్వాంతర్యామి

890. భగవంతు డందఱియందును గలడు, కాని యంద ఱును భగవంతునియందు లేరు, అందుచేతనే వారు బాధ పడుచున్నారు. (చూ. 44, 266.)

891. సర్వము నారాయణుడే. మానవుడు నారాయణుడు, మృగము నారాయణుడు, మహర్షి నారాయణుడు, మోస గాడు కూడ నారాయణుడే. ఉన్నదంతయు నారాయణుడే. ఆతడు అనేక రూపములతో క్రీడించుచున్నాడు. సర్వవస్తు వులును నారాయణుని వివిధరూపములు, వాని యనంత విభూతులు. *

892. భగవాను డిట్లనును : "కాటువేయు పాము నేనే, విషము తొలగించు మాంత్రికుడను నేనే ; శిక్షల విధించు దండనాధికారిని నేనే, ఆ శిక్షలను నెఱపు కింకరుడను నేనే." (చూ. 899.)

893. వివిధజంతువులలో దివ్యశక్తి వివిధముగా వ్యక్త మగుచున్నది; ఏలన ఏకత్వము గాదు, భిన్నత్వమే సృష్టి ధర్మము, భగవంతుడు సర్వాంతర్యామి, చిన్న చీమయం దును భగవంతుడు కలడు. భేదమంతయు ప్రకాశమున

---

* "యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా,
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః."
—నారాయణోపనిషత్తు.

మాత్రమే. †

894. ఎవ్వరిని అనేకులు గౌరవింతురో, పూజింతురో, అనుసరింతురో—వారియందే దివ్యశక్తి విశేషముగా ప్రకాశించుచుండును : అట్టిప్రతిభ లేనివారియందు తక్కువగా నుండును. (చూ. 718.)

895. భగవంతుడీ స్థూలశరీరమున నెటు లుండును ? చిమ్మనగొట్టములోని కాడవలె నుండును. శరీరమున నుండియు భగవంతుడు దాని నంటకుండును.

## బ్రహ్మము : మానవుని ధార్మికబాధ్యత

896. ప్రశ్న : సర్వము భగవంతుడే ఐనయెడల ఇక పుణ్యపాపము లనునవి లేవా ?

ఉ. ఉండను ఉన్నవి, లేను లేవు. మనలోని అహంకారము నాతడు నిలిపియుంచునంతవఱకు ద్వైతభావమును పుణ్యపాప విచక్షణను గూడ నిలిపియుంచును. కాని యొక్కొక్కప్పుడాతడు కొందఱి యహంకారమును నిర్మూలించును; అట్టివారు సమస్త పుణ్యపాపములకును అతీతు లగుదురు. నరునకు బ్రహ్మసాక్షాత్కారము కానంతవఱకు ద్వైతభావమును పుణ్యపాపవిచక్షణయు ఉండితీరవలయును. పుణ్యపాపములును కీడుమేళ్లును సర్వము నీకు సమానమే యనియు భగవంతుడేమి చేయించిన, అది చేయుచున్నాననియు నీవు చెప్పవచ్చును. కాని ఇవన్నియు వట్టి చిలుకపలుకు లని నీ యంతరంగమున నెఱిగియేయుందువు. నీ వేదేని దుష్కార్యమును

† "అణోరణీయాన్ మహతో మహీయాన్."—కఠోపనిషత్తు.

జేయగనే నీ యంతరాత్మ నిన్ను బాధించుచునేయుండును.

897. ప్రశ్న : ఏపనిచేయుటకై నను భగవంతుడే ప్రేరేపించుచున్న పక్షమున నా పాపమునకు నే నుత్తరవాదిని కాదుకదా ?

ఉ. దుర్యోధనుడును ఇట్లే చెప్పినాడు : "ఓసర్వేశ్వరా! నీవే నా హృదయాంతర్వర్తివి. నీ వేమి చేయించిన నే నది చేయుచున్నాను." కాని భగవంతుడే కర్తయనియు తాను నిమిత్తమాత్రుడ ననియు నిజముగా నమ్మువా డెట్టి పాపమును జేయజాలడు. పరిపూర్ణుడైన నర్తకు డెప్పుడును తప్పటడుగు వేయడు. నిజమునకు హృదయము పరిశుద్ధమైననే కాని భగవంతుడున్నాడని కూడ నమ్మజాలడు.

898. ఒకభక్తుడు : స్వామీ, నాకొక సందేహమున్నది. మనకు స్వేచ్ఛ కలదందురు, అనగా ధర్మముగాని, అధర్మముగాని, మఱేదిగాని మన యిష్టానుసారము చేయగలమందురు. నిజమా ? మనకు నిజముగా స్వాతంత్ర్యము కలదా ?

శ్రీగురుదేవుడు : సర్వము భగవత్సంకల్పము ననుసరించి నడచును. ఇదంతయు వానిలీల ! ఆతడు మనచేత అనేకవిధముల అనేకకార్యములను—మంచివి, చెడ్డవి, ఉత్తమమైనవి, నీచమైనవి—చేయించుచున్నాడు. వీని కన్నిటికిని మూలము వాడే. యోగ్యులు, అయోగ్యులును— ఎల్లరును వాని మాయయే; వాని లీలయే. * ఉదాహరణమునకు

* "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా."
—భగవద్గీత, 18-61.

చూడుడు : తోటలోని చెట్లన్నియు ఔన్నత్యమునగాని, రామణీయకమునగాని, వైభవమునగాని ఒండొంటితో సమానము కావుగదా ? (చూ. 870, 1094.)

బ్రహ్మసాక్షాత్కారము కానంతవఱకు నరుడు తాను స్వతంత్రుడ ననుకొనుచుండును. కాని భగవంతుడే యీ భ్రాంతిని వానియం దుంచువాడు. లేనిపక్షమున పాపకార్యములు అపారముగా హెచ్చిపోవును; అపుడిక జనులకు పాపభీతియే లేకుండును, మఱియు పాపములకును దోషములకును శిక్ష యనునదియే లేకుండును.

కాని బ్రహ్మసాక్షాత్కారము బడసినవాని భావన యెట్లుండునో తెలియునా ? అతడు మనఃపూర్వకముగా నిట్లు భావించును: "దేవా ! నేను యంత్రమను, నీవు యంత్రకారుడవు; నేను గృహమను, నీవు గృహాధిపతివి ; నేను రథమను, నీవు రథికుడవు; నీవు నన్నెట్లు నడపిన నే నట్లు నడతును; ఎట్లు పలికించిన అట్లు పలుకుదును !" (చూ. 109, 114, 995.)

899. దేవుడే దొంగను పోయి దొంగతనము చేయుమని ప్రేరేపించును; మరియు దొంగనుగూర్చి జాగ్రత పడుమని గృహస్థుని ఆతడే హెచ్చరించును. సర్వమునకు ఆతడే కర్త. †(చూ. 892.)

---

అర్జునా ! ఎల్లభూతములకు నియామకుడైన ఈశ్వరుడు ఎల్ల ప్రాణుల హృదయములం దున్నవాడై జంత్రగాడు బొమ్మల నాడించు రీతిగా మాయచేత ప్రాణులను భ్రమింపజేయుచున్నాడు.

శ్లో. "సర్వస్యచాహం హృదిసన్నివిష్టో మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహనం చ,

పదునెనిమిదవ ప్రకరణము

# బ్రహ్మసాక్షాత్కారము

మనస్తత్త్వము: బ్రహ్మసాక్షాత్కారము—కుండలినీ శక్తి: ఆత్మ ప్రబోధము—కృత్రిమావేశము—దివ్యశ్రవణము, దివ్యదర్శనము—సమాధి: బ్రహ్మజ్ఞానము—సమాధితత్త్వము—సమాధిసంజనితమైన విజ్ఞానము

## మనస్తత్త్వము : బ్రహ్మసాక్షాత్కారము

900. పంచభూతాత్మకమైన యీ శరీరము స్థూలశరీరము. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము—అనువానితోఁ గూడుకొనునది సూక్ష్మశరీరము. బ్రహ్మసాక్షాత్కారమును బడసి బ్రహ్మానందము ననుభవించుట కనువగునదియే కారణ శరీరము. తంత్రములలో నిదియే 'భాగవత తనువు'అని చెప్ప

---

వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్."

—భగవద్గీత, 15-15.

సర్వప్రాణుల మనస్సులందు నేనే వసించుచున్నాను. నావలననే వారలకు స్మృతి, జ్ఞానము, మాంద్యమును పుట్టుచున్నవి. అనేక వేదములచే నెఱుగదగినవాడను, వానిని జేసినవాడను, తెలిసినవాడను నేనే.

శ్లో. "మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ .
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ."

—భగవద్గీత, 7-7.

అర్జునా! నాకంటె ఇతరకారణము మఱొకటి లేదు, సమస్త ప్రపంచము దారమునందు రత్నములవలె నాయందు గూర్పబడియున్నది.

బడుచున్నది. వీని యన్నిటికిని అతీతమగున దొకటి కలదు. అదియే 'మహాకారణము.' (చూ. 912, 918.)

901. బాహ్యప్రపంచ స్ఫురణలో బద్ధమైయున్నప్పుడు మనస్సు స్థూలవిషయములనే గమనించుచు, అన్నమయ కోశమున నెలకొనియుండును. ఈ కోశము అన్నముపై నాధారపడు జీవుని స్థూలకోశము. మనస్సు అంతర్ముఖమైనప్పుడు ఇంటిద్వారమును బంధించి లోపలి గదులలోనికి ప్రవేశించినట్లగును; అనగా స్థూలశరీరమునుండి సూక్ష్మశరీరములోనికిని, అందుండి కారణశరీరములోనికిని ప్రవేశించును; తుదకు మహాకారణమును జేరును. ఆ స్థితియందు మనస్సు బ్రహ్మమున లయమగును—దానినిగూర్చి నేమియు జెప్పజాలము.

902. శ్రీ చైతన్యదేవునకు మూడువిధములైన స్థితులుండెడివి: (1) మనస్సు స్థూలశరీరమునను సూక్ష్మశరీరమునను నెలకొనియుండునట్టి బోధావస్థ, (2) మనస్సు కారణశరీరమున కెగసి 'కారణానందము' ననుభవించునట్టి యర్ధబోధావస్థ, (3) మూలమగు 'మహాకారణము'న మనస్సు పూర్తిగా లయించునట్టి యంతర్ముఖ బోధావస్థ, లేక తురీయావస్థ.

ఈ స్థితులకును వేదాంతమున జెప్పబడు పంచకోశములకును మంచి పోలికగలదు. స్థూలశరీరమగు నన్నమయ ప్రాణమయ కోశములు, సూక్ష్మశరీరమగు మనోమయ విజ్ఞానమయ కోశములు, కారణశరీరమగు నానందమయకోశము నను నవియే పంచకోశములు. మూలకారణము ఈ కోశము

లన్నిటికిని అతీతము. మనస్సు మూలకారణమున లయించు నప్పు డాతడు (శ్రీ చైతన్యుడు) సమాధిస్థితు డగువాడు; ఇదియే నిర్వికల్పసమాధి, లేక జడసమాధియని చెప్పబడును.

## కుండలినీశక్తి : ఆత్మప్రబోధము

903. కుండలినీ ప్రబోధము గాంచినగాని ఆత్మప్రబోధము గలుగదు. కుండలినీశక్తి మూలాధారకమలమున నిద్రాణమై యుండును. ఆమె మేల్కాంచినప్పుడు సుషుమ్నయందు ప్రవేశించి స్వాధిష్ఠాన మణిపూరకాది పద్మములగుండా పోయి తుదకు సహస్రారమును జేరును. అప్పుడు సమాధిస్థితి లభించును. దీని నంతయు ప్రత్యక్షముగా గంటిని.

904. 'మహావాయువు' మేల్కాంచి, చెంగున శిరస్సున కెగిరి వెడలుట బ్రహ్మసాక్షాత్కార లక్షణములలో నొకటి. అపుడు సమాధిస్థితి గలుగ బ్రహ్మదర్శనమగును.

905. కుండలినీ ప్రబోధమును వర్ణించుచు శ్రీ గురుదేవు డొకప్పు డిట్లు తెల్పెను : "ఒడలు జల్లుమన నొకానొకశక్తి పాదములనుండి శిరస్సున కెగయును. అది మెదటిని జేర కుండునంతవఱకు నాకు బాహ్యస్ఫురణ ముండును, కాని యది మెదటిని జేరినంతనే బాహ్యప్రపంచ స్ఫురణ శూన్య మగును. చూచుటయు వినుటయు నాగిపోవునప్పు డిక మాట లాడుటమాట చెప్పెడిదేమి? ఇక మాటలాడువా రెవరు? 'నీవు, నేను' అనువిచక్షణయే అదృశ్యమగును. (హృదయ మును కంఠమును జూపుచు) ఇంతవఱకును, లేదా, ఇంత వఱకునుగూడ ఆ మహాశక్తి వెలువడి వచ్చునప్పుడు నాకు

గోచరించినట్టియు ననుభూత మగునట్టియు విషయముల నన్నిటిని మీకు జెప్పవలెనని నే నొక్కొక్కప్పు డనుకొనుచుందును. ఆ స్థితిలో నేను మాటలాడగలను— మాటలాడుచుందును. (కంఠమును జూపుచు) కాని దీనిని దాటి యా శక్తి (ఇంకను పైకి) వెడలినంతనే ఎవ్వరో నా నోటిని మూసినట్లగును. ఇక నా స్వాధీనత తప్పిపోవును. కుండలిని కంఠమును దాటి వెడలునప్పుడు నాకు గలుగు ననుభవమును మీకు దెలుపవలయునని నిశ్చయించుకొందునుగాని, అట్లు నిశ్చయించుకొనుచుండగనే చెంగున మనస్సు (శిరస్సువైపునకు) పైకి పోవును—ఇక నంతటితో సరి!'' గురుదేవు డనేక పర్యాయములు ఈస్థితిని వర్ణింప బ్రయత్నించెను, కాని యెన్నడును కృతార్థుడు కాలేదు. ఒకనాడు తనయెదుటనున్న వారికి ఈ యనుభవములను వర్ణింప నిశ్చయించుకొని కుండలీనీశక్తి కంఠమును జేరువఱకును గురుదేవుడు తన వర్ణనను సాగించెను. భ్రూమధ్యభాగమున కవ్వలివైపున నుండు ఆజ్ఞాచక్రమును జూపుచు నిట్లు వచించెను: ''మనస్సు ఇచ్చటికి వచ్చినంతనే పరమాత్మదర్శనము లభింప సమాధిస్థితి గలుగును. అప్పుడు జీవునకును పరమాత్మకును నడుమ పలుచని పొరమాత్రముండునని చెప్పనగును. అందుండి సర్వము గోచరించుచుండును. అప్పు డాతని యనుభూతి యిటులుండును....'' సవివరముగా ఆస్థితిని వర్ణింప బ్రయత్నించినంతనే గురుదేవుడు సమాధిస్థితుడయ్యెను! మనస్సు కొంచెము క్రిందికి దిగివచ్చినంతనే—అనగా బహిఃప్రజ్ఞ కలుగ నారంభించినంతనే—మఱల బ్రయత్నించెను, కాని మఱల సమాధి నిమగ్నుడయ్యెను! ఇట్లు

అనేకపర్యాయములు విఫలమనోరథుడై తుదకు గురుదేవుడు కండ్ల నీరుపెట్టుకొని యిట్లు వచించెను: "ఏమున్నది?— కొంచెమైనను దాపరికము లేకుండ అంతయు మీకు జెప్పుటకై నే నెంత మనఃపూర్వకముగా ప్రయత్నించినను అమ్మ నన్ను ఎంతమాత్రము అటుల జేయనీయకున్నది. ఆమె నా నోరు మూసివేయుచున్నది!"

906. కుండలినీశక్తి బయల్వెడలి మెదటిని జేరు వివిధ మార్గములను సూచించుచు శ్రీగురుదేవుడు తఱచుగా నిట్లు వచించువాడు: "ఒడలు జల్లుమన మెదటిని జేరునట్టి యాశక్తి యెప్పుడును ఒకే గమనము ననుసరింపదు. శాస్త్రములు ఆశక్తి ఐదువిధములైన గమనములను గలిగి యుండునని తెల్పును. మొదటిది పిపీలికాగమనము. నోటిలో ఆహారము నిడుకొని చీమలబారు పైకి ప్రాకుచున్నరీతిని పాదములనుండి యేదియో మెల్లగా పైకి ప్రాకిపోవుచున్నట్లు తోచును. అది శిరస్సును జేరినంతనే సాధకుడు సమాధిస్థితి నొందును. రెండవది మండూక గమనము: కప్ప వడివడిగా చిన్నచిన్న రెండుమూడుదూకులు దూకి కొంచెముసేపాగి, మఱల గమనము ప్రారంభించునటుల పాదములనుండి యేదియో మెదటివైపునకు బోవుచున్నటుల దోచును. ఇయ్యది మెదటిని జేరినంతనే సమాధిస్థితి లభించును. మూడవది సర్పగమనము: తిన్నగా గాని, చుట్టచుట్టుకొని గాని పాము పడియుండి ఎదుట తన యాహారము గాన్పించినంతనే, లేదా, ఏదేని భయము తోచినంతనే వంకరటింకరగా ప్రాకిపోవునటుల కుండలినీశక్తి మెదటివైపునకు బరుగిడును, అంతట సమాధి గలుగును;

నాలవది విహంగగమనము : పక్షి యొక చోటినుండి మఱి యొకచోటికి ఎగురునపుడు రెక్కలనల్లార్చుచు,ఒకప్పుడు ఎగు వగను మఱియొకప్పుడు దిగువగను బోవుచు, ఏమైనను గమ్య స్థానము జేరువఱకు ఆగకుండునటుల ఆశక్తి బయల్వెడలి మెదటిని జేరును, అంత సమాధిస్థితి గలుగును. ఐదవది (కడపటిది) మర్కట గమనము : చెట్టునుండి చెట్టునకు బోవునపుడు కోతి యొక కొమ్మనుండి మఱియొక కొమ్మకు చెంగున దూకి రెండుమూడు దూకులలో గమ్యమును జేరు వటుల కుండలిని మెదటిని జేరుచున్నట్లు యోగికి అనుభూత మగును. అంతట సమాధిస్థితి లభించును.''

907. శ్రీగురుదేవు డీయనుభవములను వేదాంతదృష్టి ననుసరించి యీవిధముగా వివరించువాడు : ''వేదాంతము సప్తభూమికలనుగూర్చి తెలుపును : ప్రతిభూమికయందును సాధకునకు ప్రత్యేకమగు దివ్యదర్శనము, లేక దివ్యానుభూతి లభించును. * మానవుని మనోవ్యాపారము సహజముగా మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము నను దిగువ మూడుచక్రములందుమాత్రమే బద్ధమైయుండ బ్రవర్తించు చుండును. వీనిలో గొప్పది నాభి కెదురుగా నుండు మణి పూరకము. అందుచే మనస్సు ఆహార నిద్రాదికములగు సామాన్య పశుధర్మములతో సంతుష్టినొందుచుండును. కాని యది హృదయమున కెదురుగా నుండు ననాహతమును జేరి

---

* (1) శుభేచ్ఛ, (2) విచారము, (3) తనుమానస, (4) సత్త్వాపత్తి, (5) అసంసక్తి, (6) పదార్థభావని, (7) తుర్యగ అనునవి సప్తభూమికలు. వీనినిగూర్చి యోగవాసిష్ఠమున విశేషముగా గాననగును.

నంతనే మానవునకు దివ్యజ్యోతియొక్క దర్శనము గలుగును. ఐనను ఈ స్థితినుండి సాధకుడు తఱచు పతనముచెంది దిగువ (మూడు) చక్రముల వ్యాపారములలో బడుచుండును. కాని హృదయమున కెదురుగా నుండు విశుద్ధచక్రమును జేరునప్పుడిక సాధకుడు భగవదన్యవిషయములనుగూర్చి మాటలాడ జాలడు. నే నీస్థితిలో నుండినప్పు డెవ్వరైనను ప్రాపంచికపు గొడవలనుగూర్చి ఏకరువుపెట్టిన పక్షమున, నెత్తిపై నెవ్వరో అమాంతముగా గొట్టినట్లుండెడిది. ఈ బాధ లేకుండ నే నపుడు పంచవటికి బోయి ఏకాంతమైనచోట దాగియుండెడివాడను. లౌకికులు గాన్పించినంతనే పాఱిపోవువాడను; బంధువులు నాదృష్టికి—అందు బడినచో మఱల వెలువడుటకు వీలులేని—పాతాళమువలె గాన్పించువారు. వారి యెదుట నాకు ఊపిరి సలుపకుండెడిది— ప్రాణము పోవుచున్నట్లుండెడిది; వారి బారినుండి తప్పించుకొని పాఱిపోయినప్పుడే నాకు మనశ్శాంతి గలిగెడిది. (చూ. 559, 1102.) ఈ స్థితి బొందిననుగూడ సాధకుడు (దిగువ మూడుచక్రములలోనికిని) పతనము నొందవచ్చును. కాబట్టి యాతడు సదా జాగరూకుడై యుండవలయును. కాని భ్రూమధ్యమున కెదుటనుండు ఆజ్ఞాచక్రమును మనస్సు చేరినపక్షమున సాధకుడు ఇక నిర్భయుడగును. అపుడాతడు పరమాత్మదర్శనమునొంది సదా సమాధిస్థితుడై యుండును. ఈ స్థానమునకును అత్యున్నతమగు సహస్రారమునకును నడుమ పలుచని పొరమాత్రముండునని చెప్పవచ్చును. పరమాత్మకు అపు డాతడు అత్యంత సన్నిహితుడై యుండుటచే వానియందాతడు లీనమైనటు భావించుచుండును.

కాని యాతఁడు ఇంకను లీనము కాలేదు, ఐక్యము నొందలేదు. ఈ స్థితినుండి మనస్సు ఐదవదియగు విశుద్ధచక్రమునకు, లేదా, అంత పుట్టిమునుక వచ్చినచో, నాలవదియగు అనాహతచక్ర మునకు దిగవచ్చును—కాని యంతకంటె క్రిందికి మాత్రము దిగదు. జీవులతరగతిలోనివారగు సామాన్యసాధకులు ఈస్థితిని బొందినచో మఱల క్రిందికి—అనగా బహిఃప్రజ్ఞకు—రాజా లరు. ఇరువదియొక్క దినములు నిరంతర సమాధిస్థితులై యుండి అటుపిమ్మట ఆ పలుచని పొరను భేదించుకొని పరమాత్మతో శాశ్వతముగా నైక్యము నొందుదురు. సహస్రారమున జీవాత్మ పరమాత్మలయొక్క యీ శాశ్వత సంయోగమే సప్తమభూమికను బొందుటయని చెప్పబడును. (చూ. 835, 986.)

## కృత్రిమావేశము

903. పైకి సమాధివలె గాన్పించు నొకవిధమైన భావావేశమును బొందు నొకని సూచించుచు, శ్రీ గురుదేవు డిట్లు పల్కెను : "నిజమైన దివ్యావేశమున జీవుఁడు హృదయాంతరాళమున ప్రవేశించి పరిపూర్ణప్రశాంతి నొందును; కాని యిచట మనకు గానవచ్చునదేమి! ఓయీ, శాంతింపుము—సముదాయించుకొనుము.(ఎదుటనున్న భక్తుల నుద్దేశించుచు) ఈ యావేశమెట్టిదో మీకు దెలియునా? అరగిద్దెడు పాలను పెద్ద బూరెలమూకుడులో బోసి ఋఱుగబెట్టుట వంటిది. పైకి మూకుడు నిండ పాలున్నట్లు గాన్పించును, కాని పొయ్యి న్నుండి క్రిందకు దింపినంతనే ఒక చుక్కయైనను అందుండదు.

ఇదివఱకు అందుండిన అరగిద్దెడు పాలు గూడ అడుగంటి పోవును.

## దివ్యదర్శనము, దివ్యశ్రవణము

909. జీవాత్మపరమాత్మల యైక్యమనియు సగుణబ్రహ్మదర్శనమనియు బ్రహ్మసాక్షాత్కారము రెండువిధములు. ఇందు మొదటిది జ్ఞానమనియును, రెండవది భక్తియనియు జెప్పబడును.

910. నాయనలారా! నిజముగా భగవంతుని జూడవచ్చును. మనమిచట గూర్చుండి మాటలాడుకొనుచున్నట్లే సరిగా ఇదేవిధముగా—భగవంతుని జూచి వానితో మాటలాడవచ్చును. నిజముగా—మనఃపూర్వకముగా—జెప్పుచున్నాను.

911. సగుణబ్రహ్మసాక్షాత్కారము తఱచు దివ్యరూపమున గలుగును. ఆ దివ్యరూపము వినిర్మలహృదయులకు మాత్రమే గోచరించును. అనగా ఆ రూపములు ఈశ్వరుడు ప్రసాదించు భాగవతతనువునకు సంబంధించిన దివ్యేంద్రియములకు మాత్రమే గోచరించును. కావున ఈ దివ్యరూపములను సిద్ధపురుషుడే చూడగల్గును. (చూ. 900, 918.)

912. 'భగవత్సాక్షాత్కారము నొందువారు భగవంతుని తమ చర్మచక్షువులతోడనే చూతురా?' యని యొకరు ప్రశ్నింప శ్రీగురుదేవు డిట్లు సమాధానమొసగెను: "చూడరు ఈ చర్మచక్షువులతో—ఈభౌతికనేత్రములతో—భగవంతుని జూడజాలము. సాధనదశలో నీలో 'ప్రేమ

శరీరము' నిర్మితమగును. దాని కన్నులును చెవులును 'ప్రేమ మయములే' వానితో నీవు భగవానునిజూచి వానితో సంభా షింపవచ్చును.'' * (చూ. 900)

913. అనాహతధ్వని సదా దానంటదియే సాగుచున్నది. అదియే ప్రణవనాదము (అనగా ఓంకార ధ్వని.) అది పర బ్రహ్మమునుండి వెలువడుచున్నది, దానిని యోగులు మాత్రమే వినగలరు. సాధారణులగు లౌకికజనులు దానిని వినజాలరు. ఒకవైపున నాభిప్రదేశమునుండియు, మఱియొక వైపున పరబ్రహ్మమునుండియు ఆనాదము వెలువడుచున్నట్లు యోగులు గ్రహింపగలరు.

## సమాధి : బ్రహ్మజ్ఞానము

914. సమాధిదశలో మనఃస్థితి యెటులుండును ? నీటి నుండి కొంతసేపు వెలుపల నుంచి మఱల నీట విడువబడిన చేప యెట్టి యానందస్థితి ననుభవించునో (మనసు) అట్టిస్థితిలో నుండును.

915. గురువనియు శిష్యుడనియు భేదమును పాటింపని యా దివ్యస్థితి యెంత మహిమాన్వితము ! గురుశిష్యభేదమే అపుడు గోచరింపదు !

---

* ''న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్. ''

—భగవద్గీత, 11-8.

'' ఈ ప్రాకృతమైన నీ కన్నులతో నా దివ్యస్వరూపమును జూడ జాలవు. నీకు దివ్యదృష్టినిచ్చుచున్నాను. వానితో ఆశ్చర్యకరమైన నా యోగశక్తిని జూడుము '' (అని శ్రీకృష్ణు డర్జునునితో బల్కెను).

916. వేయిసంవత్సరములనుండియు అంధకారబంధురమై యున్న గదిలోనికి దీపమును దెచ్చినంతనే అది దానిని ప్రకాశింపజేయునట్లు జ్ఞానతేజము యుగములతరబడిగానున్న అజ్ఞానాంధకారమును నశింపజేసి జీవుని ప్రకాశింపజేయును. (చూ. 357, 675.)

917. "సమాధిస్థితిలో తమకు దృశ్యప్రపంచ స్ఫురణ ముండునా?" యని యొకరు ప్రశ్నింప, శ్రీగురుదేవు డిట్లు సమాధాన మొసగెను : "సముద్రములోపల గుట్టలు, పర్వతములు, కనుమలు, లోయలు నుండునుగాని యవి పైకి గనబడవు. ఇట్లే సమాధిస్థితియందు అపారమగు సచ్చిదానందసాగరముమాత్రమే గోచరించును. జీవభావము దానిలో అణగిపోయి అవ్యక్తముగా నుండును."

918. నిజమైన జ్ఞానమున అహంకారము లేశమైన నుండదు—దాని జాడయైనను కానరాదు. సమాధిస్థితి లభింపనిదే (తత్త్వ) జ్ఞాన మెన్నటికిని కలుగదు. జ్ఞానము మధ్యందినమార్తాండునివంటిది—అందు నరునకు తన నీడయే కానరాదు. అటులనే నరుడు జ్ఞానమును లేక సమాధిస్థితిని బొందినంతనే అహంకారమను నీడ యిక నిలువజాలదు. ఏలయన, ఒకవేళ మిగిలియున్నను అది విద్యామయమని నిశ్చయముగా నెఱుంగుడు. అది యెంతమాత్రము అవిద్యాసంజనితము కాదు. (చూ. 274, 900, 911.)

919. 'బుద్ధుడు నాస్తికుడా?' యని యొకరు ప్రశ్నింప, శ్రీగురుదేవు డిట్లు సమాధాన మొసగెను : "కాదు, అతడు నాస్తికుడు కాదు, తన యనుభూతుల నాతడు వెల్లడింప.

జాలకపోయెను, అంతేకాని మఱియొకటి కాదు. బుద్ధుని యభిప్రాయమేమో నీకు దెలియునా?—గాఢమగు ధ్యానముచే 'బోధ'తో, చిత్స్వరూపముతో, ఐక్యమునొందుట—చిత్స్వరూపమే యగుట. అస్తిత్వమనికాని నాస్తిత్వమని కాని చెప్పుటకు వీలులేని—అస్తిత్వనాస్తిత్వములకు నడుమనుండు—ఒకానొక మహోత్కృష్టావస్థ బ్రహ్మసాక్షాత్కారము. ఈ 'యస్తిత్వనాస్తిత్వములు' ప్రకృతివికారములు. తత్త్వము ఈరెంటికిని అతీతము."

920. జ్ఞానాజ్ఞానములకు అతీతుడవు కమ్ము. అనేకత్వముయొక్క స్ఫురణయే అజ్ఞానము,—అనగా ఏకత్వమును గ్రహింపక—అద్వితీయ బ్రహ్మము నెఱుగక—భిన్నత్వమును జూచుటయే అజ్ఞానము. 'నేను విద్యావంతుడ' ననునహంకారము అజ్ఞానమువలన గలుగును. భగవంతుడు సర్వాంతర్యామియను ఎఱుక, అట్టి నిశ్చయము,—అనేకత్వమునం దేకత్వము కలదను వాస్తవదృష్టి—ఐక్యజ్ఞాన మనబడును. * భగవంతుని చక్కగా దెలిసికొనుటయే విజ్ఞానము. (చూ. 927.)

నీకాలికి ముల్లుగ్రుచ్చుకొనిన దనుకొనుము. దాని

---

* "సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే,
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్."
—భగవద్గీత, 18-20.

ఏజ్ఞానముచే నరుడు భిన్నములైన సర్వభూతములందును అఖండమైనదియు నాశరహితమైనదియు ఏకమైనదియునగు పరమాత్మస్వరూపమును గనునో ఆజ్ఞానము సాత్త్వికజ్ఞానమని యెఱుగుము.

నూడదీయుటకు మఱియొకముల్లు కావలయునుగదా ? ఊడ దీసినతర్వాత రెంటిని ఆవలబాఱవేయుదువు. కాబట్టి అజ్ఞాన మను ముల్లు ఊడదీయుటకు జ్ఞానమను ముల్లు తెత్తువు; పిమ్మట అఖండ బ్రహ్మసాక్షాత్కారమునకై జ్ఞానాజ్ఞాన ములు రెంటినిగూడ త్రోసిరాజందువు. బ్రహ్మము జ్ఞానా జ్ఞానములు రెంటికిని అతీతముగదా !

లక్ష్మణుడు తన దివ్యసోదరుడగు శ్రీరామచంద్రునితో ఇట్లనియెను : "అన్నా ! వసిష్ఠదేవునివంటి బ్రహ్మజ్ఞాని తన కుమారులు మరణించినందులకై విలపించుచు నోదార్పబడ కుండుట ఆశ్చర్యముకాదా ?" రామచంద్రు డిట్లు సమాధాన మొసగెను : "లక్ష్మణా ! సాపేక్షమైన (బ్రహ్మ) జ్ఞానము గలవానికి సాపేక్షమైన అజ్ఞానముగూడ నుండునని మది నుంచుకొనుము."

వస్తుతః అట్టివానికి బ్రహ్మమువిషయమై అజ్ఞాన (లేశ)ము ఉండకమానదు. ఏలన, ఇందు జ్ఞానాజ్ఞానములు సాపేక్షములు—పరస్పర సంబద్ధములు. ఎట్లన, లోకమున ఏకత్వమునుగూర్చిన జ్ఞానమనగానే భిన్నత్వమునుగూర్చిన జ్ఞానము స్ఫురించుచునేయుండును; వెలుతురును గూర్చిన ఎఱుకగల వానికి చీకటినిగూర్చిన ఎఱుకయు నుండునుగదా ?

నరుడు తన పరిమితశక్తిననుసరించి చూచినయెడల బ్రహ్మము జ్ఞానాజ్ఞానములకును, పుణ్యపాపములకును, సుకృతదుష్కృత ములకును, శౌచాశౌచములకును (సమస్త ద్వంద్వములకును) అతీతమై కన్పట్టును.

ఒక జిజ్ఞాసువు: దేవా! తాముచెప్పు జ్ఞానాజ్ఞానము లను ముండ్లను రెంటిని త్రోసి రాజనినపిమ్మట నేమి మిగులును?

శ్రీ గురుదేవుడు : ఏమున్నది? నిత్యశుద్ధ బుద్ధస్వరూపమే మిగులునది. కాని నీకు నేను దానిని బోధపఱుచు టెట్లు? నేతి రుచి యేమని నిన్నొకరు అడుగుదురనుకొనుము. దానిని పూర్తిగా బోధపఱుచుట నీకు సాధ్యమగునా? * "నేతిరుచి సరిగా నేతిరుచియే" యని చెప్పుటయే గదా నీవు చేయగలిగినపని? ఒకకన్య తన స్నేహితురాలి నొకప్పు డిట్లడిగెను : "నీ మగడు వచ్చినాడుగదా, వానిని కలిసికొనునప్పుడెల్ల నీకు గలుగు నానంద మెట్టిదో నాకు చెప్పవా?" అందులకు పెండ్లియాడిన బాలిక యిట్లు సమాధాన మొసగెను : "ఓసీ! నీమగడు వచ్చినపిమ్మట నీకంతయు బోధపడును లెమ్ము, నే నిప్పుడు దానిని నీకు బోధపఱచుటెట్లు?" (మా. 193.)

## సమాధితత్త్వము

921. పిట్ట తనగూడు ధ్వస్తమైనప్పుడు ఆకాశమున కెగిరిపోవును. అట్లే శరీరస్ఫురణయు బాహ్య ప్రపంచస్ఫురణయు నశించినంతనే జీవాత్మ పరమాత్మాకాశమున కెగిరిపోయి సమాధిస్థితియందు లయముగాంచును.

---

* "అనుభూతిం వినా తత్త్వం ఖణ్డాదేర్నానుభూయతే,
అనుభూతిం వినా రూపం చాత్మనో నానుభూయతే."
—శ్రీ యోగవాసిష్ఠము, 5-64-53.

అనుభవములేనిచో శర్కరాదుల తత్త్వముగూడ ఎట్లు గోచరము కాదో, అటులనే అనుభవము లేనిచో ఆత్మస్వరూపమును గోచరింపదు.

922. దివ్యత్వము ప్రాప్తించుటకుముందు మానవత్వము నమసిపోవలయును. ఆనందమయియగు 'బ్రహ్మమయి' (జగజ్జనని) సాక్షాత్కరించుటకుముందు ఈ దివ్యత్వము నమసి పోవలయును. నశించినట్టి దివ్యత్వము (అనగా శివుని)యొక్క ఱొమ్ముమీదగదా ఆయానందమయి తన భవ్యనాట్యమును సల్పుచున్నది! (చూ. 888.)

923. కర్పూరము వెలుగునపు డేమియు మిగులదు. నిత్యానిత్య వస్తువిచారము పరిసమాప్తమై ఉత్తమసమాధి ప్రాప్తించునపుడు, 'నీవు', 'నేను', 'ప్రపంచము' నను స్ఫురణమే యుండదు, ఏలన, అపుడు అంతఃకరణము బ్రహ్మమున లయించును. (చూ. 845.)

924. అహంకారము నిర్మూలమైనంతనే జీవత్వము నశించును; అంతట సమాధిస్థితిలో బ్రహ్మసాక్షాత్కారమగును. కావున బ్రహ్మానుభవమునొందునది బ్రహ్మమే కాని జీవుడు కాడు.

925. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" యనునట్లు బ్రహ్మము అవాఙ్మానసగోచరమని యొకభక్తుడు వాదింప, శ్రీ గురుదేవు డిట్లు విమర్శించి పలికెను: "అది సరికాదు. పరిమితమగు మనస్సుచే భగవంతుని దెలిసికొనజాలమనుట నిజము, సందియము లేదు. కాని శుద్ధ మనస్సుచే వానిని దెలిసికోవచ్చును. * శుద్ధమనస్సనినను శుద్ధబుద్ధియనినను ఒక్కటియే. మఱియు నిరుపాధికమగు నాత్మయు శుద్ధ బుద్ధియు నొక్కటియే. కామినీ కాంచనములయందలి

* "సుఖ మాత్యన్తికం యత్తత్ బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్."
—భగవద్గీత, 6-21.

మోహమువలన ఇంద్రియ బద్ధమగు సంకుచితబుద్ధిచే, లేక పరిమితము, సాపేక్షమునగు మనస్సుచే వానిని గ్రహింపజాలమనుట నిజము. మనస్సు సాధనచే ఇంద్రియలోలతను బాపుకొని శుద్ధముకాగలదు. విషయవాసనలను, కోరికలను—మోహరాగములను—తొలగించుకొని అఖండాత్మతో నైక్యము నొందవచ్చును, పూర్వము మహర్షులు భగవత్సాక్షాత్కారము నొందినది ఈ విధముననేకదా? అఖండాత్మస్వరూపుడగు భగవంతుని మహర్షులు శుద్ధమనస్సుచేతనే చూడగలిగిరి. ఆశుద్ధమనస్సే ఆత్మయని వారు గ్రహింపగలిగిరి.

926. మనస్సును బుద్ధియు మలినములై ఇంద్రియబద్ధమైయున్నంతవఱకు భగవంతుడు వానికి అతీతుడుగనే యుండును; కాని యవి పరిశుద్ధమైనంతనే భగవంతుడు వానికి సాక్షాత్కరించును. కామలోభములు చేరి మనస్సును మలినముచేయుచున్నవి. హృదయమున అవిద్య రాజ్యము చేయుచున్నంతవఱకు మనోబుద్ధులు ఎన్నటికిని పరిశుద్ధము కాజాలవు, సాధారణముగా మనస్సును బుద్ధియు పరస్పరభిన్నములని చెప్పుట కలదు. కాని యవి పరిశుద్ధమైనపుడు ఏకమై చైతన్యమున లయించును. అపుడు చైతన్య స్వరూపుడగు భగవంతుడు చైతన్యమునకే సాక్షాత్కరించును.

## సమాధిసంజనితమగు విజ్ఞానము

927. సమస్త ప్రకృతినుండియు వేఱుపఱిచి ఆత్మను దెలిసికొనుటయే జ్ఞానము. విచారముచే ప్రకృతిని తొలగించుటచే సమాధిస్థితి లభించును; అపుడు ఆత్మ సాక్షాత్కారమగును.

విజ్ఞానమనగా పరిపూర్ణముగా దెలిసికొనుట యని భావము. కొందఱు జున్నునుగూర్చి కేవలము వినియుందురు, మఱి కొందఱు కేవలము చూచియుందురు, ఇక గొందఱు రుచి చూచియుందురు. దానినిగూర్చి కేవలము వినియున్నవాడే అజ్ఞాని. చూచియున్నవాడో, జ్ఞాని; ప్రత్యక్షముగా రుచి చూచినవాడు విజ్ఞాని, అనగా ఆతడు పరిపూర్ణమైన జ్ఞానము నొందినవాడు. భగవంతుని దర్శించి, ఆప్తునితోవలె వానితో ఆంతరంగిక సంబంధము గలిగియుండుటయే విజ్ఞాన మన బడును.* (చూ. 177.)

మొదట నీవు 'నేతి, నేతి'—'ఇది కాదు, ఇది కాదు' అనునట్టి విచారమార్గము నవలంబింపవలయును. బ్రహ్మము ఈ పంచభూతములును కాదు, ఇంద్రియములును కాదు, మనస్సును కాదు, బుద్ధియును కాదు, అహంకారమును కాదు— బ్రహ్మము ఈ తత్త్వములన్నిటికిని అతీతము. మేడ నెక్క-వలయునని, ఒకటివెంబడినొకటిగా మెట్లను విడువవలయును. మెట్లే మేడ కావనుట నిజము. కాని నీవు మేడ నెక్కినంతనే ఏ యిటుకలు, సున్నము, ఇసుక మొదలగు వానితో మెట్లు

* "ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్."
—భగవద్గీత, 9-1.

ఏ జ్ఞానముచే సంసారసాగరమునుండి తరింతువో, మిక్కిలి గోప్యమైనదియు, విజ్ఞానసహితమైనదియు, సర్వము వాసుదేవుడే యని తెలియజేయునదియు నగు నీ జ్ఞానమును అసూయారహితుడవైన నీకు జెప్పెదను. (విజ్ఞానమనగా శాస్త్రసమ్మతమైన అనుభవజన్యజ్ఞానమని శంకరులు.)

వరుస నిర్మింపబడియున్నదో వానితోడనే మేడయు నిర్మింప బడియున్నదని కనుగొందువు ; ఎయ్యది బ్రహ్మమో అదియే తత్త్వజ్ఞులు దెలుపు నిరువదినాలుగు తత్త్వములతోఁగూడిన జీవజగత్తులై యున్నది. ఏది ఆత్మయో అదియే పంచభూతములై యున్నది. ఆత్మనుండి వెలువడినయెడల ఈ భూమి యింత గట్టిగా నెందులకున్నదని మీరడుగవచ్చును. ఈశ్వర సంకల్పమునకు సాధ్యముకాని దేదియు లేదు. శుక్ల శోణితముల నుండి అస్థులును మాంసమును నిర్మితమగుట లేదా? సముద్రపు నురుగు ఎంత గట్టిపడుచున్నదో చూడుడు ! (చూ. 734, 774, 850.)

విజ్ఞానము నొందినపిమ్మట మానవుడు సంసారియై మనినను మనగలడు. ఏలన, ఆత డప్పుడు చరాచర ప్రపంచమంతయు బ్రహ్మమేయనియు బ్రహ్మము ప్రపంచమునకు బాహ్యముగా లేదనియు విస్పష్టముగా గాంచును. శ్రీరామచంద్రుడు విజ్ఞానమును బొంది సంసారమున నుండ నిరాకరించినప్పుడు వసిష్ఠుడు ఇట్లు పల్కెను : "రామా! ప్రపంచము బ్రహ్మమునకు బాహ్యముగా నున్నపక్షమున, నీవు దానిని పరిత్యజింపవచ్చును."* అంత రామచంద్రుడు మాటాడక ఊరకుండెను.

---

* ఇయ్యది వసిష్ఠుని బోధనయొక్క సారాంశము. ఈ క్రింది శ్లోకములు ఈ భావమును దెల్పును :

"బ్రహ్మతత్త్వం వినా నేహ కిఞ్చిదేవోపపద్యతే,
సర్వం చ ఖల్విదం బ్రహ్మేత్యేషైవ పరమార్థతా."
—యోగవాసిష్ఠము, 4-40-35.

బ్రహ్మతత్త్వములేనిచో నేదియు ఉత్పన్నముగా నేరదు. 'ఈ విశ్వమంతయు బ్రహ్మమే' యనుకథనముమాత్రమే యథార్థమైనది.

ఏలన, బ్రహ్మమునకు బాహ్యముగా నేమియు లేదని రామచంద్రుడు లెస్సగా గ్రహించియుండెను.

**928.** సంగీతమున స్వరములు ఆరోహణక్రమమున ఉచ్చస్థాయిని బొంది, అవరోహణక్రమమున మఱల నీచస్థాయిని బొందునట్లు సమాధిస్థితిలో అద్వైతానుభవమును బొందిన పిమ్మట బాహ్యలోకమునకు దిగివచ్చి, 'అహంస్ఫురణ'తో నుండవచ్చును. ఒకదాని తర్వాత నొకటిగా దొప్పల నన్నిటిని ఒలిచివేసి, అరటిదూటను గైకొని, దానినే యందలి ముఖ్య భాగముగా భావింతుము. కాని తరువాత మఱల దొప్పలు అరటిచెట్టువే యని గణింతుము. బోదెను సంపూర్ణమైన దానినిగా జేయుటకు దొప్పలును దూటయును గూడ సమానముగనే ఆవశ్యకములుగదా? (చూ. 741, 866.)

**929.** మారేడుపండు భాగములను పరిశీలించునపుడు చిప్ప, గింజలు, గుంజు—అని విభజింతుము గదా? ఇపుడు వీనిలో ఏది మారేడుపండు? మొట్టమొదట మనము చిప్పను తరువాత గింజలను అప్రధానములని విడిచిపెట్టి తుదకు గుంజును వేఱుగా గైకొని అదియే నిజముగా పండనుకొందుము. కాని దేనికి గుంజు కలదో దానికే గింజలును చిప్పయునుగూడ కల

---

"శుద్ధం సదసతోర్మధ్యం పదం బుద్ధ్వావలమ్బ్య చ,
స బాహ్యాభ్యన్తరం దృశ్యం మా గృహాణ విముఞ్చ మా."

—యోగవాసిష్ఠము, 4-46-14.

వ్యక్తావ్యక్తముల రెంటియందును వ్యాపించియున్న శుద్ధ బ్రహ్మపదము నెఱింగి, అట్టి ప్రత్యగాత్మస్వరూపము నే యాశ్రయించి బాహ్యాభ్యంతరజగత్తులను గ్రహింపకయు త్యజింపకయు నుండుము.

వను భావన తరువాత గలుగును. ఇవన్నియు గలిసిగాని పం డగుచున్నవి. ఇట్లే భగవంతుని నిర్గుణావస్థయందు సందర్శిం చినపిమ్మట నెవ్వడు (ఏ భగవంతుడు)స్వతస్సిద్ధముగా నిత్యుడో వాడే లీలామయుడై జగద్రూపమును దాల్చియున్నాడని బోధపడును. (చూ. 868, 869.)

930. ఒకప్పుడు శ్రీ గురుదేవుడు నరేంద్రు (వివేకానంద స్వామి)ని "నీ జీవితాదర్శమేమి?" అని ప్రశ్నించెను. "సమాధినిమగ్నుడనై యుండుటయే" యని నరేంద్రుడు సమాధానముచెప్పెను. అంత శ్రీ గురుదేవు డిట్లు హెచ్చ రించెను : "నీవంత సంకుచిత బుద్ధివై యుండుట తగదు. సమాధిస్థితి నతిక్రమింపుము. సమాధి నీకు తృణప్రాయము!" వేఱొకనితో శ్రీ గురుదేవు డిట్లు పలికెను : "భావము (దివ్యభావపారవశ్యము), భక్తి—ఇవియే పరమావధి యను కొనకుము."

931. మఱియొక సందర్భమున శ్రీ గురుదేవుడు నరేంద్రు నదియే ప్రశ్నవైచి యదియే సమాధానముపొందెను. అంత శ్రీ గురుదేవు డిట్లు హెచ్చరించెను : "ఏమేమి! నీకింత కంటె ఉత్తమాశయము కలదనుకొంటిని. ఇట్టి పాటి కాశయ ముతో—ఇట్టి యసంపూర్ణాశయముతో—నీ వెట్లు సంతుష్టు డవు కాగలవు? సర్వావలోకనమే నాబలము. నా కిష్టమగు నొకకూర గలదనుకొనుము : దానిని నేను వేపుడుకూరగా, ముద్దకూరగా, పులుసుగా, పచ్చడిగా—నానావిధములుగా భుజించి యానందింపగోరెదను. భగవానుని నేను సమాధి

స్థితిలో అవ్యయాద్వితీయబ్రహ్మముగా మాత్రమేకాక, సఖ్యభావము, దాస్యభావము మొదలగు వివిధ మనోహరభావములమూలమున వానిని నానావిధ దివ్యరూపములందును సందర్శించి యానందింతును. నీవు నిట్లే చేయుము. ఒక్కమ్మడి జ్ఞానివిని భక్తుడవునుగూడ గమ్ము.'' (చూ. 177.)

## పందొమ్మిదవ ప్రకరణము

# బ్రహ్మజ్ఞాని

**వివిధ ముక్తపురుషులు—సాక్షాత్కార సూచనలు—సాక్షాత్కార లక్షణములు—ముక్తుని సంగరాహిత్యము—పుణ్యపాపములకు ముక్తుడు అతీతుడు, కాని పాపము చేయడు—ముక్తుడు : కర్మము**

## వివిధ ముక్తపురుషులు

932. ప్రకృతిశాస్త్రము పరిమితజ్ఞానమునుమాత్రమే ఒసగ గలదని జనులు గ్రహింపజాలకున్నారు. అఖండమగు నాత్మ సామ్రాజ్యమునుగూర్చి యది మన కెట్టి సందేశము నీయ జాలదు. అట్టి సందేశమును పురాణఋషిసత్తములవంటి బ్రహ్మద్రష్టలుమాత్రమే మనకు దెలిపియున్నారు. "బ్రహ్మ తత్త్వ మిట్టిది" అని చెప్పుటకు వారికిమాత్రమే అధికారము కలదు.

933. సిద్ధులు (ముక్తపురుషులు) లోకమున నైదువిధ ములుగా గాన్పించుచున్నారు. ఎట్లన :

(1) స్వప్నసిద్ధులు—కలలో ప్రబోధము నొంది ముక్తులగువారు.

(2) మంత్రసిద్ధులు—మంత్ర(జప)మూలమున ముక్తులగువారు.

(3) హఠాత్ సిద్ధులు—ఆకస్మికముగా నిధినిక్షేపము లను గనుగొనియో, శ్రీమంతురాలిని పెండ్లియాడియో,

ధనికుడయిన పేదవానివలె అకస్మాత్తుగా ముక్తులగువారు. ఇట్లే పాపాత్ములు అనేకులు ఎట్లో ఆకస్మికముగా పునీతులై ఆత్మసామ్రాజ్యమును బొందుదురు. (చూ. 680.)

(4) కృపాసిద్ధులు—భగవత్కృపచే ముక్తులగువారు. ఒక డడవిని నడుచుచుండగా వానికొక ప్రాచీన సరస్సో, భవనమో కాన్పించుననుకొనుము. ఆత డిక కష్టనష్టముల కోర్చి వానిని నిర్మించుకొననక్కఱలేదుగదా? ఇదే తీరున అత్యల్ప కృషితోడనే అదృష్టవశమున ముక్తులగువారు కొంద ఱుందురు. (చూ. 593.)

(5) నిత్యసిద్ధులు—జన్మతః ముక్తులై యుండువారు. సొర, గుమ్మడి మున్నగు తీగలందు మొగ్గలు విచ్చుటకు పూర్వమే పిందెలు కానవచ్చును. అటులనే నిత్యసిద్ధులు జన్మముతోడనే సిద్ధులై యుందురు. సిద్ధి పొందుటకు వారు చేయుచున్నట్లు కాన్పించు యత్నమంతయు—సాధనలన్నియు—లోకసంగ్రహార్థమే*—లోకమునకు మార్గదర్శకములుగా నుండుటకే. (చూ. 230, 300.)

934. శాక్తేయులు సిద్ధులను (ముక్తులను) కౌలు లందురు;

* "లోకసఙ్గ్రహమేవాపి సమ్పశ్యన్ కర్తుమర్హసి. 20
యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే." 21
—భగవద్గీత, కర్మయోగము.

(అర్జునా!) లోకసంగ్రహార్థమైనను నీవు కర్మము చేయదగుదువు. ఏలన, ఉత్తముడైనవాడు దేని నాచరించునో దానినే ఇతరులును ఆచరింతురు. అతడు దేనిని ప్రమాణముగా (లౌకిక వైదికములందు) అంగీకరించునో లోకమంతయు దానినే యనువర్తించును.

వేదాంతులు వారిని పరమహంసలందురు; బౌలసంప్రదాయిక వైష్ణవులు సాయులని చెప్పుదురు.

935. మామిడిపండు తిని యెవరికైన దెలియునేమో యని పెదవులను బాగుగా తుడుచుకొనువారు కొంద ఱుందురు; మఱికొందఱో, తమకొక మామిడిపండు దొరకి నంతనే ఇతరులను కేకవేసి పిలిచి వారితోగూడ దానిని పంచుకొని తిందురు. ఇట్లే కొందఱు బ్రహ్మసాక్షాత్కారము పొంది బ్రహ్మానందమునంతయు తామే యనుభవించుచుండ, మఱికొందఱు (సాక్షాత్కారమును బడసి) ఇతరులకుగూడ ఆదివ్యానుభవమును గలిగించువఱకును శాంతి నొందజాలరు. (చూ. 180.)

## సాక్షాత్కార సూచనలు

936. భగవంతుని గాంచిన మహనీయుడు నూతన వ్యక్తిత్వము నొందును—అపూర్వపరిణామము నొందును.

937. కొంద ఱిదివఱకే ప్రబోధము నొందియున్నారు. వీరియందు కొన్నిలక్షణములు గాన్పించును. గంగాయము నాది నదులును సప్తసాగరములును జలప్రపూర్ణములై యున్నను వానిని ముట్టక చాతకపక్షి వాననీటికై పరిత పించునట్లు వీరు భగవదితరవిషయములనుగూర్చి ప్రసంగింప నొల్లరు, విననొల్లరు. * దప్పికచే నోరాఱిపోవుచున్నను

---

* "తమేవైకం జానథ ఆత్మాన మన్యావాచో విముఞ్చథ."

(ఆతనిగూర్చియే—ఆపరమాత్మునిగూర్చియే— చింతింపుము, ఆత్మేతర ప్రసంగములను విసర్జింపుము.) —ముండకోపనిషత్తు, II-2-5.

చాతకపక్షి వర్షబిందువులనేకాని ఇతరమైననీటిని త్రాగదు. (చూ. 1002.)

938. భగవత్సాక్షాత్కారమునకు సూచన లేవి? అరుణ కాంతులు సూర్యోదయమును ప్రకటించునటుల స్వార్థత్యాగము, అమలత్వము, సచ్ఛీలము ననునవి స్వామి రాకను ముందుగ దెలుపును. (చూ. 766.)

939. రాజు సేవకునియింట విందారగింపబోవు నపుడు తన భాండారములనుండియే ఆసనములు, అలంకారములు, భోజ్యపదార్థములు—సమస్తము—ముందుగ నచటికి బంపును. అపుడు సేవకుడు తనస్వామికి తగినటుల గౌరవమర్యాదల నొనర్పగల్గును. అట్లే నారాయణుడు నరుని హృదయసింహాసనము నధిష్ఠింపబోవునపుడు ముందుగనె భక్తిప్రపత్తులను శ్రద్ధను అందు పాదుకొల్పును.

940. అంతరంగమున ఆనందము భగవత్సాక్షాత్కార సూచనలలో నొకటి. సముద్రమున పైభాగమునమాత్రమే అలలు చెలరేగుచుండును, కాని గంభీరమైన అడుగుభాగము నిశ్చలముగ నుండును.

941. బ్రహ్మానందామృతపానముచే మత్తత గలుగును. అట్టివాడు మద్యపానము చేయనక్కఱలేదు; మద్యపాయి వలెనే ఆతడు పూర్తిగా మత్తుడై కాన్పించును. నాదివ్య జననిపాదములను గాంచినంతనే నేను ఐదుబుడ్ల సారాయమును గ్రోలినంత మత్తుడ నగుదును. ఇట్టిస్థితిలో విచక్షణ విడిచి భుజించుటకు వలనుపడదు. (చూ. 816, 819.)

942. పరిపక్వహృదయుడగువాని స్థితి యెట్టిది? అగ్నిచే

పరిపక్వమైన దుంపగాని, వంకాయగాని బాగుగా మెత్తబడు నట్లు జ్ఞానాగ్నిచే పరిపక్వ హృదయుడగువాడు నవనీతకోమల మానసుడై వినమ్రుడై యుండును.

## సాక్షాత్కార లక్షణములు

943. ఎవ్వడు ఈలోకమున జీవించియుండియు మృతుడై యుండునో, అనగా శవమునందువలె ఎవ్వని కామక్రోధాదులు నిర్మూలమగునో అట్టివాడే ఆత్మజ్ఞాని. (చూ. 422.)

944. శ్రీగురుదేవుడు కేశవచంద్రసేనునితో నొకప్పు డిట్లుపల్కెను: "వేదాంతము నవలంబించి నీవింకను ఉన్నత తత్త్వములను బోధింప నారంభింతువేని, మీా సంప్రదాయము అడుగంటును. జ్ఞానదశలో సంప్రదాయములను నిర్మించుట అర్థరహితము—స్వప్నతుల్యము."

945. జ్ఞానప్రాప్తియైనపిమ్మట నరునకు భగవంతుడు దూరమున నెక్కడో కైలాసముననో, వైకుంఠముననో ఉన్నట్లు గోచరింపడు. అప్పుడు భగవానుడు, 'అతడు' అని గాక, 'ఇతడు, ఇది—అంతరాత్మయని' పొడకట్టును. భగవంతుడు సర్వాంతర్యామి; తన్ను వెదకు వారలకు భగవంతుడు గోచరించును. * (చూ. 739.)

946. నీట ముంచిన కడవకు లోపలను వెలుపలనుగూడ జలముండును. అట్లే భగవంతునియందు లయమొందిన జీవు

* క. ఇందుఁ గలఁ డందు లేఁడని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి చూచిన, నందందే కలఁడు దానవాగ్రణి వింటే.
—భాగవతము, ప్రహ్లాద చరిత్ర, 7—275.

నకు బాహ్యాభ్యంతరములందు అఖండాత్మయే గోచరించును. (చూ. 576.)

947. భగవత్సాక్షాత్కారము నొందినపిమ్మట భగవంతుడు సర్వత్ర, సర్వమునందును గోచరించును. కాని మఱియేయితరవస్తువునందుకంటెను నరునందు భగవంతుడు విశేషముగా ప్రకాశించుచుండును; అన్నిటియందుకంటెను ఎక్కువగా సత్త్వగుణప్రపూర్ణులగు భక్తులయందు—కామినీకాంచనమోహము లేశమునులేని మహనీయులయందు—వాని ప్రకాశము దేదీప్యమానమై యొప్పును. (చూ. 718.)

948. ఏమైనను భగవత్సాక్షాత్కారము నొందిన పిమ్మట భక్తుడు భగవానుని లీలలను సందర్శింపగోరుచుండును. రావణవధానంతరము శ్రీరామచంద్రుడు రాక్షసులనడుమ బ్రవేశించినంతనే నికాశ రాక్షసి (వృద్ధురాలయ్యును) పరుగెత్త నారంభించెను. అది గని లక్ష్మణుడు శ్రీరామచంద్రు నిట్లు ప్రశ్నించెను: "అన్నా! ఏమిది? ఈరక్కసి యింత వృద్ధురాలయ్యును, పుత్త్రిలను బోగొట్టుకొని యింత పుత్త్రశోకము ననుభవించియు, ప్రాణాపాయమునకు వెఱచి పరుగెత్తుచున్నదే?" రాముడామెకు అభయ మొసగి, దగ్గఱకు రమ్మని, పరుగెత్తుచున్నందులకు కారణ మడిగెను. రాక్షసి యిట్లు సమాధానము చెప్పెను: "ఓరామచంద్రా! నే నింతకాలము జీవించియున్నందువలననే నీ లీలను కన్నులార గాంచగల్గితిని. నీలీలలను ఇంకను సందర్శించుటకై మఱికొంతకాలము జీవింపగోరెదను."

949. ముక్తునియందు మాయ యుండునా? మేలిమి

బంగారముతో నగలను జేయుట పొసగదు. అందేదోకొంత కలితీ యుండవలయును. నరునకు శరీరమున్నంతవఱకు (అన్నపానాది) శరీరధర్మములను నిర్వహించుటకైనను కొంత మాయ యుండవలయును; పూర్తిగా మాయావిముక్తుడగు వాడు ఇరువదియొక్క దినములకంటె బ్రదుకడు. (చూ. 907.)

950. శరీరమునుండి మేకతలను ఖండించిన పిమ్మట మొండెము కొంత సేపు అటునిటు దొరలాడుచుండును. దానిచే శరీరమున నింకను ప్రాణమున్నదని తెలియవచ్చును. అటులనే ముక్తునియందు అహంకారము ఛేదింపబడినను ఆతడు తన శరీరధర్మములను సాగించుటకు జాలినంత మాత్రము అహంకారశక్తి నిలిచియుండును; కాని యది వానిని మఱల సంసారబద్ధుని జేయజాలదు.

951. 'పుట్టుట గిట్టుటకొఱకే' యనునట్లు నిర్మాణమైన యీ శరీరము నశింపకతప్పదు. కాని ఆత్మకు మరణము లేదు. పోకకాయ పండినప్పుడు పైడొక్కనుండి పోక వేఱుపడును; పచ్చిగానున్నప్పుడో, దానిని వేఱుచేయుట బహు కష్టము. బ్రహ్మప్రాప్తియైనంతనే ఆత్మ శరీరముకంటె భిన్నమను జ్ఞానము ఉదయించును. (చూ. 80.)

952. యూదులు శిలువపై ఏసుక్రీస్తును మేకులు గొట్టి బంధించినప్పుడు ఆతడు అంతటిబాధకు గుఱియైనను, "వారు క్షమింపబడుదురు గాక!" యని యెట్లు ప్రార్థింపగలిగెను? గునపముతో కొబ్బెరబొండమును ఒలుచునపుడు గునపము లోపలి ముక్కలోనికిగూడ దిగవచ్చును. కాని కురిడీకాయ సంగతి వేఱు, కురిడీ చిప్పనుండి వేఱుపడి లొటలొటలాడు

చుండును. అపుడు గునపముతో డొక్కలను ఒలిచినను కురిడీని అది తాకజాలదు. ఏసుక్రీస్తు కురిడీకాయవంటి వాడు. ఆతని యాత్మ శరీరమను చిప్పనుండి విడిపోయినది. కాబట్టి శరీరబాధ యాతని నంటలేదు. శరీరమున మేకుల నమాంతముగా గొట్టినను ఆతడు పరమశాంతముగా శత్రువుల క్షేమార్థము ప్రార్థనచేయగల్గినాడు. (చూ. 80.)

## ముక్తుని సంగరాహిత్యము

953. కొబ్బెరమట్ట పడిపోవునప్పుడు చెట్టుమీద ఆనవాలు నిలుచును, దానినిబట్టి అక్కడ నొకమట్ట యుండెడిదని గుర్తింపగలుగుదుము. అదేవిధముగా బ్రహ్మసాక్షాత్కారము నొందినవానియందు కామ క్రోధముల మచ్చలుమాత్ర ముండును. (చూ. 129.) అట్టివాని నైజము పసివాని నైజమును బోలి యుండును. పసివాని నైజమున సత్త్వ రజ స్తమోగుణములు బలపడియుండని కారణమున, అత డొకదానియందు ఎంత శీఘ్రముగా ఆసక్తుడగునో, అంత శీఘ్రముగనే దానిని విడిచిపెట్టును. వానియొద్ద చాల విలువగల రుమా లున్నదనుకొనుము. దాని నిమ్మని నీవు వానిని అడిగినయెడల, "నేను దీనిని ఎవరికిని ఈయను, మానాన్న నాకీ రుమాలు కొనిపెట్టినాడు" అని పట్టుదలతో మొట్టమొదట చెప్పినను గూడ, దమ్మిడీ ఖరీదుచేయని బొమ్మ నిచ్చి నీవు దానిని సంగ్రహింపగల్గుదువు. పసివానికి అందఱును సమానులే. 'వీరు కులీను' లనియు 'వీరు కులహీను'లనియు వానికి భేదభావము ఉండదు. అందుచే వానికి జాతిభేదము ఉండదు. వానితల్లి

యింకొకని జూపి, "వాడు నీయన్న" యని చెప్పిన జాలును, వాడు వడ్రంగివానికొడుకైనను సరియే—ఒక్క కంచములో వానితోగూడ భుజించుట కొడంబడును. వానియందు ద్వేషము గాని, శుచి, అశుచియు నను భేదభావముగాని యుండదు. (చూ. 503.)

954. ముక్తపురుషుడు లోకమున నెట్లు మెలగును? ఆతడు నీటి కాకివలె మెలగును. అది నీటిలో మునిగినను నీరు దాని యాకలను తడుపజాలదు; ఒకవేళ దానిశరీరమునకు నాలుగు చుక్కలు అంటుకొనినను, అది రెక్కలను టపటపలాడించి నంతనే అవి జలజల రాలిపోవును. (చూ. 268.)

955. (ఇచట 88-వ ప్రవచనము జదువుకొనుడు.)

956. కప్పపిల్ల తోక రాలిపోయినప్పుడు నీటిలోను మెట్ట మీదగూడ నివసింపగల్గును. భ్రాంతి గొలుపు అజ్ఞానమను తోక రాలిపోయిన మానవుడు ముక్తుడై స్వతంత్రుడగును. అప్పు డాతడు భగవంతునియందును సంసారమునందునుగూడ సమానముగనే నెలకొనియుండగలడు.

957. గాలి మంచిగంధపువాసనను, క్రుళ్లి కంపుగొట్టు శవముయొక్క దుర్గంధమునుగూడ సమానముగనే వహించును, కాని యది వానితో మిళితముకాదు. ఇటులనే ముక్త పురుషుడు సంసారమున జీవించుచుండియు దానితో మిళితము కాడు—బద్ధుడుకాడు. (చూ. 265, 266.)

958. పరుసవేది తాకున బంగారముగా మాఱిన యినుము నేలలో పాతిపెట్టినను, పెంటకుప్పలో పాఱవేసినను సరియే, బంగారముగనే యుండును—పూర్వపుస్థితికి దిగదు.

ఒక్కసారియైనను భగవత్పాదారవిందములను స్పృశించిన మానవోత్తముని విషయముకూడ నిట్టిదే. అతడు లౌకిక వ్యవహారాడంబరములలోనున్నను, ఏకాంతమగు వనప్రదేశముననున్నను నిర్లిప్తుడై యుండును—ఏకళంకమును వాని నంటదు. * (సూ. 966.)

959. పాలకు నీటిచేరిక గలిగించినయెడల వెంటనే రెండును కలిసిపోవును. కాని పాలను వెన్నగా మార్చితిమా, నీటిలో కలియుటకు బదులు దానిపై తేలియాడును. అటులనే జీవాత్మ బ్రహ్మభావమును బడసెనా, నిరంతరము, అనుక్షణము, అపరిశుద్ధాత్ములతో—సంసారబద్ధులతో — సహవాసము చేసినను ఆ దుష్టసాంగత్యముచే అణుమాత్రమును మాలిన్యము నొందదు. (సూ. 598.)

960. జీవుడును జగత్తును బ్రహ్మముతో అభిన్నమని యెవ్వడు స్వానుభవముచే గ్రహించునో అట్టివానిని పుణ్యపాపము లంటవు.

పుణ్యపాపములకు ముక్తుడు అతీతుడు, కాని పాపముచేయడు

961. బయలున నిలిచియున్నవాడు అల్పమగు గడ్డిని, ఉన్నతమగు మఱ్ఱిచెట్టును జూచి, "ఆహా! ఈ చెట్టెంత గొప్పది! ఆగడ్డి యెంత అల్పమైనది!" యనుకొనును. కాని

* "అరణ్యే సదనే తుల్యే సమాహితమనోదృశాం,
భవతామిహ భూతానాం భూతానాం మహతామివ."
—యోగవాసిష్ఠము, ౬-౫౬-23.

రామా! నిత్యసమాహితచిత్తులగు నీవంటివారికి ఆకాశాదిభూతములకువలె గృహారణ్యములు సమములే యగును.

యాతడే కొండ నెక్కి యెత్తగు దానిశిఖరమునుండి చూచు నప్పుడు గడ్డియు వృక్షమునుగూడ హెచ్చుతగ్గుల గుర్తింప రాని ఒకే పచ్చికబయలుగ గాన్పించును. ఇదేవిధముగా ప్రాపంచికులదృష్టికి పనులలో ఉచ్చనీచములు గోచరించు చుండును—ఒకడు మహారాజని, మఱియొకడు మాదిగవాడని, ఒకడు తండ్రియని, మఱియొకడు కొడుకని ఎన్నియో భేద ములు తోచుచుండును. కాని దివ్యదృష్టి—ఆత్మదృష్టి— ప్రాప్తించినవానికి సర్వము సమమై తోచును;—శుభాశుభ ములు, ఉచ్చనీచములు నను తారతమ్యములు రూపుమాసి పోవును.

962. భగవదున్మత్తుడగు నొకసాధువు శ్రీగురుదేవుడు నివ సించుచుండిన కాళికాలయమునకు వచ్చెను. ఒకనా డాతనికి భోజనము దొరకలేదు; ఆకలిగానున్నను ఆత డెవరిని యాచింపలేదు. సంతర్పణానంతరము ఒకవీధిమూల పాఱ వేయబడిన యెంగిలియాకులను నాకుచున్న యొకకుక్కకడకు పోయి యాతడు, "అన్నా! నాకు పాలీయకుండ నీవొక్కడవే తినుచున్నావా?" అని యాకుక్కను కౌగిలించికొని దానితో గూడ తిన నారంభించెను. * ఈవింత చెలికానితో ఇట్లు భోజన మైనపిమ్మట ఆసాధువు కాళీదేవ్యాలయమును జొచ్చి, ఆల

* శ్రీరామకృష్ణుని ప్రియశిష్యుడగు శ్రీ బ్రహ్మానందస్వామి 'గురూప దేశములు' (Words of the Master) అను తన గ్రంథమున ఈ సందర్భమున ఈక్రిందివిషయములనుగూడ తెలిపియున్నాడు:

"ఆసాధువు ఒకయన్నపుముద్ద నోటిలో బెట్టుకొని మఱియొక ముద్ద కుక్క నోటిలో బెట్టుచు, ఇద్దఱును మిత్రులవలె జతగా తిను

యములోనివారికెల్ల గగుర్పాటొదవునటుల మహాభక్త్యావేశ ముతో దేవిని ప్రార్థింపసాగెను. కొంతసేపటికి ప్రార్థనను ముగించి యాతడు వెడలిపోవుచుండుట గాంచి, శ్రీగురుదేవుడు తనబంధువుడగు హృదయుని ఆతనివెంట బోయి యాతనితో సంభాషించి రమ్మని పంపెను. హృదయుడు ఆతనివెంట కొంత దూరము పోవుసరికి ఆసాధుసత్తముడు వెనుకకు దిరిగి, "నీ వేల న న్ననుసరించుచున్నావు ?"అని యడుగగా, "స్వామీ! నాకేమేని బోధచేయుడు" అని హృదయుడు కోరెను. ఆ మహనీయు డిట్లు బోధించెను : " ఈమురికిగుంటలోని నీరును ఆ పావనగంగాజలమును నీ కెప్పుడు సమమై తోచునో, వేణుగానమును అల్లరిమూకలగోలయు నీకెన్నఁడు సమాన ముగా తోచునో అపుడు నీవు బ్రహ్మజ్ఞానము పొందినవాడ వగుదువు." హృదయుడు మరల వచ్చి యావాక్యములను విని పింప శ్రీగురుదేవు డిట్లు వచించెను : "ఆతడు బ్రహ్మజ్ఞాన మును—సమాధిస్థితిని—బొందిన మహనీయుడు. 'బాలోన్మత్త

---

చుండిరి. ఈవింతను జూచుటకై బహుజనులు వచ్చి యచ్చట గుమి కూడిరి, వారిలో కొందఱు ఆమహనీయుని జూచి, 'వట్టిపిచ్చివా'డని హేళనచేయుచు నవ్వ నారంభించిరి. అందుమీదట ఆమహనీయు డిట్లని యెను : 'ఎందుకు నవ్వెదరు ?...

శ్లో. "విష్ణూపరిస్థితో విష్ణుః, విష్ణుః ఖాదతి విష్ణవే,
 కథం హససి రే విష్ణో, సర్వం విష్ణుమయం జగత్."

తే. "విష్ణు వుపవిష్టుఁ డయ్యెను విష్ణుఁ గూడి, విష్ణు వన్న మిడుచునుండె విష్ణువునకు,
 విష్ణువా! యేల నవ్వెదు విష్ణుఁ జూచి, విష్ణువేకద యిది చూడ విష్టపముల ?"

పిశాచవత్' అనునట్లు సిద్ధుడు(అనగా ముక్తుడు) బాలునివలె, పిచ్చివానివలె, పిశాచమువలె—అనేక విధములుగా తిరుగాడుచుండును — అనేకవిధములుగా నటించుచుండును." (చూ. 969.)

963. పరమహంసస్థితి పసిబాలుని స్థితిని బోలును. ఐదేండ్ల బాలునికివలె వానికి స్త్రీకిని పురుషునకును భేదమే తోపదు. ఐనను లోకులకు మార్గదర్శకుడుగా నుండుటకై యాతడు స్త్రీలవిషయమై జాగరూకుడై మెలగవలయును. (చూ. 419.)

964. ఒకప్పుడొకసన్న్యాసిని జనకునికొలువుకూటమునకు వచ్చెను. ఆమెముఖము నవలోకింపకుండ రాజామెకు వంగి నమస్కరించెను. అది గని సన్న్యాసిని యిట్లు పల్కెను: "జనకా! నీ కింకను స్త్రీనిగూర్చి యింత భయముండుట ఎంత విచిత్రము!" బ్రహ్మజ్ఞానము నొందినవాని నైజము కేవలము పసివాని నైజమును బోలును—ఆతడు స్త్రీపురుషులకు భేదమును పాటింపడు. (చూ. 437.)

965. (సరేకాని) జ్ఞానియం దీలోకమున గోచరించు స్వల్పదోషములు అంతగా గమనింపదగినవి కావు. చంద్రమండలమున గోచరించు మచ్చలు చంద్రుడు తనకాంతులను వెదజల్లుటకు అడ్డువచ్చుట లేదుగదా!

966. పరుసవేదిని తాకిన ఉక్కుకత్తి బంగారుకత్తిగా మారును. అప్పుడు దాని యాకారము మాఱకున్నను దాని వలన దేనికిని హానికలుగజాలదు. అట్లే భగవత్పాదారవిందములను స్పృశించిన మనుజుని రూపు మాఱకున్నను ఆతడేదుష్కార్యమును జేయజాలడు. (చూ. 958.)

967. దివ్యమగు నద్వైతజ్ఞానమును నీకొంగున ముడి వేసికొని నీ యిచ్చవచ్చిన కార్యముల నొనర్పుము. * నిజమగు నద్వైతజ్ఞానివై యున్నపుడు నీవలన నేదుష్కార్యమును జరుగనేరదు.

968. ఒకసాధువు జనాకీర్ణమైన వీధినుండి పోవుచు, పొరపాటున ఒక దుష్టుని కాలివ్రేలిని త్రొక్కెను. ఆదుష్టుడు కోపావేశపరవశుడై సాధువును స్మృతితప్పి పడిపోవునటుల నిర్దయుడై మోదెను. ఆ సాధువుశిష్యులు అనేకోపచారములు సలిపి యాతనికి స్మృతిగలిగించుటకై చాల శ్రమపడిరి.

---

* ఇయ్యది శ్రీరామునకు వసిష్ఠుని యీ క్రిందియుపదేశమునకు సరివచ్చును :

"పూర్ణాం దృష్టి మవష్టభ్య ధ్యేయత్యాగవిలాసినీమ్,
జీవన్ముక్తతయా స్వస్థో లోకే విహర రాఘవ. 18-17.
ప్రవిచార్య దశాః సర్వా యదతుచ్ఛం పరమ్పదమ్,
తదేవ భావే నాలమ్బ్య లోకే విహర రాఘవ. 18-20.
జ్ఞాతవానసి సర్వేషాం భావనాం సమ్యగ న్తరం,
యథేచ్ఛసి తథాదృష్ట్యా లోకే విహర రాఘవ." 18-23.

—యోగవాసిష్ఠము, ఉపశమప్రకరణము.

"ఓ రామా! ధ్యేయవాసనాత్యాగయుక్తమగు పూర్ణదృష్టి, అనగా అద్వైతదృష్టి నవలంబించి, జీవన్ముక్తి నాశ్రయించి, స్వస్థచిత్తుడవై లోకమున విహరింపుము... సాంసారిక పారమార్థికదశల నన్నింటిని జక్కగా విచారించి మహత్తరమగు బ్రహ్మపదమునే భావముచే నాశ్రయించి లోకమున విహరింపుము... రామా! పదార్థములన్నింటి సారాసారములను నీవు బాగుగా నెఱిగియున్నావుగాన, ఇక నీయిచ్చవచ్చిన దృష్టి నవలంబించి లోకమున విహరింపుము."

కొంచెము స్మృతి వచ్చుచుండుట గాంచి వారిలో నొకడాతని నిట్లు ప్రశ్నించెను : "స్వామీ! మీకు ఈ యుపచారములు చేయున దెవరో గుర్తింపగలరా?" "ఆహా! నన్ను కొట్టిన యతడే, (—పరమాత్మయే,) సందేహమేమి ?" అని సాధువు సమాధానించెను. నిజమైన సాధువునకు శత్రువని, మిత్రుడని భేదభావము ఉండదు. † (చూ.1120.)

## ముక్తుడు : కర్మము

969. బ్రహ్మసాక్షాత్కారము నొందినవాడు, 'ఇది శౌచము, ఇది యశౌచము' ననుభేదభావములేక యొకప్పుడు పిచ్చివానివలెను మఱియొకప్పుడు పిశాచమువలెను సంచరించుచుండును; బాహ్యాభ్యంతరములందంతటను బ్రహ్మమును గాంచుచు, ఒకప్పుడు స్థాణువువలె నిశ్చేష్టుడై యూరకుండును; ఒక్కొక్కప్పుడు పసివానివలె బట్టలను చంకను బెట్టుకొని తిరుగులాడుచు దేనియందును ఆసక్తుడు గాకుండును; కాని పరహితార్థమై కృషిచేయునపు డాతడు సింహపరాక్రముడై యొప్పును. (చూ. 316, 319, 962.)

970. సమాధిస్థితిని బొందినవెనుక సర్వకర్మములును తొలగిపోవును—బాహ్యపూజలు, తావళముతో జపించుట,

---

† "మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే." —భగవద్గీత, 14-25.

మానావమానములందు సమదృష్టిగలవాడును, శత్రుమిత్రులయందు సమమైన మనస్సుగలవాడును, సర్వారంభములను—అనగా సమస్త సంకల్పములను—పరిత్యజించినవాడును త్రిగుణాతీతుడని చెప్పబడును.

లౌకిక కార్యములు మొదలగునవన్నియు తొలగిపోవును. ప్రారంభదశలో కర్మాడంబరము విశేషముగా నుండును. కాని భగవత్సాన్నిధ్యమును బొందినకొలదియు ఈగందర గోళము తగ్గిపోవును; తుదకు ప్రార్థన, భగవన్నామసంకీర్తనమును గూడ అంతరించును. (సాధారణబ్రాహ్మసామాజికుడగు శ్రీ శివనాథశాస్త్రిని సంబోధించుచు): (సభ జరుగునపుడు) మీరు సభకు రాకుండునంతవఱకు మీగుణగణములను గూర్చియు, పేరుప్రతిష్ఠలనుగూర్చియు సభ్యులు చెప్పుకొనుచుందురు; కాని మీరు లోనికి వచ్చినంతనే ఆప్రసంగములన్నియు కట్టువడును. అందఱును మిమ్ములను జూచి యానందముతో, "ఇదిగో, శివనాథబాబు వచ్చుచున్నారు" అని మాత్రమే పలుకుదురు—తదితరప్రసంగములన్నియు అంతరించును. (చూ. 153, 816, 835.)

971. క్రొత్తగా కాపురమునకు వచ్చిన యువతి గృహకృత్యములలో మునిగి తేలుచుండును—కాని యిది యంతయు నామెకు బిడ్డపుట్టువఱకే. బిడ్డ పుట్టినంతనే ఆమె సామాన్య గృహకృత్యములను విడిచివేయ నారంభించును—వానియందామెకు ఉత్సాహము ఉండదు. అందులకుబదులు ఆమె తన బిడ్డను దినమంతయు లాలనచేయుచు, ఆనందముతో ఎత్తుకొని ముద్దులాడుచుండును. ఇదేతీరున అజ్ఞానదశలో నున్నంతవఱకు నరుడు నానావిధకర్మములను జేయును తీఱిక యనునది లేకుండును. కాని తనహృదయమున భగవంతుని యునికిని గాంచినంతనే వానికిక కర్మకలాపమున రుచి తగ్గిపోవును. ఇక నాతడు కేవలము భగవంతుని సేవించుటలో—

వాని యాజ్ఞను బరిపాలించుటలో—ఆనందము గాంచుచుండును. ఇతరవ్యాపారములు అతని కికనెంతమాత్రము రుచింపవు. ఆతడిక దైవసంసర్గమువలనగలుగు నానంద పారవశ్యమును బోగొట్టుకొన నొల్లడు. (చూ. 816, 997.)

972. భగవత్సాక్షాత్కారము నొందినపిమ్మట ప్రపంచము మిథ్యగా గాన్పింపదు. భగవద్దర్శనము నొందినవానికి ఈజీవజగత్తులన్నియు భగవత్స్వరూపములుగనే గోచరించును. (చూ. 544.) అట్టివాడు తన బిడ్డలను పోషించుచు, గోపాలునే పోషించుచున్నట్లు భావించును; తలిదండ్రులను లక్ష్మీనారాయణులనుగా గాంచుచు, వారలను సేవించును. భగవత్సాక్షాత్కారమును బొందినయనంతరము ఎవ్వడేని గృహస్థుడుగ నుండి సంసారముచేయుచున్నను భార్యతో సంభోగింపబోడు.* భార్యాభర్తలిరువురును భక్తులై ప్రార్థనాదికములతో కాలము గడపుచుందురు. సర్వభూతములందును భగవంతుని గాంచుచు, వారు సర్వభూతసేవ చేయుచుందురు—అన్నిటియందును భగవంతునే పూజింతురు.

---

* మఱియొకతావున, ఇదే సందర్భమున, శ్రీగురుదేవుడు, "అట్టి గృహస్థుడు ప్రాయికముగా భార్యతో సంభోగింపడు" అని పలికియున్నాడు.

ఇరువదవ ప్రకరణము

# స్వవచనములలో శ్రీ గురుదేవుని కొన్ని దివ్యానుభవములు

బాల్యదశానుభవములు — తాంత్రికాదిసాధనలు — నిర్వికల్పానుభవము — గురుదేవుని నిరంతర బ్రహ్మానుభూతి — గురుదేవు డెట్లు ప్రార్థించెను ? — కీడుమేళ్లలో సమానముగనే భగవంతుడు గలడు— తన వ్యాధినిగూర్చి గురుదేవుని యభిప్రాయము — మానవత్వమును దైవత్వమును గురుదేవునందు సమ్మేళనమొందిన విధానము

## బాల్యదశానుభవములు

973. చదువునుగూర్చి యశ్రద్ధ చేయుచుండెనని బాల్యమున తన యన్న రామకుమారు డొకప్పుడు తన్ను మందలింప, శ్రీ గురుదేవు డిట్లు సమాధాన మొసగెను: "అన్నా! ఈ పొట్టకూటిచదువు నా కెందులకు? ఇందులకు బదులు ఆత్మవికాసమును గలిగించి శాశ్వతానందము నొసగు జ్ఞానమును నే నార్జింపగోరుదును."

974. పారమార్థికజీవితమున ప్రారంభదశలో శ్రీ గురుదేవుడు రాత్రికాలమున ఏకాంతవనప్రదేశమున దిగంబరుడై, యజ్ఞోపవీతమును గూడ విసర్జించి ధ్యానించుచుండుట గురుదేవునకు వరుసను కుమారు డగు హృదయుడు * కనుగొని,

---

* ఈతడు గురుదేవునకు అత్త (తండ్రి చెల్లెలు) కూతురగు హేమాంగినీదేవి పుత్త్రుడు. ఈతని పూర్తినామము హృదయరామ ముఖోపాధ్యాయుడు.

"ధ్యానమునకు దిగంబరత్వ మెందుల" కని ప్రశ్నించెను. గురుదేవు డిట్లు సమాధానమొసగెను: "బంధరహితుడై సాధకుడు ధ్యానింపవలయును. పుట్టినదాది మానవుడు అసహనము, లజ్జ, అభిజాత్యము (అనగా గొప్పవంశమున జన్మించితినను గర్వము), సంఘమర్యాద, భయము, ప్రతిష్ఠ, కులాభిమానము, అహంకారము ననునట్టి యెనిమిదివిధమైన సంకెలలచే బద్ధుడగుచున్నాడు. జందెము గూడ బంధమే—ఇది యహంకారచిహ్నము—తాను బ్రాహ్మణుడననియు ఇతరులందరికంటె నధికుడననియు గర్వింపజేయును. కాబట్టి జగజ్జననిని ధ్యానించునపుడు ఈ బంధముల నన్నిటిని త్రోసిరాజని బంధరహితుడై యుండవలయును."

975. శ్రీ గురుదేవునకు భగవత్పరితాపము తీవ్రము కాజొచ్చెను—భగవత్ సాక్షాత్కారము లేని జీవితము దుర్భరమై తోచెను. ఆతడిక హతాశుడై జీవితము నంతమొందించుకొన బ్రయత్నించునంతలో అకస్మాత్తుగా సాక్షాత్కారము లభించెను. తన దివ్యానుభవమును శ్రీ గురుదేవు డిట్లు వర్ణించెను: "తలుపులతో, కిటికీలతోగూడ ఆ గదియు ఆలయమును నాచుట్టునున్న సమస్తము క్షణములో అదృశ్యమయ్యెను. ఇక నేమియు లేనట్లు తోచెను. దేదీప్యమానమగు ననంత చైతన్యసాగరము మాత్రమే నాకు గోచరింపసాగెను. ఏవైపుజూచినను—అన్ని దిశలనుండియు—ఆదివ్యసాగర మహోత్తుంగతరంగములు నావైపు ఉవ్వెత్తుగ వచ్చుచుండెను. అచిరకాలముననే యవి నాపై బ్రసరించి నన్ను ముంచివేసెను. దానిచే శ్వాసలు కట్టువడ బాహ్యస్మృతి

రహితుడనై పడిపోయితిని.'' ఈ యనుభూతినే తెలుపుచు మఱి యొకప్పు డిట్లు పలికెను: '' ఆ దివ్య సాక్షాత్కారముచే పరవశుడనై గదిలో నేలపై బడిపోయితిని. బాహ్యలోకమున నేమి జరుగుచుండెనో నాకప్పుడు స్ఫురణయే లేదు—నాడును మఱునాడును ఎట్లుగడచెనో నాకు ఎఱుకయే లేదు. నా యంతరంగమున అనిర్వచనీయానందసాగరము—అంతకు ముందు నే నెన్నడనుభవింపని దివ్యానందము—ప్రసరించుచుండెనని మాత్రమే నాకు అప్పుడు ఎఱుక. ఐనను నా దివ్యజనని భవ్యసాన్నిధ్యము మాత్రము నా హృదయాంతరాళమున భాసించుచునే యుండెను.''

976. కాని యీ భగవదనుభవము గురుదేవునకు నిరంతర బ్రహ్మానుభూతిని గల్గింపజాలదయ్యె. దివ్యానుభవ రహితుడై, పరితప్తహృదయుడై యాతడు దినములు గడపవలసి వచ్చెను. నిరంతరబ్రహ్మానుభూతికై యాతడు అఖండావేదనతో బాష్పధారలు ప్రవహింప వెక్కివెక్కి యేడ్చుచు తన దివ్యజననిని ప్రార్థింపసాగెను. ఆ సమయమున దన మనఃస్థితిని దెలుపుచు గురుదేవు డిట్లు పలికియున్నాడు: '' జనులు నా చుట్టును(రోదనచేతను ప్రార్థనలచేతను ఆ కృష్టులై) మూగిన యెడల వారు కేవలము నాకు నీడలవలెను తెరపై వ్రాయబడిన బొమ్మలవలెను—అంత మిథ్యగా—అంతమాయగా—దోచెడివారు: అందుచే నాకెట్టి లజ్జయు గలిగెడిది కాదు. కాని దుర్భరావేదనచే బాహ్యస్మృతిరహితుడనైనపుడెల్ల, ఉత్తరక్షణముననే దేదీప్యమానమగు స్వరూపమున దివ్యమాతృదర్శనము లభించెడిది. ఆ భవ్యరూపము ఒకప్పుడు

నవ్వుచు, ఒకప్పుడు నాతో సంభాషించుచు, మఱియొకప్పుడు నాకు సదుపదేశము లొనర్చుచు, నన్నోదార్చుచు సాక్షాత్కరించెడిది.''

977. తీవ్రభగవత్పరితాపమున గడచిన యీ దినములను వర్ణించుచు శ్రీ గురుదేవు డిట్లు వచించువాడు: ''ఆ సమయమున శరీరశౌచమును గూర్చినమాటయే నాకు గుర్తులేకుండుటచే తలవెండ్రుక లెదిగి ధూళితో గూడుకొని జడలు కట్టుకొనిపోయెను. ధ్యానమున గూర్చుండునపుడెల్ల తీవ్రచిత్తైకాగ్రతచే శరీరము నిశ్చలమై కట్టవలె కొయ్యబడువాఱి పోయెడిది. శరీరమును స్థాణువనుకొని పక్షులు నిర్భయముగా వచ్చి తలపై వ్రాలి ఆహారముకోసము జడలను వెదకుచు పొడుచుచుండెడివి. (చూ. 612, 613.) ఒక్కొక్కప్పుడు తీవ్రభగవద్విరహవేదనచే మొగము నేలను బెట్టి రాచుకొన. గాయములై రక్తము వచ్చెడిది. ధ్యానముతో, ప్రార్థనలతో, భక్తిసాధనలతో, దినములు అట్టె నిమిషములవలె గడచిపోవ, నాకపుడు వానినిగూర్చిన యెఱుకయే లేకుండెడిది. సంధ్యాసమయమున ఆలయమునుండి శంఖఘంటారవములు ఘోషింప పగలు గడచి రాత్రియగుచున్నదని నాకపుడు స్మరణకు వచ్చెడిది. ఆ యెఱుకతోబాటు నిరాశాదుఃఖము నన్నలముకొన నేలపైబడి పొరలాడుచు, మొగమును నేలను రాచుకొని యిట్లు బొబ్బలుపెట్టువాడను: ''ఓతల్లీ! ఒక దినము గడచిపోయినది. నా కింకను నీవు ప్రసన్నవు గావైతివిగదా!'' హృదయము అంపముతో కోయబడినట్లు తోప నేలపైం బొరలాడుచు, నేను పడువేదనను గాంచినజనులు, 'అయ్యో,

పాపము! ఈతఁ డేదియో శూలచే బాధపడుచున్నాఁడు కాబో లును' అనుకొనెడివారు.''

978. తనవివాహానంతరము గురుదేవుఁడు తిరిగి దక్షిణే శ్వరమునకు వచ్చినంతనే మఱల దివ్యోన్మత్తుఁడయ్యెను. ఆ దినములలో తన మనఃస్థితినిగూర్చి గురుదేవు డిట్లు పలికి యున్నాఁడు : ''నా మనశ్శరీరము లనుభవించిన దివ్యపరిణామ మున మఱెవ్వరైనను నాలవవంతు అనుభవించినను గూడ ఈ పాటికి పరమపదించియుందురు. (తన్నుద్దేశించుచు) ఈ శరీరమునకు గూడ ఆ గతియే పట్టెడిది; కాని యదృష్టవశ మున (ఆ దశలో) విశేషకాలము దివ్యమాతృదర్శనముచే గలిగిన బాహ్యవిస్మృతితో గడపితిని. అటుపైని ఆఱేండ్ల పర్యంతము కంటి కొక కునుకైనను రాలేదు—ఎంత ప్రయ త్నించినను ఱెప్పలు మూతపడెడివే కావు. కాలమే అప్పుడు నాకు స్ఫురించెడిది కాదు; శరీరస్మృతి పూర్తిగా నమసి పోయెను. మనస్సు జగజ్జననిని విడిచి శరీరముమీఁదికి లేశము మఱలినను గూడ ఘోరభయము నన్నావహించెడిది. నిజ ముగా నాకు పిచ్చియెత్తినదా యని తలఁచు భయపడువాఁడను. అద్దమునెదుట నిలిచి కంటిని వ్రేలితో పొడుచుకొందునుగదా, మూతపడదే! స్పర్శానుభవమైన పొందదే! ఈ స్థితిని గాంచి భయభ్రాంతుఁడనై కన్నీరొలుక విలపించుచు జగజ్జనని నిట్లు ప్రార్థించువాఁడను : 'అమ్మా! జగజ్జననీ! కేవలము నిన్నే నమ్ముకొనియుండుటకును నా ప్రార్థనలన్నిటికిని ఇదియా ఫలము! నా కీ కుదురని వ్యాధిని దెచ్చిపెట్టితివా!' కాని మరుక్షణముననే, 'అమ్మా! నా శరీరమున కేగతి పట్టినను

నీవు మాత్రము నన్ను విడనాడకుము! నీ సందర్శనమును కృపను నాకు ప్రసాదింపుము! తల్లీ! నీ దివ్యపాదారవిందములనే అనన్యగతిగా నమ్ముకొనియున్నాను గదా? నీకంటె నాకు దిక్కెవ్వరు?' బాష్పములు ఒలుక నిట్లు వేడుకొనన నా మనస్సునకు అపూర్వోత్సాహము గలిగెడిది; శరీరముపై పరమానసహ్యము జనించెడిది. అపుడు దివ్యమాతృదర్శనానందమున,—ఆమె న నోక్షదార్ఢ్యవచనముల మైమఱచువాడను.''

979. శ్రీగురుదేవుని పరిశుద్ధమానసమే యాతనికి ప్రథమగురువై, ప్రధానగురువై యొప్పెను. ఇవ్విషయమునుగూర్చి శ్రీగురుదేవు డిట్లు వచించియున్నాడు: ''అవసరమైనప్పుడెల్ల నాశరీరములోపలినుండి సరిగా నావలెనే కాన్పించు నొక బాలసన్న్యాసి వెలువడి నాకు సర్వము బోధించువాడు. ఈవిధముగా నాతడు వెలువడ నొక్కొక్కప్పుడు కొంచెము బాహ్యస్ఫురణ గలిగియుండెడివాడను, మఱియొక్కొక్కప్పుడు ఆతని సాన్నిధ్యమును చేష్టలను కనిపట్టుటతప్ప, ఇతరమైన బాహ్యస్ఫురణమును పూర్తిగా గోల్పోవువాడను. ఆతడు మఱల నా శరీరమున ప్రవేశించినంతనే బహిఃప్రజ్ఞ నొందువాడను. పూర్వము ఆతనివలన వినిన బోధలనే బ్రాహ్మణివలనను శ్రీ తోతాపురివలనను తదితరులవలనను వినియున్నాను. ఆతడు నా కుపదేశించిన తత్త్వమునే పిమ్మట ఈ గురువులందఱివలనను గ్రహించినాను.''

## తాంత్రికాది సాధనలు

980. భైరవీబ్రాహ్మణియొక్క గురుత్వమున తా నభ్య సించిన తాంత్రికసాధనలనుగూర్చి శ్రీగురుదేవు డిట్లు వచించెను: "బ్రాహ్మణి పగలు దక్షిణేశ్వరమునుండి యెచ్చ టెచ్చటికో వెడలి తంత్రశాస్త్రమున సాధనకు ఆవశ్యకమని చెప్పబడిన వివిధవస్తువులను సేకరించెడిది. చీకటిపడుచుండగా ఆమె నన్ను నియమితమైన యోగ ఆసనముకడకు రమ్మని పిలిచెడిది. నేను వెడలి కాళీపూజ నొనర్చి యామె యుప దేశముననుసరించి ధ్యానింప నారంభించువాడను. జపమాలను చేపూని జపింపబోవుదునుగదా, దివ్యావేశపరవశుడనై సమాధినిమగ్నుడ నయ్యెడివాడను. అందుచే జపమునకు ప్రారంభముననే స్వస్తియగుచుండెడిది. అపుడు నాకెట్టి యద్భుతదివ్యదర్శనములు గలిగెడివో యిపుడు వివరింపజాలను. అయ్యవి ఒకదానివెంబడి నొకటి అతిత్వరితముగా భాసించెడివి. ఆ సాధనల ఫలిత మపుడు నాకు వెంటనే ప్రత్యక్షమగుచుండె డిది. ముఖ్యమైన అరువదినాలుగు తంత్రములందును జెప్ప బడిన వివిధసాధనలనన్నిటిని బ్రాహ్మణి నాచే జేయించెను. వీనిలో అనేకము అత్యంతదుస్సాధ్యమైన సాధనలు. ఏలన సాధారణముగా సాధకులనేకులు వీని నాచరింపబోయి భ్రమ ప్రమాదములకు లోనగుచుందురు—పతితు లగుచుందురు. కాని, అమ్మ కృపాకటాక్షమున వీనినన్నిటిని నిరపాయముగా, నిశ్శంకముగా ఆచరింపగల్గినాను."

981. కుండలినీప్రబోధమును వర్ణించుచు శ్రీగురుదేవు డిట్లు వచించెను: "ఈ యనుభవము పొందినపుడు సరిగా

నావలెనే గాన్పించు నొకవ్యక్తి వెలువడి నా యిడాపింగళా సుషుమ్నానాడులను పూర్తిగా గదల్చివైచువాడు. షట్చ క్రములందలి పద్మములను ఆతడు తననాలుకతో నాక, వాలి యున్న యవి ఒక్కుమ్మడి తలలెత్తెను. తుదకు సహస్రార కమలము పూర్ణవికాసము నొందును.'' (చూ. 905, 906, 907.)

982. మహమ్మదీయమతసాధనల నాచరించినప్పుడు తన మనఃస్థితిని వర్ణించుచు శ్రీగురుదేవు డిట్లు తెల్పెను: ''నే నపుడు అల్లా నామస్మరణముచేయుచు, మహమ్మదీయుల వలెనే బట్టలను ధరించుచు, యథావిధిగా నమాజు చేయు చుండెడివాడను. మనస్సునుండి హిందూభావములన్నియు పూర్తిగా పలాయనమగుటచే హిందూదేవతలకు నేను నమస్కరింపకుండుటయే కాక, వారిని దర్శింపవలయునని నా కపుడు బుద్ధికూడ పుట్టెడిది కాదు. ఈవిధముగా మూడునాళ్లు సాధనచేసిన పిమ్మట ఆసాధన గమ్యమును బొందితిని.''

983. ఒకప్పుడు నేను హిందూమతము, మహమ్మదీయ మతము, క్రైస్తవమతము మొదలగు వివిధమతముల నవలం బించుటయే కాక, హిందూమతమున మఱల వైష్ణవ శాక్తేయ వేదాంతాదిసంప్రదాయముల నవలంబించి సాధనలుచేసితిని. వివిధమార్గముల ననుసరించుచున్నను అన్నియు ఒకేగమ్య మును బొందుచున్నవని కనుగొంటిని. (487-వ ప్రవచనమును టిప్పణిని జూడుడు.)

984. తనకు ప్రియుడును తనయన్నకుమారుడునగు అక్ష యునిమరణమును గాంచినప్పుడు శ్రీగురుదేవుడు మనుజు

డెట్లు మరణించునో ప్రత్యక్షముగా గాంచెను. ఈ యనుభవ మునుగూర్చి శ్రీగురుదేవు డిట్లు పలికియున్నాడు: "అక్షయుడు నాకన్నెదుటనే మరణించెను. అందులకు నే నెంతమాత్రము విచారింపలేదు. ప్రక్కను నిలుచుండి నేను మనుష్యు లెట్లు మరణింతురో చూచితిని. అది ఒఱనుండి కత్తిని పైకి దీయుటవంటిది. కత్తి యెప్పటిదే, కాని ఒఱమాత్రము దిగ విడువబడినది. ఈ దృశ్యమును జూచి నే నానందమున నవ్వుచు, పాడుచు, నృత్యముచేసితిని. వారు కళేబరమును దీసికొనిపోయి దహనమొనర్చిరి. కాని మఱునాడు నే నక్కడ (తనగదిప్రక్క నున్న వసారాను జూపుచు) నిలిచియుండగా, అక్షయుని మరణమునకై నాకు దుర్భరమైన వేదన కలిగినది—తడి బట్టను పిండునట్లు ఎవ్వరో నా హృదయమును మెలిపెట్టి పిండుచున్నట్లు అఖండబాధపడితిని. ఆశ్చర్యపడి, నాకు జగజ్జనని బుద్ధిచెప్పుచున్నదని తలచితిని. ఈ శరీరముతోడనే నాకు ప్రమేయములేదే! ఇక నాసోదరుని కుమారునితోడనా నాకు సంబంధము! ఐనను వానిమరణమునకై నేనే యింత బాధపడినప్పుడు తమయాప్తులు గతించునపుడు గృహస్థు లెంతగా కుందుదురోకదా!"*

*శకుంతలయెడబాటున కణ్వమహర్షిసైతము పొందిన దుఃఖమును కాళిదాసు ఇటులనే వర్ణించియున్నాడు:

ఉ. "కొండలమంద డెందము శకుంతల తా నిపుడేగునంచయో
క్రందుగ బాష్పరోధమునఁ గంఠమునుం జెడె దృష్టి మాంద్యముం
బొందె; నొకింత పెంచిన తపోధనులే యిటు కుంద నెంతగాఁ
గుందుదురో తమంతఁ గను గూఁతులఁ బాయు గృహస్థు లక్కటా!"

—అభిజ్ఞానశాకుంతలము, వీరేశలింగకవి యనువాదము.

## నిర్వికల్పానుభవము

985. తననిర్వికల్పసమాధ్యనుభవమును వర్ణించుచు శ్రీగురుదేవు డిట్లు తెల్పెను: "ఉపదేశానంతరము దిగంబరుడు† అద్వైతవేదాంతసిద్ధాంతములను నాకు బోధింప మొదలిడెను. సర్వవిషయములనుండియు మనస్సును ఉపసంహరించుకొని ఆత్మలో నిమగ్నుడవుకమ్మని చెప్పెను. కాని నే నెంత ప్రయత్నించినను నామరూప ప్రపంచమును దాటి నిరుపాధిక స్థితికి మనస్సును దీసికొనిపోజాలకపోతిని. ఇతరవిషయముల నుండి మనస్సును మఱల్చుట నాకు కష్టమనిపించలేదు గాని కేవల చైతన్యసారమై, దేదీప్యమానమై యొప్పు శ్రీలోకేశ్వరిరూపము నాకు మిగుల చనవైన కారణమున ఆ దివ్యస్వరూపము నాకు సత్యస్వరూపమున ప్రత్యక్షమై నామనస్సును నామరూపప్రపంచమును దాటిపోనీయకుండెను. ఎన్నిసారులు అద్వైతముపై మనస్సును నిలుపబ్రయత్నించినను ప్రతిపర్యాయమును ఆ రూపము నాకు అడ్డువచ్చుచునే యుండెను. అప్పుడిక నిరాశుడనై, 'ఇది నాకు సాధ్యముకాకున్నది. నా మనస్సును నిరుపాధికస్థితికి గొనిపోయి ఆత్మను 'ముఖాముఖిని' దర్శింపజాలకున్నాను' అని దిగంబరునితో జెప్ప, నాతడొకించుక కోపదృష్టితో నిట్లు నిష్ఠురముగ బలికెను: 'ఏమి! నీకిది సాధ్యముకాకున్నదా? చూచెదను. నీకిది సాధ్యమై తీరవలెను!' అంతలో నాత డేదియో యొక వస్తువుకొఱకు

† తనగురునియందలి పూజ్యభావముచే శ్రీగురుదేవుడు దిగంబర నాగసన్న్యాసియగు శ్రీ తోతాపురి నిట్లు సూచించుచువాడు.

చుట్టుపట్ల పరికించి, యొకగాజుపెంకు గనబడ, దానిని గైకొని నాకనుబొమలనడుమ నొక్కి, 'సూటిగా మనస్సును ఇక్కడ కేంద్రీకరింపుము' అని చెప్పెను. అంతట కృతనిశ్చయుడనై మఱల ధ్యానమునకు గూర్చుండి జగజ్జననిదివ్యరూపము కాన్పింపగనే వివేకమను ఖడ్గముతో ఆరూపమును ఖండించితిని. ఇకనేమియు అంతరాయము లేకుండుటచే అయ్యది (మనస్సు) దృశ్యప్రపంచమును దాటి రివ్వున పై కెగసిపోవ (నిర్వికల్ప) సమాధినిమగ్నుడ నైతిని."

986. ఒక్కుమ్మడి ఆఱునెలలవఱకు నేనాస్థితి (నిర్వికల్ప సమాధి)లో నుంటిని. సామాన్యమానవుండు ఆస్థితిని బొందినచో మఱల నందుండి వెలువడరు—మూడువారములైనపిమ్మట శరీరము పండుటాకువలె రాలిపోవును. రేయింబవళ్లు ఎఱుకయే నాకు లేకుండెను. శవమునందువలె నానోటిలోను ముక్కుపుటములలోను ఈగలు దూరుచుండెడివి; కాని వానియెఱుకయే నాకు లేకుండెడిది. ధూళిధూసరితములై తలవెండ్రుకలు జడలుకట్టెను. నాకు తెలియకుండగనే ఒక్కొక్కప్పుడు మలమూత్రవిసర్జన మగుచుండెడిది. దైవవశమున దక్షిణేశ్వరమున కపుడొక సాధువు వచ్చి నాకు పరిచర్యలు చేసి యుండనిపక్షమున ఈ శరీరము నిశ్చయముగా నశించియుండెడిది. ఆ సాధువు వెంటనే నాస్థితిని గుర్తించి యీ శరీరమూలమున లోకేశ్వరి యింక ననేక కార్యము లొనర్పవలసియున్నదని—ఈ శరీరము పరిరక్షింపబడినచో, అనేకులు శ్రేయస్సునొందగలరని—గ్రహించెను. ఆతడు వేళకు ఏదియో కొంత యాహారము దీసికొనివచ్చి నాకు బాహ్యస్మృతి గలిగించు

టకై అనేకవిధముల ప్రయత్నించువాడు. తుదకు కష్టతో శరీరమును గట్టిగా గొట్టి నాకు కొంచెము స్మృతి వచ్చినట్లు కాన్పింపగనే ఆహారమును నోటిలో కూరువాడు. ఒకప్పుడు అందు బహుస్వల్పభాగముమాత్రమే కడుపులోనికి బోయెడిది; మఱియొకప్పుడు అదియుకూడ సాధ్యము కాకుండెడిది. ఈవిధముగ ఆఱునెలలు గడచినవి. ఈస్థితిలో మఱికొన్ని నాళ్లు గడచినవెనుక లోకేశ్వరియాజ్ఞ నాకిట్లు వినవచ్చెను: "లోకమునకు బోధించుటకై 'భావముఖమున' (అనగా ద్వైతప్రపంచస్ఫురణము, ఆత్మావలోకనము నను రెంటికిని నడుమ—ద్వైతప్రపంచద్వారమున) నుండుము." నాటినుండి రక్తగ్రహణి ప్రారంభమయ్యెను. ప్రేవులను మెలిపెట్టి పిండుచున్నట్లు దుర్భరబాధ కలుగసాగెను. ఆఱు నెలలు ఈ విధమైన బాధమూలమున క్రమముగా మఱల శరీరస్మృతి కలుగనారంభించెను. అంతవఱకు స్వల్పావకాశము దొరకినప్పుడెల్ల మనస్సు(దానంతటదిగనే) రివ్వున పైకెగసి నిర్వికల్పస్థితిలో లీనమగుచుండెడిది."

987. ఈ (నా) మనస్సుయొక్క సహజప్రవృత్తి ఊర్ధ్వముఖము. (అనగా నిర్వికల్పసమాధిస్థితికి ఉన్ముఖ)మైయుండును. ఆస్థితిని బొందినపుడిక క్రిందికి వచ్చుట కిచ్చగింపదు. మీకోసము దానిని బలవంతముగా క్రిందికి లాగుచుందును. ఏదియో యొకచిన్నవాంఛ లేనిదే దానిని క్రిందికి లాగుట కష్టము. అందులకై ఏహుక్కా పట్టుటయో, పానీయము త్రాగుటయో, ప్రత్యేకమైన యొకపదార్థమును దినుటయో, ఒకానొకని జూచుటయో—ఇట్టివాంఛ నొక దానిని

గల్పించుకొని మనస్సునకు పదేపదే తెల్పుదును. అటుల చేసిననేకాని మనస్సు క్రిందికి (శరీరముమీదికి) రాదు. ఇట్లు వచ్చినను అంతలోనే మఱల మీదికి బోవుట కలదు. అపుడు దానిని అట్టివాంఛలచే మఱల క్రిందికి లాగవలసియుండును.

988. 'ఓం తత్ సత్' అనుమంత్రమునుండి 'తత్' ('అది' అనగా బ్రహ్మము) అనుపదము నుచ్చరించుటచేతనే శ్రీగురుదేవుడు మహోత్తమమగు నిర్వికల్పసమాధిస్థితిని బొందువాడు. 'సత్' (ఉనికి) అను పదము నుచ్చరించుటచే తద్వ్యతిరిక్తమగు 'అసత్' అను భావము ఒకవేళ మనస్సునకు తట్టినను తట్టవచ్చును ; పరమపవిత్రమైన ఓంకారము గూడ (చూ. 434) ఇందులకు చాలనట్లుగనే తోచెను. కాని 'తత్' అనుపదమును గురుదేవు డుచ్చరించినంతనే ద్వైతప్రపంచ భావములన్నియు నాతని మనస్సునుండి యదృశ్యమైపోయెడివి; సదసద్విభేదమంతయు సంపూర్ణముగా సమసిపోయెడిది; సమస్తద్వంద్వాతీతమైన అద్వితీయ బ్రహ్మానుభవమున గురుదేవుడు లీనమై యొప్పువాడు.

989. ప్రశ్న : దేవా! తాము సమాధిస్థితిలో లీనమగు నపుడు లేశమైనను తమకు 'నే' నను స్ఫురణము ఉండునా?

ఉ. ఔను, సాధారణముగా కొంచెము ఉండును. బంగారుకణికపై చిన్నబంగారురేకును అఱుగదీసినప్పుడు పూర్తిగా అఱిగిపోకుండుటవంటి దిది. బహిఃప్రజ్ఞ యంతయు అదృశ్యమగును, కాని దైవము నేను బ్రహ్మానుభవము నొందుటకై అణుమాత్రమైన అహంత నుంచును.

కాని యొక్కొక్కప్పుడు ఆతడు (భగవంతుడు) ఆ

లేశమునుగూడ నిర్మూలించును. ఇదియే మహోత్తమమైన (నిర్వికల్ప) సమాధి. ఇది వర్ణింప నలవికానిది— జీవుడు బ్రహ్మముగా మాఱునట్టి యఖండపరిణామము. ఉప్పుబొమ్మ సముద్రపులోతును గనుగొనుటకై అందు దుమికినదట! కాని యది నీటిని తాకినంతనే కరగిపోయినదట! అపు డిక సముద్రము ఎంత లోతున్నదో వచ్చి చెప్పువారెవ్వరు!

## గురుదేవుని నిరంతర బ్రహ్మానుభూతి

990. "స్వామీ! మీరు భగవంతుడు కలడని నమ్మెదరా?" అని యొకరు ప్రశ్నింప, "ఔను, నమ్మెద" నని శ్రీగురుదేవుడు సమాధాన మొసగెను.

"కలడని మీరు ఋజువుచేయగలరా?"—"ఆహా!"

"ఎట్లు?"—"నిన్నిక్కడ నేనెట్లు చూచుచున్నానో అట్లే—ఇంతకంటె వేయిరెట్లు విస్పష్టముగా—భగవంతుని నేను చూచుచున్నాను గావున."

991. ఒక తార్కికుడు వచ్చి, "జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములనగా నేమి?" అని ప్రశ్నింప, గురుదేవు డిట్లు సమాధానించెను: "మహాశయా! నాకీ పాండిత్యపు గొడవలేవియు—ఈ తలవెంట్రుక చిక్కులేవియు— తెలియవు. నాలోనున్న ఆత్మ, నాజగజ్జనని—నాకు తెలిసిన వివి రెండే."

992. నాశరీరస్థితిని జూచి హృదయు డిట్లనువాడు: "అంత చక్కశరీరమున అంత పారమార్థికసంపదను—అంత దివ్యజ్ఞానమును—నే నెన్నడును కనలేదు!" శరీరము బలహీనముగానున్నను ఇతరులతో భగవత్ప్రసంగము చేయుట

నే నెన్నడును మానలేదు. ఒకప్పుడు నేను కేవలము శల్యావశిష్టముగ నుంటిని; అప్పుడును పారమార్థికవిషయములను గూర్చి—శరీరస్పృహయే లేకుండ—గంటలకొలది ప్రసంగించుచువాడను; నాకిది బాగుగా జ్ఞప్తి.

## గురుదేవు డెట్లు ప్రార్థించెను?

993. జగజ్జననిని ఈవిధముగా ప్రార్థించుచువాడను: "అమ్మా! ఆనందమయీ! నీవు నాకు సాక్షాత్కరింపక తప్పదు." మఱియొకప్పు డిట్లు వేడుకొనువాడను: "ఓ దీనబంధూ! ఓదీనదయాళూ! నేను నీ విశ్వమునకు వెలియైతినా? జ్ఞానహీనుడను, భక్తిహీనుడను, తపశ్శక్తిహీనుడను. నే నేమియు నెఱుగను. ప్రభూ! నీకృపాకటాక్షమున నాకు నీవు దర్శన మీయక తప్పదు." (చూ. 454, 754.)

994. అమ్మా! జగజ్జననీ! నాకు లోకులవలన గౌరవము వలదు, ఇంద్రియభోగములు వలదు; గంగా యమునా శాశ్వత సంగమమువలె నాయాత్మ నీయందు లయించుగాక!—ఇదియే నేను గోరునది. అమ్మా! నేను భక్తిహీనుడను, యోగహీనుడను, దీనుడను, నిస్సహాయుడను. నాకొకరి మెప్పు వలదు; నీదివ్యపాదారవిందములయందే నామనస్సు నిరంతరము నిలుచుగాక! * (చూ. 781.)

* శ్లో. "నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యత్ భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం,
ఏతత్ ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాన్తరేపి
త్వత్పాదామ్భోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు."
—ముకుందమాల.

995. తల్లీ! నేను యంత్రమను, నీవు యంత్రవు; నేను గృహమను, నీవందుండుదానవు; నేను ఒరను, నీవు కత్తివి; నేను రథమను, నీవు సారథివి. నీ వెటుల చేయించిన నే నటుల చేయుదును; నీ వెటుల పలికించిన నేనటుల పలుకుదును; నీ వెట్లు నడిపించిన నేనట్లు నడుతును; 'నేను' కాదు, 'నేను' కాదు, అంతయు 'నీవే' * (చూ. 898.)

996. సత్యవ్రతుడగువాడు భగవత్సాక్షాత్కారము నొందుట నిశ్చయము. సత్యమున లక్ష్యములేనివానికో, సర్వము క్రమముగా నశించును. నే నీస్థితిని (బ్రహ్మసాక్షాత్కారమును) పొందినపిమ్మట పుష్పాంజలినై తల్లి కిట్లు విన్నవించువాడను: "అమ్మా! నీ † జ్ఞానాజ్ఞానములను, నీ శౌచాశౌచములను, నీ శుభాశుభములను, నీ పుణ్యాపాపములను అన్నిటిని నీవే గైకొని నాకు వినిర్మలభక్తినిమాత్రము ప్రసాదింపుము." ఐనను నేనిట్లు అమ్మతో పలికినప్పుడు, "నీ సత్యాసత్యములనుగూడ నీవే గైకొనుము" అని పలుకజాలక పోతిని. అమ్మకు నే నన్నిటిని మఱల అర్పించినను సత్యమును మాత్రము అర్పింపజాలనైతిని.

## కీడుమేళ్లలో సమానముగనే భగవంతుడు కలడు

997. భగవత్సాక్షాత్కారముతో సమస్తకర్మములును తొలగిపోవును. నాపూజాకలాపము ఈవిధముగానే అంత

---

* సాధకుని మనోభావమునుగూర్చి శ్రీరామకృష్ణుడు (వంగభాషలో. "నాహం; నాహం; తుహు, తుహు" అని వచించువాడు.

† అనగా నీవు సృజించినవని భావము.

మొందినది. కాళీదేవ్యాలయములో నేను పూజచేయువాడను. సమస్తము చిన్మయమని అకస్మాత్తుగా ఒకనాడు నాకు విదితమైనది. పూజాపాత్రములు, వేదిక, ద్వారము—సర్వము చిన్మయమై గోచరించినవి. మానవులు, మృగములు, పక్షులు—సర్వము చిన్మయమే. నే నపుడు పిచ్చివానివలె నలువైపులను పూలను వెదజల్ల నారంభించితిని. చూచిన దాని నెల్ల పూజించితిని.

శివార్చనచేయుచు, ఒకనాడు శివలింగముపై వజ్రము నుంచుచుండగా, విశ్వమంతయు శివుడే యని నాకు గోచరించినది. అది యెట్లని నేను తర్కింపలేదుకాని నాహృదయమున ఈ యనుభవము మెఱుపు దీగవలె మెఱసినది. నాటితో నాశివవిగ్రహారాధనము అంతమొందినది. ఒకప్పుడు పూవులను గోయుచుండగా, ప్రతి పూలమొక్కయు భగవంతుని విశ్వరూపము నలంకరించుచున్న పూగుత్తివలె గాన్పించినది. పూవులను గోయుట కదియే నాకు కడసారి. (చూ.816, 971.)

998. ఒకసారి నాకొక దృశ్యము కానవచ్చినది. ఒకే ద్రవ్యము విశ్వరూపమునుధరించి సమస్తజీవరాసులతో నిండియున్నట్లు కాన్పించినది. అయ్యది మనుష్యులు, పశువులు, తోటలు, బాటలు మున్నగు నన్నిటితోడను గూడిన మైనపు టిల్లువలె గోచరించెను. అన్నియు మైనముతో నిర్మాణమైనవే, సర్వము మైనమే!

999. నాకేమి కనబడునో తెలియునా? భగవంతుడే సర్వము నైనట్లు కాన్పించును. నరులుగాని, యితర జంతువులుగాని తలలు ఊపుచు, కాలుసేతుల నాడించుచుండు

తోలుబొమ్మలలాగున కాన్పించును. భగవంతుడే వానిలోపల నుండువాడు.

1000. అమ్మ నన్ను భక్తునిస్థితిలో—విజ్ఞాని స్థితిలో—నుంచినది. అందుచేతనే రాఖాలు(బ్రహ్మానందస్వామి)తోడను ఇతరులతోడను పరిహాసముచేయగలుగుచున్నాను. నేనే గనుక జ్ఞానిస్థితిలో నున్నపక్షమున, ఇయ్యది సాధ్యము కాకుండెడిది. ఈ స్థితిలో నాకు అమ్మ (కాళి)యే సర్వము నై యున్నట్లు కాన్పించుచున్నది. సర్వత్ర ఆమెయే—లోకేశ్వరియే—నాకు గోచరించుచున్నది. దుష్టులు కూడ—భాగవత పండితుని సోదరుడు కూడ—అమ్మయే యైయున్నదని కాళికాలయమున నాకు గోచరించినది. నేనెంత ప్రయత్నించినను రామలాల్ తల్లిని దూషింపలేకపోతిని. అమ్మకయే మఱియొకరూపమున ఆమెయై యున్నదని నాకు గాన్పించినది. బాలికలందు అమ్మ కానవచ్చుటచేతనే నేను వారిని పూజింతును. నా భార్య నాపాదము లొత్తును, కాని తరువాత నేనామెకు నమస్కరింతును. అమ్మ నన్నీస్థితిలో నుంచుటచేతనే మీరు నమస్కరించినపుడు మఱల మీకు నమస్కరించుచుందును—నమస్కరింపవలసియున్నది. దుష్టుని గూడ నేనలక్ష్యముచేయజాలను. ఒక్క తులసీదళమును—ఎంత చిన్నదై యున్నను, ఎండిపోయియున్నను—భగవానునికి సమర్పింపవచ్చును. * (చూ. 644.)

---

* "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః."
—భగవద్గీత, 9-26.

1001. జగత్తు నా కెట్లుగోచరించునో తెలియునా? చెట్లు, పొదులు, మనుష్యులు, పశువులు, గడ్డిగాదము — మొదలైన వన్నియు తలగడగలేబులవలె గోచరించును — ఇందు కొన్ని మృదువైనవి, మఱికొన్ని ముదుకవి; కొన్ని గుండ్రనివి; మఱి కొన్ని నలుచతురమైనవి. కాని, యీ గలేబు లన్నిటిలో నుండునది ఒకేవస్తువు — దూది. ఇటులనే జగత్తులోనివస్తువు లన్నియు అఖండ సచ్చిదానందమయిచే పూరింపబడియున్నవి. అల జగజ్జననియే అనేకమైన వలువలనుదాల్చి ఈ యావరణము లన్నిటినుండియు తొంగిచూచుచున్నట్లు నాకు గోచరించును. నే నొకప్పుడు అనుక్షణము ఈ దృశ్యమును గాంచు స్థితిలో నుంటిని. ఈ నా స్థితిని గ్రహింపకుండ జనులు నన్నోదార్చుటకై వచ్చువారు. రామలాల్ తల్లి విలపించినది. ఆమెను జూడగా ఆలయములోని అమ్మయే యీరూపమును దాల్చినట్లు నాకు తోచెను. నవ్వు ఆపుకొనలేక నేలపై బడి దొరలాడుచు నే నిట్లంటిని: "ఎంత చక్కని వస్త్రములను దాల్చినా వమ్మా!" ఒకప్పుడు నేను కాళికాలయములో జగజ్జననినిగూర్చి ధ్యానించుచుండ, ఆమె రూపమును అనుసంధానము చేయుట నాకుఅసాధ్యమనిపించినది. కొంతసేపైనతర్వాత ఆమెయొక పూజాపాత్రముప్రక్కనుండి చూచుచుండుట నాకు గానవచ్చినది. రూపమున నామె యిచటి ఘట్టమునకు స్నానమునకై వచ్చు రమణి యను వేశ్యను బోలియుండెను. నే

---

ఎవడు భక్తితో నాకు ఆకునైనను, పుష్పమునైనను, ఫలమునైనను, ఉదకమునైనను సమర్పించుచున్నాడో, అట్టిబుద్ధిమంతునిచే భక్తిపూర్వకముగా సమర్పింపబడిన యా వస్తువులను నేను ఆరగించుచున్నాను.

నాశ్చర్యముతో నవ్వుచు నిట్లంటిని: " బాగుగనే యున్నది! ఈ దినము నీవు రమణివి కాగోరితివా ! కానిమ్ము. నేటి యారాధనము ఈరూపముననే స్వీకరింపుము." ఈవిధముగా అమ్మ నా కిట్లు బోధించినది: "వ్యభిచారిణి గూడ నేనే. నా కంటె మఱేదియులేదు." మఱియొకనాడు నేను బండి యెక్కి 'మేచాబజారు 'నుండి పోవుచుండ అమ్మ 'షోకుగా' వేషము వేసికొని జనులను మోహింపజేయుటకై సంసిద్ధమైన సుందరి వలె గాన్పించినది. నుదుట కస్తూరీతిలకమును, తలలో నవర ము ను ధరించి యామె విలాసముగా హుక్కా పట్టుచుండెను. " అమ్మా ! ఈ రూపమును గూడ నీ వెన్నుకొంటివా ! " అని నే నాశ్చర్యముతో లోకేశ్వరినడిగి యామెకు సాష్టాంగ ప్రణామ మాచరించితిని.

1002. బ్రహ్మమును ప్రత్యక్షసత్యముగా, నా కన్నులార, చూచుచుండగా నే నిక తర్కించుటెందులకు ? అఖండ బ్రహ్మమే మన చుట్టునున్న సర్వము నై యున్నదని నేను స్వయముగ జూచుచున్నాను; బ్రహ్మమే ప్రత్యగాత్మగను దృశ్యప్రపంచముగను గూడ గోచరించుచున్నది ! ఈ సత్య మును గనుటకు ఎవ్వనికైనను ఆత్మప్రబోధము కలుగవల యును. బ్రహ్మమును ఏకైకసత్యముగా గాంచునంతవఱకు, " నేతి, నేతి—ఇది కాదు, ఇది కాదు "అని వివేచన చేయు చుండవలయును. " బ్రహ్మమే ఈ సర్వమునై యున్న దని నేను నిస్సందేహముగా గ్రహించినాను " అని కేవలము చెప్పుట చాలదు, చాలదు (అది వాచావేదాంతము). దైవా నుగ్రహమువలన ఆత్మప్రబోధము కలుగవలయును. ఆత్మ

ప్రబోధము వెనువెంటనే సమాధిదశ ప్రాప్తించును. ఈ దశలో శరీరస్పృహయే లేకుండును; ప్రాపంచికవిషయముల యందు — అనగా కామినీకాంచనములందు — రాగము నశించును; భగవదితరవిషయములను వినుటకు మనసొప్పదు; లౌకికవిషయములను వినవలసివచ్చినపక్షమున చాల వెగటుగ తోచును—బాధగా తోచును. ఆత్మప్రబోధము కలిగినంతనే పరమాత్మను దర్శించుటయే పై మెట్టు. ఆత్మదర్శనమును జేయునది ఆత్మయే. (చూ. 937.)

1003. నరునందు నారాయణునిగాంచునప్పుడే సంపూర్ణజ్ఞానము కలుగునని వైష్ణవచరణునివలన అనేకసంవత్సరముల క్రితమే వింటిని. నారాయణుడే వివిధరూపములతో— ఇపుడు పెద్దమనుష్యునివలెను, మఱియొకప్పుడు పరమదురాత్మునివలెను, ఇపుడు యోగ్యునివలెను, మఱియొకప్పుడు వట్టి తుంటరివలెను—క్రీడించుచున్నాడని నాకిపుడు ప్రత్యక్షముగ గాన్పించుచున్నది. కాబట్టి, "పెద్ద మనుష్యుడై యున్న నారాయణుడు, వంచకునిరూపమున నున్న నారాయణుడు, పాపియైయున్న నారాయణుడు, పోకిరిరూపమున నున్న నారాయణుడు" అని చెప్పచుందును. ఇపుడు వీరందఱను సంతుష్టిపరచుట యెట్లనునది నాకున్న సమస్య. అన్నపానీయాదులచే అందఱును సంతృప్తులను జేయుటయే నా యిచ్ఛ. అందుచే ఒకసారి యొక్కని నాయొద్ద నుంచుకొని వానిని సంతుష్టుని జేయుచుందును.

1004. కులీనురాలును సుశీలవ్రతయునగు స్త్రీని గాంచినప్పుడు పతివ్రతారూపమున నిరాడంబర వేషమును దాల్చిన

జగజ్జననియే నా కామెయందుగోచరించును; మఱియు సిగ్గు బిడియములను విడిచి యత్యాడంబరముగా శృంగారించుకొని బాహాటమైన చోట విలాసముగా గూర్చుండియుండు భోగ కాంతలను గాంచినప్పుడును అల జగజ్జననియే వారియందు మఱియొకరూపమున క్రీడించుచున్నట్లు నాకు దోచును.

1005. (ఇచట 62-వ ప్రవచనమును జదువుకొనుడు.)

కాని మీరు ఇంకొక మెట్టుపై కెక్కినయెడల మీకు బ్రహ్మజ్ఞానము లభించును. ఈ స్థితిలో నాకు సర్వము బ్రహ్మమే యైయున్నట్లు గోచరించును—ప్రత్యక్షముగా గాన్పించును. హేయముగాని, ఉపాదేయముగాని(పరిత్యజింప వలసినదిగాని పరిగ్రహింపవలసినదిగాని)యపుడిక నేమియు నుండదు! ఎవ్వరిమీద నైనను కోపపడుట నాకపుడు అసాధ్యము. (చూ. 1000.)

ఒకప్పు డొకచోటికి బండినెక్కి వెడలుచుండగా, మేడ ముందరి వసారాలో నిలుచుండియుండిన యిద్దఱు భోగము పడతులను జూచుట తటస్థించినది. కాని, వారియందు నాకు సాక్షాజ్జననియే కాన్పించుటచే వారికి నమస్కరించితిని.

నా కీస్థితి కలిగినప్పుడు నేనిక కాళీమాత కేమియు అర్పింపజాల నైతిని. పూజనే చేయజాలనైతిని. అది చూచి దేవాలయ నిర్వాహకుడు నన్ను దూషింప నారంభించెను. కాని వాని దూషణలకు నా కెంతమాత్రము కోపము రాలేదు, సరి కదా, నవ్వు వచ్చెను.

1006. ప్రపంచ వాస్తవస్థితిని తన కెఱుకపరచిన యొక దివ్యదృశ్యమును వర్ణించుచు శ్రీ గురుదేవు డిట్లు పలికెను:

"నా కిప్పు డేమి కాన్పించినదో మీకు తెలియునా? ఒక దివ్యదృశ్యము—జగజ్జనని దర్శనము! ఆమె గర్భిణీస్త్రీవలె గాన్పించినది, బిడ్డను గని యామె ఉత్తరక్షణముననే మ్రింగి వేసినది. మ్రింగునపుడు బిడ్డయం దెంతభాగము నోటిలోనికి బోయినదో అంతభాగమును శూన్యమైపోయినది! సర్వము శూన్యమని అమ్మ నాకు (ఇట్లు) తెల్పినది. మఱియు, నామె, 'ప్రళయమా! రమ్ము, రమ్ము' అని యాహ్వానించుచున్నదా యనునట్లు కాన్పించినది. (చూ. 52.)

## తన వ్యాధిని గూర్చి గురుదేవుని యభిప్రాయము

1007. (అంత్యదశలో కంఠము నందలి వ్రణముచే) శ్రీ గురుదేవుడు జబ్బుపడినప్పుడు శశధరపండితుడు సందర్శించి యిట్లు ప్రశ్నించెను: "రోగగ్రస్తమైన భాగమున మనస్సును కేంద్రీకరించి మీ రేల నివారణ పొందరాదు?"

గురుదేవుడు : భగవానుని కర్పించిన నా మనస్సును రక్తమాంసపంజర మగు ఈ తుచ్ఛకళేబరముపైకి ఎట్లు మఱల్పగలను?

శశధరుడు : పోనిండు, వ్యాధినివారణార్థము అమ్మను మీరు ప్రార్థింపరాదా?

గురుదేవుడు : నా జగన్మాతను స్మరించినంతనే స్థూల శరీరము నా దృష్టినుండి తొలగిపోవును—అపు డిక దానితో నాకు సంబంధమేయుండదు, ప్రమేయమే యుండదు. కాబట్టి శరీరవిషయమై (ఏమనిగాని) ప్రార్థించుట నాకు అసాధ్యము.

1008. గురుదేవుని వ్యాధి తీవ్రమైనప్పు డాత డెట్టి

యాహారమును తినజాలకుండెను; మాటలాడుట కూడ మిక్కిలి కష్టముగా నుండెను. ఆస్థితిలో నాత డిట్లు వచించెను: "నే నిప్పు డనేకముఖముల మూలమున మాటలాడుచు, భుజించుచున్నాను. సర్వాత్మలకు నేను ఆత్మను, నాకు అనంతముఖము లున్నవి. నే నఖండాత్మను. ఈ యాత్మ మానవ చర్మముచే గప్పబడియున్నది. అందొకా నొక తావున గొంతులో పుండు బయలుదేరినది. శరీరము రోగగ్రస్తమైనప్పుడు మనస్సును బాధించును. వేడినీరు పడి శరీరము బొబ్బలెక్కినప్పుడు మనము, 'ఈనీరు నన్ను కాల్చినది' అని నీటిని దిట్టుదుము, కాని కాల్చునది వేడిమికాని నీరు కాదు. బాధయంతయు వ్యాధియంతయు శరీరమునందే, శరీరమునకే; కాని ఆత్మ సమస్తబాధాతీతము, సమస్తరోగాతీతము—వ్యాధులును బాధలును దాని నంటజాలవు." *

1009. (వ్రణబాధ కలిగిన కంఠమును జూపుచు) దీని మూలమున గ్రుక్కెడుపాలైనను మ్రింగజాలకున్నాను. కావున కొంచెము ఏమైనను తినగలుగునట్లు చేయుమని అమ్మను ప్రార్థించితిని. కాని, అమ్మ యందఱను జూపుచు నిట్లు వచించెను: "ఏల ? ఇందఱముఖముల మూలమునను నీవు భుజించుట లేదా !" అమితమైన లజ్జచే నేనిక మాటాడలేదు.

---

* "అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ,
నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః." -భగవద్గీత, 2-24

ఈ యాత్మ ఛేదింపనలవికానిది, దహింపనలవికానిది, తడుప నలవికానిది, ఎండింపను అలవికానిది, ఇయ్యది నాశనము లేనిది, అంతటను వ్యాపించియుండునది, స్థిరరూపమగునది, చలింపనిది, అనాదియైనది.

1010. శరీరమునకు అపరిమితబాధ సంభవించినను నరు డెట్లు ఆత్మవిచారము చేయవలయునో, ఆత్మజ్ఞానమున నెలకొని యుండవలయునో, బోధించుటకై అల జగన్మాత నాకీ వ్యాధిని గల్పించినది. ప్రాణములను తోడివేయు బాధచేతను భరింప రాని యాకటిజిచ్చుచేతను శరీరము సంకటపడుచున్నను, కాసంత యుపశాంతిగల్గించుట మానవశక్తికి అసాధ్యమైనను గూడ ఆత్మయే శరీరాధిపతియని అమ్మ నాకు దెల్పుచున్నది. ఆత్మ ఇంద్రియాతీతమగు పరంజ్యోతియని, ఆత్మజ్ఞాన మొక్కటియే వాస్తవమని, సిద్ధత్వమును సాధించినప్పుడే సమస్త బంధవిమోచన మగునని విశ్వాసహీనులకును సంశయాత్ములకును నమ్మకము గలుగజేయుటకై దివ్యమాత శరీరమున కీవ్యాధి గల్పించినది.

1011. అంత్యదశలో శ్రీగురుదేవునకు వ్యాధి సంభవించినప్పుడు శిష్యులు వ్యాధినివారణార్థమై భగవానుని ప్రార్థింపుడని-తమకొఱకేనియు మఱికొంతకాలము శరీరము నిలుచుటకై భగవానుని వేడుకొనుడని—మనఃపూర్వకముగా ప్రార్థింప గురుదేవు డిట్లు పలికెను: "సరేకాని, యీ విషయమై నేను దేవునకు నివేదించిన లాభములేదు. పరమేశ్వరేచ్ఛయే జరుగుగాక! నేనును నా జగదీశ్వరియు శాశ్వతముగా నేకమైతిమని నాకిపుడు విస్పష్టముగా గోచరించుచున్నది. కృష్ణునితో రాధ యిట్లు పలికెను: 'ప్రాణప్రియా! నీ విక నాహృదయముననే నెలకొని నన్నేలుకొనుము, నీ మానవరూపమున నాకిక గోచరింపకుము. కాని వెంటనే యామె మానవరూపమున కృష్ణుని గాంచుటకై తహతహ

పడెను. ప్రాణేశ్వరుడగు కృష్ణుని గాంచుటకై యామె హృదయము పరితపింప సాగెను. కృష్ణుని గాంచనిచో, జీవితము దుర్భర మనిపించెను. కాని (యామె కోరికప్రకారము) భగవదిచ్ఛయే జరుగవలసియున్నది కదా! అందుచే కృష్ణుడు చాలకాలము వఱకు మఱల మానవరూపమున ఆమెకు సాక్షాత్కరింపలేదు.''

## మానవత్వమును దైవత్వమును గురుదేవునందు సమ్మేళనమొందిన విధానము

1012. నాహృదయమునకు నిజముగా కంటకములవలె గ్రుచ్చుకొను మూడుమాటలు కలవు : అవి యివి : (1) గురువు, (2) కర్త, (3) బాబా (తండ్రి). భగవంతు డొక్కడే గురువు—జగద్గురువు. (చూ. 638) నాజగజ్జననియే సమస్త కార్యముల నొనర్చునది (కర్త్రి). నే నామె చేతిలోని ఉపకరణమాత్రమను. సదా నేనామెబిడ్డనని భావించుకొనుచుందును.

1013. సుప్రసిద్ధుడైన యొకపండితునితో తనసమావేశమునుగూర్చి శ్రీగురుదేవు డిట్లు పలికెను : ''పండితుడు నన్ను జూచుటకై వచ్చుచున్నాడని విన్నంతనే భయపడితిని. ఏలన, నే గట్టుకొనిన బట్టను గూర్చియే నాకు స్మృతి లేదు. నాతో ఆతడు సంభాషించునెడ నేనేమి సమాధానము చెప్పవలయునో నాకు తోచలేదు. అంతట అమ్మతో నిట్లంటిని : 'నిన్ను విడిచి నే నన్యమెఱుగను—ఈశాస్త్రములు, గీస్త్రములు నాకేమియు తెలియవు. అందుచే నిచట నున్నవా

రితో నిట్లు చెప్పితిని : 'మీరందఱును ఇచట గూర్చుండుడు. మీరిక్కడ నున్నారనిన నాకు ధైర్యము.' పండితుడు సరిగా వచ్చినపిమ్మట నా కింకను కొంచెము భయము వేయుచునే యుండెను. ఆతనివైపు తదేకముగా జూచుచు, ఆతని మాటల నాలకించుచు, నిశ్శబ్దముగా కూర్చుంటిని. అప్పుడే అమ్మ నాకు పండితుని మనస్సును పూర్తిగా విప్పిచూపుచుండుట గాంచితిని. వివేకవైరాగ్యములు లేనియెడల శాస్త్రములను ఊరక వల్లించిన నేమి లాభము ? (తన శరీరమును జూపుచు) ఇచట నేదియో శిరస్సునకు ప్రాకిపోవుచున్నట్లు తోచెను. భయ మంతరించినది, శరీరస్మృతియు సమసెను. ముఖ మెత్తితిని, నోటినుండి మాటలు ప్రవహింప సాగెను. వాగ్రూపమున వెలువడుచున్న నాభావముల నెవ్వరో మఱల మఱల పరిపూర్ణ మొనర్చుచున్నట్లు నాకు దోచెను. కామారిపుకూరమున * జనులు ధాన్యము గొలుచునపుడు ఒకడు వెనుకనుండి ధాన్యమును త్రోయుచుండ మఱియొకడు గొలుచుచుండును. ఇదియు నిట్టిదే. ఏయే విషయములనుగూర్చి ప్రసంగించితినో నాకే తెలియదు. నాకు కొంచెము బాహ్యస్మృతి వచ్చినంతనే పండితుని జూచుసరికి ఆతడు అశ్రువులతో శరీరము దడిసిపోవ నేడ్చుచుండెను. అప్పుడప్పుడు నాకీ స్థితులు గలుగుచుండును. కేశవుడు నన్ను గంగానది మీదుగా నావలో దీసికొని వెడలుదుననియు, కుక్ (cook) అను క్రైస్తవప్రచారకుడును, దేశసంచారియునగు నైరోపాదేశస్థుడు మాతోగూడ వచ్చుననియు నాకు వర్తమాన

---

* శ్రీరామకృష్ణుని జన్మస్థానము (Kamarpukur.)

మంపెను. అది విని నేను సరుగుడుచెట్టుకడకు పదేపదే వెడలనారంభించితిని. (అనగా భయముచే మలమూత్రవిసర్జనముచేసెనని భావము). అనంతరము వారు వచ్చిరి, నేను స్టీమరు ఎక్కితిని. వెంటనే నాలో నొకమార్పు కలిగెను. అప్పు డెన్ని విషయములనుగూర్చి ప్రసంగించితినో! (భక్తబృందమును జూపుచు) వీరందఱును నేను అద్భుతమైన బోధలు చేసినానని చెప్పినారు. కాని నాకా విషయమే తెలియదు.''

1014. నాయందలి పరమాత్ముడే నాచే ఈకార్యముల నన్నిటిని జేయించుచున్నాడు. ఒక్కొక్కప్పుడు భగవద్భావమును బొందువాడను-అర్చింపబడనిదే అపుడు నాకు శాంతి కలుగకుండెడిది. నేను వానిచేతిలోని ఉపకరణమను, నన్నాతడు వినియోగించుకొనును. నన్నాతడు ఎట్లు చేయించునో అటుల చేయుదును, ఎటుల పలికించునో అట్లు పలుకుదును. (చూ. 898.)

1015. గురుదేవునకు ముఖ్త్యారునామా (Power of attorney) ఇచ్చిన (అనగా సంపూర్ణాత్మార్పణముచేసిన) పిమ్మటగూడ గిరీశచంద్రఘోషు పూర్వజీవితమువలన దనకు సంప్రాప్తమైన పాపప్రవృత్తులను దలపోసి దుఃఖాక్రాంతుడై కలవరపడనారంభించెను. (చూ. 520.) అది గని శ్రీగురుదేవు డిట్లు పలికెను : ''ఓయీ, మతిహీనుడా! నిన్ను బట్టుకొనినది బురదపాముకొనుచుంటివా? కాదది విషసర్పము. పరుగెత్తి నీవింటికి బోయినను మరణింపవలసినదే. నీ కామాత్రము తెలియదా? బురదపాము కప్పను బట్టుకొనిన, అది

యెన్ని యోసారులు బెకబెకలాడిననేకాని ప్రాణము విడువదు. ఒక్కొక్కప్పుడది తప్పించుకొనునుగూడను. కాని యదియే (దానిని బట్టుకొనినది) విషసర్పమైనచో, ఒకటి రెండు బెకబెకలతో దానిపని సరి. ఒక వేళ తప్పించుకొనినను కొంచెముదూరము పరుగెత్తి తనగుంటలో బడి చచ్చును. ఇచటికి వచ్చినవారి విషయముకూడ నిట్టిదే.” (అనగా వారెట్లైనను పాపవినిర్ముక్తులగుదురని భావము. (చూ.174.)

1016. ఒకనాడు శిష్యుడు తనపాదము లొత్తుచుండ శ్రీగురుదేవుడు ఆ పరిచర్య నుద్దేశించి యిట్లు పలికెను : “దీనికి విశేషమైన ప్రాముఖ్యమున్నది.” అంతట హృదయముపై జేయి వైచుకొని మఱల నిట్లు పలికెను : “దీనియందు (నాయందు) ఏదైన (దివ్యత్వము) ఉన్నపక్షమున, దీనిచే (ఈశుశ్రూషచే) అవిద్య (అజ్ఞానము) పూర్తిగా నశింపవలసినదే.” అపుడు శిష్యుని గంభీరముగా అవలోకించుచు నిట్లు వచించెను : “ఇక్కడ నెవ్వరును పైవారు లేరు. ఆనాడు నాకొకదృశ్యము గోచరించినది. అపుడు హరీశుడు నాయొద్ద నుండెను. సచ్చిదానందమయుడు ఈ కోశము (నాశరీరము)నుండి వెలువడుచుండుట నాకు గోచరించినది. ఆత డిట్లు పలికెను : ‘యుగయుగము నేనవతరింతును.’ * నాకు అపస్మారము కలిగినదనుకొంటిని. అందుచే నేనూరకుంటిని. అపు డాతడే (సచ్చిదానందమయుడే) యిట్లు

* “ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.”
ధర్మసంస్థాపనార్థమై యుగయుగము నే నవతరింతును.
—భగవద్గీత, 4-8.

ఝలుకగా వింటిని : 'చైతన్యుడుకూడ శక్తి నారాధించెను.' (అనగా నీవు శక్తి నారాధించుచున్న కారణమున భగవదవ తారము కాననుకొనకు మని భగవానుడు శ్రీగురుదేవునకు దెల్పెనని భావము.)

1017. వ్యాధిగ్రస్తుడై యున్నప్పుడు శ్రీగురుదేవు డొక నాడు శిష్యులతో నిట్లు పలికెను : "ఇచట, (అనగా తన యందు) ఇద్దఱు వ్యక్తులున్నారు. ఒకవ్యక్తి జగజ్జననివ— రెండవవ్యక్తి యామెభక్తుడు. జబ్బుపడినది ఈ రెండవ వ్యక్తియే...తనశిష్యులతో భగవానుడు అవతారరూపమున వచ్చుచుండును. ఆతఁడు మానవరూపమును దాల్చును. ఆత నితో నాతనిశిష్యులును మఱల లోకేశ్వరి సన్నిధికి బోవుదురు, అకస్మాత్తుగా నలుగురైదుగురు వీధిగాయకులు ఇంటిలోనికి వత్తురు. వచ్చి వారు భగవన్నామ సంకీర్తనము చేయుచు, ఆనందముతో నృత్యముచేయుదురు. అది యైనంతనే ఆ యింటిని విడిచిపోవుదురు. రాక యెంత ఆకస్మికమో పోకయు నంత యాకస్మికమే! వా రెవరో (వారి వృత్తాంతమేమో) లోకులకు దెలియనే తెలియదు!"

1018. బలిపీఠము, బలియగు జంతువు, దానిని నఱుకు వాడు—మూడును ఒకే తత్త్వమని తెలిసికొంటిని.

1019. అంత్యదశలో వ్యాధి తీవ్రమైనపుడు శ్రీగురుదే వుడు నరేంద్రు (వివేకానందు) నిట్లు ప్రశ్నించెను : "సరియే కాని నాయనా! నాభావము లెట్టివని నీ యభిప్రాయము?"

నరేంద్రుడు : చెప్పెడి దేమి! దేవా! తామే సర్వము! వివేక ఖడ్గముచే, లోకాతీతబలముచే, సంసారా

రహస్యమును ఛేదించుకొని బ్రహ్మమును బొందిన వీరాధి వీరులు తాము! సఖ్యభావమునుపై తము—ఆలోకై కరమ ణుని జేరు దివ్యప్రేమపారవశ్యమును—అనిర్వచనీయ ప్రేమ మాధుర్యమును—తాము పొందితిరి. భగవత్పరితాపమున సఖ్యభావమనసేల, సమస్తభావములను కరతలామలక మొనర్చుకొనిన భాగవతవీరులు తాము!

గురుదేవుని హృదయమున దివ్యభావములన్నియు నొక్కుమ్మడి నుబికి పారవశ్యమును గల్గించెను. తన హృద యముపై జేయివైచుకొని, నరేంద్రుని, ఇతరశిష్యులను సంబోధించుచు నాత డిట్లు పలికెను : "సర్వము—భావింప దగిన సమస్తము—ఇందుండియే వెలువడుచున్నదని నాకు గోచరించుచున్నది—ప్రత్యక్షముగా గాన్పించుచున్నది."

1020. తాను భగవదవతారమూర్తినని గురుదేవు డనేక పర్యాయములు వక్కాణించియుండెను : ఇవ్విషయమై సందే హముకలుగ నరేంద్రుడు తనలో దానిట్లనుకొనెను: "ఈఘోర శరీరయాతన నొందుచున్న యీసమయమున—ఈ మరణ యాతనాసమయమున—ఈతడు తాను భగవదవతారమూర్తి నని తెలుపగలిగినచో నేను నమ్మెదను." అతివిచిత్రము! ఈ భావము నరేంద్రునకు దోచినంతనే శ్రీ గురుదేవుడు తన యావచ్ఛక్తిని వినియోగించి విస్పష్టముగా నిట్లు పల్కెను : "నాయనా! నీకింకను సందియము తీఱలేదా? వినుము, ఎవ్వడు రాముడో, ఎవ్వడు కృష్ణుడో, అతడే యీ శరీరమున రామకృష్ణుడు—కాని నీ వేదాంతప్రకారము కాదుసుమీ."

యో నః పితా జనితా యో విధాతా
ధామాని వేద భువనాని విశ్వా ।
యో దేవానాం నామధా ఏక ఏవ
తం సంప్రశ్నం భువనా యన్త్యన్యా ॥ 10-6-82-3.

—ఋగ్వేదము.

ఎవ్వడు మన రక్షకుడో ఎవ్వడు మనలను సమస్తవిశ్వమును సృజించి పరిపోషించునో, ఎవ్వ డీవిశ్వమునంతయు తన నిలయమని యెఱుంగునో, ఎవ్వడు దేవతలను సృజించి వారికి తమతమ విధులను నియమించెనో, అట్టివానిని (అద్వితీయుడగు పరమాత్ముని) గూర్చి (ధీమంతులు) ఎల్లరును "పరమేశ్వరు డెవ్వడు ?" అని విచారణసల్పుచున్నారు.

న తం విదాథ య ఇమా జజానా-
న్యద్యుష్మాక మన్తరం బభూవ ।
నీహారేణ ప్రావృతా జల్ప్యా
చా సుతృప ఉక్థ శాసశ్చరన్తి॥ 10-6-82-7.

—ఋగ్వేదము.

ఓ నరులారా ! ఎవ్వ డీసమస్తమును సృజించెనో అట్టివానిని (పరమాత్ముని) మీరు ఎఱుంగకున్నారు. మీవ్యక్తిభావనకుసైతము అతీతుడై అతడు మీలో దాగియున్నాడు. మీదృష్టిని పొగమంచువలె నావరించియున్న అజ్ఞానమునకు వశులై ఐహిక సౌఖ్యములకై ప్రాకులాడుచు, పరమున స్వర్గభోగముల నొసగు కర్మముల నొనర్చుచు, ఆత్మను గూర్చి దురభిప్రాయములకు లోనై సంచరించుచున్నారు.

## ఇరువదియొకటవ ప్రకరణము

# సూక్తులు

## నైతిక సూక్తులు—పారమార్థిక సూక్తులు

### నైతిక సూక్తులు

1021. చాకలియింట (ఉదుకుటకై తెచ్చిన) బట్టలనేకము లుండును, కాని యవి వానివి కావు. ఉదుకగానే వాని యిల్లు ఖాళీయగును. స్వతంత్రభావములు లేనివారు ఈ చాకలివంటివారు. నీభావములపట్ల చాకలివాడవు గాకుము.

1022. ఒరు లేమి చేయవలయునని కోరుదువో దానిని స్వయముగా నీవును జేయుము. *

1023. యాచనచే మానవుడు అల్పుడగును. బలిచక్రవర్తిని యాచింపబోయినప్పుడు విష్ణుదేవునంతటివాడు వామనుడు కావలసివచ్చెను. ఎవ్వనిగాని నీ వేదేని యాచింపబోయినంతనే హీనుడవగుచున్నావు (అని భగవానుడు తన నిదర్శనముచే మనకు బోధించుచున్నాడు).

1024. లోకు లెంత సులభముగా స్తోత్రముచేయుదురో అంతసులభముగా నిందను జేయుదురు ; కాబట్టి నిన్నుగూర్చి

* "ఒరు లేయవి యొనరించిన, నరవర యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి, పరాయణము పరమధర్మపథముల కెల్లన్."

—మహాభారతము.

వారు చేయు నిందాస్తుతులను లక్ష్యింపకుము.†

1025. శాంతిసుగుణములకు ఆలవాలమైన జీవనము గడపుచు లోకుల నిందాస్తుతులను గణింపకుము.

1026. కొందఱివిషయమున మనము జాగరూకులమై వర్తింపవలయును. (1) ధనికులు: వారికి ధనబలము, మనుష్యబలము నుండుటయేకాక, విశేషమైన పలుకుబడియు నుండును. తలచుకొనినయెడల వారు నీకు అపకారము చేయగలరు. నీవు వారితో బహు జాగరూకతతో మెలగవలయును; వారు చెప్పినదానికెల్ల బహుశః తల నూపవలసి వచ్చును. (2) కుక్క: అది నిన్ను జూచి మొఱిగినను మీదబడి కఱవబోయినను నీవాగి యూలవేసి దానిని శాంతింపజేయవలయును. (3) ఆబోతు: అది నిన్ను పొడవవచ్చినయెడల కొన్ని శబ్దములతో దానిని శాంతింపజేయవలయును. (4) త్రాగినవాడు: నీవు వానిని రేపితివా, నిన్ను అడ్డమైన బూతులు తిట్టును. కాని, "మామా! ఖులాసాగా ఉన్నావా?" అనుచు వానిని బుజ్జగించినయెడల, వాడు చాల ఆనందించుచు, వచ్చి నీతోగూడ చుట్టకాల్చును.

1027. ముల్లంగిగడ్డలను దినినవానికి ముల్లంగివాసనగల త్రేనుపులే వచ్చును; దోసకాయ మెసవినవానికి దోసకాయ

---

† శా. "నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగా బోగనీ
ఘాతంబప్పుడ పొందనీ నియతిమైఁగానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపథంబు దప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్."

—భర్తృహరి సుభాషితము, నీతిశతకము, 74.

వాసనగల త్రేనుపులే వచ్చును; అటులనే అంతరంగమందలి భావములపస మాటలే యొక్కొక్కప్పుడు వెల్లడించుచుండును. (తిండి యెట్టిదో త్రేపట్టిది, భోజన మెట్టిదో మానసమట్టిది.)

1028. 'ఏగూటిచిలుక కాగూటిపలు' కనునట్లు ఎట్టివారితో సహవాసముచేయుదుమో అట్టిగుణములే మన కబ్బును. మఱియు మన గుణముల ననుసరించియే సహవాసమును ఎన్నుకొనుచుందుము.

1029. కొందఱు త్రాచుబాము నైజము కలవారై యుందురు. వారు ఎప్పుడు కాటువేయునదియు నీకు దెలియదు. విఱుగుడు కనుగొని వారివిషమును నీవు తొలగించుకొనుటకై చాల శ్రమపడవలసియుందువు. లేదా, వారిపై బగపట్టునంతటి క్రోధావేశమున కగ్గమగుదువు.

1030. క్రోధము తమోగుణలక్షణము. క్రోధపరవశుడగువాడు వివేకమును గోల్పోవును. హనుమంతుడు లంకకు నిప్పంటించెనుగాని సీత యున్న యశోకవనమునుగూడ అయ్యది తగులబెట్టునేమో యని యూహించునంతటి వివేకము వానికి లేకపోయెను.

1031. 'వందలు, వేలు గురువులు దొరకుదురుకాని శిష్యుడు దొరకుట దుర్లభము' అను సామెత మీరు ఎఱుగుదురుకదా? అనగా శ్రీరంగనీతులు చెప్పువారు అనేకులున్నను వానిని ఆచరించువారు అరుదని భావము.

1032. మతధర్మములు క్షీణించుటకు కారణమేమి? వాననీరు నిర్మలమైనదే యైనను, భూమిపై బడుసరికి సంపర్క

దోషముచే మలినమగును. మిద్దెలు, తూములు, కాలువలు నివన్నియు ముఱికిగానున్నప్పు డవి ప్రవహింపజేయు వాననీరు మాత్రము ముఱికిగాదా? (ఇట్లే మతధర్మములు ఆయా ప్రచారకుల లోపములచే దోషభూయిష్ఠము లగునని భావము.)

1033. పాపమును పాదరసమును హరించుకొనుట దుర్లభము.

1034. సాధువునుగాని, దేవాలయమునుగాని సందర్శింపబోవునపుడు వట్టిచేతులతో బోరాదు. అర్పణచేయుటకై ఏదేని స్వల్పముగనైనను గైకొని వెడలవలయును.

1035. ఇంటిలోనివారు మెలకువతో నున్నయెడల దొంగలు చొరజాలనిచందమున నీవు సదా జాగరూకుడవై యున్నపక్షమున చెడుతలంపులు నీ మనస్సున ప్రవేశించి నీ శీలమును హరింపజాలవు.

1036. తల్లి, తండ్రి, భార్య, బిడ్డలు మొదలగు వారి యందుండు రాగమే మాయ. సర్వజీవులయెడలను సమానముగా బ్రవహించు ప్రేమయే దయ.

1037. జీవించియున్నంతవఱకు నేర్చుకొనుచు నే యుందును.

1038. బ్రతికియున్నంతకాలము భక్తిప్రపత్తుల రహస్యములను అనుదినము నేర్చుకొనుచు నే యుండుము. దానివలన నీకు మేలుకలుగును.

1039. (పూజ్యభావముచే) ఇతరులు శిరస్సు వంచుతావున నీవును శిరస్సు వంచుము. పెద్దలను పూజించుట వ్యర్థముగ బోదు. (చూ. 411.)

1040. సదా నీమతధర్మములందు నీవు పట్టుదల గలిగి

యుండుము, కాని దురభిమానమును పరమతములం దసహన మును పూర్తిగా విడనాడుము. (చూ. 486, 487, 526.)

1041. భరతుడు, ప్రహ్లాదుడు, శుకదేవుడు, విభీషణుడు, పరశురాముడు, బలి, బృందావనగోపికలు—వీరందఱును తమపెద్దలు భగవద్విషయమున దమ కడ్డుతగులుటచే వారి యెడ నవిధేయులై వర్తించిరి. (చూ. 445.)

1042. నిష్కాముడవై — అసంగుడవై — నీ విధ్యుక్త కర్మముల నొనర్చుటయే సర్వోత్తమము. (చూ. 269, 451.)

## పారమార్థిక సూక్తులు

1043. ఈశ్వరవాణి యొకప్పుడు పిచ్చివారి నోటను, త్రాగుబోతుల నోటను, పసిబిడ్డల నోటనుగూడ వినవచ్చును.

1044. సదా హరినామసంకీర్తనము జరుగు నింట పిశాచము చొరజాలదు.

1045. గంగానదీతీరమున నివసించువారు ధన్యులు, పవిత్రులు.

1046. గంగాజలమును సామాన్యమైన నీరని భావింప రాదు; బృందావనధూళిని సామాన్యమైన ధూళియని తలప రాదు; శ్రీ శ్రీ జగన్నాథదేవుని మహాప్రసాదమును అన్నముగా నెంచదగదు. ఇవి యన్నియు సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపములు.

1047. భగవంతుడు సంకల్పించినచో, సూదిబెజ్జమున ఏనుగును దూర్పగలడు. ఇచ్ఛానుసారము అతడేమైనను చేయగలడు. (చూ. 144.)

1048. భగవంతుని శరణుజొచ్చినవాని నడవడియందు తడబాటుండదు. (ఆరితేఱిన వ_ర్తకుడు తప్పటడుగు వేయడు. చూ. 278.)

1049. 'హరి'యనగా మనహృదయములను హరించువాడని యర్థము (హరతీతి హరిః) 'హరి బల'మనగా హరియే మన బలమని భావము.

1050. ఆత్మప్రబోధము కలుగనిదే భగవంతుని దెలిసికొనజాలము. (చూ. 903, 1002.)

1051. భగవంతుని శరణుజొచ్చి లజ్జను భయమును విడిచిపెట్టుము. "భగవంతునిపేర నేను నృత్యముచేసినచో, జనులేమనుకొందురో ?"—ఇట్టిభావములను తృణీకరింపుము.

1052. (ఇచట 238-వ ప్రవచనము జదువుకొనుడు.)

1053. శ్రద్ధయే అభీష్టవరప్రదాత. (చూ. 506.)

1054. (మనము లక్షింపవలసినవానిలో) మొదటిది భగవత్ సాక్షాత్కారము, తరువాతిది వాని సృష్టి. వాల్మీకికి రామమంత్ర ముపదేశింపబడెను, కాని దానిని 'మరా' 'మరా'—యని తలక్రిందుగా జపింపవలయునని యాతడు ఆదేశము పొందెను. 'మ' అనగా ఈశ్వరుడనియు 'రా' యనగా జగత్తు అనియు భావము—మొదటిది భగవంతుడు, తరువాతిది జగత్తు. (చూ. 5, 6, 7, 820.)

1055. అమితభక్తిచే (తన్మయత్వము పొందుటచే) హాని కలుగుననుట అవివేకము—అసంగత ప్రలాపము. (చూ. 663.) మాణిక్యకాంతులు మనోహరముగను ప్రశాంతికరముగను ప్రకాశించునేకాని తగులబెట్టవు. (చూ. 763.)

1056. లీలమూలమున నిత్యుని దెలిసికొనయత్నింపుము. (చూ. 867.)

1057. 'సత్తు'ను దెలిసికొనుటకై 'చిత్తు' నాశ్రయింపుము. (అనగా శుద్ధసత్త్వస్వరూపమగు బ్రహ్మమును దెలిసికొనుటకై శుద్ధచైతన్యరూపమగు వానిలీల నాశ్రయింపుమని భావము.)

1058. నిత్యమైనదానిని అనిత్యమైన దానిమూలముననే పొందవలసియున్నది; సత్యమును అసత్యముమూలముననే కనుగొనవలయును; పరమార్థమును వ్యవహారముమూలముననే * గ్రహింపవలయును. (చూ. 867.)

1059. వాని పేరు చిన్మయుడు; వాని నివాసము (అధిష్ఠానము) చిత్తు (జ్ఞానము); ఆతడు (పరమేశ్వరుడు) జ్ఞానస్వరూపుడు.

---

* లేదా, బ్రహ్మమును దృశ్యప్రపంచమూలముననే గ్రహింపవలయును.

ఇరువదిరెండవ ప్రకరణము

# నీతి కథలు

సాంసారికదుశ్చింతవలవ గలుగు హాని—కామమే బంధకారణము—ఆత్మవికాసము మనస్సుపై నాధారపడియుండును—మిట్టవేదాంతమువలన గలుగు ప్రమాదములు—స్వమతదురభిమానము—శ్రద్ధాభక్తులు: ఆత్మార్పణము—త్యాగము: వైరాగ్యము—మాయయొక్క స్వభావము—బ్రహ్మసాక్షాత్కారము

## సాంసారిక దుశ్చింతవలన గలుగు హాని

### బాటసారి, కల్పవృక్షము

1060. భగవంతుడు కల్పతరువువంటివాడు—మనమేమి కోరినను భగవంతు డొసగును. కాబట్టి పారమార్థిక సాధనలచే మనస్సును పరిశుద్ధమొనర్చుకొని సాధకుడు ఐహికవాంఛల నన్నిటిని విసర్జించుటకై జాగరూకుడు కావలయును. ఈ విషయమై ఒక కథ జెప్పెదను, వినుడు. ఒక బాటసారి ప్రయాణమైపోవుచు, దారిలో ఒకమైదానమును జేరుకొనెను. అతడు బయట నెండలో నడచియున్నందున, అలసి ముచ్చెమటలు పట్ట కొంచెము విశ్రమింపవలయునని యొక చెట్టునీడను గూర్చుండెను. అంత గొంతసేపటికి అక్కడ నిద్రించుటకు దనకొక పాన్పులభించిన నెంతసుఖముగా నుండునోకదా యని యూహింపనారంభించెను. తాను కల్పవృక్షముక్రింద గూర్చుంటినని యాత డెఱుగనే యెఱుగడు. పైని జెప్పిన కోరిక మనస్సున దోపగనే తనప్రక్క నొకచక్కని పానుపు గాన

బడెను. అది చూచి యమితాశ్చర్యమునొంది దానిపై బరుండెను. అటుపిమ్మట తన కొక సుందరి వచ్చి నెమ్మదిగా పాదములొత్తిన నెంతహాయిగా నుండునో కదా యనుకొనెను. ఈ తలపు కలుగగనే ఒక సుందరివచ్చి తనపాదముల నొత్తు చుండుట కనుగొని బాటసారి పరమానందభరితుడయ్యెను. అటుపిమ్మట వానికి విశేషమైన ఆకలియైనది. అంతట నతడిట్లూహించెను: "నేను కోరినదంతయు ప్రాప్తించినది. నాకిక నేదైన ఆహారము లభింపకుండునా?" అంతలోనే వాని యెదుట రుచికరమగు నానావిధ పదార్థములును వడ్డింపబడి యుండెను. తత్‌క్షణమే యాతడు వానిని దిన మొదలు పెట్టెను; తృప్తిగమెక్కి తిరిగి పరుపుమీద బండుకొని యానాడు జరిగిన వృత్తాంతమునుగూర్చి చింతింపసాగెను. ఇట్లాలోచించుచు. "ఇపుడు ఆకస్మికముగ నన్నొక పెద్దపులి వచ్చి గుటుకున మ్రింగెనా!" అని యూహింపగనే క్షణములో 'గాండ్రు' మని యొకపెద్దపులి వానిపై నుటికి మెడ కొటికి నెత్తురు పీల్పనారంభించెను. ఇటు లాబాటసారి ప్రాణములు గోల్పోయెను.

సాధారణముగా లోకులగతి యిట్లే పరిణమించుచుండును. కీర్తి గౌరవములను వాంఛించి భగవంతుని ప్రార్థించినపక్షమున, మీకోరికలు కొంతవఱకు తప్పక సిద్ధించును. కాని వాని వెనుకనే పెద్దపులి దాగియున్నదని నమ్ముడు. రోగము, శోకము, ధనహాని, మానహాని మొదలగు నీపెద్దపులులు సజీవమైన పులికంటె వేయిరెట్లెక్కువ భయంకరములుకదా!

## పూలమ్మువానియిల్లు చేరిన పల్లెపడుచులు

**1061.** కొందఱు పల్లెపడుచులు సంతనుండి యింటికి బోవుచు, దారిలో ప్రొద్దు గ్రుంకి వడగండ్లవాన వచ్చి నందున సమీపముననున్న యొక పూలమ్మువానియిల్లు చేరిరి. ఆ వర్తకుడు దయదలచి వారిని దాను పూవులు పెట్టుకొను వసారాగదిలో ఆ రాత్రి పండుకొననిచ్చెను. అందు పరిమళము గల పూవులు తట్టలకొలది యుండుటచే ఘుమఘుమ సువాసన వచ్చుచుండెను. కాని యీ సువాసన పల్లెపడుచులకు దుర్భరమై వారికొక కునుకైనను బట్టనీయకుండెను. తుద కొకతె యందులకు నివారణోపాయమును గనిపెట్టెను. ఆమె యిట్లు పలికెను: "ఖాళీగా నున్న మన చేపలబుట్టలపై గొంచెము నీళ్లుచుక్కలుచల్లి వానిని మనదగ్గఱ బెట్టుకొందము. మనకు నిద్రపట్టకుండ జేయుచున్న యీ పూలవాసన కిదియే విఱుగుడు." పల్లెపడుచు లందఱును ఈ సదాలోచనకు సంతోషపూర్వకముగా సమ్మతించి యటులనే చేసిరి, అరగడియలో వారందఱును గుఱ్ఱుపెట్ట నారంభించిరి.

అభ్యాస మెంతగొప్పదో! సాంసారిక దుశ్చింతలలో బుట్టి పెరిగి, పేడపురుగువలె ఆ మాలిన్యముననే జీవించుట కలవాటు పడిన లౌకికునిగతియునిట్టిదే. పవిత్రత, వైరాగ్యము, త్యాగమును బ్రకాశించుతావున నట్టివాడు నిమిషమైనను మనజాలడు కదా! అట్టి వాతావరణమునను ఉక్కిరిబిక్కిరియై పోవునుగదా! (చూ. 214.)

## సమాధి నిమగ్నుడైన యోగి

1062. ఒకయోగి సమాధినిమగ్నుడై బాటప్రక్కను బడియుండెను. ఒక దొంగ యా త్రోవను బోవుచు వానిఁజూచి, "వీడు దొంగయై యుండవలయును. రాత్రి కొన్ని యిండ్లు దోఁచి అలసటచే నిక్కడ పడి నిద్రపోవుచున్నాడు. పోలీసువారు వచ్చి త్వరలోనె వీనిని బట్టుకొందురు. కాబట్టి నేను త్వరగా నిక్కడినుండి పాఱిపోవుట మంచిది" అనుకొనెను. ఇట్లు ఆలోచించుచు వాడు పరుగెత్తెను. ఇంతలో నొక త్రాగుబోతు వచ్చి యోగిని జూచి యిట్లు పలికెను: "ఓహో! బావా! తప్ప త్రాగి యీ మురికికాలువలో బడిపోయినావా! ఉహుఁ! నేనే నయము. ఒరే! నీకంటె నేనే కైపు ఆపుకొని పడిపోకుండ ఉన్నాను! చూడు నామజా!" తుదకొక సాధువు వచ్చి, సమాధిమగ్నుడైన యొక మహనీయు డచట పడియుండెనని గ్రహించి యాతని చెంత గూర్చుండి పాదములొత్త నారంభించెను.

(నిజమైన మహత్త్వమును పవిత్రతను గ్రహింపకుండ మన లౌకిక ప్రవృత్తు లిట్లు మనలను నిరోధించుచుండును.)

## పల్లెవాండ్ర దివ్యావేశము : అర్చకుని యన్నము

1063. అర్చకులనుగూర్చి శ్రీగురుదేవుడు చైతన్యచరిత్రనుండి యొకకథను జెప్పుచుండెడివాడు. భావసమాధినిమగ్నుడై శ్రీ చైతన్యుడు సముద్రమున బడినప్పుడు పల్లెవాండ్రు వలవేసి పైకి దీసిరి. శ్రీ చైతన్యదేవుని శరీరసంస్పర్శచే వారి కొకవిధమైన పారవశ్యము గలిగెను. అంతట వారు

తమ పనుల నన్నిటిని విడిచిపెట్టి హరినామస్మరణముచేయుచు పిచ్చివారివలె దిరుగసాగిరి. వారి బంధువు లెట్లును ఈ 'విచిత్ర వ్యాధి'కి చికిత్స జేయజాలక, ఉపాయాంతరము గానక, తుదకు శ్రీ చైతన్యదేవునియొద్దకే వెళ్లి మొఱపెట్టిరి. శ్రీ చైతన్యు డిట్లు పలికెను : "ఏపూజారియింటికై నను బోయి కొంచె మన్నము దీసికొనివచ్చి వారి నోట బెట్టుడు. దానితో ఆ మైమఱపు తగ్గిపోవును." వా రటుల చేసినంతనే యా పల్లె వాండ్రు పారవశ్యమును గోల్పోయి యథాస్థితికి వచ్చిరి.

(ఆత్మవికాసమును నిరోధించుటలో ఐహికజీవనము యొక్కయు అపవిత్రత యొక్కయు ప్రభావ మిట్టిది.)

## యజమానుడనని నటించిన సేవకుడు

**1064.** ఒకధనికుడు తన ప్రధానసేవకునకు దనయాస్తి నంతయు సంరక్షించు నధికార మొసగెను. ఎవ్వరైనను ఆసేవకుని, "ఈయాస్తి యెవరి"దని యడుగ నాతడు, "అయ్యా, ఇదంతయు నాసొత్తే; ఈయిండ్లు, తోటలు— అన్నియు నావే" యనువాడు. ఈవిధముగా జెప్పుచు, అత డహంభావముతో గన్ను మిన్ను గానక సంచరింపసాగెను. ఒకనా డాసేవకుడు తనయజమానుని యాజ్ఞకు వ్యతిరిక్తముగా తోటలోని చెఱువులో జేపలు పట్టుట తటస్థించెను. ప్రారబ్ధవశమున సరిగా నప్పుడే యజమాను డచటికి వచ్చి యీ మాయలమారి చేయుచున్న పనిని జూచెను. సేవకుని యవిధేయతను అక్రమమును గాంచి యాతడు ఆగ్రహపడి, వెంటనే యుద్యోగమునుండి యాతని వెడలగొట్టుటయే

కాక, నలువురును జూచుచుండ మొగము వాచునట్లు చీవాట్లు పెట్టెను; మఱియు నాత డార్జించిన దానినిగూడ మాడలాగి కొనెను. పాపము, ఆనిర్భాగ్యుడు తన సొంతసొత్తగు ప్రాత గిన్నెలు, గుడ్డలు గల రేకుపెట్టెనుగూడ దిగవిడిచి పోవలసిన వాడయ్యెను. దురభిమానమునకు ఫల మిటులుండును.

## మంగలి: యేడు బంగారుగోతములు

1065. మంగలి యొకడు భూతము ఆవహించిన చెట్టు క్రిందనుండి పోవుచు, "బంగారుతో నిండిన యేడుగోతములు నీకు గావలయునా?" యను ధ్వనిని వినెను. ఆ మంగలి యిటునటు చూడగా నెవ్వరును గానరాలేదు. ఏడుగోతముల బంగారము నిచ్చెదనను శబ్ద మెటులైనను వానికి పేరాసను గల్గింప నాతడు, "ఆహా! తీసికొందు"నని గట్టిగా నఱచెను. "ఇంటికి బొమ్ము, నేనాగోతములను నీయింటికి జేర్చినాను" అనుప్రతివచనము వెంటనే వినవచ్చెను. ఈ విచిత్ర మెంత వఱకు నిజమో కనుగొందమను నాత్రముతో నాత డింటికి బరుగెత్తెను. ఇల్లు చేరి చూచుసరికి గోతములు కట్టెదుట నుండెను! వానిని విప్పిచూడ నొకటి తప్ప మిగిలినవన్నియు బంగారునాణెములతో నిండియుండెను. మంగలిమనస్సులో నిపుడొక తీవ్రమైన కోరిక పుట్టినది. ఏడవగోతమునుగూడ దాను నిండింపవలయుననియు, లేనిచో దనయానందమునకు వెలితి కలుగుననియు నాతడు తలచెను. అందుచే నాతడు తన యింటిలోని వెండినగలను బంగారునగలను అన్నిటిని అమ్మివైచి వానిని వరహాలుగా మార్చి యాగోతములో

వేసెను. కాని యాగోతము నిండదే! అది యెప్పటి యట్లే యుండెను. అందువలన మంగలికి జాల ఆరాటము గలిగెను. తానును కుటుంబమును తిన్నగా దిండి తినక, మాడి మఱికొంతధనము ప్రోగుచేసి యాగోతములో వేసెను. కాని విచిత్రమైన యాగోత మెప్పటివలె అసంపూర్ణముగనే యుండెను. అందుచే నాతడొకనాడు రాజును సందర్శించి తన రాబడి కుటుంబపోషణకై చాలకున్నదని చెప్పి తనజీతము హెచ్చుచేయింపుడని కోరెను. ఈ మంగలిమీద రాజునకు అభిమానముండుటచే, ఆతడు కోరగనే రాజు వాని జీతము రెట్టింపుచేసెను. ఈజీతమంతయు మంగలి కూడబెట్టి గోతములో వేయుచుండెనుగాని యా విచిత్రపు గోతము నిండదే! తుద కామంగలి యింటింటికి దిరిగి తిరిపెమెత్త నారంభించి యాసొమ్మును తన నెలజీతమును అంతయు ఆవింతగోతములో బడవేయసాగెను. కాని యది యెప్పటివలెనే యుండెను—అది నిండు సూచన లేమియు గాన్పింపవయ్యె. నెలలు గడుచు చుండెను, కాని యేడుగోతముల భాగ్యము గలిగిన యానిర్భాగ్యపుమంగలి దుఃఖము నానాటికి హెచ్చుచుండెను. రాజు వాని దైన్యమును దురవస్థను గనిపట్టి యొకనా డిట్లు ప్రశ్నించెను: "ఓరీ! నీజీత మిప్పుడున్న దానిలో సగమై యున్నప్పుడే ఎంతో ఆనందముగను, ఉల్లాసముగను ఉండెడివాడవే. కాని యిప్పుడు రెట్టింపుజీతము సంపాదించుకొనుచున్నను అతి దీనముగా, బిక్కమొగము వేసికొనియుండుటకు కారణమేమి? నీకేమియు కీడు వాటిల్లలేదుకద? ఒకవేళ 'ఆ యేడుగోతములు'ను నీకు తటస్థపడినవా యేమి?" ఈమాటలు విని

మంగలి యులికిపడి, "మహాప్రభూ! ఎవరా సంగతిని ఏలిన వారికి వినిపించినారు?" అనెను. రా జిట్లు పలికెను: "నీకు దెలియదా? ఎవరి కాయేడుగోతములను యక్షుడు దత్తము చేయునోవానియందీలక్షణములు కాన్పించును. నాకును యక్షుడీగోతములను దీసికొమ్మని యీయబోయెను; కాని యా ధనము, 'దాచుకొనుటకా, వ్యయించుటకా?' యని నే నడుగగా, యక్షుడు మాఱు పలుకకుండ బాఱిపోయినాడు. ఆ ధనము ఎవరును వాడుకొనదగినది కాదని నీకు దెలియదా? అది చేచిక్కినవారికి దానినింకను గూడబెట్టవలయుననియే కాని వ్యయింపవలయునని బుద్ధి పుట్టదు. తత్క్షణమే పోయి యాధనమును తిరిగి యిచ్చివేయుము." ఈసదుపదేశమును విని మంగలి బుద్ధితెచ్చుకొని యక్షు డావహించిన యాచెట్టు కడకు బోయి, "ఓ యక్షుడా! ఇదిగో, నీబంగారము. నీవే తీసికొనుము" అనెను. "సరే" యని యక్షుడు మాఱు వలికెను. మంగలి యిల్లు చేరి చూచుసరికి ఆ యేడుగోతములును ఎంత విచిత్రముగా వచ్చెనో అంత విచిత్రముగనే అదృశ్యమైపోవుటయేగాక, వానితోపాటు తాను యావజ్జీవము పాటుపడి సంపాదించిన ధనముకూడ ఎగిరిపోయినది!

లోకమున గొందఱిస్థితి యిటు లుండును. నిజమైన యాదాయ మేదియో, వ్యయమేదియో తెలియనివారి కున్న దంతయు నాశనమగును.

## మేకపిల్ల: తంగేడు పువ్వులు

1066. వైశాఖమాసమున నొక చిన్న మేకపిల్ల తన

తల్లికడ నాటలాడుకొనుచుండెను. ఉల్లాసముగా అది యొక కుప్పిగంతు వైచి తల్లితో నిట్లనియెను: "అమ్మా! అమ్మా! అవిగో, తంగేడుచెట్లు. వాని పూలను నేను గడుపార మేయుదును." అందులకు తల్లి యిట్లనియెను: "బిడ్డా! ఆపూలను నీవు మేయగలుగుట యంత తేలికయైనపని కాదు. తంగేడు పూవులు నీకు జిక్కుటకుముం దనేకగండములు గడవవలసియున్నది. రాబోవు భాద్రపదాశ్వయుజమాసములు నీకంతగా శుభదినములు కావు! ఎవరేని నిన్నెత్తుకొనిపోయి దుర్గాదేవికి బలి యీయవచ్చును. అది తప్పిన, భయంకరమైన కాళీపూజ వచ్చును; అదృష్టవశమున ఆ గండముకూడ తప్పినను, ఇంకను జగద్ధాత్రిపూజ యున్నది. ఆ సమయమున మనజాతిలో మిగిలియున్న మగసంతతినంతయు నించుమించుగా జాతరలో గడతేర్తురు. మహాదృష్టవశమున నీ వీ గండములనన్నిటిని గడచి బ్రదికి పెద్దవాడవైనయెడల, దీపావళినాటికి తంగేడుపూల విం దారగింతువుగాని లెమ్ము! అపుడు మంచితంగేడుపూవులు దొరకగలవు కూడను."

ఈ కథలోని మేకపిల్లవలె మన నవయౌవనోత్సాహము కల్పించు మనోరథములన్నిటికిని తలలూపరాదు—వానిని దీర్చుకొందమను అత్యుత్సాహము కూడదు. మఱి యేమన, జీవయాత్రలో సంభవించు గండము లనేకము లని మది నుంచుకొని గొంతెమ్మకోరికలను సాధ్యమైనంతవఱకు జంపుకొనుటయే మేలు.

# కామమే బంధకారణము

## 'సంసారము నంటని సంసారి'

1067. సంసారమాలిన్యము నంటకుండ సంసారమున నుండుట గృహస్థులకు సుసాధ్యమేయని నవనాగరకవిద్యాధికు డొకడు శ్రీగురుదేవునితో వాదింపసాగెను. అప్పుడు గురుదేవుడు వాని కిట్లనియెను: "'సంసారము నంటని నేటి నీ సంసారి' యనగా నెట్టివాడో నీకు దెలియునా? తాను సంసారమాలిన్యము నంటనివాడు కావున, డబ్బుతో దా నెట్టి జోక్యము పెట్టుకొనడు కావున, తనగృహకృత్యములను ఆదాయమును వ్యయమును అన్నిటిని భార్యయే పరిపాలించుచుండును. అందుచే నెవ్వడైన నొక బీదబ్రాహ్మణు డీ 'గృహాధిపతి'ని యాచింపవచ్చినపక్షమున నీత డిట్లనును: 'అయ్యా! నేనెన్నడును ధనము తాకను; నన్ను యాచింపవచ్చి నీవెందులకు వృథా కాలయాపన చేసెదవు?' ఆ బ్రాహ్మణుడు అతి దీనముగా ప్రార్థించుచు, పీడించువాడైన పక్షమున, 'సంసారము నంటని యీ సంసారి' విసుగుకొని తనలో దా నిట్లనుకొనును: 'వీని కేదైన నిచ్చినగాని వీనిపోరు తప్పించుకొను సూత్రము లేదు.' అందుచే నాతడు, 'సరే, రేపు రావయ్యా, వీలైనంతవఱకు జూచెదను' అనును. ఈ 'లోకాదర్శగృహస్థుడు' లోనికిబోయి భార్యతో నిట్లనును: 'ఇటు చూడు, ఒక బీదబ్రాహ్మణుడు చాల అవస్థపడుచున్నాడు. వాని కొక రూపాయి నిత్తము.' 'రూపాయి' యను మాట చెవిని బడగనే భార్య రుద్రరూపము దాల్చి సాక్షేపముగా, 'ఆహా!

ఏమి ఔదార్యమండి! వెనుకముందు జూడకుండ బాలి వేయు టకు రూపాయలు మీకు పులివిస్తరాకులో, ఊళ్లో!' ఆ గృహయజమానుడు నట్టుచు, 'అబ్బే! ఆ బ్రాహ్మణుడు చాల పేదవాడు, అంతకంటె దక్కువిచ్చిన బాగుండదు' అని ప్రార్థనాపూర్వకముగా మనవిచేయును. 'వీలు కాదు, ఒక్క బేడకంటె ఎక్కువ ఇచ్చుటకు వీలు కాదు. ఇదిగో బేడ. మీ కిష్టమువచ్చిన దీని నీయవచ్చును' అని భార్య 'నిర్మొగ మోటముగా' బలుకును. కాని యీ 'బాబు' సంసారమాలి న్యము నంటని సంసారి కావున తన భార్య యిచ్చినదానినే స్వీకరించును. మఱినా డాయాచకునకు దక్కున దా బేడయే.

''సంసారము నంటమని చెప్పకొను మీ సంసారులు నిజ ముగా స్వాతంత్ర్యహీనులు—తెలిసినదా? కుటుంబవ్యవహార ములను స్వయముగా జక్కబెట్టుకొనరు కావున జాల యోగ్యులమనియు పావనులమనియు తలపోయుచుందు వీరు నిజముగా భార్యచే జీకటి మొట్టికాయలు తిను భార్యా దాసులు. కాబట్టి వీరు సామాన్యమానవు లనిపించుకొనుటకు గూడ దగరు.''

## గోవింద దేవాలయార్చకులు

1068. పూర్వము జయపురమందలి శ్రీ గోవిందదేవాల యార్చకులు పెండ్లిచేసికొనువారుకారు. అప్పుడు వారాత్మ తేజోవిరాజితులై యుండెడివారు. ఒకసారి రాజు తనకడకు రండని వారికి గబురుచేయగా, ''రాజునే యిక్కడకు రమ్మ నుడు'' అని జబాబుచెప్పిరి. కాని తరువాత వారు పెండ్లిండ్లు

చేసికొనసాగిరి. అంత నిక రాజునకు వారిని బిలువనంపవల సిన యగత్యమే లేకుండబోయినది! వారు తమంత తామే పోయి, "మహారాజా! ప్రభూ! మిమ్ము దీవింపవచ్చితిమి. మీ కొఱకై దేవాలయమునుండి ప్రసాదమును దెచ్చితిమి; స్వీకరింపుడు" అని వేడుకొనువారు. వా రటుల జేయక తప్పినది కాదు. పాపము, ఆనిర్భాగ్యు లేమి చేయగలరు? ఒకనాడు ఇల్లు కట్టుకొను నక్కఱ, మఱియొకనాడు పిల్లలకు అన్నప్రాశనముచేయు ముచ్చట, ఇంకొకనాడు కుమార్తెలకు పెండ్లిండ్లు—ఇట్లు అడుగడుగునను ఆవశ్యకములే ఆయెను! వీనికై డబ్బు కావలయునుగదా! అందులకై రాజుగారిని యాచింపక తప్పదాయెను!

ఒరులయొద్ద సేవచేయుచు మీ రెట్టి నీచస్థితిలో నున్నారో మీయంతట మీకే తెలియగలదు. పాశ్చాత్యపద్ధతిప్రకారము బాగుగా విద్య నేర్చిన మీయువకులు—మీ యాంగ్ల విద్యాపండితులు — నోరెత్తకుండ అధికారులచే తన్నులు తినుచున్నారు! ఈ యవమానములకును ఈ బానిసత్వమునకును మూలకారణ మేమో తెలియునా? 'కామిని'— కామినీవ్యామోహము.*

---

* చ. "జలజవిలోచనంబులును సన్నపుఁ జందురకావిచీరలుం
గులుకు మెఱుంగుఁ జన్నులును గొంచెపుఁగానులు రత్నకింకిణీ
కలరశనాగుణంబులును గల్గిన కాంతలు గల్గరేని గా
సిలి మతిమంతు లేటికి వసింతురు రాజగృహాంగణంబులన్."
—భర్తృహరిసుభాషితము, ఏనుగు లక్ష్మణకవి యనువాదము, 2-31.

## ఉద్యోగ సంపాదనము

1069. ఒక పేదవాడు ఉద్యోగము దొరకక చాల బాధపడుచుండెను. అనేక పర్యాయము లొక ఆఫీసునకు బోయి యచటి పెద్దగుమస్తాను (లేక కార్యనిర్వాహకుని) దర్శించి, పడిగాపులు పడియుండి, ఏదేని యుద్యోగము నొసగుడని వేడుకొనెను. ఉన్నదనికాని, లేదనికాని ఖండితముగా జెప్పక యాతడు, "ఈదినము కాదు, రేపు రమ్ము", "నన్నప్పుడప్పుడు చూచుచుండుము" అనుచునే కాలము గడపుచుండెను. ఈవిధముగా జాలదినములు గడచిపోయినవి. ఒకనాడా పేదవాడు తన బాధలనుగుఱించి యొక స్నేహితునితో జెప్పుకొనెను. ఆ స్నేహితుడు వెంటనే, "నీవెంత తెలివి తక్కువవాడవు! ఆ నిర్భాగ్యుని దర్శించి దర్శించి నీకాళ్లు అఱిగిపోయియుండును. గోపమ్మదగ్గఱకు బోయి దానిని బతిమాలుకో. నామాట నమ్ము. రేపే నీకు ఉద్యోగము దొరకును" అని యుపాయము చెప్పెను. ఆ పేదవాడు అమితాశ్చర్యముతో, "అటులనా! ఇప్పుడే పోయి యామె కాళ్ల మీద బడుదును" అనెను. గోపమ్మ యా యుద్యోగస్థుని యుంపుడుకత్తె. ఆ బీదవాడామెయొద్దకు బోయి, "అమ్మా! నేను చాల దుర్దశలో నున్నాను. నీవు తప్ప నన్ను రక్షించువారు లేరు. నేను బ్రాహ్మణుడను. నాకితరమగు నాధారము లేదు. అమ్మా! చాలకాలమునుండి ఉద్యోగము లేక బాధపడుచున్నాను. ఆలుబిడ్డలు 'అన్నమో రామచంద్రా!' యని పలవించుచున్నారు. నీ వొక్కమాట చెప్పితివా, నాకు ఉద్యోగము లభింపగలదు. ఈపుణ్యము గట్టుకొనుము" అని

బతిమాలుకొనెను. గోపమ్మ యిట్లనెను: "సరేకాని, ఎవరితో జెప్పిన, కార్యము సానుకూలమగును?" ఆ బ్రాహ్మణుని దైన్యము చూచి యామె, "అయ్యో, పాపము! ఈ బ్రాహ్మణుడు చాల దురవస్థలో నున్నాడు" అని జాలిపడెను. ఆ బ్రాహ్మణుడు వెంటనే యిట్లనెను: "నీవు బాబుగారితో నొక్కమాట చెప్పితివా, నా కుద్యోగము దొరకును." గోపమ్మ యారాత్రియే 'బాబుగారితో' జెప్పెదనని వాగ్దానము చేసెను. విచిత్రము! మఱునాటి యుదయముననే బ్రాహ్మణుని యింటికి బంట్రౌతు వచ్చి నాటినుండియే యుద్యోగమున జేరవలసినదిగా 'బాబుగారి' యుత్తరువును విన్నవించిపోయెను. ఆ యుద్యోగస్థుడు ప్రధానోద్యోగితో బ్రాహ్మణునిగూర్చి యిట్లు సిఫారసుచేసెను: "ఈతడు చాల యోగ్యతగలవాడు, పెద్దపరీక్షల నిచ్చినవాడు. ఈతనిసేవ మన ఆఫీసునకు జాల లాభకరముగా నుండునని యుద్యోగము నిచ్చినాను. తమ దయవలన జాల అభివృద్ధి నొందదగినవా డీతడు."

కామినీవ్యామోహ ప్రభావ మిటువంటిది. లోకమంతయు కామినీకాంచనవ్యామోహములో మునిగి తేలుచున్నది.

## లోభివర్తకుడు : గురువు

1070. ఒక పేదబ్రాహ్మణునకు ధనికుడగు నొక బట్టలవర్తకుడు శిష్యుడుగా నుండెను. స్వతస్సిద్ధముగా ఆవర్తకుడు బహు లోభి. ఒకనా డా బ్రాహ్మణునకు దన దేవతార్చన గ్రంథమును గప్పుకొనుటకై యొకగుడ్డ కావలసివచ్చినది. ఆయన తనశిష్యునియొద్దకు బోయి యడిగినాడు. వర్తకు డిట్లూ

పలికెను: “అయ్యో, రెండుగడియలక్రితము చెప్పినపక్షమున మీకు గావలసినగుడ్డ నిచ్చియుందును. మీకు బనికివచ్చెడు చిన్నగుడ్డముక్క యిప్పుడేదియు లేదే! ఏమి దురదృష్టము! కానిండు, మీరడిగినదానిని జ్ఞప్తి నుంచుకొందును. ఐనను మీరప్పుడప్పుడుమాత్రము జ్ఞాపకముచేయుచుండుడు.” పాప మాబ్రాహ్మణుడు నిరాశతో వెడలిపోయెను. గురువుగారికిని ఈ శిష్యోత్తమునకును జరిగిన సంభాషణమును వర్తకుని భార్య తెరచాటుననుండి వినినది. ఆమె వెడలిపోవుచున్న యా బ్రాహ్మణుని వెంటనే లోనికి బిలిపించి, “స్వామీ! గృహ యజమానుని మీరడిగిన దేమి?” యని విచారించెను. బ్రాహ్మణుడు జరిగిన వృత్తాంతమును దెలుప, “చిత్తము, మీరింటికి వెళ్లుడు; మీరు కోరిన గుడ్డ రేపుదయముననే మీకు జేరును” అని వర్తకునిభార్య పలికెను. రాత్రి వర్తకు డింటికి రాగానే, “దుకాణము మూసివేసితిరా?” యని భార్య యడిగెను. “ఔను, విశేషమేమి?” యని వర్తకు డనెను. “ఇప్పుడే వెళ్లి మనదుకాణమున గలవానిలో నాణ్యమైన రెండుబట్టలు తీసికొనిరండు” అని భార్య పలికెను. వర్తకు డంత, “ఏమీ యాతొందర! రేపుదయమున నీయుగూడదా? ఉన్న వానిలోనెల్ల మేలైనవానిని రేపుదయముననే యిచ్చెదను” అనెను. “అటుల కాదు, ఇప్పుడే యీయవలెను, లేదా, నా కక్కఱయే లేదు” అని భార్య నొక్కిచెప్పెను. పాప మా నిర్భాగ్యు డేమి చేయగలడు? గురువుగారా, ఏవో మాయ మాటలతో—కల్లబొల్లి వాగ్దానములతో—బంపి వేయుటకు? ఈమె తన ‘శయ్యామందిరపు గురు’వయ్యె!

ఇక నేమి చేయుట ! ఈమెయాజ్ఞ లప్పటికప్పుడే చెలామణియై తీరవలయును. లేనిచో, 'ఇంటిలోని పోరు ఇంతంత గాదయా!' యనునట్లగును. తుద కావర్తకుడు విధిలేక యర్ధరాత్రివేళ బోయి, కొట్టుతీసి, భార్యకోసము బట్టలు తెచ్చినాడు. మఱునాటి యుదయముననే ఆయిల్లాలు గురువుగారికి గావలసిన బట్టను బంపుచు నిట్లు కబురంపెను : "ఇకమీఁదట మా యొద్ద మీకేమైన గావలసినపక్షమున నన్నడుగుడు, మీకు దొరకును."

(కాబట్టి దయామయియగు లోకేశ్వరి శరణుజొచ్చి యామె వరప్రసాదమును గోరువారి ప్రార్థనలు, ఈషణ్మాత్రము కఠినమైన పితృభావమున భగవంతు నర్చించువారి ప్రార్థనలకంటె శీఘ్రముగా— సులభముగా— నెఱవేఱుటకు అవకాశముగలదని గ్రహింపనగును.)

## కార్తికేయుడు

1071. భార్యయెడ గృహస్థధర్మమును నిర్వర్తింపకుండుటకు గారణమేమని యొకరు ప్రశ్నింప శ్రీగురుదేవు డిట్లు సమాధాన మొసగెను : "కార్తికేయు డొకనాడు పిల్లిని గిల్లినాడట. ఇంటిలోనికి బోయి చూచుసరికి దన దివ్యజనని యగు పార్వతిచెంప గిల్లబడియుండుట గాంచి, 'అమ్మా, నీ బుగ్గపై అసహ్యమైన యీగాయ మెటుల గలిగినది?' అని యడిగెను. జగజ్జనని యిట్లు సమాధానమొసగెను : 'ఇది నీపనియే, నీగోటి ఱక్కెయిది.' కార్తికేయుడు నివ్వెఱపడి, 'అదెట్లమ్మా! నేను నిన్నెన్నడును గిల్లిన జ్ఞప్తి లేదే!' అనెను.

'నాయనా! నీ వీయుదయము పిల్లిని గిల్లినమాట మఱచి పోయితివా?' అని యాతల్లి యడిగెను. కార్తికేయుడు, 'ఔనమ్మా, నేను పిల్లిని గిల్లితిని. ఐనను నీ బుగ్గమీద గాయము పడుటెట్లు?' అనగా తల్లి యిట్లనెను: 'వెఱ్ఱి నాయనా! ఈ జగమున నేనువినా ఏమియులేదు. సృష్టిజాత మంతయు నేనే. నీ వెవరిని హింసించినను నన్నే హింసించిన వాడవగుదువు.' ఈ పలుకు లాలకించి కార్తికేయు డత్యాశ్చర్యము నొంది తాను వివాహ మాడరాదని నిశ్చయించి కొనినా డట! ఏలన దా నెవరిని బెండ్లియాడగలడు? ప్రతి స్త్రీయు దనకు దల్లియే కదా? ఇట్లు సమస్తస్త్రీలయందును మాతృభావమును బొంది యాతడు పెండ్లియాడుట మాని వేసెను. నేనును కార్తికేయునివంటివాడనే. ప్రతిస్త్రీని లోకేశ్వరిగనే భావింతును."

## ఆత్మవికాసము మనసుపై నాధారపడియుండును

### ఇద్దఱు మిత్రులు

1072. ఆత్మవికాసము మనఃస్థితిపైనను భావములపైనను ఆధారపడియుండును. వికాసము హృదయమువలన గలుగవలయునుగాని ఏ బాహ్యకర్మములవలనను గలుగదు. ఇద్దఱు స్నేహితులు భాగవతకాలక్షేపము జరుగు తావునకు సమీపమునుండి పోవుచుండిరి. అందొకడు, "అదిగో, అచటికి బోయి కొంచెముసేపు పురాణమును విందము" అనెను.

రెండవవాఁడు, “ఎందుకోయి! భాగవతమును వినిన నేమి లాభము? భోగమువాండ్ర యింటికి బోయి హాయిగా గాల క్షేపము చేయుదము” అనెను. మొదటివాఁ డందులకు సమ్మ తింపక భాగవతకాలక్షేపము జరుగుచోటికే వెడలెను. రెండవ వాఁడు భోగముదాని యింటికి బోయెనుగాని, తా నాశించిన యానందమును గనజాలక పోయెను. అందుచే దనలో దా నిట్లనుకొనసాగెను: “అయ్యో! నే నిక్కడి కేల వచ్చినాను? శ్రీహరిలీలలను వినుచు నా స్నేహితు డెంత హాయిగా గాల క్షేపము చేయుచుండునో కదా!” ఇట్లాతడు తాను అపవిత్ర స్థలమున నుండియు హరిని గూర్చియే ధ్యానించెను. రెండవ వాఁడో, భాగవతశ్రవణముచేయుచును గూడ అం దానందము గనజాలక తన్ను దా నిట్లు నిందించుకొనసాగెను: “ఆహా! ఎంత బుద్ధిహీనుడను! మిత్రునితో గూడ భోగముదాని యింటికి బోయి సుఖ మనుభవింప నైతినే! అత డెంతహాయిగా గాల క్షేపము చేయుచుండునో కదా!” ఇట్లీతడు భాగవతము పఠింప బడుతావున గూర్చుండెనన్న పేరే కాని, “చిత్తము శివుని మీఁద, భక్తి చెప్పులమీఁద” అనునట్లు వీని మనసంతయు భోగముదాని యింటిమీఁదనే యుండెను. ఇట్లు వీని మనస్సు అపవిత్రసంకల్పములతో మలినమైయుండుటవలన, స్వయ ముగా లంజెయింటికి బోకపోయినను పాపమునే పొందినాఁడు. ఇక భోగముదాని యింటికి బోయినవాఁడో, స్వయముగా తాను అపవిత్రస్థలమున నున్నను వాని మనస్సంతయు భాగవత కాలక్షేపముమీఁదనే యుండుటవలన భాగవతశ్రవణముచేసిన పుణ్యమును బడసెను.

## సన్న్యాసి : వేశ్య

1073. ఒక గుడిచెంత నొక సన్న్యాసి నివసించువాడు. ఎదురుగా నొక బోగముదాని యిల్లుండెను. విటు లనేకులు నిరంతరము నామెయింటికి వచ్చుచు బోవుచుండుట గాంచి సన్న్యాసి యొకనా డామెను బిలిచి యిట్లు చీవాట్లు పెట్టెను: "నీవు మహాపాపివి. రేయింబవళ్లు నీవు పాపముచేయుచునే యున్నావు. నీ కెట్టి ఘోర దుర్దశ రానున్నదోకదా!" పాపము, ఆ సాని, తన పాపకృత్యములకు జాల విచారించి తన పాపమును క్షమింపుమని భగవంతుని బ్రార్థించుచు, మనఃపూర్వకముగా పశ్చాత్తాపపడెను. ఐనను వ్యభిచార మామెకు వంశాచారమగుటచేతను జీవనోపాధికై మఱియొకవృత్తి నాశ్రయించుటెన్న గానకుండుటచేతను, తన తనువు వ్యభిచరించినపు డెల్ల దన్ను దాను నిందించు కొనుచు, విశేషపశ్చాత్తాపపడుచు క్షమింపుమని భగవంతుని బ్రార్థించుచుండెడిది. ఆ సన్న్యాసి తాను చేసిన హితోపదేశము వ్యర్థమైనదిగదా యని విసుగుకొని తనలో దా నిట్లనుకొనెను: "సరి, దీని జీవితకాలమున నిటుపై దీని యింటి కెందఱు విటులు వత్తురో చూచెదనుగాక." నాటి నుండి కొన్ని బొమ్మరాళ్లను బ్రోగుచేసికొని, యా సాని యింట విటుడు ప్రవేశించినపుడెల్ల సన్న్యాసి యొకబొమ్మ ఱాతిని దీసి యొకచోట వేయుచుండువాడు. రాను రాను ఆ ఱాళ్లొక పెద్ద కుప్పగా బెరిగినవి. ఒకనా డాతడు సానికా కుప్పను జూపి, "చూచితివా, ఇది నీపాపముల గుట్ట; నీ పాపకృత్యములను మానుమని నిన్ను నేను మందలించిన

నాటినుండియు నీవు మానక వ్యభిచరించినపుడెల్ల నే నొక జాతిని గుర్తుగా బెట్టుచున్నాను; ఆజాళ్లచే నేర్పడిన నీ పాప రాశి యిది! ఇంతటినుండియైన నీపాతకములను మానుమని చెప్పుచున్నాను. వీనిచే నీకెట్టి ఘోరదుర్గతి కలుగునో తెలి యునా?'' అని హెచ్చరించెను. పాప మానిర్భాగ్యురాలు తన పాపరాశిని జూచి గజగజ వణకుచు దన యశక్తతను గూర్చి, ''భగవంతుడా! నా యీఘోరదుఃఖజీవనమునుండి నన్ను రక్షింపవా?'' అని యంతరంగమున మొఱలిడసాగెను. ఆమె ప్రార్థనమ భగవంతుడు వినినాడు. ఆనాడే మృత్యు దేవత యామెయింట బ్రవేశింప నామె యీ ప్రపంచమును విడిచినది. అచింత్యమైన విధివశమున సన్న్యాసియు నానాడే దేహత్యాగము చేసినాడు. యమదూతలు సన్న్యాసియొక్క జీవుని బాశములచే బంధించి నరకలోకమునకు గొనిపోయిరి; విష్ణుదూతలు వచ్చి పశ్చాత్తప్తురాలైన యా వేశ్యయొక్క జీవుని వైకుంఠమునకు గొనిపోయిరి. ఆవేశ్యయొక్క యదృష్ట మును గాంచి సన్న్యాసి యిట్లనుచెను : '' ఇదియే కాబో లును భగవంతుని ధర్మసూక్ష్మత! జీవితమంతయు నేను కఠిన నిష్ఠలతో గడపితిని. నన్ను నరకమున కీడ్చుకొని పోవుచున్నారు! యావజ్జీవము మహాపాతకములు చేసిన యా వ్యభిచారిణి వైకుంఠమునకు బోవుచున్నది!'' ఈపలుకులు విని విష్ణుదూత లిట్లు తెలిపిరి. ''ఓయీ! విధాత యొక్క నిర్ణయము లెప్పుడును న్యాయ్యముగనే యుండును; సంకల్పానుగుణముగనే ఫలము గలుగుచుండును. పేరు ప్రతి ష్ఠల నాశించి జీవితమంతయు నీవు బాహ్యాడంబరముతోడను,

అహంభావముతోడను గడపితివి. అందులకు భగవంతుడు నీకు విధించిన ఫలమిది. నీ వెన్నడును మనఃపూర్వకముగా భగవత్ప్రాప్తికై పరితపింపవైతివి. తన తనువు పాపముచేసినను, ఈవేశ్య యహర్నిశము హృదయపూర్వకముగా భగవంతుని ప్రార్థించినది. అదిగో, లోకమున నీ శరీరమున కెట్టి గతి కలుగుచున్నదో, ఆమె శరీరమున కెట్టిగతి కలుగుచున్నదో చూడుము. శరీరముతో నీ వెన్నడును పాపముచేయలేదు. కావ నీ శరీరమును వారు పూలమాలలతో నలంకరించి, మేళతాళములతో నూరేగించుచు పుణ్యనదిలో విడువబోవు చున్నారు. కాని యీ వేశ్యయొక్క శరీరము పాపముచేసి యున్నది కాన, ఈక్షణమున గాకులచేతను, గద్దలచేతను జీల్చి వేయబడుచున్నది. ఐనను, ఈమెహృదయము పవిత్రమైనది కావున పుణ్యలోకమునకు బోవుచున్నది. నీ హృదయము సదా యీమె పాపకార్యములనే మననము చేయుచుండెను గాన నపవిత్రమైనది. అందుచే నీ వపవిత్రమ లుండు లోకమునకే పోవుచున్నావు. నిజముగా వ్యభిచరించినది నీవు కాని యీమె కాదు.''

## మిట్టవేదాంతమువలన గలుగు ప్రమాదములు

### మిట్టవేదాంతియగు రాజు

1074. ఈ విశ్వమంతయు బ్రహ్మమే యని ప్రకటించు నద్వైతసిద్ధాంతము నొక రాజునకు వాని గురువు బోధిం

చెను. ఈ సిద్ధాంతము రాజునకు జాల నచ్చినది. అంతఃపుర ములోనికి బోయి యాతడు తన రాణితో నిట్లనెను: "రాణి కిని రాణిదాసికిని భేదము లేదు. కాబట్టి దాసియే యింతటి నుండి నారాణియగును." తన భర్తయొక్క యీ పిచ్చిప్రసం గమును విని రాణి నిశ్చేష్టురాలయ్యెను. ఆమె యా గురుని బిలిపించి, "అయ్యా! మీ బోధలయొక్క దుష్ఫలమెట్లు న్నదో చూడుడు" అని మొఱలిడుచు జరిగిన వృత్తాంతము నంతయు దెలిపెను. ఆ గురువు రాణి నోదార్చుచు నిట్లు పలి కెను: "నేడు రాజునకు నీవు భోజనమిడు సమయమున నన్న ముతోబాటావుపేడనుగూడ పళ్లెరమున వడ్డింపజేయుము." భోజనసమయమున గురువును రాజును గలిసి భోజనమునకు గూర్చుండిరి. అన్నముతోబాటు వడ్డింపబడిన యావుపేడను జూచుసరికి రాజునకుగలిగిన యాగ్రహ మెట్టిదో యూహింప నగును. దీనిని గనిపట్టిన గురువు మందహాసముచేయుచు మెల్లగా నిట్లు ప్రశ్నించెను: "దేవరవా రద్వైతజ్ఞానము గలవారుగదా. అన్నమునకును, ఆవుపేడకును భేదము నేల పాటింతురు?" రాజంతట పట్టరానికోపముతో నిట్లనెను: "మహాద్వైతినని చెప్పుకొను మీరే, చేతనైనచో, ఈపేడ తినుడు." గురువంతట "మంచిది!" అని వెంటనే తానొక సూకరముగ మాఱి లొట్టలువేయుచు, ఆ పేడను, భక్షించి మఱల మానవరూపమును ధరించెను. రాజంతట సిగ్గు దెచ్చుకొని మఱల నెన్నడును రాణితో నట్టి పిచ్చిప్రసంగము చేయలేదు.

## మిట్టవేదాంతియగు బ్రాహ్మణుడు

1075. ఒక బ్రాహ్మణుడు తోటను వేయించి రేయింబవళ్లుదానిని జాగ్రత్తగా గనిపట్టి చూచుచుండెను. ఒకనాడొకయావు తోటలోబడి యాత డత్యంతప్రీతితో సంరక్షించుచున్న యొకమామిడిమొక్కను మేసివేసినది. తనకు మిక్కిలి ప్రియమైన యా మొక్క నావు ధ్వంసముచేయుచుండుట చూడగనే బ్రాహ్మణుడు కాలరుద్రుడై బడితె తీసికొని యావునుమోదగా నది చనిపోయినది. బ్రాహ్మణుడు గోహత్య చేసినాడను వార్త యెల్లెడలను వ్యాపించినది. ఈ బ్రాహ్మణుడు తాను వేదాంతి నని ప్రకటించుకొనుచుండెడివాడు. గోహత్యాపాతకము నెవ్వరైనను దనపై బెట్టగనే తాను నిర్దోషి యని ఋజువుచేయుటకుగా నత డిట్లు పలుకసాగెను: "లేదు, నేను గోహత్యచేయలేదు; ఆ పనిచేసినది నా చేయి; చేతి కధిష్ఠానదేవత యింద్రుడు ; కాబట్టి గోహత్యాపాతకమింద్రునిది కాని నాది కాదు." స్వర్గమందలి యింద్రు డీ పలుకులను వినినాడు; విని యాతం డొక వృద్ధబ్రాహ్మణవేషమును ధరించి తోటయజమానునియొద్దకు వచ్చి యిట్లు ప్రశ్నించెను: "అయ్యా, ఈ తోట యెవరిది?"

బ్రాహ్మణుడు : నాది.

ఇంద్రుడు : ఇది యెంత చక్కనితోట ! నేర్పరియైన తోటమాలిని మీరు సంపాదించియుందురు; చూడుడు, మొక్కల నెంతసొగసుగా, ఎంత నిపుణముగా, నాటినాడో !

బ్రాహ్మణుడు : ఇదంతయు నాపనియేనండీ! చెట్లనన్నిటిని స్వయముగా బరీక్షించి, స్థలనిర్ణయముచేసి పాతించినాను.

ఇంద్రుడు : ఆలాగుననా అండీ! చాల చక్కగా బాతించినారు. ఇచట నీ త్రోవ నెవరు వేయించినారు ? ఇది యతిరమణీయముగా నిర్మింపబడియున్నది.

బ్రాహ్మణుడు : అంతయు స్వయముగా నేను జేసినదేనండి.

అంతట నింద్రుడు చేతులు జోడించుకొని యిట్లు విమర్శించి పలికెను: "ఈపనులన్నియు 'నావియే' యని, ఈతోట యొక్క ఘనత యంతయు 'నాదియే' యని—చెప్పుకొనుచున్నావుకదా. ఆవును జంపిన పాపము మాత్ర మింద్రుని కంటగట్టుట చాల అన్యాయ్యము సుమీ!"

## అహింస నవలంబించిన పాము

1076. ఒకచోట నొకపాము నివసించుచుండెను. ఎవరును ఆ వైపునకు బోవ సాహసించెడివారు కారు. ఏలన, కర్మము చాలక యెవ్వరైనను నచటికి బోయినంతనే యది కఱచి చంపుచుండెడిది. ఒకనా డొకమహాత్ము డా త్రోవను బోవుచుండగా, పాము వానిని యథాప్రకారము తఱుముకొని పోయి కఱవజూచెను. కాని యది వానిని సమీపింపగనే తన భీకరస్వభావమును గోల్పోయి వాని సాధుత్వమునకు వశమైపోయినది. అప్పుడు దానిని జూచి యా మహనీయుడు, "మిత్రమా ! నీవు నన్ను గఱవ నెంతువా ?" యనెను. పాము సిగ్గుపడి మిన్నకుండెను. అంత నాత డిట్లు బోధించెను : " సోదరా, నామాట విను ; ఇక నెవ్వరిని హింసింపకుము." పాము శిరమువంచి యందుల కొడంబడెను. ఆ మహనీయుడు వెడలిన పిమ్మట పాము తన కలుగును బ్రవేశించినది. అప్పటి

నుండియు నది యెవ్వరిని హింసింపనొల్లక నిరపాయమైన జంతువై పావనజీవనము గడపుచుండెను. కొలదిదినము లైనంతనే చుట్టుపట్టులవా రెల్లరును పాము తన విషమును గోల్పోయినదనియు నిక దానివలన ప్రమాదము లేదనియు జెప్పకొనసాగిరి. ఆ నమ్మకముతో జనులు దానిని సమీపించి పలువిధముల బీడింపసాగిరి. కొందఱు ఱాళ్లు రువ్విరి, కొందఱు నిర్దయులై తోకబట్టి యీడ్చిరి— ఈ విధముగా దాని బాధలు చెప్ప నలవికాకుండెను. కొంతకాలమున కదృష్టవశమున యోగి తిరిగి యామార్గముననే వచ్చి గాయములచే కృశించియున్న పాము దుర్దశను గాంచెను; చాల జాలిచెంది హేతువేమని యడిగెను. అందులకా పామిట్లు సమాధానించెను: "స్వామీ! మీరు బోధించిన నాటి నుండియు నే నెవ్వరిని హింసించుటలేదు. అదియే నా యీ దుర్దశకు కారణము. అయ్యో! నా యెడ వా రెంతయో నిర్దయులై—క్రూరులై — వర్తించుచున్నారు. ఏమని చెప్పదును నా దురవస్థ!" యోగి చిఱునవ్వు నవ్వి యిట్లు పలికెను: "మిత్రమా! నిన్ను నే నెవ్వరిని గఱవ వద్దంటినిగాని బుసకొట్టి భయపెట్ట వలదంటినా? నీ వేజంతువును గఱవ రాదు కాని బుసకొట్టి ఎవరిని నీదరికి రాకుండ జేయవచ్చునే!"

ఇటులనే మీరు సంసారులై యుండునెడల లోకులు మీయెడ భయభక్తులుకలిగి మెలగునట్లు వర్తింపవలయును. ఎవరిని హింసింపకుడు, మఱి యెవరిచేతను హింసపొందకుడు.

## బ్రహ్మచారి : యేనుగు

1077. "సర్వము బ్రహ్మమే" యని గురువు శిష్యునకు బోధించెను. శిష్యుడు దానిని మక్కికి మక్కిగా నర్థముచేసి కొనెనేగాని దాని యంతరార్థమును గ్రహింపడయ్యెను. ఒకనాడాతడు రాజవీథిని బోవుచుండగా నేను గెదురయ్యెను. పైనున్న మావటివాడు "తొలగుము, తొలగిపొండు" అని యఱచుచుండెను. బ్రహ్మచారి, (శిష్యుడు) "నే నేల తొలగిపోవలెను? నేను బహ్మమును, ఏనుగును బ్రహ్మమే. బహ్మమునకు దనవలననే యేమి యపాయము!" అని తనలో దాను వితర్కించుకొనుచు గదల డయ్యెను. తుద కేనుగు వానిని దొండముతో బట్టుకొని ప్రక్కకు విసరివేసెను. బ్రహ్మచారికి బలమైన గాయములైనవి. కొంతవడి కెట్లో గురువుగారియొద్దకు బోయి జరిగిన వృత్తాంతము నంతను విశదీకరించెను. గురువిట్లు మందలించెను: "మంచిది; నీవును బ్రహ్మమే, ఏనుగును బ్రహ్మమే; కాని 'మావటి బ్రహ్మము' 'తొలగి పొమ్ము' అని పైనుండి నిన్ను హెచ్చరించెనుగదా. ఆ బ్రహ్మము మాట నీవేలచెవిని బెట్టవైతివి?" (చూ. 40, 41.)

# స్వమతదురభిమానము

## ఘంటాకర్ణుడు

1078. ఘంటాకర్ణునివలె స్వమతదురభిమానివి కాకుము. శివు నారాధించుచు, నితరమైన వేలుపుల నందఱను ద్వేషించు నొకడుండెడివాడు. శివు డొకనాడు వానికి ప్రత్యక్షమై, "నీ వితర దైవతములను ద్వేషించునంత కాలము నేను నీయెడ

ప్రీతుడనుగాను'' అని చెప్పెను. కాని యాతడు వినడయ్యెను. కొన్నిదినములైనపిమ్మట శివుడు మఱల వానికి ప్రత్యక్షమయ్యెను. కాని యీసారి సగబాలు శివుడుగను సగబాలు విష్ణువుగను గాన్పించు హరిహరరూపమున సాక్షాత్కరించెను. అంత నామూఢభక్తుడు సగము సంతోషమును సగము వెగటును బొందెను. ఆతడు తా నర్పించు నైవేద్యములను శివరూపమున నున్నవైపున నుంచెనుగాని విష్ణురూపమున నున్నవైపున నేమియు బెట్టడయ్యెను. తన యిష్టదైవతమగు శివునకు ధూపమునర్పించి యాదురభిమాని విష్ణువు దాని ననుభవించిపోవునేమోయని వానిముక్కుపుటములను గట్టిగా నదిమిపట్టినాడు. అంతట శివు డిట్లు పలికెను : ''ఓరి ; నీదురభిమానము కాలిపోను ; నేనే హరిహర రూపమునుదాల్చి సమస్తదైవతములు నొకే బ్రహ్మముయొక్క వివిధరూపములని నీకు నచ్చజెప్పబూనితిని. కాని సద్బుద్ధివై నీ వీ గుణపాఠమును గ్రహింపవైతివి. నీ దురభిమానమునకై నీవు ఫలమనుభవింపవలసినదే. చిరకాల మందులకై దుఃఖమనుభవింతువుగాని లెమ్ము.'' ఆమూఢభక్తు డనంతర మొక పల్లెటూరికిబోయి కాలముగడపుచుండెను. అచిరకాలముననే యాతడు ప్రబలవిష్ణుద్వేషిగా పరిణమించెను. ఆతని మనోవైచిత్ర్యమును గనిపట్టి ఆయూరి పిల్ల లాతడు కాన్పించినంతనే ''విష్ణువు, విష్ణువు'' అని కేకలువేయుచు వానిని పీడింపసాగిరి. ఆతడు రెండుచెవులకును రెండుగంటలు కట్టుకొని, పిల్లలు, ''విష్ణువు, విష్ణువు'' అని యఱవనారంభించినంతనే తన కసహ్యమైన యా నామములు వినరాకుండ

గంటలు గణగణ మ్రోగించుకొనుచుండెడివాడు! అది చూచి పిల్లలు వానిని మఱింత పీడింపసాగిరి. ఈవిధముగా వానికి ఘంటాకర్ణుడను పేరు ప్రసిద్ధమైనది.

## గ్రుడ్డివాండ్రు : ఏనుగు

1079. నలుగురు గ్రుడ్డివాండ్రేనుగురూప మెట్టిదో తెలిసికొనవలెనని బయలుదేఱిరి. ఒక డేనుగు కాలిని దడవి, "ఏనుగు స్తంభమువలెనుండును" అనుకొనెను. రెండవవాడు దాని తొండమును దాకి, "ఏనుగు పెద్దగదవలె నుండును" అనుకొనెను. మూడవవాడు దాని పొట్టను దాకి, "ఏనుగు పెద్దపీపావలె నుండును" అని యూహించెను. నాలుగవవాడు దానిచెవిని నిమిరి, "ఏనుగు పెద్దచేటవలె నుండును" అని యెంచెను. తుద కేనుగుస్వరూపమునుగూర్చి వారు తమలో దాము తీవ్రముగా వాదులాడ నారంభించిరి. దారిని బోవువాడొకడు వారు వివాదపడుచుండుట చూచి, "దేనినిగూర్చి మీరు వివాదపడుచున్నారు?" అని యడిగెను. వారు తమ వృత్తాంతమునంతను దెలిపి మధ్యవర్తిగానుండి న్యాయము చెప్పుమనిరి. అంత నాత డిట్లు పలికెను : "మీలో నెవరును ఏనుగును జూడలేదు. ఏనుగు స్తంభమువలెనుండదు, దాని కాళ్లు స్తంభమును బోలియుండును. అది చేటవలె నుండదు, దానిచెవులు చేటలవలె నుండును. అది గదరీతిగా నుండదు, దానితొండము గదరీతిగా నుండును. కాళ్లు, చెవులు, కడుపు మొదలైన యీ యవయవములన్నిటియొక్కయు కలయికయే యేనుగు. ఇవియన్నియు గూడిన యాకారమే ఏనుగుయొక్క యాకారము."

ఇదేవిధమున భగవంతుని యొకానొకరూపమును మాత్రమే, లేదా యొకానొక కళనుమాత్రమే దర్శించిన వారు (భగవంతుని స్వభావమునుగూర్చి) తమలో దాము వాదులాడుకొనుచుందురు. (చూ. 471, 481, 484, 717.)

## నూతిలోని కప్ప

1080. ఒకనూతిలో నొకకప్ప యుండెను. అది చాల కాలమందు వాసముచేసినది. అది దానిలోనె పుట్టి దాని లోనె పెరిగిన కప్ప. ఒకనాడు సముద్రములోనుండెడి మఱి యొకకప్ప వచ్చి యీనూతిలోబడుట తటస్థించెను. నూతిలోని కప్ప క్రొత్తగా వచ్చినదానిని జూచి, "నీ వెక్కడిదానవు?" అని ప్రశ్నించెను. సముద్రపుగప్ప, "నేను సముద్రమున నుండుదానను" అని సమాధానించెను. అంత నూతికప్ప యిట్లడిగెను: "సముద్రమా! అది యెంత పెద్దది?" "అది చాల పెద్దది" అని సముద్రపుగప్ప బదులుచెప్పెను. నూతి కప్ప కాళ్లు బాఅజాపి, "మీ సముద్ర మింత పెద్దదిగా నుండునా?" యనెను. "అంతకంటె చాలపెద్దది" అని సముద్రపుగప్ప ప్రత్యుత్తరించెను. అంత నూతికప్ప యీ వైపునుండి యావైపున కొక్కగంతువేసి, "ఈనానూతి యంత పెద్దదా మీ సముద్రము!" అనెను. "మిత్రమా! సముద్రమును నీనూతితో ఎట్లు పోల్పగలవు?" అని సము ద్రపుగప్ప బదులు చెప్పెను. అంత నూతికప్ప యిట్లు నొక్కి వక్కాణించినది: "కాదు నానూతికంటె నేదియు బెద్దదిగా నుండజాలదు—పెద్దదై యుండుట యెన్నటికిని బొసగదు!

ఈసముద్రపుగప్ప వట్టి 'యబద్ధపుకోరు.' దీనిని తఱిమివేయ వలయును."

సంకుచితాభిప్రాయములు గలవారిధోరణి యిటులుండును; తమ చిన్ననూతిలో దాము కూర్చుండి ప్రపంచమంతయు దమనూతికంటె పెద్దదిగా నుండజాలదని తలపోయుచుందురు. (చూ. 366.)

# శ్రద్ధాభక్తులు: ఆత్మార్పణము

## భక్తుడు : భగవంతుని రక్షణ

1081. ఒకప్పు డొకచాకలి యొక భక్తుని బట్టుకొని కొట్టుచుండ, నాభక్తుడు, "నారాయణ! నారాయణ!" యని యఱచుచుండెను. శ్రీమన్నారాయణు డపుడు వైకుంఠమున లక్ష్మీదేవియొద్ద గూర్చుండి యుండెను. భక్తుని మొఱను వినినంతనే యాతడు తటాలున లేచి, వానిని రక్షించునిమిత్త మాతావునకు బోసాగెను. కాని నాలుగడుగులువేసి మఱల వచ్చి కూర్చుండెను. అది చూచి, లక్ష్మీదేవి, నారాయణుని, "ఇంత త్వరితముగా మఱలివచ్చుటకు కారణ" మేమని యడిగెను. నారాయణు డిట్లు సమాధానించెను: "నేనచటికి బోవలసిన యగత్యము కనబడలేదు. కాబట్టి మఱలివచ్చినాను. వాడు (ఆ భక్తుడు) కూడ జాకలివాడైనాడు, స్వయముగా రక్షించుకొన మొదలుపెట్టినాడు—తన్ను కొట్టుచున్నవానిని కలియబడి మఱల కొట్టుచున్నాడు. ఇక నేనెందుల కచటికి వెడలుట?" (చూ. 686.)

ఎవ్వడు సంపూర్ణముగా భగవానున కాత్మార్పణ మొనర్చుకొనునో వానినే భగవానుడు రక్షించును.

## యశోద: రాధ

1082. ఒకప్పుడు గోపాలుని క్షేమసమాచార మేమియు దనకు దెలియనందున యశోద రాధకడకు వెడలి, "గోపాలుని సమాచార మేమైన నీకు దెలియునా?" యని యడిగెను ఆ సమయమున రాధ దివ్యభావపరవశురాలై యుండెను; అందుచే యశోదమాట లామెకు వినబడలేదు. రాధ మఱల బాహ్యస్మృతి నొందినపిమ్మట నందుని రాణియగు యశోద తనయెదుటనుండుట గాంచి, వెంటనే యామెకు వందన మాచరించి రాకకు గారణ మడిగెను. యశోద కారణమును దెలుప రాధ యిట్లనియెను: "తల్లీ! కన్నులు మూసికొని గోపాలుని రూపమును ధ్యానింపుము. నీ వాతని జూడ గలవు." యశోద కన్నులు మూసికొనినంతనే స్వయముగా దివ్యభావ స్వరూపిణియగు రాధ తన యలౌకిక శక్తిచే నామె కఖండ పారవశ్యమును గల్గించెను. తోడనే యశోద తన గోపాలుని గాంచెను. అంత నామె రాధ నిట్లు వేడు కొనెను: "అమ్మా! రాధా! నేను కన్నులు మూసికొను నప్పుడెల్ల నాముద్దు గోపాలుని గాంచగల్గునట్లు వరమిమ్ము."

## శ్రీరామచంద్రుడు: మండూకము

1083. శ్రీరామచంద్రు డరణ్యములందు సంచరించుచు నొకసమయమున వింటిని బాణము నేలలో గ్రుచ్చి, నీరు

త్రాగుటకై పంపాసరోవరమున దిగెను. పిమ్మట బయటికి వచ్చిచూడగా, దన వింటికొనకు శరీరమంతయు రక్తమయమై యున్న యొక కప్ప యచట పడియుండెను. శ్రీరామ చంద్రుడు మిక్కిలి విచారించి యాకప్పతో నిట్లనియెను: "అయ్యో! ఏమైన కొంచెము చప్పుడు చేయగూడదా? నీ విక్కడ నున్నట్లు నాకెట్లు తెలియును? చప్పుడుచేసియున్న పక్షమున నీకీవిపత్తు రాకుండెడిది గదా!" అందులకు మండూక మిట్లు విన్నవించెను: "నాకాపద వచ్చినప్పుడు, 'ఓ రామా! నన్ను రక్షింపుము' అని నిన్ను స్మరింతును. నీవే నన్ను జంపుచుండగా నిక నే నెవరిని వేడుకొందును?"

## వినయవిధేయతలుగల సేవకుడు

1084. ఒక శ్రీమంతుని సేవకు డాతని యింటికివచ్చి, వినయవిధేయతలతో నొకమూల నొదిగి నిలుచుండియుండెను. వానిచేతిలో నేదియో గుడ్డతో గప్పబడియుండెను. యజమానుడు వానిని గాంచి, "నీచేతిలోనున్న దే" మని ప్రశ్నించెను. అంత సేవకుడు తన బట్టచాటుననున్న యొక సీతాఫలమును దీసి, కడునమ్రతతో యజమానునిముందు బెట్టి, యజమానుడు దానిని రుచిచూచునెడల కృతార్థుడ నగుదునని భావింప సాగెను. యజమానుడు సేవకుని భక్తిశ్రద్ధలకును వినయవర్తనమునకును మెచ్చి, యాతడు తెచ్చినది యల్పపు కానుకయైనను నత్యాదరముతో గ్రహించి, "ఆహా! ఇది యెంత చక్కని పండు! దీని నెక్కడ సంపాదించితివి?" అనుచు నెంతయో యానందించెను.

ఈవిధముగనే భగవంతుడు భక్తుని యంతరంగమును బరిగణించును. వాని వైభవ మనంతమై వెలయునదైనను భక్తిశ్రద్ధలకు భగవంతుడు వశుడగుచుండును. (చూడుము 644, 1000.)

## కొండమీది : గుడిసె గాలివాన

1085. శ్రీగురుదేవుడు (ప్రతాపచంద్ర మజుందారునితో): నీవు విద్యావంతుడవు, బుద్ధిశాలివి, జిజ్ఞాసాపరుడవుకూడను. కేశవుడును నీవును గౌరనితాయిల (గౌరాంగనిత్యానందుల) వలె (సోదరులవలె) నున్నారు. సాంసారిక విషయముల ననుభవింపవలసినంత యనుభవించితివి—ఉపన్యాసములు, వాదోపవాదములు, మతభేదములు, అంతఃకలహములు—ఓ!—జరుగవలసినన్ని జరిగినవి. ఇంకను వీని నన్నిటిని లక్షింతువా? (నానావిషయములందు) చెదరిన నీమనస్సును గూడగట్టుకొని యీపాటికి భగవంతునిపై ద్రిప్పుట మేలు సుమీ. పరబ్రహ్మసాగరమున నిమగ్నుడవు కమ్ము.

మజుందారుడు : మహాశయా? నిజము. నేనటుల జేయవలసినదే—ఆవిషయములో సందేహము లేదు. కాని నాకీప్రాకులాట యంతయు కేశవుని పేరు ప్రతిష్ఠలను నిలువబెట్టుటకే.

శ్రీరామకృష్ణుడు (నవ్వుచు) : నేనొక కథ చెప్పెదను, వినుము. ఒకడొక కొండమీద గుడిసె కట్టినాడు. అందులకై చాల కష్టపడినాడు. చాల సొమ్ము ఖర్చుపెట్టినాడు. కొలది దినములకే గాలివాన వచ్చి యాగుడిసెను నుఱ్ఱూతలూగింప సాగినది. దాని నెటులైన సంరక్షించుకొనవలయునని, "ఓ

దేవా! ఈ గుడిసెను నాశనముచేయకుము, నా మొఱ నాలకింపుము'' అని వాయుదేవుని ప్రార్థించినాడు. కాని వాయుదేవుడు వినలేదు. ఆతడు మఱల ప్రార్థించినాడు, కాని గుడిసె ఊగులాడుచునే యుండెను అప్పు డాతఁడు వేఱొక యుపాయము నాలోచించినాడు. 'పురాణములలో హనుమంతుడు వాయుపుత్త్రుడని చెప్పబడియున్నది కదా! ఇక నాతని పేర ప్రార్థింతమని గొంతెత్తి యిట్లఱచినాడు: "ఓ దేవా! ఈ గుడిసెను కాపాడుము, ఇది నీ తనయుడగు హనుమంతునిది.'' ఐనను వాయుదేవుడు వినిపించుకొనలేదు. అంత నాతడు, "ఓ దేవా! ఈగుడిసె హనుమంతుని స్వామియగు శ్రీరామచంద్ర ప్రభునిది; కావున దీనిని గాపాడుము'' అని యఱచినాడు. అప్పుడును వాయుదేవుడు లక్ష్యపెట్టలేదు. అంతట గుడిసె కూలిపోవుచుండుట గని, తన ప్రాణరక్షణార్థమై యాత డీవలకు దూకి, యిట్లు శాపాలాపము లారంభించినాడు: "ఈ 'ముష్టిగుడిసె' కూలిపోనీ! దానివలన నాకేమి?''

నీ విపుడు కేశవుని పేరు నిలుపుటకై తాపత్రయపడవచ్చును. ఐన నీశ్వరసంకల్పమువలననే కేశవునితో సంబంధించిన యీ పారమార్థికోద్యమము — ఈ సంప్రదాయము — బయల్వెడలినదనియు, నది యొకానొకప్పుడు మంచిదశ ననుభవించినపక్షమున నదియు నీశ్వరసంకల్పమే యనియు మదిలో నుంచుకొనుము — మనస్సమాధానము నొందుము. కాబట్టి యమృతసాగరమున నిమగ్నుడవు కమ్ము.

## సాధకుడు : పురీషము

1086. ఒకమనుష్యు డొకసాధువును సమీపించి అఖండ వినయమును గనబఱచుచు నిట్లు పలికెను : "స్వామీ! నే నత్యల్పుడను. నే నెట్లు తరింపగలనో యానతీయ వేడెదను." సాధువు వానిహృదయమును గనిపట్టి యిట్లనియెను: "మంచిది, నీవు పోయి నీకంటె అల్పమైనదానిని (దేనినైనను) నాయొద్దకు దీసికొనిరమ్ము." ఆ మనుష్యుడు వెడలి తన కంటె నల్పమైన దానికొఱకు నలువైపులను వెదకెను, గాని వాని కేదియు గాన్పింపలేదు. తుద కాతడు తన పురీషమును గని, "ఓహో! ఇదిగో, నా కంటె అల్పమైనదిదియే" అని దానిని దీసికొనిపోవుటకై చేయి చాచునంతలో ఆపురీషమునుండి యొకధ్వని యిట్లు వినవచ్చెను :"ఓ పాపీ! నన్ను దాకబోకుము, మధురము, రుచ్యమునైన అపూపమనై నేను దేవతార్పణమునకు దగియుంటిని—చూచువారలకు గన్నులపండువనై యుంటిని. కాని నాయభాగ్య దేవత నన్ను నీకడకు దెచ్చినది. నీసంసర్గము నన్నీహీనదశకు దెచ్చినది—నరులు నన్ను జూచి యసహ్యించుకొని గుడ్డతో ముక్కు గట్టిగా మూసికొని పాఱిపోవుచున్నారు, ఇది యంతయు నీసంపర్కమహిమ! నేను నీ సంసర్గమునకు వచ్చినది ఒక్కసారియే. అంతమాత్రమున నే నాకర్మ మిట్లు కాలినది. నీవు మఱల నన్ను తాకినపక్షమున నాకింక నెట్టి ఘోరదుర్దశ రాబోవునోగదా!"

ఈ విధముగా నాతడు నిజమైన నమ్రతను నేర్చెను—నేర్వవలసి వచ్చెను. దానితో నాతడు వినయవంతులకెల్ల వినయవంతుడై కాలక్రమమున ముక్తుడయ్యెను.

## నారద గర్వభంగము

1087. నారదు నొకప్పుడు తన్ను మించిన భక్తుడు లేడను గర్వమావేశించినది. ఆతని హృదయమును గ్రహించి భగవాను డిట్లనియెను : "నారదా! ఫలానిచోటికి బోయి చూడుము. అక్కడ గొప్పభక్తు డొకడు గలడు. వాని పరిచయము సంపాదింపుము, ఏలన నాతడు నాయుత్తమభక్తుడు." నారదు డచటికి పోయి యొక వ్యవసాయిని గనుగొనెను. ఆత డుదయముననే లేచి, ఒక్కసారి 'హరీ' యని నాగలిని గైకొని పొలమునకు బోయి దినమంతయు నేల దున్నుచుండును. రాత్రి మఱల నొక్కసారి 'హరీ' యని పరుండును. వానిని జూచి నారదు డిట్లు తలచెను : "ఈ మోటుమానిసి భక్తు డెట్లు కాగలడు? వీడు దినమంతయు విధివిరామము లనునవి లేక లౌకికవిషయములలో నిమగ్నుడై యుండును. భక్తుని చిహ్నము లెవ్వియు వీనియందు గానరావు. వీడా, యుత్తమ భక్తుడు!" అంత నారదుడు తిరిగి భగవానుని సమీపించి తాను చూచివచ్చిన నూతనవ్యక్తియొక్క యావద్వృత్తాంతమును దెలిపెను. అంత భగవాను డిట్లు వచించెను : "నారదా! ఈ నూనెగిన్నెను దీసికొని యీపురమును జుట్టి రమ్ము. ఒక్కచుక్కయైనను గిన్నెనుండి నూనె తొణకరాదు సుమీ!" నారదు డటు లొనర్చి తిరిగివచ్చినంతనే భగవానుడు, "నారదా! సరియేకాని, పురముచుట్టు నీవు నడచునప్పు డెన్ని మాఱులు నన్ను దలచుకొంటివి?" అని ప్రశ్నించెను. "ఒక్క మాఱైనను దలపలేదు. నూనెతో నంచులవఱకు నిండియున్న యీగిన్నె తొణకకుండ జూడవలసివచ్చినప్పుడు

మిమ్ము దలచుకొనుటెట్లు స్వామీ?" యనినాడు నారదుడు. అంత భగవాను డిట్లు పలికెను: "ఈయొక్క నూనెగిన్నె యే నీవు నన్ను బూర్తిగా మఱచునట్లు చేసి మనస్సును భగవద్విముఖము చేసివేసినదే! దుర్భరమైన సంసారభారమును వహించుచును గూడ ప్రతిదినము రెండుసార్లు నన్ను స్మరించుచున్న యాసేద్యగాడెట్టివాడో చూడుము!"

## నారదుడు: ఇద్దఱు యోగులు

1088. భగవత్సాక్షాత్కారము పొందవలయునని యిద్దఱు యోగులు తపస్సు చేయుచుండిరి. ఒకనాడు నారదమహర్షి వారి పర్ణశాలసమీపమునుండి పోవుచుండెను. ఆతని గాంచి, యోగులలో నొకడు, "స్వామీ! తాము వైకుంఠమునుండియా వచ్చుచున్నారు?" అని ప్రశ్నించెను. నారదుడు "ఔను" అన నాతడు, "ఐనచో భగవాను డేమిచేయుచున్నాడో సెలవియ్యరా?" యనెను. "ఏనుగులను లొట్టిపిట్టలను సూది బెజ్జముగుండా దూర్చుచు క్రీడించుచుండగా జూచితిని" అని నారదుడు సమాధానించెను. అది విని యాయోగి, "దానిలో ఆశ్చర్యపడవలసిన దేమియు లేదు, భగవానున కసాధ్యమగు కార్య మేముండును?" * అనెను. కాని రెండవా డిట్లు ప్రతిఘటించెను: "వెఱ్ఱిమాట! అది యసంభవము! మీరు వైకుంఠమునకు బోనేలేదని దీనివలన ఋజువగుచున్నది."

ఇందు మొదటివాడు భక్తుడు, పసివాని నమ్మికను బోలు

* "మూకం కరోతి వాచాలం పఙ్గుం లఙ్ఘయతే గిరిం,
యత్కృపా తమహం వన్దే పరమానన్ద మాధవమ్."

మహిమ గలవాడు. (చూ. 503.) భగవానునకసాధ్యమగునది యేదియు లేదు. వాని తత్త్వమును బూర్తిగా నెవరు గ్రహింప గలరు ? వాని మహిమమునుగూర్చి యేమైనను బలుక వచ్చును. (చూ. 1047.)

## దైవ సంఘటన

1089. ఒకప్పు డొకని కుమారునకు బ్రాణముమీదికి వచ్చినది; ఎవ్వరును వాని బ్రాణమును గాపాడగలుగునట్లు కాన్పింపకుండెను. ఆసమయమున నొకసాధువు వచ్చి యిట్లు పలికెను : "కుఱ్ఱవాడు బ్రతుకుట కొక్క యుపాయ మున్నది. కొలది స్వాతివర్షపు జినుకులతో గలిసిన త్రాచు పాము విషమును, మనుష్యుని పుఱ్ఱెను సంపాదింపగలిగినపక్షమున మీ పిల్లవాని బ్రాణమును గాపాడవచ్చును." ఆ పిల్లవాని తండ్రి పంచాంగము చూచి మఱునాడే స్వాతినక్షత్రము ఉచ్చస్థితియందుండు నని తెలిసికొని భగవంతు నిట్లు ప్రార్థించెను : "తండ్రీ! ఆపద్బాంధవా! ఈపరిస్థితులన్నియు కలిసివచ్చునట్లనుగ్రహింపుము. నాపుత్త్రుని బ్రాణమును రక్షింపుము." అఖండపరితాపముతో, నిష్కపటచిత్తముతో, మఱునాటిసాయంతనమే యాతడుబయలుదేఱి శ్మశానములన్నిటను దిరిగి నరకపాలముకొఱకై వెదకసాగెను. తుట్టతుదకొక చెట్టు క్రింద బుఱ్ఱె యొకటి పడియుండుట జూచి దానిని గైకొని భగవత్ప్రార్థనచేయుచు స్వాతివర్షముకొఱకు నిరీక్షించుకొని యుండెను. ఆకస్మికముగా జల్లు వచ్చి కొన్నిచినుకులు పైకి త్రిప్పబడియున్న పుఱ్ఱెలో బడెను. అంత నాతడు, "ఇవిగో,

స్వాతివర్ష ప్రజినుకులు, నరునిపుత్రైలోనే లభించినవి" అని సంతో సించి మనఃపూర్వకముగా భగవంతు నిట్లు ప్రార్థించెను: "దేవా! అనుగ్రహించి తక్కినవికూడ సమకూర్పుము." కొంత సేపటికి సమీపముననే యొక కప్పయు దానిపై బడ బోవుచున్న త్రాచుబామును వానికి గాన్పించినవి. క్షణములో ఆకప్ప పుత్రైమీదికి దూకినది. త్రాచు దానిని వెంబడింప దాని విషము పుత్రైలో బడినది. "ఆహా! ఏమి యీశ్వరకృప!" యని యాత డానందపరవశుడై యిట్లు పలికెను: "తండ్రీ! నీ కృపవలన నసాధ్య విషయములన్నియు సాధ్యములైనవి. నే నెఱుగుదును, ఇక నాపుత్త్రుని ప్రాణము దక్కును!"

కాబట్టి భగవంతునియందు మీకు దృఢవిశ్వాసమును వానిని బొందవలయునను తీవ్రవాంఛయు నున్నపక్షమున వాని యనుగ్రహమువలన సమస్తము చేకూఱగలవు.

## గోపికలు : వ్యాసుడు

1090. ఆత్మసాక్షాత్కారము కావలయునన్న, సాధన లాచరించి తీరవలయును. కాని పూర్ణవిశ్వాస మున్నపక్షమున స్వల్పసాధనమైనను జాలును. (చూ. 590.) వ్యాసమహర్షి నదిని దాటబోవుచుండెను. అప్పుడే గోపికలును నచటికి వచ్చిరి. కాని రేవున నావ లేదు. "అయ్యో, ఇపు డేమి చేయుట!" యని వారు తత్తఱిల్లి వ్యాసు నడిగిరి. అందుల కాతడు, "దిగులుపడకుడు, నేను మి మ్మేఱు దాటించెదను. కాని నాకు జాల ఆకలివేయుచున్నది. తినుట కేమైన బెట్టెదరా?" యనెను. గోపికలు తమ యొద్ద పాలు, వెన్న,

మీగడయు నుండగా వ్యాసునకు సమర్పించిరి. ఆతడు వాని నన్నిటిని క్షణములో భక్షించెను. అంతట గోపికలు, "ఏటు దాటు మాట నే"మని వేగిరపడిరి. వ్యాసమహర్షి నీటి యొడ్డున నిలుచుండి, "ఓ యమునా! నే నీనాడేమియు దిని యుండనిపక్షమున మే మిందుండి నడచిపోవునటుల నీరు పాయలుచేసి మాకు ద్రోవనిత్తువుగాక" యని ప్రార్థించెను. ఆయననోటినుండి యీ మాటలు వెలువడగనే నీరు రెండు పాయలై వారికి గట్టెదుట నదీగర్భము కాన్పించెను. గోపిక లబ్బురపడిరి. "ఇప్పుడే మనము పెట్టిన వన్నియు దిని, 'నే నేమియు నేడు తిననిపక్షమున' అని యీతడు పలుకుట యెంత విచిత్రము!" అని భావింపసాగిరి. వ్యాసుడు స్వయముగా దా నేమియు దినలేదనియు, తన హృదయాంతర్వర్తి యగు పరమేశ్వరుడే సర్వము నారగించియున్నా డనియు దృఢవిశ్వాసము గల్గియున్నందుల కిది నిదర్శనమని గోపికలు గ్రహింపరైరి.

## బాలభక్తుని దేవతార్చన

**1091.** ఒక దేవతార్చనబ్రాహ్మణు డొకరింట నిత్యము దేవతార్చన చేయుచుండువాడు. ఆ పనిని దన చిన్నకుమారున కొప్పగించి యొకప్పు డాతడు గ్రామాంతరము పోయెను. నిత్యనైవేద్యమును దేవునిముందు బెట్టి, దేవుడు దాని నారగించునట్లు చూడుమని యాతడు బాలునకు జెప్పి యుండెను. తండ్రియాజ్ఞ ననుసరించి పిల్లవాడు నైవేద్యమును విగ్రహాముముందు బెట్టి మౌనముగా వేచియుండెను.

కాని యావిగ్రహము తినను దినదయ్యె; మాటాడను మాటాడ దయ్యె! ఐనను పిల్లవాడు చాలసేపటులనే వేచియుండెను. దేవుడు పీఠము దిగివచ్చి నైవేద్యము పెట్టిన పళ్లెరములకడ గూర్చుండి తినునని పిల్లవాని దృఢవిశ్వాసము! అంత నాతడు, "ఓ దేవుడా! రమ్ము, ఆరగింపుము, ఆలసింపకుము, నే నింక గనిపెట్టుకొని యుండలేను" అని వేడుకొనసాగెను. కాని దేవుడు పలుకలేదు. ఆ బాలు డంతట, "భగవంతుడా! నీ కీ నైవేద్యము నారగించునట్లు చూడుమని మానాన్న నాతో జెప్పినాడు. నీ వేల రావు? నీవు మానాన్నయొద్దకు వచ్చి యాయ నర్పించు నైవేద్యము నారగింతువుగదా! నీవు వచ్చి నే నర్పించుదానిని దినవేమి? నా నేరమేమి?" అనుచు నేడ్వసాగెను. ఆవిధముగా చాలసేపు వెక్కి వెక్కి యేడ్చినాడు. అంతట దేవతాపీఠమువంక గనువిచ్చి చూడగా, దేవుడు నరరూపమున వచ్చి నివేదితపదార్థములను దినుచుండుట కాననయ్యెను! అటుల దేవతార్చనమును ముగించి బాలుడు వెలుపలికిరాగా, ఆయింటివారు, "దేవతార్చన పూర్తియైన యెడల ప్రసాదమును దీసికొనిరమ్ము" అనిరి. "ఔను, దేవతార్చనయైనది. దేవు డంతయు దినివేసినాడు" అని యా బాలుడు సమాధానముచెప్పినాడు. వారందఱును నివ్వెఱపడి, "నాయనా! ఏమనుచున్నావు? దేవుడే యంతయు దినివేసినాడా?" అనిరి. శుద్ధ నిష్కాపట్యము మోమున దాండవింప బాలు డిట్లు పలికెను: "ఏల? భగవంతుడు నే నర్పించిన దానినంతయు నారగించినాడు." అంతట

వారందఱును దేవతార్చనమందిరమున బ్రవేశించి యుత్తవిగానున్న పళ్లెరములను గాంచి నిశ్చేష్టులైరి.

నిజమైన విశ్వాసముయొక్కయు భగవత్పరితాపముయొక్కయు ప్రభావ మిట్టిది! (చూ. 503.)

## 'కృష్ణుడు నీయన్న'

1092. తీవ్రపరితాప మొక్కటియే భగవద్దర్శనమునకు నిశ్చితమైనమార్గము. పసివాని నమ్మికను బోలు నమ్మిక యుండవలయును; తల్లిని జూచుటకై వానికి గలుగునట్టి తీవ్రకాంక్ష యుండవలయును.

జటిలుడను పిల్లవాడుండెను. అతడు బడికి బోవునప్పు డొంటరిగ నొకచిట్టడవిగుండా పోవలసివచ్చెడిది. అతడు తఱచు భయపడుచుండెడివాడు. ఈమాట తల్లితో జెప్పగా దల్లి యిట్లు పలికెను: "నాయనా! భయమెందులకు? నీకు భీతి కలిగినప్పుడెల్ల కృష్ణుని బిలువుము." "కృష్ణు డెవరమ్మా!" అని బాలు డడిగెను. "కృష్ణుడు నీయన్న" అని తల్లి చెప్పినది. అటుతరువాత జటిలున కడవిలో భీతి కలిగినప్పు డాతడు, "అన్నా! కృష్ణా!" అని యఱచినాడు. ఎవరును రాకపోవుటచే నింకను బిగ్గఱగా, "ఓయన్నా! కృష్ణా! నీవెక్కడ నున్నావు? నాకు భయము వేయుచున్నది. నన్ను వచ్చి కాపాడుము" అని యఱచెను. అంత నిష్కపటముగా మొఱపెట్టుచున్న యాబాలుని మొఱాలకింపకుండ—ఆతని వచ్చి రక్షింపకుండ—కృష్ణు డూరకుండగలడా? కృష్ణు డొక చిన్న బాలుని రూపు దాల్చి వచ్చి,

"తమ్ముడా! వచ్చితిని. నీకు నేనుండగా భయమెందుకు? నాతో రమ్ము! నేను నిన్ను బడికి దీసికొనిపోయెదను" అనెను. అటు లాబాలుని బడిదగ్గఱ విడిచి, "నీవు నన్ను బిలిచినప్పు డెల్ల నేను వచ్చెదను, భయపడకుము" అని కృష్ణుడు అభయ మొసగెను.

నిజమైన నమ్మికయొక్కయు భగవత్పరితాపము యొక్కయు మహిమ యిట్టిది. (చూ. 503, 624, 625, 929.)

## భక్తురాలగు గొల్లత : బ్రాహ్మణుడు

1093. ఒకగొల్లపడు చేటికావలి యొడ్డున నుండు నొక బ్రాహ్మణునకు వాడుకగా బాలు తీసికొనిపోయి యమ్ముచుం డెడిది. నావ రాకపోకలు సరిగాలేని కారణమున నామె ప్రతి దినము సకాలమునకు బాలందీయలేకుండెను. ఒకనాడా బ్రాహ్మణుడు చీవాట్లు పెట్టగా నాదీనురా లిట్లు పలికెను: "నేనేమి చేయుదును, బాబూ! ఇంటికడనుండి పెందలకడనే బయలుదేఱుదును. ఏటియొడ్డున బల్లెవానికోసమును, ఏఱు దాటువారందఱు వచ్చి చేరుటకోసమును గనిపెట్టుకొని యుండ వలసివచ్చుచున్నది." అంత నాయర్చకుడిట్లనియెను: "వెఱ్ఱి దానా! భగవన్నామోచ్చారణముచేసి సంసారసాగరమునే దాటవచ్చునే, నీ వీచిన్నయేటిని దాటలేవా?" అవాయకు రాలగు నాగొల్లత యేటిని దాటు నీసులభోపాయమును గూర్చి విని చాల యానందించెను. మఱునాటినుండియు నుద యముననే యామె బ్రాహ్మణునకు బాలందించుచుండెను. ఒకనాడాతడామె నిట్లడిగెను: "నీ వీమధ్య చాల పెందల

కడనే వచ్చుచున్నావు, ఎట్లు?'' ఆమెయిట్లు సమాధానించెను: "బాబూ! మీరు చెప్పినటుల దేవుని పేరు తలచుకొనుచు నేఱు దాటివచ్చుచున్నాను. ఇక నాకు నావ యవసరము లేకున్నది.'' బ్రాహ్మణుడు ఆపలుకులు నమ్మజాలక, ''సరియే కాని, నీ వేటెట్లు దాటెదవో నాకు జూపెదవా?'' యని యెను. ఆమె, ''చూపెద'' నని బ్రాహ్మణుని దనతోఁగూడ దీసికొనిపోయి నీటిమీదినుండి నడచిపోసాగెను. కొంతసేపటికి వెనుకకు దిరిగి చూచి యామె బ్రాహ్మణుని దురవస్థను గను గొని యిట్లనియెను: ''అదేమి, బాబూ! నోటితో దేవుని పేరు పలుకుచు, చేతితో బట్టపైకెత్తి పట్టుకొనుచున్నావు? నీవు పూర్తిగా దేవుని నమ్మనట్లు కనబడుచున్నది.''

భగవంతునకు సంపూర్ణమైన యాత్మార్పణము, వాని యందు స్థిరమైననమ్మిక—ఇవియే యద్భుతకార్యము లన్నిటి కిని మూలము (చూ. 506.)

## నారదుని నరకానుభవము

1094. దైవానుగ్రహమునకును జీవుని స్వాతంత్ర్యమున కును సమన్వయము కుదురక, యిరువురు శిష్యులు పరిష్కారార్థము శ్రీ గురుదేవుని సమీపించిరి. గురుదేవు డిట్లు పలికెను: "స్వాతంత్ర్యము! స్వాతంత్ర్యము!! సర్వము నీశ్వర సంకల్పముపై నాధారపడియున్నది. (చూ. 674.) మన స్వాతంత్ర్యము (లేదా, మనయిచ్ఛ) ఈశ్వరసంకల్పముతో నావు గుంజకు గట్టబడినటుల బంధింపబడియున్నది. ఐనను నొక నిర్ణీత వలయములో నావునకు గొంత స్వాతంత్ర్యమున్నట్లు మనకును గొంత

స్వతంత్రత యున్నమాట నిజమే. కాబట్టి మానవుడు తాను స్వతంత్రుడ ననుకొనుచుండును. కాని వాని స్వాతంత్ర్యమును నిచ్ఛయు నీశ్వరేచ్ఛకు లోబడియుండునవేయని గ్రహింపుడు." (చూ. 898.)

శిష్యులు : అటులైనచో జపతపములు మున్నగు సాధనల యవసరము లేదా ? (చూ. 585.) ఏలన, 'అంతయు నీశ్వరేచ్ఛయే ! ఏమి జరిగినను వాని సంకల్పమువలననే జరుగుచున్నది !' అని ప్రతివ్యక్తియు గాళ్లు చాచుకొని కూర్చుండ వచ్చును. (చూ. 897.)

శ్రీరామకృష్ణుడు : ఓహో ! ఎంతవఱకు నామాట ? నీవూరక నోటిమాటగా ననిన జాలునా ? ముండ్లకంపమీద జేయివేసి, "ముండ్లులేవు ముండ్లులేవు" అనుకొనిన ముండ్లు గ్రుచ్చుకొనుట మానునా? (చూ. 673, 674.) పారమార్థిక సాధనలు చేయుట పూర్తిగా దన యధీనములోనే యున్న పక్షమున ప్రతివ్యక్తియు నటుల చేసియుండెడివాడే ! ఐనను ప్రతివ్యక్తియు జేయజాలడు, ఎందుచేత ? — కాని ఒక విషయము గమనింపవలసియున్నది. భగవంతుడు నీ కిచ్చిన శక్తిని సద్వినియోగముచేసినగాని నీ కాయన యధికముగా నీయడు. అందుచేతనే పురుషప్రయత్నముయొక్క అక్కఱ. కాబట్టి భగవదనుగ్రహము పొందుటకైనను ప్రతివ్యక్తియు శ్రమపడి కృషిచేయవలసియున్నది. అట్టి పురుషకారమువలనను వాని యనుగ్రహమువలనను ననేక జన్మములలో ననుభవింపవలసిన కష్టములును దుఃఖములును నొక్క జన్మములోనే తీఱిపోవుచుండును. ఏమైనను కొంత పురుషప్రయత్న మత్యావశ్యకము. ఒక కథ చెప్పెదను, వినుడు :

గోలోకాధిపతి యగు విష్ణు వొకప్పుడు నారదుని, "నీవు నరకమున బడిపోవుదువుగాక" యని శపించెను. నారదుడు చాల వ్యాకులపడి కీర్తనలు పాడుచు నరక మెచటనుండునో, తానచటికె బోవు టెట్లో, తెలుపుమని భగవంతుని వేడుకొన సాగెను. విష్ణుమూర్తి యంతట సుద్దముక్కతో నేలమీద ప్రపంచముయొక్క పటము గీచి, స్వర్గనరకములు సరిగా నెచట నుండునో సూచించెను. నారదు డంతట నరకమని చూపబడిన తావును జూపి, "ఇదేనా, ఇదేనా, నరకము!" అనుచు నా తావున బడి దొరలి, "స్వామీ! నేను నరక బాధల నన్నిటి ననుభవించినాను" అని పలికెను. విష్ణుమూర్తి చిఱునవ్వు నవ్వి, "అదెట్లు?" అని యడుగ నారదు డిట్లు పలికెను: "స్వామీ! ఏల? స్వర్గనరకములు నీవు సృష్టించినవేకావా? నీవే యీ పటమును రచించితివి. అందు నరకమును జూపితివి. ఇక నది నరకమేకదా? నే నందు బడి దొరలినప్పుడు నా బాధ చెప్ప నలవిగాకుండెను. అందుచే నరకమున నా శిక్ష ననుభవించినా నని చెప్పినాను." నారదుడు మనఃపూర్వకముగా నిట్లు చెప్పుటచే విష్ణుమూర్తి యాతని మాటల నంగీకరించెను.

## అర్జునగర్వభంగము

1095. శ్రీకృష్ణుని ప్రియమిత్రుడైన యర్జునుని హృదయము నొకప్పుడు గర్వ మావేశించినది. భగవానుడును తన మిత్రుడునైన శ్రీకృష్ణునియెడల భక్తివిశ్వాసములు గలవారిలో తనతో సమానులు లేరని యర్జునుడు భావించు

సాగెను. సర్వజ్ఞుడగు శ్రీకృష్ణభగవాను డర్జునుని మనో భావ మును గ్రహించి యొకనాడు విహారార్థము తనతోగూడ దీసి కొని పోయెను. వారు చాలదూరము పోకమునుపే వట్టిగడ్డిని దినుచున్న యొక విచిత్రబ్రాహ్మణు డర్జునునకు గాన్పించెను. ఐనను వాని మొలనుండి యొక ఖడ్గము వ్రేలాడుచుండెను. వానిని జూడగనే యాత డే జీవికిని హింసచేయనొల్లని యహింసావ్రతుడైన పరమభాగవతోత్తముడై యుండునని యర్జునుడు గ్రహించెను. గడ్డిలోను ప్రాణ ముండుటవలన నాతడు పచ్చిగానుండు గడ్డినైనను దిన సహింపక, యెండి నిర్జీవమైయున్న గడ్డినిమాత్రమే తిని ప్రాణము నిలుపుకొను చుండెను—ఐనను ఖడ్గధారియైయున్నాడే! ఈ వైపరీత్యమును గాంచి, యర్జునుడు వింతపడి, శ్రీకృష్ణునితో నిట్లు పలికెను: "ఇదేమి వింత! తుదకు గడ్డిపోచకైనను హింస చేయనొల్లని యహింసావ్రతుడైన యీతడు మృత్యుచిహ్నమును ద్వేష నిలయమునగు ఖడ్గమును ధరించియున్నాడు!" "అతని నీవే యడిగి తెలిసికొనుము" అని భగవానుడు పలికెను. అర్జును డంతట బ్రాహ్మణుని సమీపించి, "స్వామీ! నీ వేజీవిని హింసింపబోవు. ఎండుగడ్డిని దిని ప్రాణము నిలుపుకొను చున్నావు! అట్టి నీ వీకఱుకత్తిని బూనియుంటివేల?" అని యడిగినాడు.

బ్రాహ్మణుడు: నాకంటబడి రేని నలుగురిని శిక్షింపనెంచి దీనిని బూనియున్నాను.

అర్జునుడు: వా రెవరెవరు?

బ్రాహ్మ.: మొదటివా డానీచుడు నారదుడు.

అర్జు. : ఏల? ఆయన యేమి చేసెను?

బ్రాహ్మ. : ఏమి చేసెనా? వానిదుండగము చూడు. సదా తనకీర్తనలతో, సంగీతముతో, నాస్వామికి నిద్రలేకుండ చేయుచుండును. స్వామిసుఖమును లేశమైనను గమనింప నక్కఱ లేదా? రాత్రి యనక, పగలనక, సర్వకాల సర్వావస్థల యందును స్తోత్రములను ప్రార్థనలను జేయుచు స్వామి కేమియు దోపనీయడు.

అర్జు. : రెండవ వా రెవరు?

బ్రాహ్మ. : ఆ తెలివితక్కువ ద్రౌపది.

అర్జు. : ఆమె నేర మేమి?

బ్రాహ్మ. : దాని యవివేకమును సాహసమును జూడు! నాస్వామి సరిగా భోజనమునకు గూర్చుండువేళ బొబ్బలిడ సాగినది. నాస్వామి తినబోవుచున్న యన్నమును విడిచి, వడివడిగా కామ్యకవనమునకు బరుగెత్తి, దుర్వాసుని శాపమునుండి పాండవులను రక్షింపవలసివచ్చినది. ఇంకను దాని స్వాతిశయము నేమని చెప్పను? తాను దినగా మిగిలిన యెంగిలికూడును నాస్వామిచే దినిపించినది!

అర్జు. : మూడవవ్యక్తి యెవరు?

బ్రాహ్మ. : ఆనిర్దయుడు ప్రహ్లాదుడు. ఏమి వాని క్రౌర్యము! జంకు, గొంకు లేకుండ నాస్వామిని బిలిచి సలసల గాగుచున్న నూనె కాగులో దింపినాడు; మదపుటేనుగుల పాదములక్రింద ద్రొక్కించినాడు; వజ్రతుల్యమైన స్తంభమును బగులగొట్టుకొనివచ్చునట్లు చేసినాడు.

అర్జు. : నాలుగవవా రెవరు?

బ్రాహ్మ. : ఉన్నాడొక నిర్భాగ్యుడు, అర్జునుడు.

అర్జు. : ఏమి, అత డేమి పాపము చేసినాడు?

బ్రాహ్మ. : చూడు, వానిదుండగము! నాజగన్నాథుని దీసికొనిపోయి కురుక్షేత్రయుద్ధమున నీచమైన తనసారథ్యము వహింపజేసినాడు. ఇది మహాపరాధముకాదా?

అర్జునుడు ఆపేదబాపని భక్తి యెంత గాఢమైనదో గ్రహించి నిశ్చేష్టుడైనాడు. ఆక్షణమునుండియు వానిగర్వమంతరించినది; తానే భగవద్భక్తులలో మేటిననుకొనుట మాని వేసినాడు.

## 'అంతయు రామేచ్ఛ' యని నమ్మిన సాలె

1096. ఒకానొక యూరిలో పుణ్యాత్ముడగు నొకసాలె యుండెను. వానిభక్తిని పవిత్రహృదయమును జూచి యెల్లరును వానిని నమ్మి ప్రేమించెడివారు. ఆసాలె తాను నేసిన వస్త్రముల నమ్ముకొనుటకై బజారునకు బోయి, కొనవచ్చిన వారితో నిట్లు పలుకువాడు : "రామేచ్ఛ వలన నూలుఖరీదొకరూపాయి; రామేచ్ఛవలన కూలి పావలా; రామేచ్ఛ వలన లాభము బేడ; రామేచ్ఛవలన ఈబట్టఖరీ దిప్పుడు రూపాయిఆఱణాలు." జను లాత డేమి వెల చెప్పినను వెంటనే యిచ్చి కొనునంతటి విశ్వాస మాతనియందు గలిగి యుండిరి. నిజముగా నాతడు గొప్ప భక్తుడు. రాత్రులందు భోజనానంతరము భగవంతుని ధ్యానించుచు చాలసేపు భగవన్నామస్మరణ చేయుచుండువాడు.

ఒకనాడు రాత్రి చాల ప్రొద్దుపోయినది. ఆత డింకను

నిద్రపోలేదు. చావడిలో ద్వారముకడ గూర్చుండి చుట్టకాల్చు కొనుచు నేకాంతముగా నుండెను. ఒక దొంగలగుంపా త్రోవను బోవుచుండెను. వారికొక మూటలుమోయువాడు కావలసివచ్చెను. ఈసాలెవానిని జూడగనే వారీతని లాగికొనిపోయిరి. అనంతరము వారొక యింటిలో జొరబడి చాల సొత్తును దొంగలించిరి, దానిలో గొంత యీసాలెవాని నెత్తిని బెట్టి మోయుమనిరి. ఇంతలో బోలీసువాడొక డా త్రోవను రాగా దొంగలు పాఱిపోయిరి. నెత్తిని దొంగసొత్తు మోయుచున్న మనసాలెవాడు పట్టుబడెను. ఆరాత్రి యతడు చెఱసాలలో గడపవలసివచ్చెను. మఱునాటియుదయము న్యాయాధికారియెదుట విచారణకై యాతడు తీసికొని రాబడెను. జరిగిన సంగతిని విని గ్రామస్థులందరును సాలెవానిని జూడవచ్చిరి. వారందఱును న్యాయాధికారితో, "అయ్యా, ఇత డమాయకుడు, దొంగతనము చేయజాలడు" అని యేక గ్రీవముగా జెప్పిరి. అంతట న్యాయాధికారి, "జరిగినదేమొ చెప్పు"మని సాలెవాని నడిగెను. సాలె యిట్లు పలికెను: "అయ్యా, రామునియిచ్ఛవలన నేను చావడిలో గూర్చుండి యుంటిని. రామేచ్ఛవలన రాత్రి చాల ప్రొద్దుపోయినది. రామేచ్ఛవలన నేను ధ్యానముచేయుచు వాని పవిత్ర నామమును స్మరించుచుంటిని. రామేచ్ఛవలన దొంగ లావైపు వచ్చి నన్ను దమతో నీడ్చుకొనిపోయిరి. రామేచ్ఛవలన వారొక యింట గన్నమువేసి దొంగిలించిన సొత్తును గొంత నా నెత్తిని బెట్టిరి. రామేచ్ఛవలన బోలీసువారు నన్ను బట్టుకొని ఛెఱలోనుంచిరి. రామేచ్ఛవలన నేలినవారి సన్నిధికి

నేటియుదయము విచారణకై తీసికొని రాబడితిని.'' న్యాయాధిపతి వాని నిష్కాపట్యమును పారమార్థికచింతను జూచి వెంటనే విడిచిపెట్టెను. బయటికి వచ్చి మిత్రులతో నాతడు, "రామేచ్ఛవలన నేను బంధవిముక్తుడనైతిని''అని పల్కెను.

నీవు సంసారమున నుండుటకాని సంసారమును త్యజించుటకాని—సర్వము రామేచ్ఛపై నాధారపడియున్నది. కాబట్టి సమస్తమైన భారము ఆభగవంతునిమీాదనే వైచి నీవిహిత కర్మములను నిర్వర్తింపుము. (చూ. 271, 517.)

## సాధువేషముచే సాధువైన దొంగ

1097. ఒక దొంగ నడిరేయిని రాజాంతఃపురమున ప్రవేశించినాడు. రాజు తనకుమార్తెను నదీతీరముననుండు సాధువులలో నొకని కిచ్చి పెండ్లిచేయుదునని రాణితో జెప్పుచుండగా (దొంగ) వినినాడు. విని తనలో తా నిట్లనుకొనినాడు: "ఆహా! నాయదృష్టము పండినది! రేపు నేను సాధువేషము వేసికొని యేటికడనున్న సాధువులమధ్య గూర్చుందును. ఏమో, రాజు తన కుమార్తెను నాకే యీాయగూడదా?—ఎవరు చెప్పగలరు?'' మఱునాడు వా డటులనే చేసినాడు. రాజుగారి యుద్యోగులు వచ్చి రాజపుత్రికను వివాహము చేసికొనుమని యేసాధువును వేడినను నెవడును నొడంబడడయ్యె. తుదకు వారు సాధువేషముననున్న దొంగకడకు వచ్చి తమ యుద్దేశమును దెలిపిరి. ఈ దొంగసాధువు మౌనము వహించి యూరకుండెను. అంతట వారు రాజునొద్దకు బోయి తెఖొక యువకుడగు సాధు వున్నాడనియు వానిని ప్రాధేయపడి

రాజపుత్రికను బెండ్లియాడుటకై యెట్లో యొడబఱుపవచ్చు ననియు దక్కినసాధువులు సమ్మతింపలేదనియు దెలిపిరి. అంతట రాజు స్వయముగా ఈ సాధువుచెంతకువచ్చి, తనకుమార్తెను బెండ్లియాడి తన్ననుగ్రహింపలయునని యతిదీనముగా ప్రార్థించెను. రాజు వచ్చి తన్ను సందర్శింపగనే దొంగవానిహృదయము మాఱిపోయినది. ఆత డిట్లనుకొనసాగెను : "నేను కేవలము సాధువేషము వేసికొంటిని. ఆహా! ఏమి దీనిమహిమ! రాజంతటివాడు వచ్చి నన్ను ప్రాధేయపడుచున్నాడే! నేను నిజముగా సాధువనే యైనపక్షమున నాకింకను ఎట్టిమహాదృష్టము పట్టునో, యేమి మహాలాభములు గలుగునో, యెవ రూహింపగలరు ?" ఈతలపులు వాని హృదయమున గాఢముగా నాటుకొనినవి. బూటకపు వేసమువేసి రాజపుత్రికను బెండ్లియాడుటకంటె దననడవడిని మార్చుకొని నిజమైన సాధువగుటయే శ్రేష్ఠమని యాతడు నిశ్చయించుకొనినాడు. నాటినుండియే యాత డందులకై తన యావచ్ఛక్తిని వినియోగింపసాగినాడు. వివాహమును ద్రోసిరాజని యాతడు కాలక్రమమున మహోత్తమ సాధువై వఱలినాడు.

యోగ్యమైన వేషమును ధరించుటసైతము ఒక్కొక్కప్పుడు తలవనితలంపుగా శుభప్రదము కాగలదు. (చూ. 386, 534, 535, 1103.)

# త్యాగము : వైరాగ్యము

## విరక్తుడగు సంసారి

1098. ఉద్యోగము పోయిన యొక డేదేని పనిని సంపా

దింపుమని భార్య పెట్టు పోరు పడలేకుండెను. ఒకనాడు వాని కుమారునకు జబ్బుచేసి ప్రాణముమీదికి వచ్చినది; వైద్యులు ఆశలేదని చెప్పివైచిరి. ఈస్థితిలో ఉద్యోగము సంపాదించు నిమిత్తము ఆత డెచటికో వెడలియుండెను. ఇంతలో కొడుకు చనిపోయినాడు. తండ్రికోసము వెదకగా నెక్కడను గానరా లేదు. తుదకు సాయంకాలము ప్రొద్దుగ్రుంకినపిమ్మట నాత డింటికిరాగా, "కొడుకునకు ప్రాణముమీదికి వచ్చినప్పుడైనను ఇంటనుండనక్కఱలేదా? మీ రేమి ఱాతిగుండెయా?" అని భార్య సాధించుచు మొఱలిడసాగెను. అంత నాతడు చిఱు నగవుతో నిట్లు సమాధానము చెప్పెను: "నేనొక సారి రాజనైనట్లు, ఏడుగురుకొడుకులను గనినట్లును వారితో అష్టై శ్వర్యము లనుభవించుచున్నట్లును గలగంటిని. కాని మేల్కొని చూతునుగదా, యెవరును గానరారైరి. అంతయు స్వప్నము! నే నాయేడుగురు కొడుకులకై యేడ్వవలయునా? లేక యిప్పుడు చనిపోయినవీనికై యేడువవలయునా? చెప్పుము."

సంసారము స్వప్నతుల్యమని గ్రహించువాడు సామాన్య సంసారులవలె నైహికసంబంధములవలన గలుగు సుఖమును గాని, దుఃఖమునుగాని బొందడు.

## భిక్షకై వెడలిన బాలసన్న్యాసి

1099. ఒక బాలసన్న్యాసి భిక్షకై యొక యింటికి వెడలి నాడు. చాల చిన్నతనముననే సన్న్యసించుటచే వానికి విశేషమైన లోకజ్ఞానము లేదయ్యె. ఒక యువతి భిక్షపెట్టు టకై రాగా నామె స్తనయుగ్మమును జూచి, "నీకేమైన

తొమ్మున వ్రణములు లేచినవా?'' యని ప్రశ్నించినాడు. ఆమాటలా యువతి తల్లి విని, ''లేదు, లేదు, నాయనా! అవి వ్రణములు కావు. త్వరలోనే ఆమెకొక బిడ్డ కలుగనున్నది. ఆబిడ్డకు పాలిచ్చునిమిత్తము ముందుగనే భగవంతుడామెకు రెండు స్తనముల ననుగ్రహించినాడు. బిడ్డ పుట్టినప్పుడా స్తనములనుండి పాలు త్రాగగలదు'' అని సమాధానించెను. ఈపలుకు లాలకింపగనే యాబాలసన్న్యాసి యిట్లు పలికెను: ''ఇక నేను తిండికై యింటింట దిరుగను. నాఱు పోసినవాడు నీరు పోయడా? పుట్టించిన యా భగవంతుడే నన్ను పోషించును.'' (చూ. 262.)

## విరక్తులగు దంపతులు

1100. భార్యాభర్త లిరువురు సంసారత్యాగము చేసి తీర్థయాత్రలు చేయ మొదలిడిరి. అటుల వెడలుచుండగా భార్యకంటె గొంచెము ముందు నడచుచున్న భర్త కొకప్పుడు త్రోవలో నొకవజ్రము కనబడినది. దానిని భార్య చూచిన పక్షమున ఒకవేళ నాశచే మోహితురాలై త్యాగఫలమును బోగొట్టుకొనునేమో యనుభయముచే నాత డావజ్రమును నేలలో గప్పిపెట్టనెంచి కాలితో మట్టి పెల్లగింప నారంభించెను. ఇంతలో భార్య సమీపించి, ''ఏమి చేయుచున్నా'' రని యడిగెను. అతడేమేమో చెప్పి తప్పించుకొనజూచెను. ఇంతలో నామె వజ్రమును గాంచి, భర్త యుద్దేశమును గ్రహించి యిట్లు పలికెను; ''ఆవజ్రమునకును మట్టిపెల్లకును

మీకింకను భేదము స్ఫురించుచున్న పక్షమున మీరు సంసారమును పరిత్యజింపనేల ?''

## ఒక్కుమ్మడి సన్న్యాసియైన సంసారి

1101. మానవునకు వైరాగ్య మెట్లబ్బును? తనభర్తతో నొకయువతి యిట్లు పలికెను : ''మాయన్నవిషయమై చాల బెంగపెట్టుకొనియున్నాను. వారముదినములనుండి యాతడు సన్న్యసింపవలయునని చూచుచున్నాడు. క్రమ క్రమముగా గోరికలనన్నిటిని విడనాడుచున్నాడు.'' అందులకు భర్త యిట్లు సమాధానించెను : ''వెఱ్ఱిదానా! మీయన్న విషయమై నీ వెంతమాత్రము బెంగపెట్టుకొనక నక్కఱలేదు. అత డెన్నటికిని సన్న్యాసి కాబోడు. ఆ విధముగా నెవ్వడును సన్న్యాసి కాజాలడు.'' ''ఇక సన్న్యాసియగు విధమేది ?'' యని భార్య యడిగినది. ''అది యీ విధముగా జరుగవలయును'' అని చెప్పుచు, అతడు తటాలున దనవస్త్రములను బేలికలుగా జించివైచి, అందొక పేలికను గోచిగా ధరించి, యిట్లు పలికెను : ''చూడు, నేటినుండి నీవును, నీ స్త్రీ జాతి యంతయు నాకు దల్లులుసుమీ!'' అత డిల్లు విడిచి మఱల గాన్పింపడయ్యెను. (చూ. 567.)

## ఇద్దఱు వ్యవసాయులు

1102. 'క్రమక్రమముగా పూర్తిచేయుదును,' 'ఇదిగో, ఆరంభించుచున్నాను,' 'నేను దీనిని అవలంబింపనున్నాను'— ఇది యంతయు నశ్రద్ధయొక్క లక్షణము, మందవైరాగ్య

ఘోరణి. (చూ. 559.) వైరాగ్యాగ్ని యెవ్వని హృదయమున ప్రజ్వలించునో, బిడ్డకొఱకై తల్లివలె నెవ్వడు భగవంతునికొఱకు పరితపించునో—యట్టివాడు భగవానుని దప్ప నితరమును లక్షింపడు. సంసారము వానికి ప్రాకారము లేని ఘోరకూపమువలె గాన్పించును, ఎప్పుడందు పడిపోవుదునోయని సదా బహుజాగరూకుడై మెలగుచుండును. (చూ. 907.) ఇతరులవలె "ముందు సంసారపరిస్థితులను జక్కబెట్టుకొని యటుపిమ్మట భగవద్ధ్యానము చేయుద"మని యాతడెన్నడును తలపోయడు. వానికి ప్రచండమైన మనోనిశ్చయ ముండును. (చూ. 627, 629, 977.)

ఒక దేశములో నొకప్పుడు గొప్ప అనావృష్టిబాధ సంభవించినది. వ్యవసాయు లందఱును దమపొలములకు గాలువలు త్రవ్వి నీరు పెట్టుకొనుటకై తీవ్రప్రయత్నములు చేయుచుండిరి. వారిలో నొకడు, గట్టిపట్టుదలగలవాడు, తనకాలువ నేటితో గలుపువఱకు నాగకుండ త్రవ్వ నిశ్చయించుకొనెను. స్నానమునకును భోజనమునకును వేళయైనను నాతడు లక్ష్యపెట్టక యదేపనిగా ద్రవ్వుచుండెను. అంత వాని భార్య కొమార్తెచేతికిచ్చి స్నానమునకై నూనె పంపినది. కూతురు వచ్చి, "నాన్నా! మట్టమధ్యాహ్నమైనది. ఇదిగో చమురు, స్నానము చేయుము, రమ్ము" అని బతిమాలుకొనెను. "ఉండు, నాకింకను బనియున్నది" అని తండ్రి బదులు చెప్పెను. రెండుగంటలు దాటినను నాతడు స్నానముమాట కాని, భోజనముమాటగాని తలపెట్టడాయెను. తుదకు వాని భార్యయే పొలమునకు వచ్చి, "ఏల మీ రింకను స్నానము

చేయుటకు రారైతిరి? అన్నము చల్లారిపోవుచున్నది. మీ కెప్పుడును వేలమువెఱ్ఱియే. చాలును, ఇప్పుడైనను రండు, భోజనముచేసినతరువాతనో, రేపో, మిగిలినపని జూచుకో వచ్చును" అనెను. కాలరుద్రుడై యాతడు తిట్టుచు, పాఱ చేత బుచ్చుకొని యామెను దఱిమి వేయసాగెను. "ఓసీ! బుద్ధిహీనురాలా! చేనెండిపోవుచున్నది. మీ రిక పస్తుండి చావవలసివచ్చును. కండ్లగపడుట లేదా? నే నీనాడు చేనికి నీ రెక్కించితీరవలెను. అటుపిమ్మటనే మఱే పనియైనను— ఎయాలోచనైనను!" అని యాత డఱచెను. వాని యాగ్రహమును గాంచి యామె పరుగెత్తుకొనిపోయెను. భగీరథ ప్రయత్నముచేసి తుట్టతుదకు, అర్ధరాత్రివేళ కతడు తనపంతము నెగ్గించుకొనగలిగినాడు. ఏటినీరు గలగలలాడుచు తన పొలములోనికి ప్రవహించుట జూడ వాని యానందమునకు మేర లేకుండెను; అనంతర మాత డింటికి బోయి, స్నానము చేయుటకై భార్యను చమురు తెమ్మనెను. స్నానమును భోజనమును ఐనపిమ్మట సుఖముగా నాతడు గుఱ్ఱు పెట్టి నిద్రించినాడు. ఇటువంటి స్థిరసంకల్పము తీవ్రవైరాగ్యమునకు లక్షణము.

మఱియొక వ్యవసాయియును అదే పనియందు నిమగ్నుడై యుండెను. కాని వానిభార్య వచ్చి, యింటికి రమ్మనగానె పాఱ బుజమున బెట్టుకొని, "సరి, నీవు వచ్చి పిలిచినప్పుడు నేను రావలయునుగదా" అని మాఱు మాటాడక యామెను వెంబడించినాడు. అతడు సకాలమున బొలమునకు నీరు పెట్టుకొనలేకపోయినాడు. మందవైరాగ్యమనగా, సోమరి

తనమనగా ఇటువంటిది.

దృఢసంకల్పము లేనిదే పొలమునకు నీరుపెట్టుకొనుట సాధ్యముకానియట్లు తీవ్రపరితాపము లేనిదే పరమానంద ప్రదమగు బ్రహ్మసాక్షాత్కార మెవ్వనికిని లభ్యముకానేరదు.

## సాధువువలె నటించిన పల్లెవాడు

1103. ఒకప్పు డొక పల్లెవాడు రాత్రివేళ రహస్యముగా నొక పెద్దమనుష్యుని తోటలో బ్రవేశించి యందలి దొరువులో చేపలుపట్టసాగెను. యజమాను డెట్లో యీసంగతి తెలిసికొని తోటచుట్టును తన సేవకులను గాపుంచి, దివటీలు వేయించుకొని దొంగను బట్టుకొనుటకై తోటలో ప్రవేశించెను. ఇంతలో ఆపల్లెవాడు, తప్పించుకొను తెరవుగానక, ఒడలెల్ల బూడిదె పూసికొని సాధువువలె ఒకచెట్టుక్రింద గూర్చుండెను. అంత జనులు వచ్చి చూడగా వారి కెచ్చటను దొంగ కానరాలేదుకాని భస్మధారియై చెట్టుక్రింద ధ్యాననిమగ్నుడై యున్నటుల తోచు సాధువు కానవచ్చెను. మఱునాటి యుదయమున ఫలాని పెద్దమనుష్యునితోటలోని కొక సాధుపుంగవుడు వచ్చియున్నాడని ఊరెల్ల జెప్పుకొనసాగెను. అందుచే వందలకొలది జనులు ఫలపుష్పాదులతో సాధువును బూజించుటకై యచటికి రాసాగిరి. జను లాతనికి సాష్టాంగ పడుచుండిరి. వెండిబంగారు నాణెము లాసాధువుముందల ధారాపాతముగా బడుచుండెను. అప్పు డాపల్లెవా డిట్లను కొనసాగెను: "ఆహా! ఏమివిచిత్రము! నిజముగా నేను సాధువను కాను. ఐనను వీరందఱును నన్నింతగా బూజించు

చున్నారు! నేను నిజమైన సాధువనే ఐనపక్షమున భగవంతుడే నాకు జిక్కగలడు!''

ఈ విధముగా కృత్రిమమైన యనుకరణముసైతె మాపల్లెవానికి జ్ఞానప్రబోధకమైనది. (చూ. 1097.)

## సాధువు: యోగశక్తులు

1104. ఒకసాధువునకు గొప్ప మహిమ లలవడినవి; వానిచే నతడు గర్విష్ఠుడైనాడు. ఐనను మొత్తముమీద నాతడు చాల మంచివాడు, తపశ్శాలి. భగవానుడు వానికి బుద్ధి గఱపనెంచి, సన్న్యాసివేషము దాల్చి, వానిని సమీపించి యిట్లు పలికెను: ''అయ్యా, మీరు మహామహిమములను సంపాదించితిరని వినియున్నాను!'' సాధువు సగౌరవముగ స్వాగతము దెలిపి యాతని గూర్చుండ జేసెను. అప్పుడే యొక యేనుగా వైపు పోవుచుండుట చూచి సన్న్యాసి సాధువుతో, ''అయ్యా, మీ రీయేనుగును ఇచ్ఛామాత్రమున జంపగలరా?'' అనియెను. సాధువు, ''అహా! దానికేమి?'' యని చేతితో కొంత మట్టిని దీసి మంత్రించి యేనుగుపై జల్లెను. ఆయేనుగు గిజగిజ దన్నుకొనుచు బడి చచ్చినది. దానిని జూచి సన్న్యాసి, ''ఓహో! మీశక్తి యత్యద్భుతమైనది. ఎంత యవలీలగా నేనుగును జంపితిరి!'' అని పొగడెను. సాధువు సంతృప్తిపడి చిఱునవ్వు నవ్వినాడు. అంతట సన్న్యాసి మఱల ''స్వామీ, ఈ యేనుగును తిరిగి బ్రదికింపగలరా?'' అనెను. సాధువు, ''అహా! అదియు జేయవచ్చును'' అని మఱల గొంత మట్టిని మంత్రించి యేనుగుకళేబరము మీద జల్లగా నేనుగు

లేచి నిలుచుండెను. అంతట సన్న్యాసి యిట్లు విమర్శించి పలికెను: "నిజముగా నత్యద్భుతము మీమహిమ! కాని మిమ్మొక్క విషయ మడుగదలచినాను. క్షణములో మీరొక నేనుగును జంపి తిరిగి బ్రతికించినారుగదా! దానివలన మీకేమి లాభము సిద్ధించినది? ఏమి యభివృద్ధి చేకూఱినది? భగవంతుని బొందుటకు మీకిది యేమైన దోడ్పడినదా?" ఇట్లనుచు ఆసన్న్యాసి యదృశ్యమయ్యెను. (చూడుడు: 'సిద్ధులవలని ప్రమాదములు': 372—382.)

## కట్టెలు కొట్టువాడు : సన్న్యాసి

1105. కట్టెలుకొట్టువాడొకడు వనమునుండి తెచ్చిన కట్టెల మోపుల నమ్ముకొనుచు బహుకష్టజీవియై కాలము గడపుచుండెను. ఒకనాడాతడు కట్టెలు కొట్టుచుండగా నొక సన్న్యాసి వనమునుండి పోవుచు వానిని జూచి, "వనమధ్యమునకు సాగిపొమ్ము. దానివలన నీకు విశేషలాభము కలుగును" అని హితోపదేశముచేసెను. మఱునా డాతడు చెప్పినట్లే వనములోనికి సాగిపోగా నచ్చట నొక మంచి గంధపు జెట్టు గాన్పించెను. ఆత డమితానందభరితుడై తాను మోయ గలిగినన్ని గంధపుగట్టెలు గొట్టి యంగడిలోనికి దీసికొనిపోయి విక్రయించి విశేషలాభమును బొందెను. "నన్ను ముందునకు సాగిపొమ్మని యామహానుభావుడు చెప్పినాడుగదా! కాని యీగంధపుజెట్టు మాట చెప్పలేదేమి? ఇంకను ముందునకు బోయిచూచెదను" అని మఱునాడాతడు మంచిగంధపుజెట్లను దాటి మఱికొంతదూరము పోయెను. అంత వాని కొక రాగి

గని కాన్పించినది. తాను మోయగలిగినంత రాగిని దీసికొని పోయి యంగడిలో విక్రయించి చాల ధనము సంపాదించెను. సాధువుయొక్క ఉపదేశముననుసరించి యాత డంతటితో నాగక, మఱునాడు మఱింత దూరము వనములోనికి బోగా వాని కొక వెండిగని గాన్పించినది. తాను మోయగలిగినంత వెండిని దీసికొనిపోయి విక్రయించి యాతడు మఱింతధనము సంపాదించినాడు. ఈవిధముగా నానాడు ముందునకు సాగి పోగా, బంగారు గనులును వజ్రపుగనులును లభించుటచే నా కట్టెలమ్ము వాడు తుదకు కోటీశ్వరుడయ్యెను.

బ్రహ్మజ్ఞానము బొందగోరువాని విషయముకూడ నిట్టిదే. ఏకొలదిపాటి సిద్ధులనో, మహిమలనో సంపాదింపగనే తాను సర్వము సాధించితినను కొనక పూనికతో సాధనను సాగించు నెడల తుదకు శాశ్వత బ్రహ్మానందలాభమును బొందితీరును.

## అక్బరు : పకీరు

1106. అక్బరు రాజ్యముచేయుచుండ, ఢిల్లి సమీపమున నొకవనములో నొక పకీరు నివసించుచుండెను. ఆపకీరు గొప్ప మహనీయుడు. అనేకు లాతని కుటీరమునకు బోయి యాతని సందర్శించువారు. కాని వారి నాదరించుటకు దనయొద్ద నేమియు లేమి ధనసాహాయ్యము కోరి పకీ రక్బరునొద్దకు వెడలెను. అక్బరు సాధువులయెడ భక్తికలవాడని పేరుపొందియుండెను. పాదుషా యాసమయమున నమాజుచేయుచుండ, పకీరు వాని ప్రక్కన నుచితాసనమున గూర్చుండియుండెను. అంతట పకీరునకు అక్బ రిట్లు ప్రార్థించుచుండుట వినవచ్చెను: ''ప్రభూ

నా కధికసంపద నిమ్ము, అధిక శక్తిసామర్థ్యములను, అధికారము నిమ్ము, నా రాజ్యమును విస్తరింపజేయుము !'' తత్‌క్షణమే పకీరు లేచి పోబోవుచుండగా, అక్బరు చూచి, కూర్చుండుడని సైగచేసెను.

ప్రార్థనానంతరము పాదుషా పకీరుతోనిట్లనెను: ''అయ్యా, మీరు నన్ను జూడవచ్చితిరే, నాతోనేమియు జెప్పకుండగనే వెడలి పోబోయితిరేమి ? '' పకీరిట్లు సమాధానము చెప్పెను : '' ఏలినవారిని జూడవచ్చిన పనియా ?... ఎందుకు లెండు, మిమ్ము బాధింపను.'' ''కాదు, మీ కేమి కావలయునో సెల విండు'' అని అక్బరు పదేపదే నొక్కియడుగగా, పకీరు తుద కిట్లు చెప్పెను: '' ప్రభూ! నా కడ కనేకులు బోధకొఱకై వత్తురు. ధనాభావముచే నేను వారి నాదరింపజాలకున్నాను. అందుచే మీ సాయము నర్థించుట మంచి దనుకొంటిని. '' '' అటులైన మీ యుద్దేశమును దెలుపకయే వెడలిపోవ జూచుటకు గారణమేమి ! '' అని యక్బ రడిగెను. పకీ రిట్లు జబాబు చెప్పెను : '' మీరే అల్లా నెక్కువ సంపాదనకోసము, అధికారముకోసము, రాజ్యముకోసము నడుగుకొనుచుండగా, ' యాచకుని యాచింపబోయిన ప్రయోజనమేమి ? ' అని నాకు దోచినది. ఇక యాచనచేయక గడవనిపక్షమున, అల్లానే యాచించుట మంచిదనుకొంటిని ! ''

## సంసార మోహితుడు : సన్న్యాసి

1107. ఒక బ్రాహ్మణుడొక సన్న్యాసిని గలిసికొనెను. ఇరువురును మతవిషయములను గుఱించియు లౌకిక వ్యవహారములు

లను గుఱించియు జాలసేపు ప్రసంగించినారు. తుదకాసన్న్యాసి బ్రాహ్మణునితో నిట్లు పలికెను : "నాయనా! చూడుము, లోకములో నెవరిమీదను ఆశపెట్టుకొనదగదు. నీవు 'నావారు' అనుకొనదగినవా రెవరును లేరు." (చూ. 275.) బ్రాహ్మణునకు నమ్మకము కుదురలేదు. తాను రేయింబవళ్లెవరి నిమిత్తమై పడరానిపాట్లు పడుచుండెనో యటువంటి తన కుటుంబములోనివారు తన కవసరముపట్ల సాయము చేయదగిన యాప్తులు కారని యాతడెట్లు భావింపగల్గును? కావున నిట్లనెను: "స్వామీ! నా కిసుమంత తలనొప్పి వచ్చెనా, నా తల్లి తహతహలాడిపోవునే! నా బాధ తొలగునిమిత్తము తన ప్రాణములనైనను సంతోషపూర్వకముగా ధారపోయుటకు సంసిద్ధమగునే! అటువంటి నాతల్లిని నేను నమ్ముకొనలేని పక్షమున నే నింకెవరిపై నాధారపడగలనో యూహింపజాలను!" అందులకు సన్న్యాసి యిట్లనెను : "అటులనా! ఐనపక్షమున నామె నీకు పరమాప్తురాలనుటకు సందియములేదు, కాని నిజము చెప్పవలసివచ్చినయెడల నీవు చాల పొరపడుచున్నావు. నీతల్లిగాని, భార్యగాని, కొడుకుగాని నీ నిమిత్తము తన ప్రాణముల నర్పించునని యెన్నటికిని నమ్మబోకుము. కావలసినచో నా మాటలయొక్క సత్యమును బుజువుచూడవచ్చును; ఇంటికి బోయి కడుపులో శూలచే మితిలేని బాధపడుచున్నటుల నటించుచు మూలుగుచుండుము. నేను వచ్చి నీకొక 'తమాషా' చూపెదను."

అంత నా బ్రాహ్మణు డాలాగుననే చేసెను. వైద్యులెందఱో రావింపబడిరి, గాని యెవరు నేమియు జేయజాల

రైరి. రోగితల్లి వెక్కి వెక్కి యేడ్చుచుండెను, ఆలుబిడ్డలు రోదనము చేయుచుండిరి. ఆ తరుణమున సన్న్యాసి వచ్చెను.

"ఈ వ్యాధి ప్రాణాపాయకరమైనది. ఎవరైనను ఈ రోగి నిమిత్తము తన ప్రాణము నర్పించువా రుండిననేగాని యే మాత్రమును ఆశ లేదు" అన్నాడు సన్న్యాసి. ఈ మాటలు విని యెల్లరును దెల్లబోయి నిలుచుండిరి. ఆ సన్న్యాసి రోగియొక్క ముదుసలితల్లిని జూచి యిట్లు పలికెను : "మీ యందఱను బోషించు నీ కుమారుడు మరణించిన వెనుక వృద్ధాప్యమున నీవున్నను లేకున్నను నొక్కటియే. వానిజీవమునకు మాఱుగా నీ జీవము నర్పింతువేని, నీ కుమారుని రక్షింపగలను. నీవు వాని తల్లివైయుండియు నీపాటి త్యాగము చేయనిపక్షమున లోకములో వాని కిక దిక్కెవ్వరు ?"

ఆ వృద్ధస్త్రీ కండ్ల నీరు పెట్టుకొని దగ్గుచు, తడబడుచు నిట్లనియెను : "నిజమే, నాయనా ! నా బిడ్డకోసము నన్ను మీ రేమిచేయుమని సెలవిచ్చినను జేయుటకు సంసిద్ధురాలను. నా ప్రాణమా ! వానిబ్రతుకుతో పోల్చినపక్షమున నా దే పాటిది ? కాని నాయనా !— నేను చచ్చిపోయిన తర్వాత, ఈ పసికూనలందఱు నేమైపోదురో యను తలపే నన్ను బిటికి దానిని జేయుచున్నది. ఎంత పాపము చేసితినో కాని యీ పసికూనలను విడువజాలకున్నాను !"

సన్న్యాసికిని దన యత్తగారికిని జరిగిన యీ ప్రసంగ మును వినుచుండిన రోగిభార్య కండ్ల నీ రొత్తుకొనుచు దన తల్లిదండ్రుల జూచి, "మీ రేమగుదురో యను చింతచే నే నీ త్యాగమును జేయజాలకున్నాను. అయ్యయ్యో !"

అని విలపింపసాగెను. ఆమెవైపు తిరిగి సన్న్యాసి, 'అమ్మా! తల్లి వెనుక తీసినప్పుడు నీవైనను నీ ప్రాణనాథునికోసము ప్రాణమర్పింపరాదా ?' అనియెను. అంత నామె, "అయ్యో! ఎంత పాపిష్ఠిదాననోకదా ! నా నుదుట వైధవ్యము వ్రాయ బడి యున్నదికాబోలును. తల్లిదండ్రులను దుఃఖసాగరమున విడిచిపోవుటకు ప్రాణమొప్పకున్నది !" అని వాపోయెను. ఈ రీతిగా ప్రతివాడును తప్పించుకొనిరి. అంతట సన్న్యాసి రోగిని జూచి యిట్లు పలికెను: "చూచితివా ? నీ నిమిత్తమై యెవ్వరును ప్రాణమర్పింప సిద్ధపడువారు లేరైరి. 'లోక ములో నెవరిమీదను ఆశపెట్టుకొనుట తగ'దని నేననినమాట లిప్పటికైనను నీకు బోధపడినవా ?" లోకముయొక్క యీ ధోరణి నంతయు ప్రత్యక్షముగా జూచిన యా బ్రాహ్మణు డపారమైన సంసారమును విడనాడి యా సన్న్యాసి ననుస రించెను.

## భార్యయొక్క ప్రేమను పరీక్షించిన హఠయోగి

1108. తన భార్యకు దాననిన పంచప్రాణములు కావున సన్న్యసింపజాలకున్నానని యొకశిష్యుడు గురునితో జెప్పెను. ఆ శిష్యుడు హఠయోగాభ్యాసము సాగించువాడు. అతడు చెప్పిన కారణము వట్టి నెపమని బోధించుతలంపున గురువు వానికి గొన్ని హఠయోగరహస్యములను నేర్పెను. హఠా త్తుగా ఆ శిష్యునియింటిలో నొకనా డేడ్పులతోడను బెడ బొబ్బలతోడను పెద్ద గందరగోళము వినవచ్చెను. ఇరుగు పొరుగు వా రందఱును బరుగెత్తుకొని యా యింటికి వచ్చి

చూడగా, హఠయోగి విచిత్రముగా నొక గదిలో మెలికలు దిరిగి నిశ్చలుడై పడియుండెను. అందఱును ప్రాణముపోయిన దని తలంచిరి. "అయ్యో! ఏమైపోతిరి? మమ్ముల నెందుకు విడనాడిపోతిరి? అయ్యయ్యో! ఇంతలో నిట్టియాపద వచ్చు నని కలనైన నను దలపనైతినికదా!" అని భార్య విలపింప సాగెను. ఇంతలో బంధుగులు వచ్చి పాడెగట్టి శవమును దహన మునకై తీసికొనిపోవ సిద్ధపడిరి. కాని వారికొక గొప్పచిక్కు తటస్థించెను. ఆ కళేబరము మెలికలు తిరిగి యుండెనుగాన ద్వారములో నుండి రాదయ్యెను. అది చూచి పొరుగు వాడొకడు గొడ్డలిని దెచ్చి ద్వారబంధమును దెగగొట్ట నారంభించెను. అంతవఱకు నోదార్ప వీలులేకుండ వెక్కి వెక్కి యేడ్చుచున్న భార్య గొడ్డలిచప్పుడు వినబడగానే యక్కడికి బరుగిడిపోయి, కన్నులొత్తుకొనుచు, 'ఏమి చేయుచున్నారు?' అని యాదుర్దాతో నడిగెను. "నీ భర్తను ద్వారముగుండా తీసికొనిపోవ వీలులేనందున ద్వారబంధమును దెగగొట్టు చున్నా"మని పొరుగువాడొకడు చెప్పెను. అంతట నామె యిట్లనెను: "వద్దు, వద్దు, ద్వారబంధమును దెగగొట్టవద్దు. నే నిపుడు వితంతువను, దిక్కులేనిదానను. తండ్రిలేని యీ బిడ్డలను బోషించుకొనవలసినదానను. మీ రిపు డీ ద్వార బంధమును దెగగొట్టినపక్షమున దీనిని మఱల మరమ్మతు చేయించుకొను టెట్లు? నాభర్తకు సంభవించినదేమో సంభ వించినది—చేతులను, కాళ్లను నఱికి యాయనను బయటికి దీసికొనిపొండు."—తాను సేవించిన మూలికయొక్క ప్రభావ మప్పటికి తగ్గిపోవుటచే హఠయోగి దిగ్గునలేచి యిట్లనెను:

"ఓసీ! నా కాలుసేతులు నఱుకుమనుచుంటివా ?" ఇట్లను చు నిల్లువాకిలిని విడిచిపెట్టి— సంసారమును త్యజించి— యాతడు గురుని వెంబడించెను.

# మాయయొక్క స్వభావము

## ముగ్గురు దొంగలు

1109. ఒకమనుష్యు డడవులగుండా ప్రయాణము చేయుచుండెను. త్రోవలో ముగ్గురు దొంగలు వానిని ముట్టడించి వానియొద్దనున్న సొమ్మంతయు దోచుకొనిరి. వారిలో నొకడు "వీనిని జీవముతో విడిచి ప్రయోజనమేమి ?" అనుచు వానిని నఱుకుటకై కత్తి నెత్తెను. ఇంతలో రెండవ దొంగ వానినాపి, "నామాట విను, ఈ నిర్భాగ్యుని జంపి యేమి ప్రయోజనము ? కాలుసేతులు కట్టివేసి వీని నిక్కడ విడిచిపోవుదము" అనెను. అంత వా రతని కాలుసేతులు బంధించి యక్కడ విడిచిపోయిరి. వారు కొంతదూరము వెడలినపిమ్మట మూడవదొంగ తిరిగివచ్చి, 'అయ్యో! పాపము! నీ వెంత సంకటపడితివోకద! క్షణములో నిన్ను విడిచిపెట్టెదను' అని కట్లు విప్పివేసి, "నాతో రమ్ము. నీకు దారిచూపెదను" అనెను. వా రిరువురు నటుల జాలదూరము నడచిన పిమ్మట రాజవీధి కాన్పించినది. అంతట, ఆదొంగ "అదిగో, నీ యిల్లు. ఈ త్రోవను బొమ్ము, ఇల్లు చేరెదవు" అనెను. ఆ మనుష్యుడు తన కృతజ్ఞతను సూచించుచు నిట్లు పలికెను: "అయ్యా! నీవు నాకు మహోపకారము చేసినావు. నేను నీ మేలు మఱవను. నాతో గూడ మా యింటికి రావా ?"

అందులకు దొంగ యిట్లు సమాధానము చెప్పెను: "వలను పడదు, నేనక్కడకు రాజాలను. వచ్చినపక్షమున బోలీసు వారు నన్ను బట్టుకొనగలరు."

ఈ సంసారమే అడవి. ప్రకృతిగుణములగు సత్త్వ రజస్తమోగుణములే ముగ్గురు దొంగలు. జీవుడే యాత్రికుడు. ఆత్మజ్ఞానమే వానిసొత్తు. తమోగుణము వానిని సంసారమను సంకెలలచే బద్ధుని జేయుచున్నది, కాని సత్త్వగుణము వానిని రజస్తమస్సులబారినుండి రక్షించును. సత్త్వగుణము నాశ్రయించి జీవుడు రజస్తమోగుణసంజనితములగు కామక్రోధాదులనుండి విడివడును; సత్త్వగుణ మిట్లు జీవుని సంసారబంధవిముక్తుని జేయును. కాని సత్త్వగుణము సైతము దొంగయే. ఐనను, అది జీవునకు పరమాత్మను జేరుమార్గమును జూపి, "అదిగో, నీయిల్లు" అని తెలుపును. అంతట, అదియు నదృశ్యమగును. ఈసత్త్వగుణము సైతము పరమాత్మసామ్రాజ్యములోనికి బోజాలదు.*

---

*"త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జునా."
—భగవద్గీత, 2-45.

అర్జునా! వేదములు త్రిగుణాత్మకమగు సంసారమే విషయముగా గలవి (లేదా సంసారస్వరూపమును దెలియజేయునవి), నీవు త్రిగుణాతీతుడవు కమ్ము,

"గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్,
జన్మ మృత్యు జరా దుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే."
—భగవద్గీత, 14-20.

ఎవడు దేహోత్పత్తికారణములైన యీమూడు గుణములను దాటిపోవుచున్నాడో వాడు జన్మ మృత్యు జరా దుఃఖములచే విడువబడి మోక్షమును బొందుచున్నాడు.

## పురోహితుడు : వాని సేవకుడు

1110. ఒకపురోహితుడు తనశిష్యునియొక్క యూరికి బోవుచుండెను. తనయొద్ద నెవ్వరును పరిచారకులు లేకుండుటచే దారిలో నొక మాదిగ కాన్పింపగా నాతడు వానితో నిట్లనియెను: "ఓయీ! నీవు నాసేవకుడవుగానుండి నాతో వచ్చెదవా? నీకు మంచితిండి దొరకును, నిన్ను జక్కగా పోషించెదను, రమ్ము." అందులకు మాదిగ యిట్లనెను: "స్వామీ, నేను కడజాతివాడను. మీసేవకుడనని యెట్లు చెప్పుకొనగలను?" అంతట పురోహితుడు వానికిట్లు ధైర్యము చెప్పెను: "'పరవా' లేదు. నీవెవ్వడవో యెవ్వరికిని జెప్పకుము. ఎవరితోడను మాటాడకుము. ఎవరిపరిచయము కలుగజేసికొనకుము." మాదిగ ఒడంబడినాడు. సాయంకాల మాపురోహితుడు తన శిష్యునింటిలో సంధ్యావందనము చేసికొనుచుండగా మఱియొక బ్రాహ్మణుడు వచ్చి, పురోహితుని సేవకుని జూచి, "ఓయీ! నాచెప్పుల నక్కడ వదలితిని, పోయి తీసికొనిరమ్ము" అనెను. ఈసేవకుడు తనయజమానుని యుపదేశమునునుసరించి మాటాడ లేదు—కదలలేదు. బ్రాహ్మణుడు మఱియొకసారి చెప్పినాడు. అప్పుడును, నాత డూరకుండెను. బ్రాహ్మణుడు పదేపదే చెప్పినను, ఆ సేవకుడు కదలడయ్యెను. చివరకు బ్రాహ్మణుడు కోపముపట్టజాలక, "ఓరీ! నీవు బ్రాహ్మణుని యాజ్ఞను తిరస్కరింప సాహసించితివిగా! నీ పేరేమి? నీవు చండాలుడవాయేమి? నిజము చెప్పుము" అనగా మాదిగ గజగజ వణకుచు, మొగము తెలవేసి, పురో

హితునివంక జూచి, యిట్లు మొఱపెట్టెను : "మహాప్రభూ! నాగుట్టు తెలిసిపోయినది. నే నింక నిక్కడ నుండుటకు గుండె దడఎత్తుచున్నది. నేను పాఱిపోయెదను." ఇట్లనుచు, ఆ మాదిగ యదేపోకగా బాఱిపోయెను.

ఈవిధముగనే మాయయొక్కగుట్టు కనుగొనినంతనే యది తొలగిపోవును. (చూ. 61, 488.)

## నారదుని సంసారమోహము

1111. మాయ యిట్టిదని తెలియరానిది. (చూ. 385.) ఒకనాడు నారదుడు శ్రీహరిని సమీపించి, "స్వామీ! అసాధ్యమును సాధ్యముగా జేయు నీమాయను నాకు జూపుము" అని వేడుకొనెను. శ్రీహరి "సరియే" యని తల పంకించెను. అటుపిమ్మట నొకనాడు శ్రీహరి నారదుని దన వెంటబెట్టుకొని యొకానొకచోటికి బ్రయాణమయ్యెను. కొంతదూరము వెడలినపిమ్మట శ్రీహరికి దాహమయ్యెను. చాల డస్సి కూర్చుండి, "నారదా! నాకు జాల దాహమగుచున్నది. ఎచటికైనను బోయి కొంచెము నీరు తెమ్ము" అనెను. నారదుడు వెంటనే నీరు వెదకుటకై పరుగిడెను.

దాపున నెక్కడను నీరు చిక్కలేదు. చాల దూరము పోగా నే ఱొకటి యున్నటుల గాన్పించినది. నారదు డాయేటి యొద్దకు బోగా నచట నొక దివ్యసుందరాంగి కూర్చుండి యుండెను. ఆమె సౌందర్యమును జూచి నారదుడు మోహితుడయ్యెను. సమీపమునకు బోగా, నామె మృదుమధుర వాక్కుల నారదుని బలుకరించెను. అచిరకాలముననే యొం

దొరలను ప్రేమించుకొనిరి. నారదు డామెను బెండ్లియాడి యామెతో గాపురము చేయసాగెను. కాలక్రమమున నాతని కామెవలన సంతానము కలిగినది. ఇట్లు నారదు డాలుబిడ్డలతో మహానందముగా గాలము గడపుచుండగా, ఆ దేశములో గొప్ప కాటకము సంభవించినది. మృత్యువు వేనవేలు జనులను దన పొట్టను బెట్టుకొనుచుండెను. అంత నారదు డాచోటు విడిచి మఱియొకచోటికి బోవుట మంచిదని భార్యతో జెప్పెను. భార్య సమ్మతింప వారిరువురును బిడ్డలను జేతులు పట్టుకొని నడిపించుచు నిల్లు విడిచి పయనమైరి. వారొక వంతెనమీదుగా పోవుచుండ హఠాత్తుగా బెద్దవరద వచ్చెను. ప్రవాహవేగమున బిల్ల లందఱును నొక్కొక్కరే కొట్టుకొని పోయిరి. తుదకు భార్యయు నీటిలో మునిగిపోయినది. దుఃఖ పరవశుడై నారదుడు నదియొడ్డున జదికిలబడి బోరన విలపింప సాగెను. ఆసమయమున శ్రీహరి సమీపించి, "నారదా! మంచినీ రేది? నీవిటు లేడ్చుచున్నావెందులకు?" అని పలుకరించెను. స్వామిని గాంచి నారదు డులికిపడి లేచెను. జరిగిన సంగతి యంతయు నారదునకు దెల్లమైనది. అంత నాతడు చేతులు జోడించుకొని, "ప్రభో! నీకు పదివేల నమస్కారములు! అత్యద్భుతమైన నీమహామాయకు కోటి నమస్కారములు!!" అని పలికెను.

## "గొఱ్ఱె పులి"

1112. ఒక పెద్దపులి గొఱ్ఱెలమందపై బడెను. అది నిండు చూలుతో నుండుటచే, మందమీదికి దూకగనే యీని చని పోయినది. పులికూన మాత్ర మెటో బ్రదికి గొఱ్ఱెల మధ్య

బెరుగసాగెను. గొఱ్ఱెలు పొలములో మేత మేయుచుండ నదియు మేత మేయ నేర్చెను. అవి యఱచినట్లె యిదియు నఱచెడిది. కొంతకాలమున కది పెరిగి పెద్దపులియైనది. ఒకనాడు విధి వశమున మఱియొక పెద్దపులి గొఱ్ఱెలమందపై బడినది. కాని మందలోనున్న యీ 'గొఱ్ఱెపులి'ని జూచి యది యాశ్చర్యపడి దీనిని దఱిమి మెడపట్టి యీడ్చినది. కాని యిది భయపడి గొఱ్ఱెవలె అతి దీనముగా నఱవసాగినది. క్రొత్తపులి దీని నొక్క యొక చెఱువు కడకు లాగికొనిపోయి నీటిలో తమ యిరువురి ప్రతిబింబములను చూపి యిట్లు ఘోషించెను: "చూడు, చూడు, నీరూపు నారూపు వలెనే యున్నది. నీవు నావలెనే పులివే. ఇదిగో, ఈమాంసము తినుము." ఇట్లనుచు బలవంతముగా దానినోటిలో మాంసము గ్రుక్కినది. కాని యీ 'గొఱ్ఱెపులి' మాంసము తినదయ్యె. దీనముగా నరచుచు దాను గొఱ్ఱె నని తెలుప మొదలిడెను. ఐనను కొంచెము రక్తము రుచి చూడగనే దానియం దణగియున్న వ్యాఘ్ర సంస్కారములు మొలకెత్తినవి. అంత నది మాంసము తిన నారంభించెను. అపుడు క్రొత్తపులి దానిని జూచి యిట్లు గాండ్రించెను: "నావలెనే నీవును బులివని యిప్పుడైనను బోధపడినదా? ఛీఛీ! ఇన్నాళ్ళు నీ వీగొఱ్ఱెలతో మెలగుచు గడ్డి మేయుచుంటివిగదా! సిగ్గుసిగ్గు! అడవికి రమ్ము, పోదము."

గడ్డిమేయుట యనగా కామకాంచనములతో తృప్తిపడి యుండుట. గొఱ్ఱెవలె పరుగెత్తుట యనగా అల్పజనులవలె వ్యవహరించుట. క్రొత్తపులి వెంట పోవుట యనగా హృదయమును వికసింపజేయగలుగు గురుని పదములను శరణు

జొచ్చి యతని నాత్మీయునిగా గ్రహించుట యని యర్థము. నీళ్ళలో దన ప్రతిబింబమును జూచుట యనగా స్వస్వరూపమును గనుగొనుట. (గురుకటాక్షము లభించినచో ఆత్మలాభము గలుగునని భావము. చూ. 628.)

## రాజసందర్శనము

1113. ఆత్మవిచారము చేయుచు రాగా, మనస్సు పరిపూర్ణ ప్రశాంతి నొందును; అంత బ్రహ్మసాక్షాత్కారమగును. (చూ. 364, 423.)

ఒకడు (తనస్నేహితునితో గూడి) రాజసందర్శనము చేయ నెంచెను. సప్తద్వారముల కవ్వల అంతఃపురములో రాజుండెను. ఆ మనుష్యుడు మొదటిద్వారముకడకువచ్చి యచట నాడంబరమైన దుస్తులతో గొందఱు భటులతో గూడుకొనియున్న యొకనిని జూచి, తన స్నేహితునితో, "ఇతడేనా రాజు?" అని యడిగెను. స్నేహితుడు నవ్వి, "కాదు" అనెను. తరువాత నాతడు క్రమముగా మిగిలిన ద్వారములను దాటిపోవుచు ప్రతిద్వారముకడను వైభవమున నొకరిని మించిన యొకరిని గాంచసాగెను. అతడు రాచనగరులోనికి బోయిన కొలదియు దనకు గాన వచ్చిన జనుల వైభవము హెచ్చిపోవుచుండెను. ప్రతిద్వారముకడను దనకు గాన్పించినవాడు రాజే యని తలచి యాతడు తనస్నేహితుని ప్రశ్నింపసాగెను. కాని యాతడు ఏడవద్వారమును దాటి రాజును ముఖాముఖిని జూచినప్పుడిక, "ఇతడేనా రాజు?" అని [illegible] నడుగ నవసరమే లేకపోయినది. అఖండైశ్వర్య

ముతో విలసిల్లుచున్న రాజును గాంచగనే తాను నరేంద్రుని సమక్షమున నిలువబడియున్నట్లు వానికి సహజముగనే తోచినది. (చూ. 584.)

# బ్రహ్మసాక్షాత్కారము

## బంగారుమురుగులను ధరించిన వితంతువు

1114. పతివ్రతయు మహాభక్తురాలును నగు నొకస్త్రీ తనభర్తను బిడ్డలకు నుపచారములుచేయుచు, సదా తన చిత్తమును భగవదాయత్తముచేసి గృహస్థధర్మమును నిర్వర్తించుచుండెను. కొంతకాలమున కామెపతి గతించెను. అంతట దహనకర్మము ముగియగనే యామె తనగాజులను దీసివేసి వానికి బదులు బంగారు మురుగులను ధరించెను. జనులామె విపరీతచర్యను జూచి వింతపడసాగిరి. కాని యామె వారల కిట్లు సమాధానము చెప్పెను: ''ఇంతకుముందు నాభర్త శరీరము గాజుపెంకులవలెనే దుర్బలమై అస్థిరమై యుండెను. ఇప్పు డాక్షణభంగురమైన శరీరము నశించినది. అందుచే నాత డిపుడు సర్వవిధముల వికారరహితుడై పరిపూర్ణుడై యున్నాడు. ఆతని శరీరమున కిక శిథిలత లేదు. కాబట్టి నేను సులభముగ చిటిలెడుగాజులను విసర్జించి యంతకంటె స్థిరమైన మురుగులను ధరించితిని.''

## జ్ఞానియగు పుత్రుడు: అజ్ఞానియగు తండ్రి

1115. ఒకప్పు డిద్దఱుసాధువులు దక్షిణేశ్వరమునకు వచ్చిరి. వారు తండ్రికొడుకులు. కుమారుడు బ్రహ్మజ్ఞాని,

కాని తండ్రి కింకను జ్ఞానోదయము కాలేదు. ఇరువురును శ్రీరామకృష్ణుని గదిలో గూర్చుండి యాతనితో సంభాషించు చుండిరి. ఇంతలో నొక యెలుకకన్నములోనుండి యొక త్రాచుబాము వచ్చి కుమారుని గఱచినది. అదిచూచి తండ్రి భీతిలిపోయి చుట్టుపట్ల నున్న వారందఱను బిలువసాగెను. కాని కుమారుఁడు కదలక కూర్చుండియుండెను. అదిచూచి తండ్రి మఱింతదిగ్భ్రమచెంది, "నాయనా! అదేమి? ఆలాగున కదలక మెదలక కూర్చుండియున్నావు? నీకు..." అని యడుగగా కుమారుడు నవ్వుచు నిట్లు సమాధానము చెప్పెను: "పాముఅనగా ఏది? ఎవరిని గఱచినది?" ఆత డద్వైతసిద్ధిని బడసినవాఁడు. కావున పామునకును నరునకును నాతడు భేదమును బాటింపలేదు. (సమస్తము నాతనిదృష్టిలో బ్రహ్మమే.)

## అంత్యజుడు : శంకరాచార్యుడు

1116. మాల యొకడు మాంసముతో నిండిన తట్టలను గావడిలో బెట్టుకొని మోయుచు శ్రీశంకరాచార్యున కెదురు పడెను. ఆయన యప్పుడే గంగాస్నానముచేసి వచ్చుచుండెను. ఆమాల యీమహనీయుని దాకుట తటస్థించినది. శంకరుడాగ్రహాపరవశుడై, "ఓరోరీ! నన్ను దాకితివా!..." యనెను. మాల యిట్లు సమాధానము చెప్పెను: "అయ్యా, నేను మిమ్ము దాకలేదు, మీరు నన్ను దాకలేదు! మీయాత్మ శరీరమో, మనస్సో, బుద్ధియో సెలవీయుడు; నిజముగా మీరెవ్వరో నాకు జెప్పుడు. సత్త్వరజస్తమోగుణములలో నాత్మ దేనిని నంటజాల దనునది తమకు దెలియనిసంగతి

కాదుకదా!'' శంకరాచార్యు డంతట దనప్రమాదమును గ్రహించి సిగ్గుపడియెను. మాలనివాక్యము లాతని కాత్మ ప్రబోధకము లయ్యెను.

## శిష్యునకు క్రమముగా బోధించిన గురువు

1117. ఒకప్పు డొక సాధువు తన శిష్యున కాత్మజ్ఞానము బోధించు తలంపున వాని నొక దివ్యమైన వనములో నుంచి తాను వెడలెను. కొన్నిదినము లైనవెనుక నాతడు తిరిగి వచ్చి, "నాయనా! నీకేమియులోటు లేదుగద?'' అని యడిగెను. శిష్యుడు, "స్వామీ! లోటులేదని యెట్లు చెప్పగలను? ...'' అని సమాధానించెను. గురు వంతట శ్యామ యను సుందరిని వానికడ దిగవిడిచి, "నాయనా! మత్స్యమాంసములను యథేచ్ఛముగా దినవచ్చును'' అని చెప్పెను. చాలకాలమైన పిమ్మట గురువు మఱల వచ్చి శిష్యుని బూర్వ ప్రశ్నమునే వైచెను. శిష్యు డీసారి "స్వామీ! తమదయ వలన నాకేమియు లోటులేదు''అనిచెప్పెను. గురు వపుడు వా రిరువురిని (అనగా శ్యామను శిష్యుని) బిలిచి శ్యామచేతులను జూపుచు, "ఇవి యేమో చెప్పగలవా?'' అని యడిగెను. శిష్యుడు, "ఏల? ఇవి శ్యామచేతులుగదా'' యని బదులు చెప్పెను. గురు వంతట శ్యామకండ్లు, ముక్కు మొదలైన యవయవములను జూపుచు, పదేపదే యదియే ప్రశ్న వైచెను. శిష్యు డుచితమైన సమాధానములను జెప్పసాగెను. అంతట వాని కిట్లు దోచినది : "ప్రతిదానినిగూర్చియు 'ఇది శ్యామముక్కు,' 'ఇది శ్యామకన్ను'—అని చెప్పు

చున్నాను గదా. ఈ శ్యామ యెవరు ?'' దిగ్భ్రిమచెందె యాతడు గురువు నిట్లు ప్రశ్నించెను : ''స్వామీ ! ఈ కండ్లు, ముక్కు, చెవులు మొదలైనవి యెవరివో ఆ యీ శ్యాము యెవరు ?'' గురు విట్లు పలికెను: ''నాయనా! ఈ శ్యామ యెవరో నీవు తెలిసికొనగోరినపక్షమున నాతో రమ్ము, నీకు బోధపఱచెదను.''ఇట్లనుచు వానిని దీసికొనిపోయి తత్త్వము నుపదేశించెను.

## పుత్రులజ్ఞానమును పరీక్షించిన తండ్రి

1118. ఒకనికి ఇద్దఱు కుమారులుండిరి. యుక్తవయస్సు రాగానే వారి నాతడు బ్రహ్మచర్యాశ్రమమున బ్రవేశింపజేసి వేదాధ్యయనమునకై యొక గురునికడ నుంచినాడు. వారు చాలకాలమునకు జదువు ముగించి యింటికి దిరిగి వచ్చిరి. '' నాయనలారా ! మీరు వేదాంతము చదివినారా ? '' అని తండ్రి ప్రశ్నించెను. వారు '' ఔను '' అని చెప్పగా, '' మంచిది, బ్రహ్మమన నెట్టిదో నాకు జెప్పుడు'' అని యాత డడిగెను. అంత బెద్దకుమారుడు వేదములనుండియు, శాస్త్రములనుండియు బ్రమాణముల నెన్నిటినో చూపుచు నిట్లు సమాధానము చెప్పినాడు : ''నాయనా ! బ్రహ్మమును నోటి మాటలతో వర్ణించుటకు వీలుపడదు. మనస్సునకు గూడ అది గోచరముకాదు.'' * ఇట్లనియు బ్రహ్మ మట్టిది, యిట్టిదని వర్ణింపబూని తుదకు '' నా కంతయు దెలియును '' అని వక్కాణించుచు దానుచెప్పుదానిని బలపఱుచుటకై వేదాంత

* 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ.'- తైత్తిరీయోపనిషత్తు.

వాక్యముల నేకరువు పెట్టసాగెను.

తండ్రి వినివిని, "సరే, నీవు బ్రహ్మమును నిజముగా దెలిసికొన్నావన్న మాట! మంచిది, నీ పనిమీద నీవు పొమ్ము" అని వానిని బంపివేసెను. అంతట నాతడు తన చిన్న కుమారుని గూడ నదియే ప్రశ్నవైచెను. ఆ పిల్లవాడు మౌనము దాల్చినాడు. వానినోట నొక్క మాటయైనను వెలువడదయ్యెను. మాటాడుటకు గూడ నాతడు ప్రయత్నింపనేలేదు. అది గని తండ్రి యిట్లు విమర్శించి పలికెను : "మంచిది, నాయనా! నిజమంతటిదే. పరబ్రహ్మమునుగూర్చి 'యిదమిత్థ' మని చెప్పుట కెంతమాత్రము సాధ్యముకాదు. దానిని గురించి పలుక నోరు తెఱచినంతనే యనంతమును సాంతముగను, అపరిచ్ఛిన్నమును పరిచ్ఛిన్నముగను, అప్రమేయమును ప్రమేయముగను నిర్వచించినవాడ వగుదువు. వేయి శ్లోకములను వేయి ప్రమాణములను ఏకరువు పెట్టుటకంటె నీమౌనమే ఈవిషయమును మహోత్కృష్టముగా వెల్లడించుచున్నది."

## పండితుడు : భాగవతబోధ

1119. బాగుగాజదువుకొనిన యొకబ్రాహ్మణుడు ధీమంతుడగు నొక రాజునొద్దకు వెడలి, "మహారాజా! నేను బాగుగా జదివిన పండితుడను. నేను మీకు భాగవతమును బోధింతమని వచ్చితిని" అనెను. ఆ యిద్దఱిలో బుద్ధిమంతుడైన రాజు, 'ఎవడేని నిజముగా భాగవతమునే బాగుగా జదివియున్నపక్షమున నట్టివాడు రాజాస్థానములకు బోయి

ధనగౌరవములను సంపాదింపనెంచుటకంటె నాత్మజ్ఞానము నార్జించుటనే యెక్కువగా నభిలషించు' నని బాగుగా నెఱుగును. అందుచే రా జాతనితో నిట్లుపలికెను : "బ్రాహ్మణ వర్యా! మీ రాగ్రంథమును సరిగా జదువనట్లు కనబడు చున్నది. నేను మిమ్ము నా గురువుగా గైకొన వాగ్దానము చేయుచున్నాను. కాని మీరు వెడలి ముం దా గ్రంథమును బాగుగా జదువుకొని రండు." అంత నా బ్రాహ్మణుడు తన దారిని బట్టిపోవుచు నిట్లనుకొనెను : "నేను ఎన్నో సంవత్సర ముల నుండి భాగవతము ననేకపర్యాయములు తిరుగవేసి యున్నను నన్నీ రాజు భాగవతము నర్థము చేసికొనని మూఢుని క్రింద గట్టినాడు! ఈ నా జెంతటి మూర్ఖుడో!!" ఐనను నా బ్రాహ్మణుడు భాగవతమును మఱొకసారి యామూలాగ్ర ముగ బఠించి మఱల రాజునొద్దకు వచ్చెను. రాజు మఱల తన పూర్వపు మాటలనే చెప్పి యాతని బంపివేసెను. బ్రాహ్మ ణున కొడలు మండినది—ప్రాణము విసిగినది. ఐనను రా జటుల వర్తించుట కేదియో యొక కారణ ముండియుండునని వానికి దోచినది. అంత నత డింటికిబోయి దీక్షగా దన గదిలో గూర్చుండి భాగవతమును శ్రద్ధగా బఠింప నారంభించెను. క్రమక్రమముగా భాగవతము నందలి గూఢార్థము లాతనికి గోచరింపసాగెను. బుద్బుదప్రాయములగు ధనము, గౌరవము, రాజులు, ఆస్థానములు మొదలగు విషయములవెంట బరువు లిడుట కేవలము వ్యర్థమని వాని విమలదృష్టికి దట్టెను. నాటినుంటి యా బ్రాహ్మణుడు భగవదారాధనచేయుచు, మోక్షమునే తన పరమావధిగా భావించి మహానిష్ఠా గరి

ష్టుడై యుండెను. ఇక రాజునొద్దకు వెడలుదమను తలంపే వానిహృదయమున లేదయ్యెను. ఇట్లు కొన్నిరోజులు గడచిన పిమ్మట బ్రాహ్మణు డేమిచేయుచుండెనో యనుతలపు గలుగ రాజు వానిని జూచుటకై వానియింటికి వెడలెను. బ్రాహ్మణునిముఖము భక్తిజ్ఞానములతో దేదీప్యమానమై ప్రకాశించుచుండెను. రాజు వానికి సాష్టాంగప్రణామ మొనర్చి యిట్లు పలికెను: "స్వామీ! భాగవతార్థమును దా మిప్పుడు సంపూర్ణముగా గ్రహించితిరని నాకు దెల్లమైనది. ఈదీనుని శిష్యునిగా స్వీకరింతురేని సంసిద్ధుడై యున్నాడు."

## జమీందారునిచే హింసింపబడిన సాధువు

1120. ఒకానొకగ్రామములో నొకమఠ ముండెను. మఠమునందలి సన్న్యాసులు భిక్షాపాత్రలను జేబూని యూరిలోనికి బోయి భిక్షాటనముచేయువారు. ఒకనా డొక సన్న్యాసి యిట్లు భిక్షాటనముచేయుచు నొకజమీందారుడు నొకపేదవానిని కఠినముగా గొట్టుచుండుట జూచెను. దయార్ద్రహృదయుడగు నాసన్న్యాసి వానిని గొట్టవలదని జమీందారుని బతిమాలుకొనెను. మహాక్రోధముచే కన్నుగానకున్న యాజమీందారుడు తన క్రోధానలమును సన్న్యాసి మీదికి ద్రిప్పెను. పాప మాసన్న్యాసి స్మృతితప్పి పడిపోవు వఱకు నామదాంధుడు వానిపై బడి మోదినాడు. ఈ సన్న్యాసియొక్క యవస్థను జూచిన మఱియొకమనుష్యుడు మఠమునకు బరుగెత్తిపోయి జరిగినసంగతి నంతయు దెల్పెను. తోడిసన్న్యాసు లీతడు పడియున్నతావునకు బరుగెత్తుకొని

వచ్చిరి. వా రాతని తమబుజములపై నెత్తుకొని మఠమునకు దీసికొనివచ్చి యొకగదిలో బరుండబెట్టిరి. ఎంతసేపైనను నాతనికి స్మృతి రాకుండెను. చాల విచారించుచు నాసోదరులు వానికి విసరుచు, జల్లని నీటిని ముఖమున జల్లుచు, గొంచెము గొంచెముగా బాలను నోట బోయుచు వాని కుపచారములు చేయసాగిరి. క్రమముగా నాతడు తేలుకొనెను. ఆమహాసీయుడు కండ్లు తెఱచి తనచుట్టు నున్న వారివైపు చూచినంతనే యాతడు తమ్ము గుర్తింపగలడో, లేడో తెలిసికొందమని యొక సన్న్యాసి, "స్వామిజీ! మీకు బాలు పోయుచున్నవా రెవరో గుర్తింపగలరా?" అని బిగ్గఱగా నడిగెను. ఆసాధుపుంగవుడు హీనస్వరమున నిట్లు పలికెను: "అన్నా గు-ర్తిం-ప-కే-మి? నన్ను గొట్టినవాడెవడో వాడే నాకు బాలుపోయుచున్నాడు!"

జీవబ్రహ్మైక్యమును బొంది సమస్తశుభాశుభములకును, ధర్మాధర్మములకును అతీతుడైనవానికిగాని యిట్టి యద్వైత భావ మలవడజాలదు. (చూ. 968.)

## పద్దయ్య దేవతార్చన

1121. ఒకగ్రామమున బద్మలోచనుడను నొక బాలుడుండెడివాడు. ఆయూరివారందఱును వానిని 'పద్దయ్య' యని పిలిచెడివారు. ఆయూరిలో బాడుపడిన యొకదేవాలయముండెను. దానిలో దేవతావిగ్రహమైనను లేదు. ఆలయము నిండ జెట్లు, చేమలు మొలచినవి. అది గుడ్లగూబలకును, గబ్బిలములకును ననుకూలమైన నివాసస్థలమైనది. ఒకనాడు

సాయంకాలము హఠాత్తుగా నాపాడుపడినగుడినుండి జేగంట స్రోతలు, శంఖధ్వనులు జనులకు వినవచ్చినవి. ఎవరో భక్తుడు దానిలో దేవతావిగ్రహమును ప్రతిష్ఠించి యారాత్రి కమును జరుపుచున్నాడు కాబోలు నని జను లాబాలగోపాల ముత్సాహముతో నచటికి బరుగెత్తిరి. వారందఱును జేతులు జోడించుకొని యాపవిత్రధ్యానములను వినుచు, దేవతా విగ్రహమును జూచుటకై గుడియెదుట నిరీక్షించుకొని యుండిరి. వారిలో నొకడు సాహసించి, లోన నేమిజరుగు చున్నదో తెలిసికొందమను తమకమున, దలుపుసందులో నుండి తొంగిచూచెను. గుడిలోపల పద్దయ్య జేగంట వాయిం చుచు, శంఖము నూదుచుండుట చూచి యత డాశ్చర్యపడి నాడు. గుడిలో నేలయంతయు నెప్పటివలెనే యసహ్యముగా నుండెను. పూజకు దేవతావిగ్రహమూ, ముందే లేదు. అంత నాత డిట్లు కేకవేసి చెప్పెను: "ఓపద్దయ్యా! నీగుడిలో బరమేశ్వరవిగ్రహమూ, లేదు! పెంటలను దొలగించి గుడిని శుభ్రముచేయనైనను జేయవైతివి! పదునొకండుగబ్బిలము లును నందు జేరి దివారాత్రములు గీఱుగాఱుమనుచున్నవి. ఆహా! దేమియు లేనిదే నీవిట్లు శంఖము నూది గందర గోళముచేయుచున్నా వెందులకు? (చూ. 173.)

కావున నీహృదయాలయమున దేవుని ప్రతిష్ఠింపదలతు వేని—వానిసాక్షాత్కారము బొందగోరెదవేని—ఊరక సంకూాదినందువలన బ్రయోజనమేమి? మొదట నీహృదయ మును బవిత్ర మొనర్చుకొనుము. మనస్సు పవిత్రమైనంతనే మాధవుడు దానిని దనయాలయముగా నొనర్చుకొనును,—

స్వయముగా వచ్చి యందు నెలకొనును. అపవిత్ర స్థలమున వానివిగ్రహమును ప్రతిష్ఠింపజాలము. పైనిజెప్పిన పదునొకండు గబ్బిలములును పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు—అనునట్టి యేకాదశేంద్రియములు. (చూ. 850.) మొదట నీహృదయాంతరాళమున బాగుగా మునిగి యందుగల రత్నములను జేబట్టుము. (చూ. 13.) అనంతరము నీకు సర్వము లభింపగలదు. మొదట మాధవుని నీహృదయాలయమున బ్రతిష్ఠించుకొనుము; అటుపిమ్మట గావలసినన్ని బోధలను, ఉపన్యాసములను జేయవచ్చును. (చూ 6, 7, 168—187, 820, 826, 828.)

ఓం తత్ సత్

శ్రీరామకృష్ణార్పణ మస్తు !

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## చిరంతనానందస్వామి అనువాదములు

### శ్రీ రామకృష్ణ పరమహంస

### నీ తి క థా ర త్న ము లు

తేటతెనుగు మాటలలో ఇందుగల 62 నీతికథారత్నములును నైతి కాధ్యాత్మిక తత్త్వములను సుప్రకాశిత మొనర్చుచున్నవి. —కృష్ణాపత్రిక

ముచ్చటగు ముద్రణము. అ. 12

## శ్రీ వివేకానంద ప్రవచన గ్రంథములు

### షికాగో నగరోపన్యాసములు

షికాగో విశ్వమత మహాసభయందు శ్రీ వివేకానందస్వామి యొసగిన మహోపన్యాసములు. వివేకానంద నామమును దిగ్దిగంతములు మారు మ్రోగించినవి ఈ యుపన్యాస రత్నములే. అ. 8

### భ క్తి యో గ ము

...ఇట్టి యుత్తమగ్రంథ మీవఱకు వెలువడలేదని నా ఆశయము. వీరి (శ్రీ చిరంతనానందస్వామి) గ్రంథములన్నియు నిరుపమానములు....

జనమంచి శేషాద్రిశర్మ—త్రిలిఙ్గ

కొలదిప్రతులు మాత్రమే కలవు. రూ. 1-0-0

### ప్ర బో ధ ర త్నా క ర ము

తత్త్వశాస్త్రసార సంగ్రహము. "ముముక్షువుల కిది నిజంగా మార్గదర్శి."—ప్రజామిత్ర. చక్కని కూర్పు. రూ. 1-12-0

**నా సంస్కరణ యుద్ధవిధానము** అ. 6

**నా గురుదేవుడు** (శ్రీ నిర్వికల్పానందస్వామి అనువాదము) అ. 6

## చిరంతనానందస్వామి అనువాదములు

## కర్మయోగము (శ్రీ వివేకానంద ప్రణీతము)

మూలగ్రంథ మెంత ఉచ్చమో అనువాదము అంత మేలై రాణించు చున్నదని భారతియు, ఈ గ్రంథము కర్మయోగతత్త్వమును అరటిపండొలిచినరీతిని విశదీకరించుచున్నదని ఆంధ్రపత్రికయు, కర్మయోగతత్త్వమును తెలియగోరువారు ఈ గ్రంథమును జదివితీరవలయునని త్రిలిఙ్గయు కొనియాడియున్నవి. 175 పుటలు, రూ. 1-0-0

## శ్రీ వివేకానంద లేఖావళి (రెండు భాగములు)

భారతదేశమునఁ బ్రతియింటను ఉండవలసిన పుస్తకములలో నిది యొకటి; బాలికాబాలు రెల్లరును శ్రద్ధతో పదేపదే చదువవలసిన పుస్తకములలో నిది యొకటి. —కట్టమంచి రామలింగారెడ్డి

మొదటిభాగము: 256 పుటలు  రెండవ భాగము: 242 పుటలు

ఒక్కొక్క భాగము వెల రూ. 1-8-0

| | | | |
|---|---|---|---|
| శ్రీ వివేకానంద సింహగర్జన | అ. ½. | 12 ప్రతులు | అ. 5 |
| నా మతము (శ్రీ వివేకానందస్వామి) | అ. ½. | 12 ప్రతులు | అ. 5 |
| యతిగీతము | ,, | | అ. 1 |

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

### చిరంతనానంద విరచితము

ఈ గ్రంథము దివ్యముగా వ్రాయఁబడినది.... ప్రతిగృహమునను భాండాగారమునను వెలయునని నమ్ముచున్నాను....

—కట్టమంచి రామలింగారెడ్డి

ఈ గ్రంథము తెలుఁగువారియింటింటను ఇలువేల్పుగా నుండదగినది.

—వేలూరి శివరామశాస్త్రి

ఆంధ్రులెల్లరును తప్పక యీ గ్రంథమును జదువవలయునని నా యభిప్రాయము....  —చిలకమర్తి లక్ష్మీనరసింహము

## శ్రీరామకృష్ణమఠ ప్రచురణములు

### శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

... మీ భాషాజ్ఞానము ఓటిపిడిబాముక్క.

—విశ్వనాథ సత్యనారాయణ

350 పుటలు, చక్కని కూర్పు. రూ. 2-0-0

### శ్రీ శారదాదేవి చరిత్ర

చిరంతనానంద విరచితము

శ్రీరామకృష్ణుని సహధర్మచారిణియు ఆదర్శయోగిని, ఆదర్శ మాతయు నగు మహనీయురాలి సమగ్రజీవితచరిత్ర

అర్థమునకే కాక భాషను గూడ మీ యీరచన అమృతధారా వాహిని... మీ గ్రంథము వాఙ్మయమున చిరస్థాయి.

—వేటూరి ప్రభాకరశాస్త్రి

ప్రతిస్త్రీయును పురుషుడును... చదువవలసినగ్రంథమిది... అమృత కలశము!... అనన్యసామాన్య నీతిమంజరి... తియ్యని తెలుగు... పాలవంటి శైలి.... —ఆంధ్రప్రభ

246 పుటలు, ముద్దులొలుకు కూర్పు. రూ. 1-12-0

### శ్రీ శారదా ప్రసంగములు

...ఈ గ్రంథము ఆంధ్రదేశమున ఆస్తికులగు స్త్రీలెల్లరు చదువదగినది. —త్రిలిఙ్గ

312 పుటలు, ముచ్చటగు కూర్పు. రూ. 2-8-0

**నవీన భారతదేశము** (శ్రీ వివేకానందస్వామి) అ. 4

**సర్వత్ర దేవుని గను విధానము** ,, అ. 8

## శ్రీరామకృష్ణమఠ ప్రచురణములు

**శ్రీరామకృష్ణ పరమహంస సంగ్రహ చరిత్ర**

చిరంతనానంద విరచితము — అ. 4

**గురూపదేశములు** (శ్రీరామకృష్ణుని ఉపదేశ రత్నములు)

సంగ్రహకర్త: శ్రీ బ్రహ్మానందస్వామి

అనువాదకుడు: చిరంతనానందస్వామి

175 పుటలు, పాకెట్ సైజు, ముచ్చటగు నాల్గవ కూర్పు. — అ. 8

**భక్తిమార్గము** (శ్రీ పరమానందస్వామి ప్రణీతము) — అ. 8

## భగవద్గీత

శ్రీ నిర్వికల్పానందస్వామిచే అనువదింపబడినది. ప్రతిపదార్థ తాత్పర్య శ్రీధరీయ టీకాసార విశేషాంశ సహితము.

...ఇందలి పాదటీకలన్నియు అమృతబిందువులు.

—వేలూరి శివరామశాస్త్రి

...కడు సుందరమై విశేషార్థమంగరమై యున్నది.

—ఆంధ్రపత్రిక

సాదాప్రతి రూ. 1-8-0 — మేలుప్రతి రూ. 3-8-0

# శ్రీరామకృష్ణప్రభ

మతధర్మవిజ్ఞానవిషయకమగు మాసపత్రిక

1946-వ సం॥ అక్టోబరునుండి చిరంతనానందస్వామి సంపాదకత్వమున వెలువడుచున్నది.

సం॥ చందా. రూ. 3 — విడి ప్రతి అ. 6

**శ్రీరామకృష్ణ మఠము, మైలాపూరు, చెన్నపురి**